సీతనుఁ జూచిరమ్మనిన ♦ చేవదలిర్పఁగ లంకఁగాల్చె నీ
వాతసుతుండు యుద్ధమతి ♦ పద్ధతియేయది రామరాఘవా. 69

ఉ. యేపనికైన సాధకపు ♦ హేతువు లెక్కుడుఁగల్గునందులో
భూపతిపుత్రికంగనుట ♦ ముఖ్యముఁగావున తొల్తఁజేసియా
పాపురావణుంగనుట ♦ వానిబలాబలచింతనమ్ము తా
చూపరుమెచ్చఁగన్ గొనియె ♦ శూరతమారుతసూతి లక్ష్మణా. 70

ఉ. వంచనఁజేసి కార్యముల ♦ పండితులెవ్వరు జేయలేదుయే
మెంచి మరుత్సుతుం డసురు ♦ లెవ్వరెఱుంగక యుండునట్లుగాఁ
బెంచిన కాయమున్ గుఱుచఁ♦బెట్టి పురంబున సీతఁజూడఁగా
సంచరణంబొనర్చినది ♦ సంస్తవనీయమె రామరాఘవా. 71

చ. తుదనొనరించఁబోవు నది ♦ తొల్త ఘటించిన కార్య హానియం
చెదను దలంచి సూక్ష్మతను ♦ వెంతయుఁదాలిచి లంకలోపలన్
బదిలముగా మహీసుతకు ♦ భద్రముఁదెల్పుచు మాటలాడె నా
యదునఁ దొలంగినన్ సఫల ♦ మాసె మనోరథమట్లు లక్ష్మణా. 72

ఉ. కొంచపువానినైన తను ♦ కోరి కనుంగొను కాలమబ్బినన్
మంచిగఁబోయివాని తగు ♦ మాటలఁదేర్చుట యొప్పనంచు తా
నెంచక వాయుసూతి వన ♦ మేటికిఁద్రుంచుచు రాక్షసేనతోఁ
బెంచెను వైరమట్లు విని ♦ పింపు గుణోత్తమ రామరాఘవా. 73

ఉ. రాక్షసులాట సామకును ♦ రారికవారలు దానమన్న ని
ర్లక్షితకిన్నరేశ్వరులు ♦ లావరులాటను భేదమొందరా
పక్షములేల దండమిట ♦ బాగనిఁజేయఁగనెంచి తద్వనీ
వృక్షములెల్లవేఁబెఱికి ♦ వేసె మరుత్తనయుండు లక్ష్మణా. 74

ఉ. కార్యము నిర్వహించెనని ♦ గౌరవమొప్పఁగ రాజ్యమిచ్చినన్
శౌర్యముతో భుజింపఁదగు ♦ సాహసవృత్తిని తాహరించినన్
చౌర్యము దూతకంచు బుధ ♦ సంఘముఁదెల్పఁగ నవ్వనంబు నే
ధైర్యముచేత నంగదుఁడు ♦ దానముచేసెను రామరాఘవా. 75

ఉ. సీతనుజూచినట్టి తమ ♦ చెయ్వులనన్నిఁటి దామెఁదెల్ప తా
రీతినిఁదెల్పనెంచి వివ♦రించె మరుత్సుతుఁ డంగదుండు సం

ప్రీతిననుజ్ఞనిచ్చె నటు • వేడుకమీఱఁగ వానరాళికిన్
ప్రీతియు దుఃఖమున్ బరుల • పేరుఁదెల్పుటమేలు లక్ష్మణా. 76

చ. నగతుని పట్టణంబున నివాసముఁ గల్గినవానినైన న
మ్మఁగవలదంచు నీవెఱిఁగి • మారుతిమాటల విశ్వసించుచున్
నగచరనాథువాక్యమును • నామదినత్తక రావణానుజున్
దగడనకేలఁబ్రోచితివి • తథ్యముఁదెల్పుము రామరాఘవా. 77

ఉ. నీవును దానవేశ్వరుఁడు • నీతిపథంబునఁ జెప్పుచుండినన్
వావిరివాయుజుండను భవంబునఁ దెల్పెనుగాన తద్వచో
ధావన మేలటంచు మును • దాల్చినవాఁడను లోకమందనన్
భావితమైనపద్ధతినిఁ • బట్టుటమంచిదికాదె లక్ష్మణా. 78

ఉ. లంకను గల్గురాక్షసుల • లావునుబీరము దుర్గభంగి ని
శ్శంకతఁజూచి వాయుజుఁడు • సర్వముఁదెల్పెడెమున్న దానినే
వంకకుఁద్రోసితో మఱలఁ • బల్కఁగఁజేసితి వవ్విభీషణున్
బింకమునిల్పు నారిపులఁ • బేర్కొనసేనకు రామరాఘవా. 79

ఉ. వాయుతనూభవుం డపుడుఁ • బల్కినదంతయు సత్యమైనదీ
చేయువ్రసంగ మందితఁడు • చెప్పెనొ చెప్పడొ చూతమంచు నే
నాయక లంకలోఁగలుగు • వారలచందముఁ జెప్పుమంటి నా
నాయకుఁదప్పకుండుటను • సంతసమందినవాఁడ లక్ష్మణా. 80

ఉ. వారిధిదాటలేదు నగ • వానిపురంబును జూడలేదు యే
దారియు శత్రుద్రుంచుటకు • దక్కకయుండఁగ నంతలోన నిన్
జేరిన రావణానుజునిఁ • జేసినవాఁడవు రాక్షసేశుగా
నేరువు తప్పినన్ బ్రతిన • నీరయిపోవదె రామరాఘవా. 81

ఉ. పాపులకెల్లఁజూడఁగ న • పాయము సిద్ధము సజ్జనాళికిన్
దాపములుండఁబోవనెడు • ధన్యులమాటల విశ్వసించి నే
తాపసబాధకుండయిన • దానవభర్త నశించునంచు ని
ష్పాప విభీషణుండితఁడు • పాలకుఁజేసినవాఁడ లక్ష్మణా. 82

ఉ. తానుసమర్థుఁడైనతరి • తక్కకు వేఁడుట నెట్టివారికిన్
హీనతగాదలంచు దుర • హీనమహాస్త్రము లన్నియుండఁగాఁ

జూని సముద్రవేసుకొనఁ ♦ బోవుటయుంగని వాఁడుగర్వియై
కానఁగరాకయుండుటయుఁ ♦ గల్గెగదాముసు రామరాఘవా. 83.

చ. మొదటపరేంగితంబు తుద ♦ ముట్టకనుంగొనుదాక సజ్జనుల్
కదలుపరాత్మవీర్యమటు ♦ గావున వారిధి నాత్మలోపలన్
పదిలముగా భజించు నను ♦ బట్టక యాతఁడు యూరకుండినన్
వదలఁగఁజేసితి జడిమ ♦ వానికివేడిమిఁజూపి లక్ష్మణా. 84.

ఉ. చేతమునందలంచినది ♦ సిద్ధినిఁబొందెడు వేళవచ్చినన్
ప్రీతిగఁజేయకున్న గని ♦ భీతునిగా గణియింపకుందురా
సేతువుగట్టి శత్రుపురిఁ ♦ చేరియు నచ్చట నిల్వయుండఁగా
హేతువదేమిఁ దెల్పుము ప·రేళిత విక్రమ రామరాఘవా. 85.

చ. త్వరపడికార్యముం జరుప ♦ వద్దను పెద్దలపల్కులెన్నియో
ధరణి వెలుంగుచుండుటను ♦ దానవపట్టణమొందియుందు నే
నరయక ముట్టడించుటకు ♦ నాజ్ఞయొసంగక యూరకుండితిన్
పరిచితమైనతోవఁ జను ♦ వాని కపాయము లేదు లక్ష్మణా. 86.

చ. తగినసహాయత నృపునిఁ ♦ దార్కొనఁగావలెగాని యొంటిగా
మొగపడరాదటంచు విని ♦ మోటుతనంబున రాక్షసాధముం
డగపడవాని పైకురికె ♦ నర్కసుసూతియు నేమిహేతువో
సొగసగురీతి నుత్తరముఁ ♦ జూపుము నాకిఁక రామరాఘవా. 87

ఉ. మిత్రునిఁబోలు బంధువుఁడు ♦ మేదినియందును లేదు వానికిన్
కృత్రిముఁడైన శత్రుఁగని ♦ కిన్కవహించక యెవ్వఁడుండు నీ
ధాత్రినిఁగాన రావణుఁడు ♦ తప్పొనరించియు వైభవోజ్జ్వల
ద్గాత్రముతో జరించఁగని ♦ దాఁటెదినాకరసూతి లక్ష్మణా. 88.

చ. కపటునివృత్తి నొక్కతరి ♦ గన్గొన చాలునటంచుఁదెల్ప రా
రిపునిమనఃప్రవృత్తి బహు ♦ రీతులనారసి మారుతాత్మజుం
డపుఁడెఱిఁగింపఁడే మఱల ♦ నంగదురావణు వీటికేలనో
విపులమసీమఁ బంపితివి ♦ వేడుకఁదెల్పుము రామరాఘవా. 89.

ఉ. లోపము లేని కాలమున ♦ లొంగకయున్నను యుండవచ్చుఁ
తాపము నొందవాని పురి ♦ దగ్ధముచేసెను వాయుసూతి తా

కోపము చేత సోదరుని ◆ గొల్వడలించె పయోధిదాటి నా
మాపదయందు లోఁగునను ◆ చంగదుఁ బంపినవాఁడ లక్ష్మణా. 90

ఉ. చేతికిఁజిక్కు శత్రుప్రను ◆ చెచ్చెరద్రుంచకఁ బోవనిత్తురే
మాతులుచావుచేత నవ ◆ మానితుఁడై యటు రావణుండురా
నాతరిఁజంపకుండ పురి ◆ కాతనిఁ బోవఁగనివ్వనేల నీ
చేతలుగాని దుష్టునెడఁ ◆ జెప్పరె ధర్మము రామరాఘవా. 91

ఉ. చంపఁగ నర్హుఁడౌ రిపునిఁ ◆ జంపుట యొప్పునుగాని ధర్మపుం
పెంపుదొరంగఁజేసినను ◆ పెద్దలు మెచ్చరుగాన రావణుం
డింపుగనిల్వకుండఁ బరు ◆ వెత్తుటచే నటుఁబోవనిచ్చితిన్
తెంపుననిల్చినన్ గళముఁ ◆ ద్రెంచకఁబోదునె నేను లక్ష్మణా. 92

ఉ. ఆదినిలంకఁగాల్చె మరు ◆ దాత్మజుఁడాతరి శత్రుపట్టణం
బైదనరారుట న్సహజ ◆ మాతనితమ్మని రాక్షసేశుగా
మోదిలఁజేసియున్ కపిస◆మూహముఁగోరిక దానిఁగాల్ప నీ
వాదట సమ్మతించఁదగు ◆ నయ్యజిగీషత రామరాఘవా. 93

చ. అరియగు రావణుంగెలిచి ◆ యాతరువాతను లంకనివ్వగా
స్థిరమతితోడ వానికభి◆షేకముఁ జేసితిగాన యాపురం
బరిపురమౌట వానరుల ◆ నంపఁగవచ్చెను వారుకోరినన్
బరులజయించు రాజులకుఁ ◆ బద్ధతులిట్టివిసుమ్ము లక్ష్మణా. 94

ఉ. అక్కరలేనివేళను స◆హాయముఁ జేయఁగనేల నక్కటా
రక్కసులెల్లఁ జచ్చుటయు◆ రావణుఁ డొక్కఁడుఁ జిక్కియుండఁగా
మక్కువతోడుతన్ రథము ◆ మాతలిచేతను బంపెదేవరా
జెక్కడుపేరిమదానిపయి ◆ నెక్కితివేటికి రామరాఘవా. 95

ఉ. తెంపున రావణుండపుడు ◆ తేరిపయింగల యస్త్రశస్త్రముల్
నింపి లయాంతకుండనఁగ ◆ నింగివెలుంగఁగ రాగ నింద్రుఁడున్
బంపెరథమ్ము శస్త్రతతి ◆ భాసిలఁజేయుచు నందుచేత నేఁ
జంపితి యానిశాచరుని ◆ సంతసమొప్పఁగనుమ్ము లక్ష్మణా. 96

చ. జలధితరించకున్న తరి ◆ సఖ్యముకోరిన యవ్విభీషణున్
నిలిపినవాఁడవై మఱల ◆ నీవ బృందముఁద్రుంచి లంకలో

వలను ప్రతిష్ఠ సేయుటకుఁ • బంపఁగ నేటికినన్ను ధాత్రిలో
సలిపినదానినేలిరిగి • సల్పరుధీరులు రామరాఘవా. 97

ఉ. రావణుఁ జంపిపిమ్మటను • రాక్షసనాథునిఁగాఁగఁజేయ నే
ఖావము నందలంచుటను • బట్టి విభీషణు లంకలోవలన్
స్థావర ముండుమంచును నిశాచరులెల్లను యొప్పనట్లుగా
చేవమెయింగనంబరచిఁ •జేసినవాఁడనుసుమ్ము లక్ష్మణా. 98

చ. మొదలనె దుఃఖవంతులగు • ముగ్ధలయుందతిజాలి గొంటయే
సదయుతిగానివారల నసహ్యపుమాటల పీడచేయఁగా
మదిఁదలఁపంగ రాదనుచు • మాన్యులుదెల్పఁగనీవు భూమిజన్
గదనభువిందురుక్తులను • గాసిలఁ జేసితి రామరాఘవా 99

ఉ. స్త్రీలు దురుక్తులాడు నెడ • శిక్షయొనర్చక యూరకుండినన్
బాలిశవృత్తిలో మెలఁగి • పాడయిపోదురుగాన నాడునిన్
వీలునిగాని మాటలను • వేదనఁజెందఁగఁ జేసెగాన నా
బాలికనట్ల నన్వలసె పల్కురిలోవలనట్లు లక్ష్మణా. 100

చ. తనకునగోచరంబయిన • దాని పరీక్షణయొప్పగాని ని
న్ననయము పీడకుండఁగ హనాంతరసీమల సంచరించ దా
మనమున నేమిఁదల్చితివో • మానితసద్గుణాఢ్యెదనర్చు నా
జనకతనూజ నగ్నిఁజొర • శాసనమేటికి రామరాఘవా. 101

ఉ. సీతగుణంబులెల్ల మన • చిత్తములం గఱగించుగాని యీ
భూతలవర్తులౌ జనుల • పోలికలో పరవాసముండుటన్
ఖ్యాతికిభంగమౌనటుల • గావునవహ్నిని శుద్ధమైనచో
ప్రీతినిఁబొంచు నీజగము • పెద్దలుమెచ్చుచునుందు లక్ష్మణా. 102

ఉ. ఒక్కరిదైనవస్తువ మహోజ్వలతన్ గ్రహియించితెచ్చి తా
నక్కఱఁ దీరినంతటనె • యూతని కంపకలాతికంపుటే
నిక్కపుధర్మమౌనె రఘ • నీచరభర్తకుఁ బుష్పకంబు నీ
వెక్కుడుప్రేమనివ్వక ధ • నేశుని కంపవె రామరాఘవా. 103

చ. పరులధనంబు మ్రుచ్చిలిన • పాపులఁదుంచుచు వారిసొత్తు నాఁ
డరమునఁబంపుటే నృపుల • ధర్మముగావున రావణాసురు

దురవడిఁ గొన్నఁ బుష్పకము ♦ నొప్పుగఁ బంపినవాఁడ కిన్నరే
శ్వరునకు దీనిలోపలను ♦ సత్యవిరుద్ధము లేదు లక్ష్మణా. 104

చ. అడిగినవాని కుత్తరము ♦ లాదరమొప్పఁగ నిట్లు దెల్పఁగా
వడివడి రాముపాదముల ♦ పైఁబడి జేసితి తప్పు సైపు మా
జడిమ దొలంగె దాసుఁడను ♦ సంశయ మెల్ల నుదీరె నేటితో
పుడమికి మీచరిత్రమును ♦ భూషణమైనది రామరాఘవా. 105

ఉ. ఈగతి లక్ష్మణుండనుట ♦ కెంతయు రాముఁడు సంతసించి వే
వేగమె వానినెత్తుచును ♦ విశ్వహితంబగునట్లుఁ జేసితీ
వీగతి వన్నిగాని విభు ♦ ధేళితవర్తన నిన్నెఱుంగ నే
భోగివిభుండు నీకఁమలఁ ♦ బొల్పఁగ విద్యలయందు లక్ష్మణా. 106

ఉ. అంతటఁ దాపసుల్ సభికు ♦ లందఱు వారలభాషణంబులన్
వింతఁగ వించు రాఘవుల ♦ వేయువిధంబుల సంస్తుతించుచున్
సంతసమొప్ప నిండ్లకును ♦ సాగిరి పిమ్మట రామలక్ష్మణుల్
కాంతలతోడఁ గూడి చిర ♦ కాలముఁ జేయుచునుండి రాజ్యమున్. 107

ఉ. దీనిఁ బఠించి వ్రాసెడు సు♦ధీవరులెల్లరు దుఃఖజాలముల్
పూనక నెల్ల సౌఖ్యములు ♦ బొందిజరింతురు రాముసత్కృపన్
మానిత ముక్తిసంపదకు ♦ మార్గముఁ జూపును కోర్కెలన్నియున్
పూనికతోడ నియ్యదియె ♦ పొల్పుగనిచ్చును సత్యమింతయున్.

మ. చెలికాన్యన్వయభూషణుండు కవితా ♦ శీలుండు భాషాంగనో
జ్వల భూషాయుత లచ్చరాయమణి ప్రోత్సాహంబుమై దీని న
గ్మ్రలి వేవ్రాసి యొసంగితిన్ సుకవితా ♦ శ్రేయఃఫలంబంచు దే
వులపల్ల్యన్వయ సీతరామకవినేఁ ♦ బూజ్యుల్ ప్రశంసింపఁగన్.

శ్రీరామలక్ష్మణప్రశ్నోత్తరశతకము

సంపూర్ణము.

శ్రీరస్తు.

# నీతికందశివశతకము.

## కందపద్యములు.

శ్రీకర ఘనసాగశర, ద్రాక్షాక్షేత్ర *కోపూరావూరిపుర
ప్రాకటమందిర భాస్వర, మాకాంతారమణ చెన్న మల్లేశ శివా. 1

వినయము గల్గుచునుండును, జనములకందఱకు నీతిశాస్త్రంబు దెనుం
గునఁ గందపద్యములుగా, నొనరించెద నీకు కరుణ నో భర్గ శివా. 2

శివ నీకు నంకితంబుగ, సవిరళముగ నీతిశాస్త్రమంతయు చేడ్కన్
భువిఁ గొండవీటి కోటయు, కవినేర విరచెఁబద్యకావ్యంబు శివా. 3

కొందఱకిఁ దెనుఁగుహితవగుఁ, గొందఱకిని సంస్కృతంబు కౌతమియగు
నే, నందఱకనుగుణ్యముమదిఁ జెందఁగనుభయోక్తుం బ్రబంధిఁ జేకూర్తు శివా.

ఇల సభయనుసురతరువుకు, లలితశ్రుతు లనెడుశాఖలతో శాస్త్రసుమ
మ్మలతో బుధులనుమధుప, మ్మలతో విలసిల్లుసభకు మ్రొక్కెదను శివా.

ఘనలోకములకువిభుఁడై, అనిమిషులకు దేవుఁడైన హరికిని దండం
బొనరించి నీతిశాస్త్రముఁ, దెనుగున రచియింతుఁ దేటతెల్లముగ శివా.

ధర నఖిలగ్రంథార్థము, లరఁగందములందుఁ గూర్తు నార్యులు మెచ్చన్
బరులకునుపకృతి పుణ్యము, దురితాత్ములఁ బీడఁ బెట్ట దోషంబు శివా.

తనకిలశ్రీమవచ్చినవే, తను ప్రాణమునైనవిడిచి రక్షింపఁదగున్
ఘనమానమనివృకోదరుఁ, డనె ప్రాణమునకన్న మానమధికంబు శివా.

ధరనాహూయముద్విజులకు, మురిపముగోవులకు ప్రాణిముదమతివలకున్
వరురాక వేడ్కఁగడు సం, గరముత్సవమనియె మాకు గాండీవి శివా. 9

పరసతులన్ దల్లివలెన్, బరధనములమంటిపెళ్ళభంగిని భువినం
దఱిప్రాణంబులు తనవలె, నరుదెంచిన బ్రహ్మమనియె నకులుండు శివా.

తనువులనిత్యము వైభవ, మనఁగ నశాశ్వతము మృత్యువంటెసమీపం
బుననుండుఁ గనుక ధర్మం, బునుగర్తవ్యమనె మాద్రిపుత్రుండు శివా. 11

---

* కోపురావూరు గుంటూరుమండలములోనిది. గుంటూరునకు 6 మైళ్ళదూరమున గలదు. ఇప్పటికిని కవి వంశీకులుండియే యుండిరి. ఇంకను యీకవి విరచితగ్రంథములు గలవని చెప్పెదరు.

మనసిజసుందరుఁ డగుపురు, షునిఁజూచిన నన్న తండ్రి సుతులయినజలిం
చును మానసంబునతులకు, ననె ద్రౌపది భువిసిజనము లరుదంద శి.
పటువాంఛకలదు నాపెని, మిటులైదుగు రారొవానిమీఁదను సతుల
క్కట పురుషులు లేమిట నె, వ్వటికిఁబతివ్రతలుననియెఁ బాంచాలి శి.
కనవచ్చు మేడిపువ్వులఁ, గనవచ్చును దెల్లనైన కాకినిసీటన్
గనవచ్చుజాపయుడుగులఁ, గనరాదనెనతులమనసు కంసారి శివా. 14
కలవున నన్నముఁబెట్టే, పురుషునకున్ గడుసుభిక్షమున ధనమిచ్చె
నెఱదాతకు రణశూరున, కరుదుగ బుణముచికి దండమనె చక్రి శి. 15
తనసొమ్ము విప్రులందునఁ, దనయౌవనమాలియందు తనప్రాణముదే
వునియందుఁ జేర్చవలెననెఁ, గనకాంబరుఁజూచి వలికె కర్ణుండు శి. 16
సర్వాంగములకు శిరమును, సర్వేంద్రియములకుఁజూడ్కి షడ్రసములకు
న్సర్వములవణము జలమున్, సర్వనదీతతులకివి ప్రధానములు శి. 17
ఘటములు వేరగు మన్నొ, క్కటి సొమ్ములు వేరు పసిఁడికడునొక్కటి వే
రటు లావులుపాలొక్కటి, పటుదేహములు వేరు నొకటి పరమాత్మ శి.
ఘనలోభి గురువు బంధువు, లనుజూడడు జారుఁడదపులజ్జనఁడు సుఖం
బును నిద్రెఱుఁగడు చదవరి, ఘనరుచిపాకముత్క్షుధార్తి గనఁడెందు శి.
విను దాత పేద కృపణుఁడు, ధని పాపి చిరాయు పుణ్యుఁ డల్పాయుకులం
బునహీను రాజు సత్కులుఁ డును సేవకు కలియుగంబుదోషమున శి.
పడఁతివియోగము స్వజనుల, మెడవాదు బుణావశిష్ట మిలహీనునిఁగొ
ల్వడము దరిద్రములోబం, ధుఁడువచ్చుట దేహములఁగడుంగాల్చు శి.
పుస్తకసతిధనములుఁ బర, హస్తగతంబైన వచ్చుటరుదగు మరలన్
వస్తేశిథిలముభ్రష్టగుఁ, బుస్తకమును వనిత కొంచముగధనము శి. 22
జనులకు బుణసంబంధము, లనఁదగుఁబశువులును నాలు నాత్మజులిండ్లున్
దనయప్పుదీరితే నా, శన మందుకుఁ జింతవలదు జగమందు శివా. 23
ఇతరులదూషించేదు, ర్మతులాచారంబువిడుచుమానవులును సం
తతలోభు లధికతామస, యతులతిచండాలురనుచు ననిమెదరు శివా.
ఖగచండాలముకాకియు, మృగచండాలంబుఖరము మిక్కిలిక్రోధుం
డగుయతిమరిచండాలుఁడు, జగమునదూషకుఁడు సర్వచండాలి శి. 25

జనకుఁడు కొడుకై దేడుల, దనుకన్ బొరవలెప దేండ్ల దనుకన్ నిజదా
సునివలెఁ బదియాఱేడుల, దనుక న్నెచ్చెలిగఁ జూడఁదగునంద్రు శి.
పనులందుదాసి యాలో, చనమంత్రి భుజించుతఱినిజననిగ రతివే
శనురంభ ధర్మహిత శాం, తినిభువి షడ్గుణ్యభార్య దీపించు శివా. 2'
వాదిన్ ధనచోరిణిఁ బర, వాదిన్ గడుతిండిపోతు ముక్కోపిని ప్రౌ
ఢ్ఢాదిన్ బోరుగింటుండెడు, మాదరచోదున్ త్యజింపమర్యాద శి. 2
అన్నముకంటెనిమిది పా, ళ్ళన్న బలంబగును పిండికెక్కువమరి పా
ల్కన్ననుమినుమధికముభువి, నన్నిఁటికతిశయగుణాఢ్యమగునెయ్యి శి
పెద్దయినబారుకొమ్ముల, యెద్దుకుసిగ్గేమిలేనియిందాత్రికి బల్
విద్దెగలమోటునకునే, ప్రొద్దున్ దూరముగఁదొలఁగిపోవలయు శి. 3(
వదరకులకును నెద్దుకు, విదితంబుగఁ గోవుపెండ్లివిత్తనములకౌ
షధమునకాహారమునకు, మదిలోఁ ఖర్చునటఁదగదు మానవుడు శి. 31
తనయాత్మబుద్ధి సుఖమగు, ఘనుఁడగు గురుబుద్ధిసాధకంబన్యులచె
ప్పినబుద్ధినాశనము భా, మినిబుద్ధి ప్రళయకాలమృత్యువగు శి. 32
బండికినై దగుఁజేతుల, నుండవలెన్ దవ్వ తేజి కొదుగుటపది వే
దండమునకు వెయ్యి దురా, త్ముండగునరుఁదొలఁగవలెను దూరంబుశి.
సింగముమూటినిఁ బులియే, డుంగూనలఁగాంచు వానిదుర్మార్గముచే
తంగూలు గోవుప్రేకపాక, టింగన మునుధర్మ మెప్పటికి జయముశి. 34
కులజీవన ముత్తమమై, యలరును గృషి వర్తకంబులగు మధ్యమమున్
గొలునడము జీవనముప్రము, చ్ఛిలిబ్రతుకుటకంటెఁ జావుశ్రేష్ఠంబు శి.
ఉత్తమునెడ కుణమిష్టము, జొత్తిలుమధ్యమునకలుకజామయిరుగడియల్
ఒత్తిలు నొకదినమధముని, హత్తు న్బ్రాపునకుఁ జచ్చునందాక శి. 36
దర్శనమునహృద్వికలము, స్పర్శనమునద్రవ్యహాని సంభోగపరా
మర్శను బాపము వేశ్యని, దర్శనరాకుసియనంగ ధర నొప్పు శి. 37
దాసీసంభోగమున ను, దాసీనము వేశ్యకేళిధనహా న్విధవ
స్త్రీసుఖమాయుఃక్షీణము, దోసమువరసతులపొందు తుదదనుక శి. 38
వృద్ధార్క హోమధూమం, బిద్ధరఁ దాఁ జిన్నదానినెనయుట రేయున్
దుగ్ధాన్నముదిను టాయు, ర్వృద్ధియు దినదినముప్రజకు వివరింపశి. 39

లేఁబెండయుఁ బీనుఁగుపోఁగ, పుత్త్రాలిచువిచారపొందు మాఁగులనీరున్
రాతిరి పెరుగన్నంబే, జాతికిదఱుగాయునండ్రు జనకల్ప శివా. 40
తనయార్జితార్థముత్తమము, నానఁదగుఁబితురార్జితంబు మధ్యముచేఁదం
బును భ్రాతృవిత్తనాథమము, ధనమధమాధమము స్త్రీవితతిదగును శి.
జనుఁడత్తిసిపెడచియాపో, శనము గోసన్ మాన్యపానసదృశంబన్నం
బనుదినగోమాంససమం, బగి తెలిసిచరింపవలయు ననఘుండు శి. 42
పనిలేమిశాంతమున్నను, మానకవచముతోటి క్రోధకంబున్నను శ
త్రులితోటిజ్ఞాతులుండిన, ననలము తోనేమికార్యమగునయ్య శివా. 43
హితులున్న నౌషధముతో, పతితాత్ముకుఁడున్న క్రూరఫణితో విద్యా
న్నతియున్న ధనముతో సం, ప్రతికసితకురాజ్యమేలపనియేమి శి 44
ఇరువురురాజులు దగము, గ్గురువిప్రులు వైశ్యులైదుగురు శూద్రులున
ల్వురుపయనముగఁ గూరగా, దరయఁగఁద త్కార్యహానియగునండ్రు శి.
నెల రేయి మెఱయు పగటిని, జలజాప్తుఁడు వెలయు సూనుఁడు జగములు ధర్మం
బలరును గుణియగుకొమరుఁడు, కులమును దీపించునండ్రు కోవిదులు శి.
ధర్మంబగుఁ ఇసుధేరిని, దుర్మార్గస్త్రీని దుష్టతురగము నిత్యున్
మర్మజ్ఞుకాపును విలలన్, గూర్మింపక గొట్టు టెల్ల గుణవృద్ధి శి. 47
ఇనుఁడుదయించెడు వేళను, జనుమనె గార్గ్యుఁడు గురుండు శకునమరసిపో
మ్మనెమాండవ్యుఁ మనోజయ, మనె విప్రుని వాక్కుతథ్యమనె శౌరి శి.
ధరనీచమహాశ్రయములు, కరిపుశకాంతములగుచ్ జగంబులఁ బ్రోచే
హరినాశ్రయింపవలెఁ జి, ల్లరప్రజవర్ధించఁగా ఫలంబేమి శివా. 49
నెనరున్నవాఁడె చుట్టము, తనయునిఁగోపించువాఁడెతండ్రియు శ్రీమవే
శనుగాచువాఁడె నెచ్చెలి, తనవిభుసుఖపెట్టినదియె తనభార్య శి. 50
ధనసంపాదన దుఃఖము, ధనరక్షణ మంతకంటెఁదగఁ దుఃఖము నా
శనద్రవ్యము లధికదుఃఖము, ధనికంబెను పేదవాఁడుధన్యుండు శి.51
హరిహరకమలాసన ని, ర్జరులకు ప్రజనోసటిద్రవాత శక్యమెతుడువన్
నరులెంతవారలెంచఁగ, శరణాగతభక్తహృదయసంతోష శి. 52
బుద్ధివిశేషమునేతిన, వృద్ధియునాయువుకు బాలు విరివిగఁగూరల్
ఇద్ధరిరోగము ప్రజకున, వృద్ధిగమాంసముకు మాంసమేబలము శి.53

చెడుఁదుష్టిలేనివిప్రుఁడు, చెడుఁదుష్టివహించురాజు సిగ్గరియైనం
జెడువేశ్య సిగ్గువిడిచినఁ, జెడునిల్లాలండ్రు చారుసితగాత్ర శివా. 54
ఘనశ్రుతిమూలమువిప్రుల, కనయముగృహమునకుమూలమంగన కృషి
కే, ల్లనుమూలంబగుధాన్యము,ధనమూలముత్రిజగములకుఁదథ్యంబు.
శిలపైనుండినగంధం, బలఁదినఁ బిల్లంటుకొనినయన్నముఁదినినన్
జలమంతమనీడఁజూచిన, బలువగుసిరిదొలఁగు దేవపతికైన శివా. 56
అజగార్దభములధూళియు, నిజనమ్మార్జనపుధూళి నెలఁతలపాదాం
బుజధూళియు సోకినఁ దన; విజయశ్రీదొలఁగు దేవవిభున కిలశివా. 57
కలవేమిలేదు క్షమితో, దురితంబును లేదు జపముతోఁ గలహంబున్
మఱిలేదోర్పునజాగ్రత, పసులైనను భయము లేదు ప్రజ కెందుశి. 58
కడుగుణసంపన్నుం డగు, కొడుకొక్కఁడెచాలు నూర్గురుజడులేలా
పుడమినొకచంద్రదీప్తికి, నడిచుక్కలచేఁ బ్రయోజనంబేమి శి. 59
ప్రస్తుతముకుదగుమాట న, మస్తజనులుసమ్మతించుమర్యాద మన
స్స్వస్థమునిడుగోపంబుఁ బ్ర, శస్తముగ నెఱుంగువాఁడు సరసుండు శి.
విషమువిషమె ద్విజవిత్తము, విషమదదిననొకెమడియు విప్రారము ని
ర్విషమనుకొన్నను సర్వం, కషకులనాశనమునొందుఁగదె యతఁడు శి.
నూఱువరాలుండినధని, నూఱూళ్లుండినను రాజు నూఱౌషధవి
న్నారిభిషకుశ్లోకంబులు, నూఱున్ననుబండితుండు నుతచరిత శివా. 62
అనుచారపడనిశాస్త్రం, బును జీర్ణముగానివేళ భోజనము దరి
ద్రునిగోష్ఠి ముసలికిని జ, క్కనిప్రాయంపుటాలు ధరణిఁగనువిషముశి.
మాటలచేననన్నుసిరుల్, మాటలచేబంధుసఖులు మర్యాదలిఁకున్
మాటలచేసంకెలలగు, మాటలమృదువెఱుఁగకున్న మరణంబు శి. 64
మునుదానివ్వనిదోష, మ్మునను దరిద్రుఁడు దరిద్రమున నతిపాపం
బొనరించుఁ దానసరకం, బునఁబడి మరలనుదరిద్రమునఁబుట్టు శి. 65
అతిథియు బాలుఁడు సతి జన, పతి యల్లుఁడు వీరు లేమిభాగ్యంబుల సం
గతు లేమెఱుఁగరు కరుణా, యుతమానసమిమ్ము భజింతు నోసాంబశి.
కొఱగానివేళ నాప్తుని, గొఱఁగానివి రాజ్యబంధుకోటులనెల్లన్
గొఱఁగానిభార్య రాష్ట్రము, లరయఁగఁబురుషుండువిడుచుటవిమేలుశి.

వినుమాహారము సాహస, మును బుద్ధి మనోరథములు బురుషునికం జెం
గనుఁగొన రెండును నాల్గా, రెనిమిదిపాళ్లెక్కుడందు రింతులకు శి. 6
క్షితిజనములపాపము నర, పతినొందును రాజసేయుపాతకము పురో
హితునొందు నృపతికగుదు, ష్కృతిగురునిఁ జెందుశిష్యుకిల్బిషము శి.
సంగీతవాద్యతాండవ, సంగరవ్యవహారభుక్తిసమయములందున్
భంగంబు సిగ్గువడినన్, మంగళకైలాసవాస మహాదేవ శివా. 7(
దైవాధీనము జగములు, యావన్మంత్రంబు దైవతాధీనము మం
త్రావృతివిప్రాధీనం, బావిప్రుఁడు మాకుదైవమనె శౌరి శివా. 71
కడుకులహానికి నొకనిన్, విడువఁదగున్ గ్రామమునకు విడవలెఁగులమె
వ్వఁడు దేశమునకు గ్రామము, విడువవలెన్ భూమి గష్టవేళలను శి. 72
బలమభ్రము పక్షులకున్, బలముదకము నదులకెల్ల బలహీనులకున్
బలమగుచుండు మహీపతి, బలమెన్నఁగ రోదనంబు బాలులకు శి. 73
వలువయలంకారమునకు, నలయఁ బ్రియము భోజనమున కధికము సుగుణ
మ్ములు కాంతలకగు వేద, మ్ములు చదువుట బ్రాహ్మణులకు ముఖ్యంబు శి.
కులమునురూపము బ్రాయముఁ, గలవాఁడయి చదువకను బ్రకాశించునె భూ
వలయమునఁ బరిమళించని, బలు మోదుగుపూలకాంతి ఫలమేమి శి. 75
కోయిలకు స్వరమె రూపం, బాయింతికి గుణమె రూపమగుఁ గురూప
ప్రాయులకు విద్య పద్యం, బాయతులకు శాంతిరూపమగునయ్య శి. 76
గగనమునకు రవిభూషణ, మగుఁ బద్మములకు మిళిందమగు వాక్కులకి
మ్మగు సత్యము భూషణమిం, పుగ సతులకు సద్గుణములు భూషణము శి.
గణుతింపవనమునకు హా, ర్షణము వసంతమునఁ బికము సభకు మనీషా
గ్రణిసర్వగుణములకు విత, రణమే భూషణమనంగ రంజిల్లు శి. 78
ఇలనదులుదకముఁ ద్రావవు, ఫలతరమేఘములు పైర్లభక్షింపవు పు
ణ్యులు సంపాదించిన ధన, ములు దినరు పరోపకారములు సేయు శి. 79
తేలుకుఁ దోకను మక్షిక, జాలమునకు శిరమునందు సర్పమునకు దం
ష్ట్రాళిని దుర్జనునకుఁ దను, మూలంబుననుండు విషముముఖ్యముగ శి.
పుస్తకములోనిచదువు ప, హీస్థలి నితరులకుఁ జేతికిచ్చినధనమున్
బ్రస్తుతకాలమునందుఁ ద, టస్థించదు వేళకుండుటయ మేలు శివా. 81

నిజబాలకులున్మిత్రులు, గజయాన లనేకులెంచగల కార్యంబుల్
యజమానిలేనియెడలను, గజిబిజియైచెడునటంద్రుఘనముఖులు శి. 82
ఇలనభ్యసించగాఁ జదు, వలరునుగర్మను నరణనగుబుద్ధియు రం
జిలనుద్యోగమున సిరుల్, గలుగునుధర్మమున ఫలముగలదంద్రు శి.83
తరువులవయసువసంతము, పురుషులయౌవనముధనముపూఁబోండ్లకునుం
దరము వయస్సౌభాగ్యము, ధరపండితజనులవయసుతగవిద్య శి. 84
వనధులపై వర్షించుట, తినివచ్చినయతని కపుడె తిండిడుటమహా
ధనికులకీవిచ్చుట ని, ర్ధనునకువయసుండుటలు వృథాయనిరి శివా. 85
తననంపాదన ధనముం, దనవెంటను రాదు బంధుతనయులు ప్రేతా
వనిదాక వచ్చుచుందురు, గనుకాతఁడు ధర్మపరుఁడుగావలెను శి. 86
నరవల్లభునిల్లాలున్, గురురాణియు నన్నభార్యకులసతి జననిన్
నెఱిగూర్మిగన్నమాతృక ధరనీయైదుగురు తమకుఁ దల్లులగు శివా. 87
చోరునిఁజంపుట తొత్తును, బారుగగారిగించి వెళ్ళబంపుట సతికిన్
వేరెపరుండుట సఖునకు, దాఁరక్తిగఁ బలుకకునికిఁ దగుశిక్ష శి. 88
తనతండ్రిఋణముఁజేసిన, తనతల్లియుజారియైన తనభామిని చ
క్కనిదైన రిపులుకొడుకుకు, జనకునకునవిద్యసుతుఁడు శత్రువుఁడు శి.
జనకుండుబాల్యమున యౌ, వనమురమణుండు సుతుఁడువార్ధకమగువే
ళను పోషింతురుగద యం, గనకుస్వకీయంపు బ్రతుకుగాదెపుడు శి.
ఘనమగు మఖప్రవేశము, లను గర్భిణీవృద్ధబాలులను నృపుగురుదే
వునిఁజూడ శూన్యహస్తము, లనుజనఁదగదటకుఁబోవలయుఁబండ్ల శి.
కుమతికిశ్లేష్మమునమమై, యమరునదియు తీపిచేతనతివృద్ధియు నా
శముకటువుననటులన్ గో, పముశాంతిమువెంటఖులుఁదుబ్రబలించుశి.
తనతండ్రి వడుగుఁజేసిన, ఘనుఁడు న్విద్యాధిగురువు గ్రాసంబిడువాఁ
డును భూవరుఁ డీయైదుగు, రును దండ్రులు జగమున న్విరూపాక్ష శి.
యముఁడే కాఠిన్యుఁడ వ, శ్యముపైవ్యుండ తనికంబె నతికఠినుఁడుప్రా
ణాము దండధరుఁడు గొనున, ర్ధముప్రాణము రెండుగొనుగదాభిషకు శి.
దారిద్ర్యనకీవియు వి, స్తారదినాంతరవు లింగసంప్రోక్షణ నం
స్కారమనాథప్రేతకు, మేరనొనర్చినను యశ్వమేధములు శివా. 95

ఈవియువినయముగల స, ద్భావము ధైర్యంబునుచితపద్ధతులివియున్
గేవలసహజగుణంబులు, ధీవరులకుఁ బరులు నేర్పితేరావు శివా. 96
హరిమందిరమున కేగిన, కరులకపోలముల మౌక్తికములులభించున్
హరినక్కతావుకరిగిన దొరకొనుడొక్కముకతోలుతోకలను శి. 97
తనువారోగ్యము పరగడు, పున నుశిరికబంధుబదరి భోజనమువలన్
ననుపుగల వెలగపండును, తినఁగగు నెపుడరఁటిపండు తినరాదుశి. 98
గయ్యాళియాలుకూళగు, నెయ్యుఁడహంకారిభటుఁడునెటిఫణిబిలయం
బైయుండు గృహమునరునవ నెయ్యోడమరణాంతికంబులివినాల్గుశి.99
ఘనసన్మానము సత్కృప, యును బందుగు విద్య ధనికుఁడుండని దేశం
బున మనుజుఁడొక్కదినమై, నను దగదుపసింప సజ్జనస్తుత్య శి. 100
శ్రుతులున్నందుకుయజ్ఞము, నతిధనమున దానభోగి పంగనవలనన్
రతి సంతతి చదువుటకున్, మతివెలయుట ఫలములంద్రు మనుజులకుశి.
కడుఁగలిమఁ బండ్లు నోమని, జమ నిష్ఠురుఁ దండిపోతు సంధ్యానుప్తం
బుడమినితరగుణముల మ, ర్త్యుఁడు హరిసముఁడైన విడుచునోలక్ష్మీశి.
శతపత్రదళాభాస్యము, మితచందనశీతలంపుమృదువాక్యముఁబున్
మతికర్తృసమానం, బతివినయము ధూర్తలక్షణాధికము శివా. 103
భువిఁదల్లి లేనిబిడ్డయు, ధవుఁడుండనియౌవనంబు తరుణులకునుశాం
తివిహీనతపము పులుసున్, వివరించఁగ లేఁభుక్తి వృధయంద్రుశి. 104
అమృతము సద్గుణియగుసతి, యమృతముశిశుభాషణమ్ములవనిపుహితవం
దమృతంబుమానభోజన, మమృతంబివియున్నివినఁగ నమృతములు శి.
పాషండుఁడైనఁ బరహిత, భాషైనను మూర్ఖుఁడైన పండితుఁడైనన్
కాషాయుపండములచే, భూషణయుతి సర్వలోకపూజ్యుండు శి. 106
పాములకు బాలుపోసిన, నేమరునేవిషమునటు లహీనాత్ములకున్
దామొనరుచు నుపకారం, బే మరియపకారమగుచుఁ బెంపొందు శి.
అప్పునుయాచించుటయును, ముప్పునుగడుజారచౌర్యమును లేకుశియున్
గొప్పైనవ్యాధియెంగిలి, పప్పన్నములష్టకష్టపద్ధతులు శివా. 108
కడుదాసీలును భృత్యులు, కొడుకులు వస్తువులుబందుగులుగుబ్టంబుల్
ఎడలేనిధనముధాన్యము, పుడమినియివియున్నియష్టభోగములుశి. 109

ఈఁగలుగాలియుసోఁగసగు, భోగముసతియాచకుండుభువిమూషకముల్
బాగుగ మున్నిబుకరణము, వేగమొసరపీడనముల వెలయుదురు శివా.
ఇలనాయుభూప్రదక్షిణ, ములుసేయుట నూర్లుకాశిఁబోవుట పదివే
యులుసేతుస్నానంబుల, ఫలములు నిజమాతృపూజఁబ్రతిరావుశి. 111
అన్నోదకసమదానము, సన్నుతద్వాదశివ్రతంబుజపగాయత్రీ
కన్నను మంత్రముమాతృక, కన్నను దైవంబులేదుగణుతింపశి. 112
ధరధనికునాలుబిడ్డలు, దొరవలెబందుగులు స్నేహితులువేల్పుగ ధీ
వరులాచార్యునివలెఁ జూ, తురుభాగ్యముకన్న నేదిదొడ్డదిఁక శి. 113
ఇలశూద్రుండు కపిలగోవులపాలానుటయు విప్రుపొలఁతినెనయుటల్
బలుశ్రుతిగోచరముసఁ గే వలచండాలత్వమొందు వాఁడిలను శి. 114
సూనులుగలుగనిచాన ల, హీనప్రసవంపుబాధ లెఱుఁగని భంగిన్
బూనియనక్షరులతి వి, ద్యానిధులరసజ్ఞ తెఱుఁగరా భువిని శి. 115
తానుద్భవింపఁగలుగును, గానఁ గవిత్వాశ్వశౌర్యఘనవితరణముల్
ఈనాలుగువిద్యల నే, మానవుచే నేర్పఁబడవు మహియందు శి. 116
తనతల్లిదండ్రులన్నలు, తనయులుపనివాండ్రుసఖులుదనయిల్లాలున్
ధనహీనమైనఁబలుకరు, ధనముండినఁగొప్పసేయుధరవారు శి. 117
గోమూత్రముచేఁ బాల్జైడు, గోమూత్రముగలసి చల్లకొమరొప్పక్రియన్
ధీమతికల్పాఘముచే, బామగుఖలునకతిపావభయమేమి శివా. 118
శరధిమథించెడివేళన్, హరియున్సిరినొందె విషము హరుఁడువహించెన్
బరగనదృష్టముకన్నను, ధరమిక్కిలికలదె ప్రజకుఁదధ్యముగ శి.119
తనురోగికి శిశువృద్ధుల, కును వంశ్యాచారయుతున కును ననయంబున్
బనిసేమినిష్ఠ వీరలు, ఘనలోకమునందుచుంద్రు గౌరీశ శివా. 120
హరినైనను హరునైనన్, బురమైనను వనమునైన భూపతినైనన్
వరయతినైనన్ గృహాసుం, దరులందొక్కటిని నమ్మఁదగునంద్రు శి.
శ్రుతిహీనునికిడుదానము, పతిహీనపుసైన్యములును బాలకహీనన్
అతివయుదక్షిణహీనపు, క్రతువును నిష్ఫలములంద్రుకవికల్ప శి.122
రోషము యముతోసమము వి, శేషాపేక్షయును ఘోరసింధువువిద్యా
శేషము సురధేనువు సం, తోషమునందనవనంబుతోసమము శి. 123

సారరహితమనఁదగు నం, సారంబనియదినెఱింగి సద్గుణులగ్రహింతుల్
సారమనిశివుఁడు హిమగిరి, శౌరిపయోరాశివసించి శయనించె శి. 124
సాదకంటెఁ జింతయధికం, బదియెట్లన సాదయుప్రాణముఁగొనిన దేహం
బుదహించుఁ బ్రాణయుతతను, వుదహించునుచింతదగనుపురుషులకు శి.
ధరలక్ష్మివచ్చు తఱిఁగొ, బ్బరికాయలయందు నీటిభంగినిసిరి దా
నరిగెడియవసరమందునఁ, గరిదిన్నకపిత్థఫలముగాఁదగును శివా. 126
ధారుణిబాలుర చెలిమియు, కారణమగునగవునారకాంతల కిడుటన్
గ్రూరాత్మునొప్పనొలువుఖ, రారోహమనస్కృతోక్తిహైన్యములు శి
ఇనుఁడుదయమధ్యసాయం, బునముండెడివేళ నుదకమునఁబ్రతిబింబం
బునురవినిఁజూడఁ గాడదు, జనములకదిగోత్రహానిజనకల్ప శి. 128
ఆఁదూడపలువుదాటఁగ, రాదతివృష్టినిఁబయిండ రాదుదకములోఁ
దాదేరినీడఁజూడఁగ, రాదివిదారిద్ర్యములు ధరాస్థలిని శివా. 129
ఇనశశిపరివేషంబులు, జనములకతిపీడమొదటిజామున రెంటన్
ఘనవృష్టిసుభిక్షము మూ, టనాల్గింట నాశమంతటనుగల్గు శి. 130
భువిమొదటిజామునను రెం, డవజామున భోజనమ్ములతిసౌఖ్యము మూ
డవజామునరోగము నా, ల్గవజామునఁ బ్రజకుమృత్యువగునయ్య శి.
విషమగు నవకూష్మాండము, విషమగు ముదివంగకాయ వృద్ధునిజోస్యం
విషమగు బాలునివైద్యము, విషమగుముదిమగఁడు లేతవెలఁదులకుశి,
దొరలిరువురువైద్యుగులి, రువ్వుఁబోరుగూరంపుఁగ్రిమి మరొకగేదెయుని
ద్దఱు పెండ్లాములుఁగదుదు, పక్షులీరైదుగురు ప్రాణఘాతకులుశి.123

సీతికంద శివశతకము.

సంపూర్ణము.

# భక్తచింతామణిశతకము

శ్రీమద్భూమిధరాధిరాజతనయా • చిత్తాంబుజద్యోమణీ
వ్యామోహార్ణవతారణైకతరణీ • బాలేందుచూడామణీ
ప్రేమాభ్యంచితకంకణీకృతఫణీ • బృందారకగ్రామణీ
స్వామీ నామదిఁబాయకుండు శివసాం•బా భక్తచింతామణీ.

మ. నతగీర్వాణ మురారిబాణ కృతనా•నాలోకనిర్మాణ సం
తతసర్వావనిపత్రమాణ త్రిజగ•త్కల్యాణ సద్భక్తసం
తతిసంత్రాణధురీణ పుంగవలస•త్కంకాణ భాస్వన్మహా
పతితోద్ధారకళాప్రవీణ శివసాం•బా భక్తచింతామణీ. 2

శా. రాజద్దివ్యధునీతురుంబ మునిహృ•ద్రాజీవరోలంబ నా
నాజీవాత్మభిదావిడంబ పరమా•మ్నాయస్తవాలంబ నీ
రేజాతాక్షముఖాకదంబ దురితా•ద్రిప్రచ్ఛిదాశంబ వి
భ్రాజద్భక్తజనావలంబ శివసాం•బా భక్తచింతామణీ. 3

మ. ఘనవైశ్వానరదృగ్లలాట విలస•ద్గంగాజటాజూట పా
వనరౌప్యాచలకూట వేదచయఘో•స్వద్ఘోట లోకవ్రజా
వనలీలాధృతకాలకూట హతగ•ర్వగ్రస్తదోషాట శో
భనచంద్రార్ధకళాకిరీట శివసాం•బా భ. 4

మ. నలినీబాంధవకోటిభామ రిపుసే•నాభీమ నిష్కామ ని
ర్మలధామా హతకామ విద్వదభిరా•మా రామసుత్రామ గీ
తలసన్నామ మరుల్లలామ నిజభ•క్తస్తోమ సుక్షేమ ప
ల్వలపూర్ధామ విపద్విరామ శివ. 5

మ. విలసద్భద్రతురంగ రంగదజహా•ద్విజ్ఞానయోగాతిని
ర్మలయోగిప్రియసంగ సంగరరిపు•ప్రాణానిలాహారక్ప

ద్బలవద్బాణభుజంగ జంగమపురీ•దాహక్రియాచంగ ప
ల్వలపూర్ధామసదానుషంగ శివ. 6

మ. స్వవశోద్యజ్జగదండ దండధరగ•ర్వధ్వాంతమార్తాండ తాం
డవలీలాధుతకాండ కాండచయదీ•ర్ణక్రూరవేదండ జ్ఞే
యవిధానంవిదఖండ ఖండశశిచూ•డాలంక్రియాభోగవై
భవవిఖ్యాతసురప్రకాండ శివ. 7

మ. అలఘుశ్రీకరమందరాంగ కరుణో•దారాంచితాపాంగ ని
స్తులకారుణ్యయుతాంతరంగ హిమవ•త్పుత్రీపరిష్వంగ మ
త్తలతాంతాశుగగర్వభంగ మునిహృ•త్పంకేజసారంగ ని
ర్మలగంగాకలితోత్తమాంగ శివ. 8

మ. నిలయీభూతబుధాంతరంగ త్రిజగ•న్నిస్త్రాణరక్షాదిని
స్తులకార్యాభినయప్రశస్తవిచల•ద్భ్రూభంగ భక్తవ్రజో
జ్జ్వలచిత్తాంబుజమత్తభృంగ సముదం•చత్కోటికందర్పకో
మలరేఖాయుతమంగళాంగ శివ. 9

మ. జలజాతప్రభవాచ్యుతాదిసుమన•స్సందోహసంస్తూయమా
నలసన్మంగళదివ్యవేష గిరిక•న్యాచిత్తసంతోష యు
జ్జ్వలబాలేందుకళావిభూష కరుణా•సంపోషితాశేష ని
ర్మలకారుణ్యసుధీవిశేష శివ. 10

మ. కలశీసంభవగౌతమాత్రిశుకమా•ర్కండేయభృగ్వాదిమా
నిలలామావళిగీయమానమహిమో•న్మీలత్సుధామాధురీ
లలితాత్మీయకథాప్రసంగ శ్రితకైలాసాంచలోత్సంగ భూ
వలయాభంగ శతాంగ లింగ శివ. 11

మ. స్వవిభానిర్జితకోటిసూర్యపరత•త్త్వజ్ఞానదాచార్య లో
కవితానావనకార్య దీనజనర•క్షావిశ్రుతౌదార్య వి
ష్ణువిధీంద్రాద్యనివార్యవీర్యసకల•స్తోత్రార్హచాతుర్య భ
వ్యవిమోక్షప్రదకీర్తిధుర్య శివ. 12

మ. కలిదోషఘ్ననిజప్రసంగ త్రిజగ•త్కందాయమానాంగ దు
ష్కలుషాదభ్రతమఃపతంగ బుధహృ•త్కాసారచక్రాంగ ని

శ్చలసుధ్యానపరాయణార్యభవపాశచ్ఛేదాచంగ కే
వలవిజ్ఞానమయాత్మనంగ శివ. 13

మ. కృతనానాజగదింద్రజాల త్రిజగద్గీతాభిధాజాల సం
తతభక్తావనలీల ఘోరభవసంతాపార్తినిర్మూల వ
ర్ధితసత్కీర్తివిశాల శైలవరపుత్రీలోల దీనావనా
వ్రతిమోద్యత్కరుణాలవాల శివ. 14

మ. పరతత్త్వావనిమద్విహార వినమద్భక్తాఘమందార దు
స్తరసంసారభయాపహార జగదాధారా గుణోదార భా
సురనామామృతసార నిర్మలపరంజ్యోతిర్మయాకార స
త్త్వరజోముఖ్యవికారదూర శివ. 15

మ. నిజమాయాకృతసర్వలోక వినమన్నిత్యామృతాలోక వి
శ్వజగత్పాలనజాగరూక దివిషద్వంద్యాంఘ్రినాళీక భ
క్తజనాస్తోకతమోవిమోక పరిధూతస్వాశ్రితానేక జ
న్మజరామృత్యుభవైకశోక శివ. 16

మ. పరసంత్రాసకరప్రతాప శేముషబ్రహ్మాదిసంతాప దు
ర్భరమోహాంధతమఃప్రదీప విలసద్భర్మాద్రిరాట్చాప శ్రీ
కరసత్కీర్తికలాప నిత్యనిజభక్తవ్రాతనిక్షేప చి
త్పరమానందమయస్వరూప శివ. 17

మ. నతభక్తవ్రతకల్పభూజ విలసన్నానాజగద్బీజ ర
క్షితగీర్వాణసమాజ పావనతరశ్రీమత్పదాంభోజ వ
ర్ణితకోటిగ్రహరాజతేజ కరుణానిర్వ్యాజ దీనావన
వ్రతపారీణ పురారిరాజ శివ. 18

మ. సవిలాసాగలదక్షయాగ భవమోక్షప్రాభవాభోగ హై
మవతీసంగతవామభాగ సకలామర్త్యావనోద్యోగ సా
ధువరానందకరాత్మయోగ దృఢచేతోభావపుర్లాహసం
భవభస్మోల్లసితాంగరాగ శివ. 19

మ. అవనీభృత్తనయాకళత్ర సమరజ్యాఖండితామిత్ర దు
ర్భవదుఃఖాంబుధియానపాత్ర సితభాస్వన్నేత్ర పంకేజబాం

ధవచంద్రానలనేత్ర నిర్మలజగ • త్కళ్యాణచారిత్ర స
త్ప్రవరస్తోత్ర జగత్పవిత్ర శివ. 20

మ. అమితశ్రీకరసుప్రసాద నిజభ • క్తాభీష్టదామోద యా
గమసంచారవినోద దీనజనర • క్షానంత తామోద దు
ష్టమహాపాపవిభేద ఘోరభవపా • శచ్ఛేద బ్రహ్మాచ్యుత
ప్రముఖాభ్యర్చితపాద శ్రీద శివ. 21

మ. వదవద్మార్చకకల్పవృక్ష త్రిజగ • త్పావచ్ఛిదాదక్ష దు
ర్మదదైతేయవిపక్ష విశ్వలయని • ర్మాణావనాధ్యక్ష చం
ద్రదినేంద్రజ్వలనాక్ష భక్తనివహో • ద్యద్భూరిసన్మంగళ
ప్రదరాజత్కరుణాకటాక్ష శివ. 22

మ. ధవళాంచద్దరహాస మానిహృదయాం • తర్వాస నిస్సీమవై
భవకైలాసనివాస భూరినిజస • ద్భక్తావనోల్లాస స
త్ప్రవరస్వాంతవికాస భాస్వదఖిల • బ్రహ్మాండభాండావళీ
భవరక్షాలయకృద్విలాస శివ. 23

మ. మున్నా ఘోరహాలాహలాగ్ని త్రిజగం • బుల్గాల్ప నీవంతట
న్నెన్నండాదిగ వేలుపుల్మొఱలిడ • న్వేవచ్చి నీవావిషం
బన్నాఁడాని జగంబుఁగాచి తట య • న్నా యెన్న నీకన్న నా
పన్నత్రాణపరాయణుల్గలరె సాం • బా భ. 24

శా. సారోదారసుభక్తి బాణుఁడు నమ • స్కారంబుగావించి యుం
పారన్వేఁడిన వానియింట నటుం • బారాధిగానుంటివి
ఖ్లేరీ భక్తమనోరథంబు లిడువా • రీవిశ్వమం దెంతయు
న్నారంజూచిన నీవకాక శివ. 25

మ. క్షితిలోఁ బల్మఱు బోయకన్నఁ డిడును • చ్ఛిష్టోపహారంబుల
ప్రతిమప్రీతిఁ బరిగ్రహించి యతవ • ర్గప్రాప్తుఁ గావించితౌ
పతితోద్ధారకభానిరూఢబిరుద • ప్రఖ్యాతికిం జూడ నీ
ప్రతిలేఁ డెవ్వఁడు దైవకోటి శివ. 26

శా. శిక్షాచారుఁ డొకండుపేర్మి శివరా • త్రి న్వేశ్యతోఁగూడి సం
సక్తిం దత్కుచసీమనీకు నొకపు • ష్పంబుంచి యర్పించినన్

రక్షింబ్రోచితి వారభక్తమలభఁబ్రఖ్యాతి నీయందెను
వ్యక్తంబైనది గానితే దెచట సాంబా భ. 27
మ. అరుదారన్నివరాత్రియందొకఁడు చోర్యానక్తి యుమత్రద్వహాం
తరదివ్యస్థలి జాగరూక్తి గను మాత్ర న్ముక్తుఁడై యేగె ని
న్నిరతాసక్తి భజించువారికరుదా నిర్వాణలక్ష్మీవిని
ర్భరసంశ్లేషసుఖాబ్ధిఁదేలుటకు సాంబా భ. 28
మ. సురలాస న్సురగ్రోలువేళ గముతోచున్వచ్చి రేగాని వా
రరయన్ లోకహితార్థ మాగరళమింతైనం దినంజాలరె
వ్వరులోకేశ్వర నీవుదక్క నీకె విశ్వత్రాణ సామర్థ్యమె
వ్వరికైన న్గలదా త్వదన్యులకు సాంబా భ. 29
శా. భక్తింబాయక ఫల్గునుండు భజియింప న్మెచ్చి దేవీసమా
యుక్తిన్నీవు కిరాతవేషమున భానుద్వృత్తిఁ బోరాడి యు
వ్యక్తుండై ప్రవహరించినంత వరలాభంబిచ్చినావయ్య నీ
భక్తానుగ్రహ మేమిచెప్ప శివ. 30
మ. గిరిమ న్నీశరణంబుసొచ్చినను మార్కండేయు రక్షించి దు
ర్భరవైవస్వతభీతిమాన్పి తఁటనీవాత్సల్య మెన్నంగ నా
తరమా నీచరణానతార్థిజనసంత్రాణైకదీక్షావిని
ర్భరభావ్యద్బిరుదంబు నీకతగు సాంబా భ. 31
మ. అలకాధీశునకిచ్చినావు నవనంఖ్యాకాక్షయశ్రీనిధుల్
జలజాక్షునకిచ్చినావు నిజభాస్వద్దివ్యచక్రంబుఁ బెం
పలరన్వ్రజకొసంగినావతులదివ్యప్రాభవం బౌభళీ
బళి నీసాటివదాన్యుఁ డేఁడి శివ. 32
శా. బాధామర్షతబ్రహ్మమూర్ధముఁ ద్రుణప్రాయంబుగాఁద్రుంచియు
న్గాఢంబౌకృప సాలెపురుగ్వనకు మోక్షంబిచ్చియున్ మించితో
రూఢింజెప్పఁగనేల తక్కినసుపర్వ ల్నిగ్రహానుగ్రహ
ప్రౌఢిన్నీకు సమాన మెవ్వరికి సాంబా భ. 33
మ. గురువత్నీగిమనోగ్రపాతకకళంకుండైన చంద్రుండు నీ
శరణన్నంతనె నెత్తిఁబెట్టుకొని వాత్సల్యంబు పంధిల్లఁగాఁ

బరిరక్షించితి విట్టియాశ్రితకృపా•పారీణు లింకెందునుం
బరికింప న్మఱిలే రికెవ్వరును సాం•బా భ. 34

శా. లేరే వేలుపు లెందఱేని మిగుల • న్లెక్కింప వారెవ్వరుం
గారుణ్యంబున భక్తవత్సలత మో•క్షప్రాభవారూఢినిం
పారం దావక దివ్యసన్మహిమ ల•క్షాంశంబునం బోలలే
రౌరా మ్రొక్కిన నీకె మ్రొక్కవలె సాం•బా భ. 35

మ. గ్రహరాజుం గని నీవు పండ్లు డులియం•గా గొట్టినవ్వేళ నే బ్రల్
గ్రహచారంబులుఁ జాలకుండె మఱియా•బ్రహ్మోత్తమాంగంబు
రహినీచేఁ దెగ నేవిధాతనొసటన్ • వ్రాసె న్భవద్దివ్యస
న్మహిమప్రాభవ మింతెకాక శివ. 36

శా. నీచారిత్రము బల్విచిత్రము గదా • నీసేవకశ్రేణికిం
పౌచిత్రాంబరరత్నభూషణసుధా•హారాదికంబిచ్చి నీ
వాచర్మాంబర మస్థిమాలయు విషా•హారంబుఁ గైకొంటి వా
హా చాతుర్యము చెప్పఁగాఁ దరమె సాం•బా భ. 37

మ. అణుమాత్రంబుఁ దలంప వాద్విజవధా•ద్యత్యంతఘోరాఘముల్
కణమైనం బరికింపఁ బోవు ఘనరా•గద్వేషలోభాదులన్
గణనం జేయవు జాతిధర్మవిధిభం•గంబుల్ రవంతేనియుం
బ్రణతాభీష్టవరంబు లిచ్చుతఱి సాం•బా భ. 38

మ. గరిమన్విప్రుఁ డొకండు చేత శివలిం•గంబుంచి పూజింప నం
తరమం దజ్జనకుండుగాంచి పడఁద•న్న న్వాఁడు క్రోధార్తిఁ ద
చ్చరణంబుద్దెగఁ ద్రుంచి తత్క్షణమ య•న్వప్సాకృతిం జెందె నీ
పరిచర్యామహిమ ల్విచిత్రములు సాం•బా భ. 39

మ. బలభిన్ముఖ్యమరుత్కిరీటమణి దీ•పశ్రేణి నీరాజితో
జ్జ్వలపాదాబ్జుఁడవైన నీకు సరిపో•ల్పన్ దైవముల్లేరు శ్రీ
వెలయంగన్గొన నీకు సాటి మఱినీ•వేగాని విశ్వంబులోఁ
బలుకు ల్వేయునికేల చాల శివ. 40

శా. శ్రీరాముండు కపిస్వరూపదివిష•త్సేనాసహాయాదిసం
భారుండై శతయోజనాయతముగా • బంధించి యున్నట్టి యా

వారాశిం దమి నొక్కగ్రుక్కగను ద్రా•వం గుంభజుం డోపుటే
పార న్నీపదభక్తి సన్మహిమ సాం• బా భ. 41

మ. తనర న్సర్వసుపర్వులందుఁ బరత• త్త్వం బెవ్వరో సత్యభా
వనతోఁ దెల్పుమటన్న వ్యాసుఁడు "నదై•వం వాసుదేవాత్పరం"
బని చేయెత్తివచింప నంత నిజబా•హా స్తంభనం బైన స
ర్వనిరూఢిం బరతత్త్వమీవనఁడె సాం• బా భ. 42

మ. పురసంహారమఖాపహార నలినో•ద్భూతోత్తమాంగచ్ఛిదా
స్మరదాహాంతకనాశ మృత్యుజయభీ•మక్ష్వేళపానాదిదు
ష్కరకృత్యంబులు నీవొనర్చుకతన • న్సర్వేశ్వరుండంచు ని
న్వరమామ్నాయము లెంతయుం బొగడు సాం• బా భ. 43

మ. తలఁదావంచుకొనె న్ఫణీంద్రుఁ డతిచిం•తన్వాగ్వరారోహ వె
ల్వెలఁ బాఱెన్ విధియేమిటోఁ వశమె ని•ర్విణ్ణాత్ముఁడై నల్దెన
ల్గలయం గన్గొనుచుండె గీష్పతియు శం•కన్మౌఢ్యముం బూనె ని
న్వలనొప్ప న్వినుతింపఁజాలమిని సాం• బా భ. 44

మ. అలవిత్తేశుఁడు మిత్రుఁడై విమలరౌ•ప్యాహార్యమాభాసమై
బలుమేల్బంగరుకొండ మేటిధనువై • భాసిల్లు నాసర్వమం
గళభార్యామణియైన నిన్గొలుచుభా•గ్యం బబ్బునే యీజగ
ద్వలయంబందును నెంతవారికిని సాం• బా భ. 45

శా. కళ్యాణాత్మక మైనచాప మురుభో•గ శ్రేష్ఠమౌనారి సా
కల్యానూన రమానివాస మగు స•త్కాండంబు భద్రప్రదా
మూల్యంబై తగువాహనంబు గల ని• న్పూజించిన న్భాగ్యసా
ఫల్యం బాటరుదే ప్రసన్నులకు సాం• బా భ. 46

శా. సత్యజ్ఞానసుఖస్వరూప మగునీ • శశ్వన్మహత్త్వంబు దా
నత్యంతాద్భుతమై పవిత్రకరమై • యజ్ఞానవిధ్వంసియై
నిత్యశ్రీకరమై చెలంగు నిదిగో • నిక్కంబు సర్వశ్రుతుల్
ప్రత్యక్షంబుగఁ జాటుచుండు శివ. 47

మ. వెలయ న్సర్వసుపర్వరూప మగు నీ • విశ్వస్వరూపంబు కే
వలరూఢి న్భజియింపలేక బహుదై•వభ్రాంతిఁ బెక్కింద్రుమూ

ర్తులసేవింపఁగ వారికిం దదుచితో • ద్యోగానురూపంబుగా
ఫలదానంబిడు మేటి వీవకద సాం • బా భ. 48

మ. అరయ న్భూజలవహ్నివాయుఖరవిం • ద్వాత్మాష్టకం బెన్న నీ
పరమార్థాష్టకమై యొసంగ నిఖిల • బ్రహ్మాండభాండోత్కరం
బురహిండజ్జలబుద్బుదోపమములై • పుట్టు న్నశ్రనుం గిట్టు నీ
పరమానందమయస్వరూపమున సాం • బా భ. 49

శా. లీలానిర్మితనైకకోటిఘనసా • లీకోద్భవాండచ్ఛటా
మాలాజాలవిరాట్స్వరూపమగు నీ • మాహాత్మ్య మింతైన నా
ఫాలీకాక్షచతుర్ముఖాద్యమరు లె • న్నంజాల రెన్నాళ్లకుం
బ్రాలేయాచలకన్యకారమణ సాం • బా భ. 50

మ. తనియ న్స్మృతిము న్శ్రుతార్థములఁ బొం • దన్వచ్చు నుద్యద్విష
ద్వనఘుల్గాఁటఁగవచ్చు నశ్రమత వి • శ్వం బెల్లఁ దెల్లంబుగాఁ
గనఁగావచ్చు నకృజ్జపంబున నె వీఁ • కన్ శైవపంచాక్షరీ
మనురాజం బఖిలార్థసాధనము సాం • బా భ. 51

శా. చేతోవీథిభవత్పదాంబుజముఁ దాఁ • జింతించి యెందేగినన్
భూతప్రేతపిశాచరాక్షసగణం • బుల్ పోవు దవ్వై యసం
ఖ్యాతాపన్నిచయంబడంగు నిరపా • యాత్యంతసన్మంగళ
వ్రాతంబుల్సమకూడు నిక్కమిది సాం • బా భ. 52

మ. నుదుట న్భస్మమలంకరించి యురుభక్తిన్ • రుద్రాక్షముల్దాల్చి లీ
లదలిర్ప న్భవదీయదివ్యచరితల్ • గానంబు గావించుచు
న్ముదమొప్ప న్విహరించువానిఁ గని తా • మోహాతిరేకంబుచే
వదలంజాలదు ముక్తికాంత శివ. 53

శా. నీలీలాచరితావళుల్పొగడువా • నిం జూచి భీతాత్ములై
జాలింబొందుచుఁ గాలకింకరులు త • త్స్వామి [illegible]
చాలంగాఁ బరువెత్తిపోదురట మిం • చన్ దుష్ప్రగా నోజగ
త్పాలారాధితపాదపద్మ శివ. 54

శా. నీనామోచ్చారణము ముక్తిపాతిశయమౌ • నీభక్తవాత్సల్యము
న్నీదీనార్తజనైకపోషణము నీ • నిర్వాణసంధాన మిం

కేద్వైవంబులయందుఁ గాన మీఁక వే•యేలా గణింపంగ నీ
పాదాబ్జంబులఁ గొల్చి ముక్తుఁడగు సాం•బా భ. 55

శా. నీకర్పించిన పత్రపుష్పఫలపా•నీయంబులుద్యన్మదా
స్తోకేభేంద్రమనోజవాశ్వవిలస•త్స్వర్ణంబుబింబాననా
ద్యాకారంబులఁ బుట్టి పూర్వభవవి•ద్యాయుక్తిఁ బ్రాకృవ్రాజక
ప్రాకారంబులఁ బాయకుందునఁట సాం•బా భ. 56

మ. పరుసం బాపులితోలు పైనిడి చితా•భస్మంబు మైఁబూసి య
బ్బురమౌపుష్కసరుల్ధరించి జగము•ల్పుట్టించుచుం ద్రుంచుచుం
బరమాయాకలితేంద్రజాల మరుదొ•ప్పంజేయఁగాఁ గాటికా
పరివైయుండితివో బళీబళిర సాం•బా భ, 57

మ. ధరణి న్రాజశిఖామణిం గొలిచి వే•దండాశ్వరత్నాంగనా
స్థిరభాగ్యంబులఁ గాంచునందు రిది యెం•తేవింతగాదా దిగం
బరు నాయాదిమభిక్షుని న్గొలిచి శ•శ్వత్త్వాభవప్రోల్లస
త్పరమైశ్వర్యముఁ గాంచుచుండ శి. 58

మ. వివిధామ్నాయపురాణశాస్త్ర మను స•ద్విద్యారహస్యంబులన్
హవనాదిక్రియల న్బయాగముఖది•వ్యక్షేత్ర రాజంబుల
న్వివరింప న్సకలప్రపంచమును నీ•వేకాని విశ్వంబులో
భవదన్యం బిసుమంత లేదు గద సాం•బా భ. 59

మ. జలజాతాక్షచతుర్ముఖత్రిదశభా•షాశేషవాచస్పతుల్
పలుక న్నేరరు నీప్రభావలవమున్ • భావింపలే రట్టిచో
నిలనేనెంతటివాఁడ నీదుమహిమం • బెన్నంగ నోలింగ భ
వ్యలసద్భూరిదయాంతరంగ శి. 60

మ. ఫలపర్ణాంబుసుమంబులిచ్చిన నన•ల్పశ్రీత్రిలోకీసము
జ్జ్వలసామ్రాజ్య మొసంగి నీవు తుద మో•క్షంబిచ్చుచుండంగ
సులభోపాయ మెఱుంగలేక మనుజుల్ • క్షోభింతురేమొకొ
త్పలినీబంధుకళావతంస శి. 75

మ. చెనకన్వచ్చి మనోజుఁ డంతటనె భ•స్మీభూతుఁడై
సునదత్తుండు నిరాకరించి చటులా•స్తోకార్తి పాల

వివిధాభీష్టములొందవచ్చు సుఖమై • విశ్వేశ సద్భక్తితో
భవదంఘ్రిస్మరణంబుఁ జేసి శి. 69

మ. ఖలసాంగత్యముగాదు చేసినను దుః•ఖంబీక నేపోదు పె
ద్దలసాంగత్యము మానరాదు మతభే•దంబుల్ వృథావాదు ని
శ్చలసారం బగునీదుభక్తి వరమో•క్షప్రాప్తి కింబాఁదు మో
హాలతల్ ద్రుంపక ముక్తి లేదు శి. 70

మ. పరులన్బాధలొనర్చి బల్ధనముసం•పాదించి విఖ్యాతికై
ధరలోఁ జేసిన యట్టిధర్మములు వ్య•ర్థంబై చనుంగాక సు
స్థిరతం బొందునె సర్వభూతపరితృ•ప్తుం జేయుటే నీమహా
పరిచర్యాకరణంబు గాదె శివ. 71

మ. క్షితిలోఁ గొందఱు వారివారిమతముల్ • శ్రేష్ఠంబు లన్యంబులౌ
మతముల్గావని చెప్పుచుందు రిదినీ•మాయావృతభ్రాంతి సం
తతనానావిధజంతుసంతతిహృదం•తర్యామివౌనీకు స
మ్మతిగా నట్టిమతంబునుంగలదె సాం•బా భ. 72

మ. అరయన్నీవపరోక్షతన్నిఖిలభూ•తాత్మస్వరూపుండవై
పరిపూర్ణస్థితినుండఁ గన్గొనక ని•న్బావింతు రెందో జనుల్
పరమేశా భవదీయమాయఁ దెలియం • బద్మోద్భవాదిత్యగో
పరమేశాదులకైనఁ బోలదఁట సాం•బా భ. 73

మ. విపరీతార్థకుతర్కవాదములచే • విజ్ఞాన మొప్పారునే
కపటాచారవిడంబనక్రియలచేఁ • గైవల్య మేతెంచునే
చపలాశావిషయోపభోగములచేఁ • జల్లారునే తృష్ణ నీ
యపరోక్షానుభవంబు లేక శి. 74

మ. కలివేళ న్విధిచోదితక్రియలొగిం•గావింపఁగా లేక తా
రలసుల్గొందఱు తత్త్వవేదులము మే•మంచు న్సుకర్మంబులి
మ్ములఁగావింపరుగాని భోగ్యవిషయం•బు లాత్మనగా లేరు ని
ష్ఫలదంభోక్తుల ముక్తిచేకుఱునె సాం•బా భ. 75

మ. నరులన్మోసముపుచ్చి సొమ్ముగొన నా•నాశాస్త్రవాదంబులు
న్వరవేదాంతవిశిష్టయుక్తులును దం•భప్రాప్తవేషంబులుం

గరము ప్పారసనుగాని సద్గురుకటా•క్షంబింత లేకున్న నీ
పరతత్త్వంబెఱుఁగంగ రాదు గదసాం•బా భ, 76

మ. మిానంబెప్పుడు నీటనేమునుగుఁ దా•మేషంబు పర్ణాశనం
బే నిత్యంబొనరించుఁ బాముపవనంబే•గ్రోలు నేర్పొప్పగ న
ద్దానన్నానికి నేమిపుణ్యఫలమొం•దంగల్గె నట్లౌను నీ
ధ్యానంబించుకలేని సత్క్రియలు సాం•బా భ, 77

శా. దేవా తావకభక్తిలేనినరుఁడే•తీర్థంబులంగ్రుంకినన్
గ్రావాగ్రంబులపైవశించినను యో•గశ్రేణిసాధించినన్
కైవల్యార్హుఁడు గాఁడతండితరకాం•క్షల్మాని నిన్నాత్మలో
భావింపంగలవాఁడు ముక్తుఁడగు సాం•బా భ, 78

మ. తనవారొక్కరుఁగూడరారు యమబా•ధల్మాన్పగా లేరు మున్
ధనకాంక్షం దనుగూడినారు తుదఁజెం•తన్నిల్వగాఁబోరు గా
వునవైరాగ్యముమిాఱు ధీరులతిభ•వ్యుల్ వారునీభక్తిభా
వనచే ముక్తికిజేరువారు శివసాం•బా భ, 79

మ. ధరణింగోరకయున్నఁ బోవుసుఖముల్•తాఁగోరిన న్రావుగాఁ
పురముల్నిత్యముగావు సంతప్రజగుం•పుంబోల్కి నేపోవు నీ
శరణన్న న్విడనాడలే విదియెమో•క్షప్రాప్తికిందావు ద
బ్బఱవేసంబులు మెచ్చవీవు శివసాం•బా భ, 80

మ. తిరమైదేహామునిల్చునా శమనుడిం•దే నిల్వఁగానోర్చునా
సిరిదానిల్కడ సేయునా యెపుడువా•సిన్వెన్నెలల్గాయునా
ధరసంసారము నిత్యమా తెలివినొం•దన్లేకమున్నెన్నఁడో
పరమార్థంబొనరింతు నేననిన సాం•బా భ, 81

మ. చెదరున్ దృష్టిమనీషయుంజెదరు బ•ల్జీర్ణంబులై యంగము
ల్వదలున్ దంతములెంతయుంగదలు శీ•లంబంతమున్నేచను
న్మదిమించిక్కినవేళఁ జిత్రమిదియే•మోతృష్ణ దానొక్కఁడే
వదలంజాలదుగాని మానవుని సాం•బా భ, 82

మ. జ్ఞాతిద్రోహులు బంధుఘాతకులు హిం•సాసత్యశూన్యుల్ దయా
వీతస్వాంతులు సాధుబాధకులు నై•వేధించుచున్నాఁడు ని

ర్భీతిందాఁగలి పూరుషుండిపుడు ధాత్రిన్నీవుపేక్షించిన
న్నాతండ్రీ బ్రదుకెట్లు సాధులకు సాంబా భ. 83

మ. ధనమే సాధనమెల్లకార్యములకుం దర్కింపసత్కీర్తి జీ
వనమే పావనమెల్లలోకములకు న్వర్ణింప నీపాద పూ
జనమే భాజనమెల్లభద్రములకుం జర్చింపఁగా నేరికి
న్మనమే కా ఘనమోక్షకారణము సాంబా భ. 84

మ. ధరసత్కీర్తికి దానమేమిగుల సద్యస్తృప్తికిం బోనమే
సరసత్వాప్తికి గానమే కలహనాశస్ఫూర్తికి న్మౌనమే
గరిమావాప్తికి మానమే నిరతమోక్షప్రాప్తికిన్ జ్ఞానమే
వరఁగుంగా కిఁకఁగాన మేక్రియల సాంబా భ. 85

మ. నినుమెచ్చించుట భక్తినే జనులకు న్మేలౌట సత్యోక్తినే
తనకు న్బంధము రిక్తినే పరమభద్రస్ఫూర్తి సద్యుక్తినే
కననిశ్చింత విరక్తినే సకలదుఃఖప్రాప్తి సంసక్తినే
మనముం బట్టుట యుక్తినే యగును సాంబా భ. 86

శా. ఆయుర్దాయముసెల్లి మర్త్యులు సదాయామ్యాలయం బొందుటల్
శ్రేయస్సంపదనొక్కెడ న్నరులు నిశ్రేయస్కులై యొక్కెడం
గాయక్లేశము నొందుటల్గనియు రాగద్వేషములాత్మన రీ
మాయాపాటవ మేమిచెప్ప శివ. 87

మ. జగతిం జూడ నియోగియై మొదలఁ దా జన్మింపనేరాదు క
ర్మగతిం జన్మము గాంచె నేని బ్రదుక న్రాదట్లు జీవించిన
న్యగతో నిర్ధనుఁడౌట గూడ దటులైన న్యోగ మిల్వాసిగో
ప్యగతిం దాపసియై చరింపఁదగు సాంబా భ. 88

మ. నినుసేవింపక పొట్టకూటికి జనుల్నిత్యంబుమూఢాత్ములై
ధనికద్వారములందుఁ గొల్చెదరు తత్కర్మంబునేమందు గా
ననమందుండెడు కొండచిల్వకు శిలాంతర్వర్తి యాకప్పకు
న్మననాహారముఁ దెచ్చి నీవిడవె సాంబా భ. 89

మ. పుడమిం బెక్కువనంబుల న్మధుఫలంబుల్ స్వాదుపానీయము
ల్గడునొప్పారులతావితానములు యోగ్యంబౌగుహావాసముల్

గడిమిం బ్రోచెడిదాత వీవు గలుగంగాఁ గూటికై దీనతం
బడి యాచింపఁగ నేల దుర్మదుల సాంబా భ. 90

మ. ఇరవందం జడలందు గంగ గల నీకీ భూజలస్నానము
న్నిరతిం జాబిలిపువ్వుఁ దాల్చు దొరవౌ నీకీ ధరాపుష్పముల్
గురులోకత్రయదీపకుండ వగు నీకుం దీపము లెచ్చుగా
వరయన్ భక్తి గొనుకొండుగాని శివ. 91

మ. పరగన్మన్మథ దేహదాహ విలసద్భస్మాంగరాగంబున
బ్బురమా బ్రహ్మకపాలమాలికలు సద్భోగీంద్రభూషాచయం
బిరవొందం ధరియించు మేటివగు నీకీ గంధమాల్యాదులం
బరితోషంబొనరించువాఁ డెవఁడు? సాంబా భ. 92

శా. శంకాతంకములేక శంకరున కీషత్సామ్య మొందంగ లే
రింకే వేల్పులటంచు దివ్యకరిపై హేమధ్వజం బెత్తి యా
పంకేజప్రభవాండమెల్ల వినిపింపన్ భూరిభేరీమహా
ఝాంకారంబులు నిండఁ జాటెదను సాంబా భ. 93

మ. బలువింతే బరువింత యానసక యాబంగారపుంగట్టుచి
ల్వలతేని న్వలతేనితండ్రిపొక కేలస్వల్గానంబమ్ముగా
బలిమిం బూనిన మేటివీవు ననుఁ జేపట్టంగ వేఁగానె యా
బలిపుత్రాంగణపారిజాత శివ. 94

మ. సకలస్థావరజంగమాత్మ వని యశ్రాంతంబు నిన్వేఁడ నీ
వకటా నాదుమొఱాలకింప విపుడా హా కేవలస్థాణుమూ
ర్తికి నేమ్రొక్కిన చందమయ్యె శివుఁ డెంతే సుప్రసన్నాత్ముఁడన్
ప్రకటఖ్యాతికి సంశయంబొదవె సాంబా భ. 95

మ. వ్రతనిష్ఠల్ సురభూసురార్చనలు దివ్యక్షేత్రయాత్రల్ శ్రుతి
స్మృతిధర్మంబులొకింతయేనెఱుఁగ మీ శ్రీపాదపద్మంబులే
మతిలో నమ్మితి నేననన్యరతినో మాతండ్రి శంభూ సతీ
పతి నీవే గతి కావవే నిరతి సాంబా భ. 96

శా. తుంగాబ్దాంబుకణంబు లెన్నఁదగు భూధూళిం గణింపం దగు
న్నింగిం జుక్కలు లెక్కవెట్టఁదగు నింతేగాని నాతప్పులె

న్నంగారా వీఁక నీవుగాకొకరు న • న్రక్షించు వారేరిఁకె
బ్బంగిం బ్రోచెదొ నీవ దిక్కుసుమ సాం • బా భ. 97

మ. పరఁగన్ శంభుఁడు దీనబంధుఁడని చె • ప్పన్నమ్మి యాసన్నిరం
తరమున్నే మొఱలిడ్డఁ బల్కవిదియే • న్నానోమ్రసమో లేకమున్
ధరనేఁ జేసినదోసమో కరఁగ ద • న్నానీమనం బింతయో
వరకారుణ్యసముద్ర రుద్ర శివ. 98

మ. పరదైవంబవు నీవటంచు మదినీ • పాదాబ్జముల్నమ్మి నేఁ
బరదైవంబుల వేఁడలే దెపుడు నా • పైనీవుపేక్షించినం
బరఁగంగా ననుఁ బ్రోచువారెవరిఁకన్ • భక్తావనాంచద్దయా
పరమూర్తీ శరణాగతార్తిహర సాం • బా భ. 99

శా. నీవేతల్లియుఁ దండ్రియు న్విభుఁడు స • న్మిత్రుండుఁ జుట్టంబులు
న్నీవేదాతవు దైవమున్ గురుఁడు నా • నిర్వాణనిక్షేపము
న్నీవేనాధగు తోడునీడ మఱియు • న్నీవే సమస్తంబు గా
భావింతు న్భవదన్య మేమెఱుఁగ సాం • బా భ. 100

శా. నీపాలంబడితి న్నిరంతరము నే • నీపాదముల్నమ్మితి
న్నీపద్యావళిఁ బాడుచుంటినెపుడు • న్నీకంటె నన్నెవ్వరుం
గాపాడందొరకోఁ డటంటి నిది నీ • కన్నంబింక నీచిత్తమో
పాపగ్రావవిభేదదంభ శివ. 101

శా. నీవిఖ్యాతచరిత్రము ల్వినుచెవుల్ నీ • పూజకౌహస్తముల్
నీవాసంబులకేఁగు పాదయుగము • న్నిన్గాంచుమేల్చూపు నిన్
గైవారంబొనరించు జిహ్వయును నీ • కై మ్రొక్కుమూర్ధంబు ని
న్భావింపంగల బుద్ధినాకొసఁగు సాం • బా భ. 102

శా. నీకీర్తిశ్రుతి నీకథాశ్రవణము • న్నీపాదసంసేవయు
న్నీకళ్యాణగుణానువర్ణనము నీ • నిత్యానుసంధానము
న్నాకుం బాయకయుండునట్లొసఁగు మ • న్నా జన్మజన్మంబుల
న్నాకారిస్తుతపాదపద్మ శివ. 103

మ. పరులన్వేఁడకయుండ వేఱొకఁడున • న్బ్రార్థించిన న్వానికిం
బరఁగన్ లేదనకుండ నామనము నీ • పాదారవిందైక సం

స్మరణంబేమఱకుండ నీవరము లి♦మ్మా నాకు శశ్వత్కృప
న్వరదా శంకర సుప్రసాద శివ. 104

మ. నమదార్తైకశరణ్య నీవు వెలయ ♦ న్మర్త్యేభశార్దూలచ
ర్మములం బ్రీతివహింతు గాననిపుడే ♦ మత్తేభశార్దూలవృ
త్తములన్నీ కుపహారమిచ్చితిని భ♦క్తవ్రాత మేమిచ్చినం
బ్రమదంబొప్పఁ బరిగ్రహింతుగద సాం♦బా భ. 105

మ. తనయుల్ లాల్మాటలు నూటి నేరక తమిం ♦ దప్పొప్పులెల్లాడినన్
జనకుల్ మోదముతోడఁ జూతు రటులే ♦ సర్వేశ నీవీజగ
జ్జనకుండౌట మదుక్తిలోపములనెం♦చంబోక వాత్సల్యభా
వనిరూఢిం గరుణించి కైకొనుము సాం♦బా భ. 106

మ. వితతశ్రీకరసత్పదార్థగరిమ ♦ న్విఖ్యాతిశోభిల్లు నీ
శతకం బెవ్వరు వ్రాసినం జదివిన ♦ న్సద్భక్తి నాలించిన
న్సతతాభీష్టసమస్తభోగపరమై♦శ్వర్యంబులం బొంది శా
శ్వతకైలాసపదంబుఁ గాంతు రొగి సాం♦బా భ. 107

మ. చెలువౌ నీకృతిఁ గూర్చి నీకొసఁగితిన్ ♦ శ్రీకూచిమంచాఖ్యస
త్కులసంజాతుఁడ సోమసుందరవరా♦ఖ్యుండ న్మహాగౌతమీ
విలసత్తీరతలస్థపల్వలపురీ♦విఖ్యాతవాసుండ ను
జ్జ్వలలీలం దయ దీనిఁ జేకొనవె సాం♦బా భక్తచింతామణీ. 108

సంపూర్ణము.

శ్రీరామాయ నమః.

# శ్రీరామచంద్రప్రభుశతకము.

శా. శ్రీకళ్యాణగుణాభివాస జయల క్ష్మీసంగమోల్లాస సీ
తాకౌతూహలకృద్విలాస త్రుటిత స్థాణూగ్రబాణాస జ్యో
త్స్నాహాసప్రదహాస చంపకసుమాం చన్నాస దోషాచరో
త్సేకోద్రేకనిరాస తోషితబుధా శ్రీరామచంద్రప్రభూ. 1

శా. శ్రీమచ్ఛ్యామలకోమలాంగ వరల క్ష్మీసంశ్రయాపాంగ ని
ష్కామగ్రామదయానుషంగ శరల క్ష్యస్వర్ణసారంగ సు
త్రామక్షేమదవృత్తిసంగ క్షితిజా తాసంశ్రితోత్సంగ ని
స్సీమప్రేమదయాంతరంగ వరదా శ్రీరామచంద్రప్రభూ. 2

మ. తరుణార్కప్రతిమానతేజ నిజసం ధాపూరణావ్యాజ సా
దరదృష్టార్యసమాజ శైలతనయా ధ్యాతాంఘ్రినీరేజ శౌ
ర్యరమాదృప్తమృగాధిరాజ సుసప ర్యాకృద్భరద్వాజ భా
స్వరసాకేతసువాసినీనిహితలా జా రామచంద్రప్రభూ. 3

శా. సంసారార్తివిరామ దేవహితకృ త్సంగ్రామ దక్షాధ్వర
ధ్వంసిప్రస్తుతనామ యోగిహృదయాం తర్ధామ సీతావధూ
త్రాంసప్రేమ వనస్థలావితమునీం ద్రగ్రామ లోకాపకృ
న్మాంసాశిప్రకర ప్రహారిశరభీ మా రా... 4

శా. సంధాపూరణజాగరూక జగతీ సంరక్షణాలోక కి
ష్కింధావల్లభపుణ్యపాక జయల క్ష్మీసంగ్రహోత్సేక ధా
రంధర్యాదిమదండశూక త్రిజగ ద్రాజద్గుణాస్తోక ని
గ్రంధీభూతవిరోధియూథపసమీ కా రా... 5

శా. క్షోణీభారనివారణేహ విధిత క్షుద్రాహితద్రోహ శ
ర్వాణీనాథహృదబ్జగేహ కృతగీ ర్వాణార్థనిర్వాహ శ్రీ
వాణీక్రీడనగేహ నీలమణివా వాహాస్ఫురద్దేహ య
క్షీణప్రేమరసప్రవాహ వరదా శ్రీ... 6

శా. బాహో విక్రమశుక్రమండలశిఖా • భస్మీకృతామిత్ర సం
దోహో దోహదవర్ధితాశ్రితజన • దుర్వ్యూహవ్యూహో గుహా
త్మాహో సాహసధైర్యశౌర్యమహిమా • దార్ఢ్యాది దీపావళీ
స్నేహో స్నేహరసప్రభావ వరభా • శ్రీ... 7

శా. కల్యాంభోరుహ జైత్రనేత్రరుచిరా • కల్యాసురక్షాకళా
కల్యాత్మ్యాజిత భానుసూనుసుఖదై • కల్యాల సన్నిత్యమాం
గల్యాభక్త నిరస్తముక్తిపురసా • గ్గల్యా జగద్గీతదా
హల్యాపాదరజః పునస్స్ఫురదహా • ల్యా రా... 8

మ. పురుహూతప్రముఖామరప్రకర సం • పూజ్యాంఘ్రి నీరేజభా
స్కరకోటి ప్రతిమాన తేజరిపుసం • ఘాతాసుఘాతాసి భీ
కరబాణాహిసమాజ దుష్టజనశి • క్షాశిక్షరక్షా విక
స్వరచేతః పరిభూతభూతపబిడౌ • జా రా... 9

శా. అర్యాభీలవిశాలశౌర్య కనకా • హార్యామితాశ్చర్య కృ
ద్ధైర్యా కామనికామవిస్మయదసౌం • దర్యా సురాచార్య ధీ
చర్యాభూర్యనివార్య సూర్యభిన్నత్తై • శ్వర్యాసపర్యా సము
త్కార్యా శంకరకార్యనిర్వహణధు • ర్యా రా... 10

మ. అమరోచ్చాటక తాటకాంతకరబా • ణాసారదోస్సార దు
ర్దమ మారీచసుబాహు దర్పహరవి • క్రాంతిక్రమోదార గౌ
తమ దారార్తి విదారశంకర ధను • ర్దండద్విధా ఖండన
ప్రమదావిష్టయతిక్షితీంద్రజనవా • రా రా... 11

మ. శరదిందూపమవక్త్ర శక్రమణిభా • స్వద్గాత్ర ఫుల్లాయతాం
బురుహ శ్రీధరనేత్ర బాంధవపయో • భూమిత్ర బ్రహ్మేశ్వరా
మరవర్యస్తుతిపాత్ర సంతతజగ • న్మాన్యాద్వయచ్ఛత్ర సు
స్థిరకళ్యాణచరిత్ర దైవతవిభూ • శ్రీ... 12

శా. సీతానాయక చిత్రసాయక శుభ • శ్రీలాభసంధాయకా
భీతాత్మాభయదాయకా విభవసం • ప్రీణత్కథాగాయకా
భూతప్రీతివిధాయకా పవనసం • భూతప్రభూతాదర
స్ఫీతాంచద్హృదమాయికానత బుభూ • శ్రీ... 13

మ. భృగురామాపజయప్రదప్రదరభూభృద్వర్యభూర్యాదరా
జగతీరక్షణదక్షసోదరమనుష్యత్రాత్రిశ్రితాఙ్ఞోదరా
నిగృహీతామృతభుజ్ఞ్రహోదరయశోనిష్పిష్టముక్తాదరా
త్రిగుణత్రిప్రకృతి త్రిమూర్తికవిభూ శ్రీ... 14

మ. అమృతాలాప లసత్కలాప రిపుభీమాటోప సదూప్రశూ
న్యమనస్తాప గతావలేప ఖరసైన్యాక్షేప దీప్తప్రతా
ప మహాచాప నిరస్తపాప జితకోపానిమ్నతీవాదిలీ
ప మహీమాన్వయదీప దుర్జనదురాపా రా... 15

మ. సుగుణాఖ్యాతి దయాసమేత హతరక్షోజాతి దేహప్రభా
నుగజీమూత హితానుజాత బుధబంధువ్రాత సంత్రాత స
త్యగరిష్ఠోక్తిప్రగీత భీజనరతిస్వాంత మిత్రాన్వయా
త గుహఖ్యాత సుధీపరీత యుత సీతా రా... 16

మ. పురుహూతాపరిభూతభూతభయదప్రోద్యన్మదోద్యద్విరా
ధరణారోధకబంధభాన్వరకబంధహీంప్రబంధత్ప్రరం
దరజిద్రావణకుంభకర్ణముఖధూర్తప్రావణస్ఫూర్తిమ
ఖరరుజ్ఞందనలోకభీకరసమిత్కా రా... 17

మ. యతిలబ్ధాక్షయదూణ మోచితదశాస్యప్రాణ క్లృప్తాంశుమ
త్సుతసంత్రాణ యమోఘబాణ [illegible] న్యాచ [illegible] ర్ణ సం
[illegible] దవీలా రా...

[illegible] నంబు తప్పదనుచు న్భావింతునా నిన్ను నే
[illegible] యిత్తునుపుత్తో నర్చింప జన్మాంతర
... ఫలించుననుచున్ భావింతునా [illegible]
[illegible] రా... కు గణింపన్ రా... 46

[illegible] భాత్రజత్కథాగాన [illegible]
ప్రత్యక్షలక్ష్మి [illegible]
[illegible] కాంతానిమం
[illegible] రా... 18

సంధానన్ భావ మే
[illegible] ంపుంఫలం బాతనిం
[illegible] ంగ ప్రభావంబుల
[illegible] ప్ప రామచంద్రప్రభూ 47

మ. అవితాజాండ భృగుప్రవీరభుజదం • డా కృష్టనిర్దుష్టవై
ష్ణవకోదండ రణప్రచండ ఖరసే • నాఖండ నోద్దండ బాం
ధవవర్గేప్సితదానశౌండ దురిత • ధ్వాంతౌఘమార్తాండ పా
టవవేదండ శరావృతాంబునిధికాం • డా రా... 20

మ. అలఘుప్రక్రమవిక్రమాధరితసిం • హాసాఘురక్షాతిదో
హలరంహోనిజనామమంత్రజపశ • శ్వ్యాధూతవల్మీకజా
తులితాంహఃస్మృతిమాత్రబాలితతమ స్తూలాకృపావాల స
ల్లలితాంభోదపసిలభవ్యగుణజా • లా రా... 21

మ. సరయూనిర్జితయజ్ఞవాట మునిరా • ట్చర్యాని రాఘాట భా
సురవాసాయితచిత్రకూట మధిత • క్షుద్రాసుహృత్కీట స
త్పరిచర్యాకృదగాట సాధుజనర • క్షాకారణాఖేట ని
ట్సరశాజానుజశేఖరాంఘ్రినఖరఝా • టా రా... 22

శా. సీతానీక్షవినోద లబ్ధశబరీ • సేవాఫలాస్వాద ని
ర్ధూతస్వాశ్రితఖేద భూధవనజం • తుష్టేమకృత్వాద వి
ద్యోతిన్నోత్రసుఖానుభూతిజజటా • యుర్మోద సత్కర్మసం
ధాతృశ్రీద నిస్త్రతాపసవిషా • దా రా... 2

శా. శాంతా సంత[illegible]మార్గపూర్ణవిమల • స్వాంతా యశోలంఘితా
శాంతా దానకృ[illegible]శ్రితాఖిలజనా • శాంతా దురంతారి సు
ద్దాంతా [illegible]నమహో • దాంతా ధరిత్రీజగ
[illegible]పుష్టయతిక్షితీంద్రజనవా • రా [illegible]

మ. శరదిందూపమవక్త్రశక్రమణిభా • స్వద్గాత్ర ఫుల్లా[illegible]
బురుహ శ్రీధరనేత్ర బాంధవపయో • భూమిత్ర బ్రహ్మేశ్వరా
మరవర్యస్తుతిపాత్ర సంతతజగ • న్మాన్యాద్వయచ్ఛత్ర సు
స్థిరకళ్యాణచరిత్ర దైవతవిభూ • శ్రీ... 12

శా. సీతానాయక చిత్రసాయక, శుభ • శ్రీలాభసంధాయ కా
భీతాత్మాభయదాయకా విభవసం • ప్రీణత్కథాగాయ కా
భూతప్రీతివిధాయకా పవనసం • భూతప్రభూతాదర
స్ఫీతాంచద్హృదమాయికానత బుభూ • శ్రీ... 13

శా. శ్రీమద్భూతనయావివాహమహభా•సింధైత్యసమ్రాజ్ఞయ
శ్రీమత్పాణివిభూషణాయితవిభా•సిస్వీస్ఫురత్పార్థివ
శ్రీమాంగళ్యమహోత్సవాంచితసభా•సింహాసనాధ్యాసిసు
శ్రీమంతు న్నినునాశ్రయింతు వరభూ•శ్రీ... 27

శా. సీతోద్వాహమహోత్సవాస్వితునిఁగాఁ జిం•తించిన న్మంగళ
వాత్రితంబు ల్సమకూరుభూతనయతో • రాజ్యాభిషేకోత్సవా
స్వీతుంగాఁదలపోయ సంపదలోగి • న్సిద్ధించునంచుంబుధు
ల్నీతుల్జెప్పిన నమ్మియాసపడనో•నే రా... 28

శా. కీశాధీశునిఁజేయలేదె మును సు•గ్రీవుం బలాశోత్కరా
ధీశుంజేయనౌకో విభీషణుని న•న్నే యద్ధిపార్థింప వ్య
ధాశుంజేసితినన్న తొంటికథ లే•లా నిష్క్రియాపేక్ష నా
కాశక్తిం గనుపింపఁజేసితివె యా•హా రా... 29

శా. నిన్ను న్భానుజుఁగూర్ప భూతనయ న•న్వేషింప నారామఁజా
మున్నీటవ్వలికేఁగ రక్కసులను • న్మూలింప ద్రోణాద్రి దే
నెన్నేనింబడి వాట్లబడ్డతని కీ•వేమిచ్చినా యిచ్చినా
వన్నా నీకది పెత్తనంబని తలం•పా రా... 30

మ. భవదీయాంఘ్రిసరోజయుగ్మమెదలో • భావించువారల్గదా
భవబంధప్రవిముక్తులౌదురనుచుం • బ్రాజ్ఞుల్ ప్రబోధింతురి సం
స్తవమా నిక్కవమా యథార్థమయిన•న్నాచోదదాచారమే
లవి ఘాతంబయినట్టులుండె నిదివీ•లా రా... 21

శా. ప్రారబ్ధానుభవంబు తప్పదనుచు • న్భావింతునా నిన్ను నే
నారాధింపఁబనేమి యిత్తనువుతో • నర్చింప జన్మాంతర
ప్రారబ్ధంబగుచున్ ఫలించుననుచున్ • భావింతునా యొల్లనీ
పైరూఢంబగు కర్తృభారము గణిం•పన్ రా... 46

మ. జడమా కర్మమొసంగు నేఫలము నే•సంధానన్ భావమే
•ర్పడఁగాఁ జేసెదవేము యేడనుని క•ర్మంపుంఫలం బాతనిం
గుడుపం బాల్పడినంతమాత్రమున నీ•కుంగర్తృభావంబుఁ
ప్పడఁగాఁ గల్గునె కి లేమి కేమికత మ•హా రామచంద్రప్ర 47

శా. చీమల్మొన్నగఁ దమ్మిచూలితుదగా • జీవుల్ స్వతంత్రించి తా
రేమైనం బచరింపనోపుదురె లో • నేనుండి ప్రేరేచకం
జీమైపల్కితివా యథైన విని యం•తృత్వంబు నీకున్న చో
నీమాటల్కిం గడుపక్షపాతిగతి యే•మీ రామచంద్రప్రభూ. 34

శా. దేహావాప్తమునందు సాక్షికము లే•దేనీకు లేకున్న చో
నోహోపాపులు కొందఱౌటయును పు•ణ్యుల్కొందఱౌటేమి సం
దేహాగ్రస్తమె యాచనున్నదిగదా • నీతుల్యభావంబు నీ
చోహేరాళము పక్షపాతి మనితో•చున్ రామచంద్రప్రభూ. 35

శా. నాకుం జీవులకు న్విభేదగతి యు•న్నం బక్షపాతంబు నా
లోకింపందగునే వినోదమునకై • లోకంబులో నిట్లు జీ
వాకారంబులు బూని వర్తిలుదు నీ•యంత్రింబుఁ గనమ్రంటివా
నా కాపై మరియుక్తి లేదె కనుఁగొ•న్నన్ రామచంద్రప్రభూ. 36

శా. జీవాకారములీపపూనుచుఁ బృథ•క్చేష్టావిశిష్టుండవై
యేవేళం బహురూపకర్మఫలభో•క్తృత్వంబునం జిక్కలే
వావైదగ్ధ్యము బంధమందు ప్రియమా•స్వానందరూపస్థితిం
గైవల్యంబున నున్నకన్న నిది వే•డ్కా రామచంద్రప్రభూ. 37

శా. నీవుం జీవులు నొక్కటైనవినుమా • నేనీకునన్యుండనా
నీవే నేఁగద నీవు నేననుచు నా • నీపట్ల నిట్టీభిదా
భావంబుం బొడమించు నీకపటశుం•భన్మాయమాయించి నే
నీవై యుండిన తెల్వినిల్వ దయరా•ని రామచంద్రప్రభూ. 38

శా. నీమాయామహిమంబు వేద్యమగునే•నిం దాత్వికుండయ్యు నీ
చోమోమోటముమాని తా గురుఁడనం•చుం బూని జ్ఞానోపదే
శామంద్రోద్యమమాచరించునె వశి•ష్ఠాఖ్యవ్రతీంద్రుండు ప్ర
స్థిగ్ధామార్గాతిగుఁగానెఱుంగడె మనీ•షన్ రామచంద్రప్రభూ. 39

శా. నీమాయోపాయవిధానకౌశలమున • నాత్మద్యుత్తమోగ్రస్తుల
క్షేత్రాయాథార్థ్యమెఱుంగనీయక భవ•న్నిర్వాణకృత్పాదచిం
భూత్రేయోగంబు లభింపనీయక జను•ర్నాశాదిసాంసారికా
స్ఫీతార్తిన్నులఁజేసి చూచుట ముదం•బా రామచంద్రప్రభూ. 40

శా. పెద్దల్ బాలురనేడిపించి పిదప • స్నేహాతిరేకంబున
న్నుద్దజ్జేసిన రట్లనీవును మమున్ • మున్మున్న సాంసారికా
పద్దైన్యంబెనయించి వెన్కనను కం•పం బ్రోవనూహించి తో
తద్దీక్షాశయమున్న దెల్పుముదమం•దన్ రా... 41

శా. నీవుంజీవులు భిన్నులప్లగుట నే•నీయంశమయ్యుం ద్వదు
జ్జీవనాత్మయ మహానుభావమున మ•త్సేవ్యుఁడవీవు స్వభ
త్సేవానిష్ఠుఁడనేను నన్ను మఱిదో•చెంగాన త్వద్దాస్యకృ
ద్భావంబూనిభజింతుఁ బ్రోవుమనుకం•పన్ రా... 42

శా. మాసీతమ్మ హరించి తన్నుఁగబళిం•పంబూను రాకాసులం
దాసానీమారివధింపకుండ దయచే•తంగాచె నన్ను స్వభ
ద్దాసుం ద్వచ్ఛరణార్థి గావుమనుచు•న్నం గావవై తీవహో
నీసౌలభ్యమలభ్యమూ మొగద తం•డ్రీ రా... 43

శా. నీసీతమ్మనె వేడుమోముననెదో • నీసన్నిధానంబు నం
ద్రాసాక్షీమశివన్ను నోముపనిక•య్యా తాన్వాంత్రించ దీ
నాసంరక్షకు నామె నివ్వదలియుం•టంగోరలే నీవన
న్నే సూటింగని నంగనవ్వలయుసు•మిత్రా రా... 44

శా. నీచిత్తంబు గరుంగఁజేసికొనఁగా•నే పేర్మియు న్నేదు వీఁ
డే చాతుర్యము లేనివాఁడనుచు నీ•కేజాలిచిత్తంబులో
దోచంగావలెఁగాని నిక్కవము హే•తుద్యోతితానుగ్రహా
శ్రీచంద్రాచ్ఛకళాప్రతోషితబుభూ • శ్రీ... 45

శా. భక్తుల్ ప్రార్థనఁజేసి నీకరుణసం•పాదింపనేకాని యే
యుక్తుల్ జెప్పియుఁ దమ్ము నీవరయు న•ట్లొక్కింతయుం జేసుకో
శక్తుల్ గారటువంటివారియభిలా•షంబీవశోధించి సు
వ్యక్తానుగ్రహశాలివౌచునికలే•దా రా... 46

శా. భూతవ్రాతము నుద్ధరించుటకునై • భూర్యాకృతు ల్బూనితీ
వే తన్మాత్రదయామయాత్ముఁడవె ని•న్నిచందపు న్నావిగాఁ
జేతోవీథినెఱుంగఁగావలదె దా•నీభూతసర్వాత్మ భూ
సీతాప్రాణవిభూ జితాదిమబుభూ • శ్రీరా... 47

శా. నేనే మానసమూది నిన్నుఁ దెలియం • దీక్షింతునో దానికి
నేనాడైనను గోచరింపవట నే • నీదృగ్భవత్తత్త్వముం
గానంగా మఱి సాధనంబుగన నీ • కారుణ్యముందక్కఁగా
రానిమ్మాత్మదయన్ నాపయిన్ గరుణమీ • రన్ రా... 48

మ. విషయజ్ఞానము చెందదించుకయు నా • విర్భావముం జిత్తము
న్నిశ్చితంబైనదికానిచో మదికిను • న్మేషంబుగల్గన్ సము
ల్లక్షణీయతత్త్వము నీదుతత్త్వమునకుం • గన్పట్టదింతైన నీ
విషమప్రక్రియఁ దోఁచితోఁచవలె నీ • వే రా... 49

మ. వినుమానందమ నీవ తానని యను • ద్విందా స్వసంజ్ఞాత్ముఁడై
యొనరున్ సంస్కృతభావనిట్టితనయం • దున్నట్టి చిత్తంబుగ
ల్గినపుణ్యాత్ముఁడు స్వస్థచిత్తుఁడనియుం • గీర్తింపుచుం డార్యులా
ఘనతన్నా కెపుడబ్బ జేసెదవొ వే • డ్కన్ రా .. 50

శా. యేమాడ్కిన్ నుతియించినం గరుణన • న్వీక్షింపవైతీవికన్
నేమాజ్ఞాలకిశోరవృత్తిఁ గాని ని • న్నేనమ్మి నిశ్చింత వి
శ్రామంబుంగననైన మర్కటకిశో • రన్యాయముంబూని న
న్నోమ్ముందాక గ్రహింపనైన సెలవీ • మ్మా రా ... 51

మ. ఘనకారుణ్యమున న్విభీషణుని లం • కారాజ్యపట్టాభిషి
క్తునిఁ గావింపవిధేయుఁడౌచు దశవ • క్త్రుం డాగతుండైన సా
ధన మేమన్న నయోధ్యనిత్తునన వే • తత్సాహసౌదార్య స
త్యనిరూఢుల్ గనికాదె నమ్మితి మహా • స్థన్ రా... 52

శా. నీకెవ్వానిననుగ్రహించు తలపు • న్మేపించునో వానినా
నాక్లేశంబు హరింతువన్ననుడివి • న్నన్ ఖిన్నుఁడౌ నిత్యమా
నాకై వల్యమహావిభూతి దనకి • య్యంబూను నీకూర్మిగ
న్నోకన్ లేమిభరింపలేకనని యెం • తున్ రా ... 53

మ. అకలంకాత్ముఁడవై తివేని ధనధా • న్యక్షేత్రముల్ పుత్రమి
త్రకళత్రాదులు పాడిపంటలు శరీ • రస్వాస్థ్యము న్నున్నగా
సకలశ్రేయములుంచి ముక్తి నిడుమా • సంకల్పమే లేనిచో
నిఁక నీకౌశలమేమి కాఁగలది కా • దే రా... 54

మ. కలుముల్ గల్గిన శాశ్వతంబులనుచున్ • గర్వాంధులై యెల్లపె
ద్దలనన్నింటఁ దృణీకరింపుచు భవ•ద్ధాన్యంబు వర్జింపుచున్
ఖలులై పోదురటంటు వాకుజనవర్గం•బట్టు కాగాని సా
ధులటుల్గారుసుమీ సమీకృతినిజా•త్మల్ రా... 55

శా. దారువ్రాతమునందు వహ్నితిలలం•దైలంబు పుష్పంబులన్
క్షీరంబందునుగంధమున్ ఘృతమువా•డ్కి న్సర్వభూతాంతర
స్స్వైరవ్యాపివి నీవెయుంగవె దురా•చారు న్సదాచారు ల
క్ష్మీరమ్యాశ్రియితా శ్రితావనదభూ • శ్రీ... 56

మ. ఇతరుం జేరక నిన్నె చేరిసతతం•బే నిట్లుప్రార్థింప నీ
మతియింతైనఁ గరుంగకుండె నికనీ • మర్మంబుఁజూడం బురా
కృత పాపంబతితుండనైతినని యూ•హింపంగనో నైననుం
బతు నొక్కింతయు లేదు నీబిరుదుక•ల్మిన్ రా... 57

మ. పతితుం బావనుఁజేతువన్న బిరుదీ•పట్లన్ ననుంబుణ్యుఁజే
సితివేని న్మనుజేయువేని చనునీ•చిత్తంబు నేనీకు నా
శ్రితుఁడంగావునఁ దెల్పఁగావలసె నా•క్షేమార్థమై తెల్పిన
ట్లితరుండుం బలెనీవునుం దలఁపనో•నే రా... 58

మ. సకలామ్నాయములు న్విరించివలన • న్సాకల్యమొప్ప న్సము
త్సుకతంజేకొనియు న్మహోఘనత యా•దోరాశిలోమున్గ సో
మకునైజానిమిషోత్తమత్వమలర • న్మత్స్యాత్మ గాఁజేసితీ
విఁక నీకారుణికత్వమెన్నదరమా•నే రా... 59

మ. అమృతప్రాప్తికి సాధనంబుగ భుజం•గాంచ న్మహామందరా
గముగైకొన్న బుధోత్కరంబునకశం•కన్ గూర్మతోదోచి సాం
పుమెయి న్మోహినివౌచు వారికమృతం•బుం జేతికందీవె చి
త్రము నీదివ్యచరిత్ర మాశ్రితులనే•దన్ రా... 60

మ. తమకంబొప్పజలంబునం బృథివిడిం•దం జేయుచోఁ జూచి ని
శ్కముగా వీఁడవవర్గమార్గమెనయుం•గానర్హుఁడంచు న్మహో
ద్యమ మేపారవిదేహముక్తికి హిర•ణ్యాక్షాసురాధీశుఁ ఛా
త్రముగావింపవె పోత్రివై కరుణమీ•రన్ రా... 61

మ. రభసంబొప్పఁగ మున్ హిరణ్యకశిపు ♦ ప్రహ్లాదుల న్సంతతం
బు భవద్వేషసమేతులన్ నృకటిభి♦న్మూర్తి న్విచిత్రింబుగాఁ
గ భవద్వేషసమేతులై తనరజా♦గ్రన్నిగ్రహానుగ్రహా
రభటుల్ జూపి యొనర్పవే యశము మీ♦రన్ రా... 62

శా. నానాబంధము లాత్మనిష్టలఁచు నం♦తంబాయఁగా నీకు భూ
దానం బిచ్చకొలందిఁ జేసిన బలిన్ ♦ ధర్మక్రమం బేగుచం
దానం బద్దుసిజేత తత్సుకృతమా♦తం డెంతముక్తాత్ముఁడుం
డైనం బల్మనిగూర్మిచే గుడుపఁగా♦దా రా... 63

మ. బలిచే పూర్వము ధారఁగొన్న ధరణిం ♦ బాపాత్ములౌ క్షత్రబం
ధులుగాంచిన వారిఁ దుంచి సవనా♦దుల్మెచ్చఁగా నేల వే
ల్పులకా ధారుణి ధారఁబోసితివి విం♦పుల్ పుచ్చుకోనీయఁ గ
ర్తలె కారాయన భూసురత్వములరా♦రన్ రా... 64

మ. తెలియంజాల భవన్మనీషితము పం♦క్తిస్యందనోర్వీశు న
న్నులకుం దోఁచి ధరిత్రిభారముడువం♦ దోశ్శాలివై నాదుక
న్నులకుం దోఁచి మదీయ కర్మభరముం♦ ద్రోవంగ లేకున్న య
ట్టులు పేక్షించితి వేతరింతు నిఁక నె♦ట్టుల్ రా... 65

శా. విశ్వామిత్రుఁడటంచు ముజ్జగముల ♦ న్విఖ్యాతుఁడౌ కౌశికు
న్విశ్వాసంబున నిన్నుఁ గోరుటనె కా♦వెన్వెంటనే తెంచి త
ద్విశ్వాలంభముగాఁచి సంతసమునొం♦దం జేసి తీవట్లనే
శశ్వద్భక్తి నినమ్మ లేదె నినుని♦చ్చన్ రా... 66

మ. భవదీయాంఘ్రిసరోజరేణుకణసం♦స్పర్శంబునన్ రాయి మా
నివధూటీత్వమునొందె పూరుషుఁడనా ♦ నేనావరాగంబునో
క విశేషంబుగ దైవతోత్తమ భవ♦త్కైవల్యముం గాంతు నా
వ్యవసాయంబానరించి ప్రోవగదవ♦య్యా రా... 67

మ. అవనీనందనితో వనాశ్రయముఁ జే♦యంబోవుచో నిన్ను జా
హ్నవి దాటించిన ధీవరుం గుహుని స్నే♦హంబుప్పతిల్ల న్భవా
ర్ణవము న్నీవు తరింపఁ జేసితివి మం♦త్రాప్యోపకారంబు లే
మి విసర్జించితి నన్ను నీ కనుచితం♦బే రా... 68

మ. పురుషుల్ లోగొనునయ్య విద్యలయముం•బొందించి యప్పూరుషుం
బరమానందమయాత్ముఁ జేయుటెపుడు • న్బాహోటమైయుండుటన్
బురుషార్థిన్ ఖలతాటకంబలిమిచే • బోకార్చి లోకంబునం
బురుషుల్ మోదిలఁజేసినాఁడవు స్వయం•భూ రా... 69

శా. శైలూషుం డిలఁదత్తదాకృతులని•చ్చంబూని తాదాత్మ్యచ
ర్యాకాల్యంబువహించి యన్యులకు మో•హంబిచ్చునేకాని తా
లోలేశంబును తన్నుమర్వడటు నా•లోనన్నునేనున్ శరీ
రాలంబంబున మర్వమింగనుపరా•దా రా... 70

మ. జడమౌబుద్ధికి స్వప్రకాశివగు నీ•సాన్నిధ్యమబ్బంగఁ జొ
ప్పడునున్మేషము తత్ప్రవేశమున సం•ప్రాప్తప్రకాశంబుల
య్యెడుఁజక్షుః ప్రభృతీంద్రియంబులవి దు•ర్వృత్తిం బ్రవర్తింపకుం
డెడునట్లు న్ననుఁగాంచు నట్టరయుమం•టిన్ రా... 71

మ. మమకారాధిక బంధుబంధురత నే•మాత్రింబునుం దేలలే
క మహాగాధ భవాబ్ధిలోమునిగి దుః•ఖంబొందుచున్నాఁడ శీ
ఘ్రము తద్బంధములూడ్చ ఘోరభవపా•రావారతీరంబుజే
ర్చి ముదంబొందఁగఁజేసి బ్రోవఁదగదే • శ్రీరా... 72

మ. అతికామాకులచిత్తుఁడైన మనుజుం•డొలబ్బ మేలబ్బన
న్నతిలంపూని విహాహమౌ జనకక•న్యారత్నమూలంబు గా
నతులాయాసము లీవుబొందుటరయుం•డా లేడ మే లేడ నీ
వితతానుగ్రహ మబ్బకున్న యెడను•ర్విన్ రా... 73

శా. ఆపద్వేళల విత్తమడ్డుపడునం•చాయాసభూయిష్ఠమౌ
వ్యాపారంబొనరించియైన మనుజుం •డార్జించు జంటీఁగపా
టుపాటైనదలంపఁ డాపదలమాయిం•పం ద్వదీయాదరం
బోపుంగాని ధనంబులోపవనిరా•ర్యుల్ రా... 74

మ. కొడుకు ల్పుట్టనియంతకుం దశరథ•క్షోణీపభుం డా[illegible]
పొడమంగానఁగనై తినంచు నడలం•బుకు [illegible]
యెడయున్నీవు సుఖఃపఁజేసి[illegible] [illegible]
బడయ నైశ్వర్యముఁగల్గు సండ్రి[illegible]

శా. హింసావాలము పాపమూలము మహా॰హేయంబపాయాలయం
బం సారూఢభుజంగమంబు బహుళా॰యాసంబు మాయాసము
త్తానంబు నృకలావదాన్పదము చిం॰తాదంతురంబైన దు
స్సంసారంబునఁదోఁచితే ననుజిఘాం॰సన్ రా... 76

మ. కలికాలోచితవర్తనంబు సలుపం॰గానేర నాకర్మవుం
ఫలమెట్లున్నదియోయొయుంగను ననుం॰బావ క్రియానాస్థుఁగాఁ
గలసత్తావకపాదభక్తియుతుఁగాఁ॰గన్ సేతనీనెయ్యము౦
గలిగెన్నాపయి నంచుఁబూనెదనువే॰డ్కన్ రా... 77

శా. యన్మూలంబున మన్మనంబు క్షుభితం॰బౌచుండు తత్కారణం
బున్మూలింపుచు నున్నవాఁడవు క్రమం॰బొప్పంబరోక్షంబుగా
తన్మార్గంబరయంగ నాపయి భవ॰త్కారుణ్యమున్నట్లు దోఁ
చెన్మద్బుద్ధి కదెట్లువెల్లడియగున్ ॰ శ్రీరా... 78

మ. అవతారాంతరము ల్వహించి మునుప్ర॰హ్లాదుం డిభేంద్రుండు ము
న్నవునీభక్తుల కొందఱిం గరుణఁ బ్రో॰త్యక్షంబుఁగాఁబ్రోచినాఁ
డవు మాబోటులనెల్ల నొండొరుల జా॰డంగాని రక్షింపకుం
టివి దానంగురు తెట్లుగల్గు మునుమా॰ట్కన్ రా... 79

శా. నీపాదంబులె నమ్మినాఁడనునుమీ ॰ నీకేనుభృత్యుండ నా
వ్యాపారం బఖిలంబు నీకు విదితం॰బౌచుండఁగా నేను వే
రేవల్మారును విన్నవింపఁ బనియే॰లేదీవ నీయంతటన్
గాపాడన్వలెగాక వేఁడుమిడియెనం॰గన్ రా... 80

మ. తనుసంబంధములేని నీవు తనుబం॰ధస్వీకృతుల్ జేయుటల్
తనుమద్రక్షణ తత్పరత్వమునగా॰దా మేనుఁబూనంగ నీ
కును తద్విస్మృతికల్గఁబోలునని నా॰కుందోఁచెఁ గాకున్న చో
ననురక్షింప నుపేక్షసేయుదువె మా॰న్యా రా... 81

శా. యజ్ఞాదిక్రియలాచరించి పరిశు॰ద్ధాత్ముండఁగానైతి స
త్ప్రజ్ఞావంతుఁడనైనఁ గానయితి వి॰ద్వత్సేవచే శాస్త్రజ
వ్యజ్ఞానంబును జెందలేనయితి నే॰యాధారముంబట్టి యా
త్మజ్ఞప్తింగనువాఁడ నీవగతినుం॰మ్మాత్ర రా... 82

శా. నావాఁడన్నతలంపు నీకొదవియుం డన్నంగాక నీవాఁడను
మా మాత్రవాత్సల్యముఁ బూని బ్రోవుమని నే నర్థింపఁగా లాభమే
మీ వైపమ్మ్యమిటుండ నీకు పెరవారెవ్వార లూకొండ్రికన్
నావిజ్ఞాపన నీవు గైకొనకయున్నన్ రా... 83

శా. భక్తుల్ గానిజనుల్ త్వదీయపదముం బ్రాపింప నేనాఁటికిన్
శక్తుల్ గారు భవత్పదాబ్జయుగళాంచద్భక్తి నీనత్కృపా
యుక్తి న్నాకులభించె నీపదము నే నొందంగనందేహ మా
ముక్తిప్రాపణ భుక్తిదావనకళా భూ రా... 84

మ. అరలేక న్మదిసర్వకాలముల నర్వావస్థలన్నిన్నే నే
న్మరియింతు న్మరియింతెకాని విధివ న్మార్గాన సేవింప నా
తరమా నీదయనిర్నిమిత్తముగ నేఁద న్బ్రావలెంగాక వి
స్ఫురదుద్వేల కృపైకభాజనమనో భూ రా... 85

శా. ఆదేశంబును ప్రత్యయంబు ప్రకృతి వ్యాపారముంగానఁగా
నేదేశంబున శబ్దశాస్త్రగతియుం దేశాని యీదృగ్విధ
క్లేదోత్పాదకవేళలం జగమురక్షింప న్నిజాంశంబులం
బ్రాదుర్భావము నొందుచుంట నిజమే రా రా... 86

మ. అపరాధంబొనరించియైన శరణం బన్నం దయాశాలివై
చపలాత్ముండగు వాయసాసురుని దుర్గంచంబోక రక్షించవే
యుపమాతీత దయానమేతుఁడవు నీయుత్కర్ష మెన్నంగ వే
లవనంబుల్ గలవాఁడు చాలఁడొరులేలా రా... 87

శా. నీయందుం గపటంబెఱుంగని ప్రియామోన్మేషంబుఁ జూపించిన
న్మాయామర్మములేని సత్కరుణచే మన్నించి ధన్యాత్ముగాఁ
జేయంబాల్పడవే నిషాదనృపతిం జేనంటగా రానివాఁ
డేయైనం బరిశుద్ధచిత్తుఁడ నికాదే రా... 88

శా. లంకం జేరఁగ దారియిమ్మనుచు జాలన్వేడి యీమిన న్మహా
హంకారంబువహించి యంతట విధేయత్వంబుఁ బూనంగ నీ
కింకన్నావికలంకతోడనె తొలంగించి ముగ్గావించి ని
శ్శంకుం జేయవె వార్ధినీయశముమించన్ రా... 89

శా. బాలుం డాడుకొనంగ నాతనికి నే • బాధైన రాకుండ పై
గాలక్షించు తదీయమాతృ భవమా • ర్గంబందు నీసేవకుం
డేలాగేఁగుచు నున్నగాతువట నీ • వేభంగమున్నోక నీ
కాలంబ్యాంఘ్రిసరోరుహా సుగుణగే • హా రా... 90

మ. తగ నేత్రాంజలిచే త్వదీయతను సౌం • దర్యామృతంబు న్సుతృ
ప్తిగ శ్రోత్రాంజలిచే భవద్గుణకథా • పీయూషముం బుణ్యవు
ష్పిగ గాత్రాంజలిచే త్వదంఘ్రియుగళీ • సేకాంబువుం గ్రోలుచుం
డి గతాఘుండ వినిర్మలాత్ముఁడ గా • నే రా... 91

శా. పాలు న్మీగడ పంచదారపొడి సా • బాల్చేసి క్రిందేనెతో
గ్రోలంగల్గినకన్న మిక్కిలిగ జొ • క్కున్ డెందమానందపూ
రాలీఢంబయి తావకాహ్వయసుధా • ఘూత్యల్ప లేశంబు జి
హ్వాలగ్నంబయినంతమాత్రమున న • య్యా రా... 92

శా. స్నానంబుం బచరింప దేహమునకున్ • శైత్యంబు వాటిల్లు నీ
ధ్యానంబైననొనర్పఁ జిత్తమునకున్ • స్థైర్యంబు లేకుండెడున్
దానంబుల్ రచియింప లేదు ధనమే • తంత్రంబున న్నేనికం
గానం ధన్యతఁ జెంద నీకరుణదృ • క్కున్ రా... 93

శా. దాసత్రాసనిరాసభానుని ప్రియా • ధాన క్రియానాలసున్
హాసావాసవిలాస యుఙ్ముఖకథా • హర్షత్సుధాభుఙ్ముఖున్
ఘనగాత్రసుముఖా సుహృత్సహచరం • గ త్రాటకావత్సహుం
గౌసల్యాసుతు నిన్ను నేఁ గొలుతు వే • డ్కన్ రా... 94

మ. కమనీయత్వవిశేష సత్వమున నే • కాదు జ్వలత్పావన
త్వమునన్ సైతము పంకజాతముల దో • వంజాలు నీపాదకం
జములం బావితదానపుంజముల శ • శ్వద్భక్తి విశ్వాసపూ
ర్వముగా గర్వముగానకం గొలుతు దే • వా రా... 95

మ. భ్రమయేకా నిరుపాధికుండవగు నీ • స్వార్థించునాతండు మా
త్రము సోపాధికుఁడౌనటంట యయినం • బ్రార్థింతు నీస్థూలగా
త్రము బోనంతె కుపాధిభంగ మొనరిం • పంబోలదా వెన్క సూ
క్ష్మమునుం గారణమున్న నేలను మనీ • షన్ రా... 96

శా. తల్లుల్ నూర్గురు నొక్కపుత్రుని మీఁదంబూను ప్రేమంబు నీ
యుల్లంబందు వహించువాఁడవట నీవొక్కఁడవు న్భక్తుపై
తద్దాక్షిణ్యము నీపురాణగతగాథా బోధితంబౌట ను
త్ఫుల్లాంతఃకరణుండనై నినుభజింతున్ రా... 97

శా. ఆదిన్ జన్మమొసంగ రాదొసఁగి నావావెక్కపంకేరుహా
మోదంబూర్పఁగరాదు కూర్చితి వితన్మాలోగ్రసాంసారిక
క్లేదంబొందఁగఁజిచ్చినాఁడ వికఁ జాలింబూని రక్షింపరా
దాదాక్షిణ్యము లేద యోరఘుకులేంద్రా రా... 98

శా. రాగద్వేషములూడ్చి సర్వసమతన్ సంరక్షింగావేర నా
యోగం బెట్టిదొకాని డెందమున నొక్కొక్కప్పుడు త్వచ్చింతనో
ద్యోగం బించుకగల్గియున్నది తదుద్యోగంబె రాగాది క
త్యాగానందదమంచు నమ్మితినుమయ్యా రా... 99

శా. నీకీర్త్యుదయమ్ము మిత్రకులము న్నీనామమంత్రంబు వా
ల్మీకి న్నీపదపద్మసంగతరజోలేశం బహల్యా న్నరుల్
నావల్ వాకులమెచ్చ పావనతనొందం జేసె నీసేవను
శ్లోకుంగానను నాచరించుటకుఁ జాలున్ రా... 100

మ. జగతీమండన మండపాకకులసంజాతుండ పేరయ్యకుం
బొగడంగాఁదగినట్టి కోనమకు నేఁబుత్రుండ కామేశ్వరుం
డగరిష్ఠామలభక్తి నీకొసఁగినాఁడం బ్రార్థనాపూర్వకం
బగునేతచ్ఛతకంబుఁ గూర్మిఁగొనుమయ్యా రామచంద్రప్రభూ.

శ్రీరామచంద్రప్రభుశతకము.



శ్రీ ర స్తు.

శ్రీసూర్యనారాయణపరబ్రహ్మణేనమః.

# శ్రీసూర్యనారాయణశతకము.

శ్రీమద్వ్యోమ చరామరానుసరణా • క్షీణప్రమాణక్రియా
సామాన్యాఖిలమాన్య విశ్వనుత శ • శ్వద్భావ్యదేశాశ్వయు
క్తా ముక్తాదయచక్రజక్రమశతాం • గాభంగసంచారల
క్ష్మీమాంగళ్యపరాయణా సకరుణా • శ్రీసూర్యనారాయణా. 1

శా. ఛాయానాయక సౌఖ్యదాయక విరా • జద్రూప నిష్కావ స
ద్గేయ శ్రీయుత సౌమ్యతాయత ధరి • త్రీపాల ధారాళ వి
జ్ఞేయత్వాయన వేదగాయన సుధా • శిశ్రేష్ఠ ధరిత్రిష్ఠ సు
శ్రేయోదాయి సుధీవిధాన్యకరుణా • శ్రీసూర్యనారాయణా. 2

శా. మిత్రా ఘోరభవార్ణవామితమహో • ర్మిత్రా ప్రభావిస్ఫుర
ద్గోత్రా పాదపవిత్రితావనిలస • ద్గోత్రా నుతిప్రక్రియా
పాత్రా సత్కరుణారసోవధిసుధా • పాత్రా వియత్సంచర
త్పత్రా ఘృణ్యుపలాలితాంబురుహప • త్రా సూర్యనారాయణా. 3

మ. సతతోగ్రద్యుతిసింహతత్యహరహా • స్సంహారిత్రాత్యంతసాం
ద్రతమధ్వాంతమదద్విపోత్కరనితాం • త శ్రీవిరాజత్కరా
చతురోపాసకబాదరాయణ సదాం • చద్వేదపారాయణా
స్థితధీభక్తపరాయణా సకరుణా • శ్రీసూర్య... 17

శా. ఘోరాకారతమోవిమగ్న మగునీ • క్షోణీజనంబున్ ఖేదముల్
తా స్సారోదారవిభాప్రభావము ప్రకా • శంబిచ్చి రక్షింపగా
నారోగ్యంబొనఁగూర్చి చేసెదవు నీ • వానందసందోహమ
జేరన్ భక్తపరాయణా సకరుణా • శ్రీసూర్య... 18

మ. విమలం బైన కృపావిపారమున నీ • విశ్వంబునం బ్రహ్మవి
ష్ణు మహేశాత్మకతం గనంబడుచు బ్రాణుల్ నిన్ను నెవ్వార లె
ట్లుమదిం గొల్తురొ వారి నట్లరసి వేల్పుంబ్రోడవై నాఁడ వో
రిమిచేఁ గూరిమిచే జనావనచణా • శ్రీసూర్య... 6

శా. బ్రహ్మాదుల్గనరారు వేఁడుకొన వారల్ప్రోచుతురన్నాంతి నీ
బ్రహ్మాండస్థులు వారిఁగొల్చెదరు శంభద్భక్తిచేఁ గొల్వరా
బ్రహ్మేశాచ్యుతమూర్తివై సతతముం • బ్రత్యక్షమౌ నిర్గుణా
జిహ్మ భక్తపరాయణా సకరుణా • శ్రీసూర్య... 7

మ. స్తుతికై యిచ్చకమాడినాననకుమీ • శోధించిన న్నత్కృపా
న్వితసద్యఃఫలదాతవీవ జగతిన్ • నీయంతప్రత్యక్షదై
వత మింకెయ్యెడ లేదునిశ్చయము శర్వాణీశ వాణీశ భా
షిత భూషాయితచర్యవర్యకిరణా • శ్రీసూర్య... 8

మ. అరదంబం దొకచక్ర మొక్కతురగం • బాశీవిషు ల్పగ్గముల్
నిరథఃకాయుఁడు యంతయుట్టిరథమ్ము • న్నివెక్క శూన్యాంబరాం
తరసంచారచణుండవై నిమిషస్తోకం గాలముందప్పకుం
డ రహింబ్రమ్మరుచుంటివౌర వెరజాణా సూర్య... 9

శా. సాయంకాలమునందు నీవలన తేజస్స్ఫూర్తి బ్రాపించి కా
దా యాదాహకవహ్ని భాసిలుట నీయంశాత్మ కారాకృష్ణభూ
తోయంబిచ్చినఁగాదె భూతలము నందు న్నిందు మేఘావళుల్
శ్రేయఃకారణ దివ్యసేవ్యచరణా • శ్రీసూర్య... 10

ంబులు సోకకుండిన హిమానీకర్దమానీక బా
ఇం గత శైత్యముల్ వదలు నాతామిస్రగామిస్థలుల్
వ్యములు, స వనో పునా తరులతాదిప్రాణు లేపొందునా
థము లగు పు పుణ్యమాన్యచరణా • శ్రీసూర్య... 11

సం దోడగు నిందిరారమణి సద్మంబైనపద్మంబు భ
లేకుండనె గూడసేయు శశిమిత్రత్వం బెసంగ నీకా

సమునొందించెదవీవు మెచ్చఁదగు నీ • సౌశీల్య మాశాప్రకా
శి మహీమండలమండనోగ్రకిరణా • శ్రీసూర్య... 12

మ. అరులంచు న్నిమ వెట్టి కోకముల శీ•తాంశుండు తానయ్యెఁ జం
దురుఁడే బంధురతాపకారియగుచున్ • దుఃఖంబునొందించు నీ
వుసతీక్షాంశుఁడవయ్యు సౌఖ్యగరిమం•బొందించుచున్నాఁడ వీ
స్థిరసత్క్రియచాలు నీకు సుగుణా • శ్రీసూ .. 13

శా. ద్యోవీథిం జనుమూర్తి వేడిమి మను•ష్యుల్ కన్నులంజూచుచున్
సేవింపం గన శక్యమంచు నెదలం • జింతింపఁ దన్మానవా
ళీవాంఛల్ ఫలియింప నీవరసవ•ల్లిన్ సౌమ్యరూపంబుతో
నావిర్భావమునొంది వెల్గెదవుగా•దా సూ ... 14

శా. దేహుల్ కన్నులుగల్గియుండియును రా•త్రిన్నీవులేకున్న వీ
క్షాహీనుల్ వలెనుంద్రు గావున జగ•చ్చక్షువన్నమాఖ్యాధురా
వాహిత్వం బొనఁగూడె నీకు జగతి • న్వందారుమందారన
స్నేహోత్సాహమనోజనావసచణా • శ్రీసూ... 15

శా. పాపాటోపము బాపనోపుట దురా•పశ్రీధురాపాటవ
వ్యాపారోపగమోవపాదివగుటన్ • వ్యాపన్నగోపాయనే
చ్ఛాపూర్ణాత్ముఁడవౌట మిత్రుఁడనుచున్ • శ్లాఘ్యుండవై నాఁడవు
ర్వీపర్విభవధుర్గమోఘకిరణా • శ్రీసూ .. 16

మ. భువనవ్రాతమునం దనేకులగు వే•ల్పు ల్గల్గియున్నట్లు గ్రం
థవిశేషంబులఁగంటిఁ గాని యొకఁడై•న న్నీవలెన్ లోకబాం
ధవవిఖ్యాతినిఁ బొందియున్నటులు గా•న న్నీవ సౌజన్యభా
సివిగా కింకొకఁడెవ్వఁ డుత్తమగుణా • శ్రీసూ... 17

శా. పాపాపాపపయోద్వయంబువిభజిం•పన్ హంసవై ఖేదముల్
బాపన్ రుగ్జలరాశికిం దరణివై•పల్ జీకువాల్కానచా
లేపున్నామపవిభావసుండవయి నీ•విట్లొప్ప నవ్వేల్పు ని
క్షేపింపంబడె నీయెడం బృథుగుణా • శ్రీసూ... 18

శా. ఖద్యోతాఖ్యుఁడవౌట నిన్నసదుగాఁ • గన్గొంచు నిమ్మానవుల్
సద్యోదాతవుగా నెఱుంగక పరో•క్షస్వామరోపాస్తికై
యుద్యోగింపుదు రెండమావులకుఁ దృ•ష్ణోపేతులాసించున
ట్లాద్యోపాస్య వహన్నిజాస్య నెఱజా•ణా సూ... 19

శా. ఆశాధీశుల నింద్రుఁ డింద్రియములన్ • స్వాంతంబుశాసించున
ట్లాశాసించెద వీవునుం గ్రహములన్ • వ్యాప్యత్రభావాఢ్యులన్
నీశక్తిం గొనియాడఁగాఁ దరమె వా•ణీభర్తకైనం బృథు
శ్రీశుంభచ్ఛరణా సహస్రకిరణా • శ్రీసూ... 20

మ. కరుణాశాలి మయూఖమాలి యెపుడుం • గాసైన నర్పింపన
క్కఱలే దానిరవద్యమూర్తికి నమ•స్కారంబు లర్పించినం
బరమానందము నొంది ప్రోచు ననుచుం • బల్కొర్దు నేజాలెదన్
నరలోకంబున లోకరక్షణధురీ•ణా సూ... 21

శా. దేవవ్రాతములోన నీవు బలెబల్ • తేజంబునన్వెల్గు మే
ల్తివిం జుక్కలలోనిచంద్రుఁడు గనన్ • లేడెంత నిండారదే
జోవంతుండయినన్ యథార్థమిది రా•జుంబోలునే బంటు త
త్సేవాలబ్ధవిభూతిపూర్ణుఁడయినన్ • శ్రీసూ... 22

మ. నరుల న్వైష్ణవశైవశాక్తములు గా•ణాపత్యసౌరంబులు
న్మత్రియున్ స్మార్తమన న్మతంబులొనరుం•దత్తన్మతబ్రాహ్మణుల్
కరము ల్మోడిచి నీయుపాస్తి తొలుతం•గావించుట న్వారిలో
నరయ న్నీవ ప్రధానదేవతవు సు•మ్మా సూ... 23

శా. పొత్తుల్నిల్వవు కోకదంపతులకున్ • భూమీస్థలిం జల్లిన
స్వత్తుల్త్రుల్వవు పల్పిశాచములతో • విప్పారుగొప్పం దమో
వృత్తుల్ సెల్లవు నీవురానియెడ నుర్విం జారచోరాది దు
శ్చిత్తుల్ బల్వవుచుండ్రు దీప్తకిరణా • శ్రీసూ... 24

మ. బహుసాష్టాంగనమస్కృతిప్రకరముల్ • భక్తి న్సమర్పింతు న
[illegible] న్మానసమందు నీకు ననుస•న్మానించి రక్షింపుమా

మహనీయస్స్పృహణీయ భవ్యకరుణా॰మాధుర్య మాధుర్యభూ
రిహిమావార్య తమోప్రతార్యకిరణా ॰ శ్రీసూ... 25

మ. ప్రతితేజస్వికినెంచి నీవ యుపమిం॰పం బాత్రమౌచుండ నీ
కితరుం డెవ్వఁడు సాటినేయఁదగు నీ॰వేకాక నీసాటి వి
శ్రుతిమౌ నయ్యమృతంబుఁబోలురసము ॰ ల్యూనపట్టునే యెందునుం
జితమందేహమహానిశాచరగణా ॰ శ్రీసూ... 26

మ. భువిలో నెంతప్రతాపశాలికిని ని॰న్నోర్వంగరాకుండఁగా
భవదీయోగ్రతరప్రతాపగరిమ ॰ న్వ్యాపింప శేషాహియున్
వ్యవసాయంబొనరింప శక్తుఁడగునే ॰ స్వాష్టాంగనత్యాచర
చ్ఛివకృత్యాదరణా జితేంద్రియగణా ॰ శ్రీసూ... 27

శా. ఆరోగ్యంబున కౌషధంబుఁగొని వై॰ద్యాదిష్టపథ్యాదులన్
ఘోరాంగవ్యథల న్మనోవ్యథలఁ జి॰క్కుల్గాంగాని నీదు న్నమ
స్కారంబు ల్ఘటియించి రోగముల నీ॰గంగానడజ్జుండు ద
త్ప్రారబ్ధం బెటువంటిదో తెలియ దా॰హా సూ... 28

శా. ఎవ్వా రెయ్యదిగోరి మ్రొక్కఁగొనినన్ ॰ హేరాళమౌనట్లు నీ
వవ్వాంఛ ల్పలియింపఁజేసెద వనా॰యాసంబుగా వారికిం
గవ్వైనం గొననిచ్చగింపవు బలా॰త్కారంబుగా నిన్ను వా
క్రువ్వంజాలుదురే యజాదిబహువ॰క్తృల్ సూ... 29

మ. అలనెత్తామరమొగ్గల న్విరియఁజే॰యుండాయుచోఁ గోమలం
బులు క్రౌంజీకటిపూకలం జలిహిమం॰బుంజిమ్ముచోఁ దీక్ష్ణము
ల్వెలసత్తాపకివీత్స్యహూణకరము ॰ ల్చిత్రప్రభావంబులై
చెలఁగు న్సర్వజగంబులందు మెలఁగున్ ॰ శ్రీసూ... 30

మ. తెలియ న్నీవు ప్రదయామయుండవు త్రిమూర్తిస్ఫూర్తిమంతుండవు
జ్వలతేజోవిభవాభిరాముఁడవు స॰ర్వప్రార్థనీయుండ వ
త్యలఘుప్రాభవశాలి విష్టఫలదా॰నానూనశక్తిం బ్రకా
శిలుచున్నాఁడవు నిన్ను నెన్నఁగలనా ॰ శ్రీసూ... 31

మ. సకలాంభోనిధులన్ సరిద్ఝరులఁ గా • సారంబులం గల్గునీ
రొకయేనూరుకరంబులందగిచి యా • యుర్వీస్థలి న్నీవు వే
రొకయేనూరుకరంబుల న్వినచఁగా • నొప్పారుచుండుం బ్రపం
చక మెల్ల న్సకుతూహలంబయి యధే • చ్ఛన్ సూ... 32

మ. తొలుత న్నీవు ప్రపంచసృష్టిసలుపం • దోతేరఁగాఁబోలు నా
జలజాతప్రియధాముఁ డన్నుడి శ • శ్వద్విశ్వసర్గస్థితి
ప్రళయాధానవినోదభాగగనశుం • భత్పాదభక్తాతిభూ
రిలసచ్ఛ్రీద పృథుప్రమోద శరణా • శ్రీసూ... 33

మ. హరివైనాఁడవు విశ్వరక్షణము సే • యంబూని కాపున్న చో
హరియంచుం గమలాప్తుఁ డంచు జనులె • ల్లానిన్నుఁ బేర్కొందు రా
దరణీయానుపమాన తేజరుచిమ • త్త్వా భాసితాంభోజ సు
స్థిరకళ్యాణసమాజ భూరికరుణా • శ్రీసూ... 34

శా. అల్పు ల్మాదృశులెన్నఁబోపుదురె నీ • యాథార్థ్య మీవిశ్వముం
గల్పాంతంబునఁగాల్పఁ బొల్పడుచు ను • గ్రస్ఫూర్తి వౌ నీకు మూ
ర్త్యల్పంబ్రొడెం డొకమారుమీరునట హే • తుల్గ్రిమ్మఁగా దేవతా
శిల్పాచార్యసుతాన్వితాత్మశరణా • శ్రీసూ... 35

శా. తేజోమూర్తి ధరించి నీవు జగము • ల్దీపింపఁగాఁ జేయుచున్
నీజాగ్రత్త్వముఁజూప మున్ జగముల • న్నిర్మింప రక్షింప ని
ర్వ్యాజింపం గయికొన్నమూర్తుల త్వదీ • యోత్పాదితంబౌ క్రియా
రాజిం జెప్పఁదరంబె క్రమగుణధు • ర్యా సూ... 36

శా. ఆది న్నీవు స్వయంభవుండవయి నీ • యంశంబున న్విశ్వము
ప్రాదుర్భావమునొందఁజేసియు దదం • తర్యామివై యుంటివౌ
నీదృక్ప్రాభవమ నీకెకాక కలదే • యెవ్వారి కెందైన స
న్వేద శ్రీద పృథుప్రమోద సుగుణా • శ్రీసూ... 37

మ. తొలుత న్నీరొదవించి నీవచట రే • తోబీజమున్నివ ని
ర్మలభద్రాండము మేడివందువలె జ • న్మంబొందె నందుండె ని

చ్చలునీస్థావరజంగమావళులు గిం॰జల్ దోమల ట్లందుభా
సిలితీ వంకురచేతనాకృతులచే ॰ శ్రీసూ... 38

శా. యుష్మన్మండలమధ్యవర్తియయి ధ్యే॰యుండ వ్యో వైకుంఠుఁ డ
ర్చిష్మంతుండు భవత్కృపాతపము పే॰ర్మిం దాబృహద్భానుఁడై
గ్రీష్మానేకమురీతిఁగాంచె శుచితం ॰ గీర్తింపుచో నాస్వభా
శుష్మద్యుత్తముఁడంచు నిన్బొగడవ॰చ్చున్ సూ... 39

మ. నిమిషంబాదిగ కల్పమంతముగ ని॰ర్ణీతంబులైనట్టి కా
లములీ నీయుదయాస్తమానగతి మూ॰లంబౌచునుండంగ జ్ఞే
యములౌచుంట సమస్తకర్మముల కీ॰వాధారమైనాఁడ వ
స్తిమితాంతఃకరణానుపాస్యచరణా ॰ శ్రీసూ... 40

మ. చతురాస్యాకృతిచే సృజించిన ప్రపం॰చంబెల్ల రక్షింప న
చ్యుతరూపంబున నీవొనర్చిన త్వదీ॰యోత్కృష్టకార్యంబు లా
తతముల్ నేనుతియింపఁజాల నయినం ॰ దాత్పర్యవిస్తారసం
స్థితిచే సంస్తుతిఁజేతు నించుకయినన్ ॰ శ్రీసూ... 41

మ. ఖలుఁడై సోమకనామకాసురుఁ డశం॰క న్వేదసంఘంబు దొం
గిలి పాథోనిధిడాగినం దెలిసి యా॰క్రించు న్వడింద్రుంచి యా
తొలిమిన్కుంగమి నంగ్రహించి మరలం ॰ దోరంబుగాధారుణిం
జెలఁగంజేయవె మత్స్యమూర్తివగుచున్ ॰ శ్రీసూ... 42

మ. మరణాభావముజేనుకోదగిన మే॰ల్మందాసుధంగోరి ని
ట్చమలు న్నిర్జరులుం బయోనిధిమథిం॰చంగ వ్వాపుంగొండ క
ర్పరమందుండ భరించి వారల సుధం॰ బ్రాపింపఁగాఁజేసి సు
స్థిరకీర్తిం దగుకూర్మమూర్తి వెకదా ॰ శ్రీసూ... 43

మ. ధృతిసంధిల్లఁ బయోనిధిందరిచి దై ॰తేయాదితేయుల్ సము
ద్గతపీయూషముఁగ్రోలఁ బోరుటలు సం॰దర్శించుచు న్మోహినీ
సతివై దైత్యులమోసపెట్టి సురల ॰ న్సంతుష్టినొందంగఁ జే
సితివీవెకద తత్సుధార్పణముచే ॰ శ్రీసూ... 44

మ. అవనింగొంచు పయోధిముంచు నసురా • ధ్యక్షు హిరణ్యాక్షుద్రుం
చి విషాణంబెనయించి ధాత్రినచటం • జిత్రోల్లసచ్ఛత్రమ
ట్లు విభాసిల్లఁగ నుద్ధరించి వసుధా • టుల్ సుస్థితిం జెందఁజే
సి విరాజిల్లు వరాహమూర్తివిగదా • శ్రీసూ... 45

శా. డింభా దంభములేల చక్రి దివిమా • డిక్కు న్సర్వగుండంటి వీ
స్తంభంబందుగలండె నా నపుడ యా • స్తంభంబు భేదించి సం
రంభంబొప్ప నృసింహమూర్తివయి బో • రంజీరవే భైరవో
జ్జృంభత్ప్రాభవు నాహిరణ్యకశిపున్ • శ్రీసూ... 46

మ. బలియై లోకములాక్రమించినబలిం • బ్రచ్ఛన్నవేషుండవై
సులభప్రక్రియదోప మూఁడడుగు లీ • క్షోణిస్థలి న్వేఁడి ని
స్తులరూపంబున సర్వలోకములు దో • డ్తో నిండి యింద్రాదులం
జెలఁగం జేసితివీవ వామనుఁడవై • శ్రీసూ... 47

మ. ఖలులై రాజులు భూజగంబున బ్రజం • గారించి భారంబుగా
మెలఁగన్ ఘోరకుఠారధారివయి బ • ల్మింబట్టి ముయ్యేడుమా
రులు వారి న్నరుమాడి చుల్కఁదనమా • రోపించి భూదేవి భా
సిలఁగాఁజేసిన భార్గవుండవెకదా • శ్రీసూ... 48

శా. ఆశాధీశులనోర్చి లోకులకు దు • ర్వ్యాపారధౌరేయుఁడై
క్లేశోత్పాదన మాచరించిన దశ • గ్రీవు న్సవర్గంబుగా
నాశంబొందఁగఁజేసి ముజ్జగము నా • నందంబునొందింపవే
దాశస్యందనివై యశంబు జెలువొం • ద న్సూ... 49

మ. బలరామాకృతిఁ బూని పూనిక ప్రలం • బక్రవ్యభుక్ఛేఖరుం
బాలియంజేసి యనేకభంగుల జగం • బున్ సౌఖ్యసంతుష్టి వ
ర్థిలగాఁజేసినవాఁడవీవకద వా • ర్ధిస్ఫూర్తిగాంభీర్య ని
ర్మలచర్యా సముదర్య సత్వగుణధు • ర్యా సూ... 50

శా. శ్రీకృష్ణుండనసముద్భవించి ధరకు • న్వ్రేగై నదుర్భావరా
నీకంబుం బరిమార్చి భూరమణికి • న్నిండారుకౌతూహలో

త్నేకంబు న్నమకూర్చి సాధులకు స • త్క్షేమస్థితిందార్చి సో
ద్రేకశ్లోకుఁడవై తివీవ సుగుణా • శ్రీసూ... 51

శా. బుద్ధాకారముదాల్చిపాల్చి త్రిపురీ•పూర్వామరస్త్రీల క
శ్వద్ధా ర్మాచ్ఛ్రవతకృత్యమ్ముంగరపి త•త్సాధ్వీత్వవైకల్య సం
విద్ధాయుష్కులఁజేసి తజ్జయునమా•వేశంబు ముక్కంటికిన్
సిద్ధింపంగ నొనర్చితీవ సుగుణా • శ్రీ... 52

మ. యవనాధీశులు సర్వదేశముల దు•ర్వ్యాపార మేపార భూ
సవనాదు ల్కనుగాఁగ నెల్లరుల భ్ర•ష్టత్వంబు నొందింపుచో
జవనాశ్వస్థుఁడవై వధింతువట పా•శ్చాత్యావళింగల్కివై
శివనామా భవభీమ భవ్యకిరణా • శ్రీసూ... 53

మ. స్వకుమారు న్సుకుమారు నిన్నొగడుటం • జంపింపనూహించు కూ
హకుడుం ద్రోహకుఁడౌ హిరణ్యకశిపున్ • హర్యక్షరూపంబున
న్వికలోత్సాహుగ వీతదేహుగ వధి•న్నిస్సంసించి ప్రహ్లాదుఁ జూ
చి కృపంబోచినవాఁడవీవ సుగుణా • శ్రీ... 54

మ. కుజరాజిన్విహరించి నీటికిఁ గొలం•కుంజేరి నక్రంబుచే
నిజరాజత్పదముల్ గ్రహింపఁబడిన • న్నిన్నూర్చి ఘోషించు నా
గజరాజు న్విడిపింపవే మకరమున్ • ఖండించి చక్రంబుచే
నజరాదు ల్వినుతింపనీవగుణధు•ర్యా సూ... 55

మ. పరులై యన్నలు దమ్ము నిళ్లువెడలిం•పం దీనులై వచ్చి నీ
శరణంబొందిన యూరుమేశనరమే•శ ఖ్యాతులం దత్సహో
దరరాజ్యంబుల నిల్పితీవకద సు•త్రామాదులగ్గింప సు
స్థిరవృత్తి న్రఘురామమూర్తివగుచున్ •శ్రీ... 56

శా. సీతారాముఁడవైన నాఁడు శబరిం • జిత్తంబులో హేయపుం
జాతింబుట్టినదంచు జింతిలక యు•జ్జ్వల్జేరఁగాలేని వి
ఖ్యాతాతుల్య పదంబొసంగితివిశం•గై వారమేరీతి నే
జేతున్నీకరుణన్ విశాలకిరణా • శ్రీ... 57

శా. యేరీతిన్నినుతింపనేర్తు భవదుత్కృష్టస్వభావంబు సీ
తారామత్వము నొందియున్నపుడు నీతండ్రినవ్వాతె న్భక్తిచే
నారాధించి జటాయువుం ద్రిదశలోకావాససౌఖ్యోన్నతిం
శేరంజేసినవాఁడ వీడ్యకిరణా శ్రీ... 58

మ. కలవంబిచ్చినకుబ్జకు న్మధురలో కామోపభోగ్యాకృతిం
గలుగంజేసి క్రియావసానమున మోక్షంబుంబ్రసాదించి తో
బలరామానుజమూర్తివైనపుడు నీప్రాగల్భ్యము న్వేయు జి
హ్వాలవాఁడైన వచింపఁజాలునెయవార్యా సూ... 59

మ. తిరిపెంబెత్తుచునైన జ్ఞానకృతశక్తిన్ నిస్స్పృహుండయ్యు నా
త్మరమణ్యస్పృహ చోదితుండయి భవత్సాన్నిధ్యముంజేర సా
దరతన్ భుక్తియు ముక్తియుంగొలుపవే ద్వారావతీభర్తవై
స్థిరవృత్తింబరగుం గుచేలునకునో శ్రీ... 60

మ. పరమాశ్చర్యకరంబు నీమహిమ గోపస్త్రీలు వ్రేపల్లెలో
వరులన్వేమొరగిచ్చనిన్మరగి కౌల్వంజేసియున్ వారిపై
నరయెవ్వారికి దోపనీకవలిపీ వై మైహికాముష్మిక
స్థిరసౌఖ్యంబులొసంగినాఁడ వహహా శ్రీ 61

శా. దీప్తక్రోధముచే సురేంద్రుఁడు భవద్విక్రాంతి నతావజ్ఞుఁడై
సప్తాహంబులురాల వానగురియన్ భత్రాకృతింగొండని
క్షిప్తంబై యొకవ్రేలఁగ్రాల వ్రజముం గేళీగతింబ్రోచితౌ
సప్తాబ్దంబుల బాలకుండవయి కృష్ణా సూ... 62

మ. బహుపత్నీకుఁడవై యదూద్వహతచే భాసిల్లుచున్నట్టినీ
గృహమేధిత్వముఁజూచు నారదునకుం బెంటన్ సభార్యుండవై
స్పృహణీయస్థితినుండి నీమహిమ పేర్మింజూపితౌ సర్వదు
ర్గ్రహచారిత్రుఁడవీవకాసుగుణ ధుర్యా సూ... 63

మ. నినువంచింప నజుండు దొంగిలినవానిన్నీవు నిర్మించి యా
వనుతెల్లం జరిగింపుచుండి యజహూవంబూనితద్ధామమూ

తనిబల్మిం జొరనీమితా గొనిన వ • త్సవ్రాతమర్పించి యొ
య్యనని న్వేడుకొనండె యయ్యజుఁడు కృ • ష్ణా సూ... 11

మ. ధృతరాష్ట్రాదులకుం దదీయ సభకుం • తీసూతికిన్ సంగర
క్షితినీదున్నహా విశ్వరూపగరిమం • జెల్వారఁగాఁజూపి త
న్నతులన్నీవు పరాత్పరుండవను జ్ఞా • నంబుప్పతిల్లంగఁ జే
సితివీవేకద నందనందనుఁడవై • శ్రీ... 65

మ. అసమానాద్భుతచర్య నీవొనరఁజే • య న్మాయఁగా రాని సం
తసముం జెందిరి మానసంబుల యశో • దానందులున్ దేవకీ
వసుదేవుల్ తమనందనుండవను భా • వంబూని నానామరా
గ్రసరుంగానిమఁ గానలేక గుణధు • ర్యా సూ... 66

మ. జననంబన్నది లేని నీవుజగతిం • జన్మంబుగై కొంట స
జ్జనులందుర్జను లొందఁజేయు బలుక • ష్టంబుల్ నివారింప భూ
జనులన్నిర్మల పుణ్యభాజనులుగా • నల్పంగఁదాభూమి భా
రనివారి ప్రియకారి భూరితరచ • ర్యా సూ... 67

మ. అవివేకిత్వముగాదె నీవిటులు ప్ర • త్యక్షంబుగా నెక్క నుం
గవకుంగన్బడుచుండ నొండొకవరో • త్కృష్టామరున్వేడుటల్
నవనీతంబొడువంగ నేతికి ప్రయ • త్నంబూను చందంబునన్
శివనామా భవభీమ భవ్యకిరణా • శ్రీ... 68

మ. అవియుంచుం బహుళాంధకార నివహా • వ్యాఘాతజాగ్రన్మహా
భవియుంచున్ యజురాది వేదనృజనా • సామాన్య ధీమన్మహా
కవియుంచున్ రవియంచు సంతతము వ • ర్ణించుచుండున్ సదా
శివనామా భవభీమ భవ్యకిరణా • శ్రీ... 69

మ. కవితామార్గ మెఱింగినందుకు భవ • త్కల్యాణచారిత్ర సం
స్తవముంజేయుట యాత్మజన్మమునకున్ • సాఫల్యమంచున్ బుధుల్
శ్రవణానందముగాఁగఁ జెల్పిన నవి • శ్వాసుండనై తిన్ సదా
శివనామా భవభీమ భవ్యకిరణా • శ్రీ... 70

మ. అపరాధంబులు వేయొనర్చెదనను • మ్మాత్ర రేవులన్మాత్ర పులం
చపలాత్ముండగు వీఁడు దాసుఁడని నీ • స్వాంతంబునన్ నన్నని
ప్రపునూహించి క్షమించఁగావలయు ద్వ • త్కారుణ్య
... ...భవ్యకిరణా • శ్రీ... 71

... యుందు నేరములు సేయన్ సై ...
యపరాధముల్ సైచికూర్మి... ...
కృతాపరాధుఁడ ననన్యప్రాపకుండన్ సదా...
... భవ్యకిరణా • శ్రీ... 72

మ. తనుసంబంధముగల్గినన్ వివిధకృ • త్యంబుల్ రచింపంగ గ
ల్గును తత్కర్మఫలానుభూతికయి పెం • క్కుల్ దేహముల్ బూనఁ గ
ల్గును నాకెన్నఁడు ముక్తివైభవముగల్గు న్నీవుతద్బంధ మూ
డ్చిన సైగాక కృపావలోకనగుణా • శ్రీ... 73

శా. సంసారాటవిజిక్క క్రోధమదమా • త్సర్యోగ్ర పాటచ్చరుల్
హింసింపన్వలగొన్న నిన్గురిచి నే • నెల్గింప నాభీతి వి
ధ్వంసింపన్మదిగోల్ప వేమిటికి నీ • తాత్పర్య మెట్లుండెనో
హంసా దేవతులావతంస వరచ • ర్యా సూ... 74

శా. దీనుండై నను మించ వేరొకనిన • ర్థిన్ వేడుకున్నాఁడు నే
వీనింబ్రోచుట మానరాదనెడు తె • ల్విన్ నీవుగై కోనిచో
నేనేలాగొడబాటు జెందినను మే • లేమీనపౌలోమి సం
ద్యానింద్యాంఘ్రి సరోజరాజయుగ చ • ర్యా సూ... 75

శా. ఏచందంబున వేఁడిన న్గలుగు నీ • వ్యాప్యానుకంపామృతం
జేచిహ్నాంబులు గల్గువాఁడవని ని • న్నన్నందగు న్నాని మేల్
సూచింపన్వలెనేవ నేనెఱఁగి నీ • స్తోత్రింబు గావించు వి
ద్యాచాతుర్యము లేని వాఁడ గుణధు • ర్యా సూ... 76

మ. త్వదుదారాంఘ్రిసరోజముల్ మనములో • ధ్యానింప నేచింతలున్
గదియంజాలవటంచు తన్నియమముం • గైకొన్నచో జిత్తముం

శా. గాఢాత్మాంగరుజార్తి నీశరణముం • గన్నాఁడ నీయందు మున్
రూఢంబైన రుజాపహారియను మేల్ • రుగ్ణంబుగాఁగుండని
గాఢప్రక్రియ నిల్పుకొంట కిపుడా • రోగ్యంబు నాకిమ్ము గో
లీఢఖ్యాతి పరాయణా యరసవ • ల్లీ సూ... 84

శా. ఆయుర్దాయముగల్గినంతకును దే • హారోగ్యమున్ భాగ్యమున్
జాయాదిప్రియవర్గసౌఖ్యమును పెం • చ్చంజేసి యాయాసముం
డాయంగానని జీవితాంతమున నీ • డ్యంబైన మోక్షాప్తియుం
జేయంగావలయుంజుమీ వరగుణా • శ్రీ... 85

శా. చీమల్ మున్నగతమ్ముచూలి తుదఁగా • జీవుల్ స్వకర్మాగత
క్షేమాక్షేమము లొందుచుండుదురొరుల్ • గీలింపఁ దూలింపనే
లామేలౌ సుకృతంబు జేసుకొనరా • దాయన్న నాశక్తితా
లేమింగాదె భజింతునిన్నరసవ • ల్లీ సూ... 86

శా. ఔరా నీశరణంబు వేఁడితి మదీ • యాంహస్సముత్సారివై
కారుణ్యంబువహించిబ్రోవ గయికో • కన్నన్నుపేక్షించుటే
మేరా యాపయినెవ్వరైన నినున • మ్మంగా శరచ్చంద్రికా
స్మేరా సత్వసమీరభూరికిరణా • శ్రీ... 87

శా. నీకారుణ్యము నాయెడం గలిగినన్ • నేనేతదుర్విజనా
నీకంబందు మహోన్నతుండనగుదున్ • నీదైనకారుణ్యమే
లేకున్నం దృణసామ్యమొందుదు నరు • ల్కీర్తింప నీసత్కృపో
త్సేకంబుంచుము నాపయిన్సుగుణా • శ్రీ... 88

శా. ధ్యానింతున్నిను నేసనాతనమ • హాన్యానన్యసామాన్యశో
భానూనాప్రతిమానమూర్తి నుదుగే • యస్ఫూర్తి మత్కీర్తినా
నానీరేజభవాభవాద్యమర సే • నాచక్రవర్తిన్ భృశా
దీనోద్ధానతమో నివర్తినిఖవ • ర్తిన్ సూ... 89

మ. అనిశోష్ణాంశుఁడవయ్యు డెందముల నీ • యావాహనం బాచరిం
చిన శీతాంశుఁడవౌచు నిల్తువట త • చ్చిత్తాబ్జముల్గందకుం

ఁ చనటుల్ గావున మన్మనోబ్జమునను•డన్ నిన్ను నావాహనం
బొనరింతు న్ననుధన్యుఁ జేయుటకు ర•మ్మో సూ... 90

శా. పాద్యార్ఘ్యాచమనీయతోయ మును స్నా•వ్యంబైనతోయంబు సం
పాద్యంబైనదిగా గ్రహింపుము కృపా•పాథోనిధీ శ్రీశచీ
... ... ...
పాద్యైశ్చర్యకధీసుధీ వినుతచ•ర్యా సూ... 91

శా. కౌశేయంబులు కాంచనాంబరములుం • గార్పాసవస్త్రంబులున్
శ్రీశాలుల్ స్వధనానురూపముగన•ర్థిన్ నీకు నర్పింతునే
వైశద్యానుగతద్విరూపక మనో•వాసోయుగం బిచ్చెదన్
నాశక్తిం గొనుమయ్య సద్గుణధురీ•ణా సూ... 92

శా. తీరారాగరసాన పల్చనగు మ•ద్భృప్తాత్మపాటీరపుం
ధారన్ సత్వరజస్తమోగుణ లస•త్కర్పూరకాశ్మీర క
స్తూరుల్ దార్చివాసనాన్వితముగా•సొంపారు లేపంబు జెం
పారంబూసెద నీకు లేపకునకా•ర్యా సూ... 93

మ. చపలత్వభ్రమమాణగంధ వహసం•స్పర్శానభిజ్ఞంబులున్
వ్యపదేశానుపవేశవర్తి మధుపా•నాస్వాదితంబుల్ మహా
నిపుణగ్రాహ్యములైన వాక్సుమములన్ • నే నిన్నుఁ బూజింతుపూ
జ్యపదాంభోజ విశాలతేజ గుణధు•ర్యా సూ... 94

మ. తతకామాగ్రహలోభమోహ మదమా•త్సర్యంబులన్ నవ్యగో
ఘృతకాలాగరుకుంకుమార్క మహిసా•క్షీ గుగ్గుకర్పూరముల్
కృతసత్సంగతి వహ్నిలో వయిచికూ•ర్మిన్ ధూపమర్పింతు పు
ణ్యతమాగణ్యతమోనివారణధురీ•ణా సూ... 95

మ. క్షితినాకుంగలవారిపై గలుగునా•స్నేహంబు స్నేహంబుగా
మతిగేహాంతరవర్తివర్తిగ భవ•న్నామాఖ్యంఘ్రిసీరేజ భ
క్తితతోగ్రానలహేతిభక్తిగఁ బ్రప•త్తిం దీపమర్పింతు బు
ణ్యతమాగణ్యతమో నివారణధురీ•ణా సూ... 96

మ. అలఘుశ్రద్ధకువారలె మోదిలవుదీ•వ్యద్భుత్యభోజ్యాది వ
స్తులకుంగావున నీకుశ్రద్ధనె నుధీ•తో నే నివేదంతు ని
చ్చలుశ్రద్ధాశివయాట నంతసిలుమా•శాసుప్రకాశప్రదా
నలనాన్యాన లసత్ప్రభావసుధురీ•ణా శ్రీ... 97

శా. నీకై పల్కెడు వాకులాకులుగ ని•స్కీర్తింపుచో నాదువ
ల్లోకల్లోకలుగా త్వదన్యమగు వే•ల్పుంగొల్వగై కొంటకే
వీఁకంజుట్టిన నున్నసున్నముగ మే•ల్వ్యోద్యంబుగావించి సో
ద్రేకంబౌనను రక్తినొందుమరుణా • శ్రీ... 93

శా. డిందంగానని మానసీయమగు నా•డెందంవుపొందమిమ్ము వు
వ్వందల్గొల్చెదు మంత్రపుష్పముగ తా•వుల్గ్రిమ్మనప్పింతు ని
మ్మందామంద దయామయాత్మకుఁడవై • పాటించి చేకొమ్ము తా
ల్మిందీను న్ననుఁ బ్రోవరమ్మరనవ•ల్లీ సూ... 99

శా. నానంచారములే ప్రదక్షిణముగా • నానిద్రకుం బందుకొం
చే సాష్టాంగనమస్క్రియార్పణముగా • నే నెప్పుడుంజల్క నా
నాసల్లాపములే తుమూవణముగా•నందించి కైవల్య ల
క్ష్మీసంయుక్తునిఁ జేయుమీడకిరణా • శ్రీ... 100

మ. జగతీమండన మండపాకకులసం•జాతుండ పేరయ్యకుం
బాగడంగాఁదగినట్టి కోనమకునే•పుత్రుండ కామేశ్వరుం
డగఁదిష్టామలభక్తి నీకొసఁగినా•డం బ్రార్థనాపూర్వకం
బగు నేతచ్ఛతకంబు కూర్మిగొనుమా•ర్యా సూర్యనారాయణా.

సంపూర్ణము.

శ్రీ హయగ్రీవాయనమః

# కలువాయి శతకము

శ్రీయుతమూర్తి యాశ్రితకల్పభూజంబు,
కరుణాపయోనిధి • కలుషహరుఁడు
సచ్చిదానందుండు • సర్వజ్ఞుఁ డవ్యయు,
డప్రమేయుండు మ•హామహుండు
ప్రియకింకరునిగ డ•బ్బీరునర్జును నేలు,
గజరాజవరదుండు • ఘననిభుండు
నాజీప తేశుఁ డై • నజనార్దనుండు నేఁడు,
వనవిహారము చేసి • వత్తుననుచుఁ

తే. జనెను రాఁడయ్యె నేమొ నా•సదనమునకు
క్షణము శ్రీహరి నెడఁబాయఁ • జాలనమ్మ
చెలియ నీవేగి కలువాయి • చిన్నికృష్ణు
తోడుకొని వేఁగ రాఁగదే • తోయజాక్షి. 1

సీ. వనిత నానాథుండు • వనవిహారము పోవ,
నిలుప మునుల్ మ్రొక్క • నిలిచినాఁడొ
విపినభూములు చొచ్చి • వేఁటాడుచున్నాఁడొ,
దైత్యుల శిక్షింపఁ • దడసినాఁడొ
వలచి యేచానకై •వనమున నున్నాఁడొ,
యెవతెకుఁ గడుబాస • లిచ్చినాఁడొ,
యిట్లు నన్నలయించు•నిచ్చతో నున్నాఁడొ,
మమత నెచ్చటఁ జేర్చి • మఱచినాఁడొ

తే. కాక నిన్నటిరే యేల • రాకమాను
యేమి! వింతలుగానున్న • వేమిసేతు, చెలియ... 2

సీ. ఈమోహనాంగుని • నెలముతోఁ జూచిన,
నింతులు వలచి మోహించు టరుదె

కమలాక్షుఁ గనుఁగొని • కడుపతివ్రతయైనఁ
గోరి యంగజుకేళిఁ • గూడు టరుదె
పురుషు లా మానులా • పురుషుఁ గాంక్షింపంగ,
మగువలు వీక్షించి • మరగుటరుదె
శ్రీధరుమూర్తిఁ గాంచినమానవతియైనఁ,
జేపట్టి యక్కునఁ • జేర్చుటరుదె
తే. యుంటి నాజీవితేశ్వరు • వెంటఁ జనక
యింతమతిహీన నై యుంటి • నేమి సేతు, చెలియ...

సీ. గడగడ కిది యేమి • కారణంబో కాని,
కను చన్ను లదరునే • ఘననితంబ
ముం జేతికంకణం • బును సందేకడెముగాఁ,
బెట్టఁగల్గెను జూడు • భీరుమధ్య
యొకరితో మాట్లాడ • నూహించి యనఁబోఁగ,
నంతలోఁ దోఁచదే • యబ్జనయన
కల్లగా దిది వింత • గా యెదలో జల్లు,
జలు మనుచున్నదే • చంద్రవదన
తే. యెన్నఁ డిటువంటియాశ్చర్య • మెఱుఁగనమ్మ
యెట్టిహేతువొ ప్రాణేశుఁ • డేగుటకును, చెలియ...

సీ. వింటివే యిటువంటి • విపరీతవార్తలు,
నావిభు నేలాగు • నమ్మవచ్చు
నలదానియురుదోడ • ల్దలగడదిండ్లాయె,
భామగుబ్బలు పూల • పాన్పులాయె
సుదతివాతెఱ తియ్య • జుంటితేనియలాయె,
వెలఁదిచేతివిడెంబు • విందు లాయె
వనితపయ్యెదవల్లె • వాటు దుప్పటమాయె,
పడఁతిమాటలె యాట • పాట లాయె
తే. ననుచు సతిచూచి చెప్పెనే • యమ్మచెల్ల
యిట్లుసేయుట కలనైన • నెఱుఁగనైతి, చెలియ...

సీ. పాన్పుసేయఁ జిగురు జెడఁగ • బాసియుండుటఁ జేసి,
కోవెలల్ తరులెక్కి • కూయఁదొడఁగె
నల దానిమపలున • నతఁ డింపు రాఁడని,
యళుల ఝుంకారంబు • లతిశయించె
ననుఁజారి నాదెస • నలిఁగిపోవఁగ శశి,
వేఁడి వెన్నెలఁగాసి • విఱ్ఱవీఁగె
నచట బాసల నిచ్చె • నని సూనశరముల,
మర్మ మంటఁగ నేసె • మన్మథుఁడు
తే. తెలిసి యిందఱు వగలు నా • ధించుచుండ
నింక నేఁ దాళఁ గలనఁటే • యింకవదర, చెలియ ... 6

సీ. రమ్మనే మనవి చే • కొమ్మనే కరుణచా.
నిమ్మనే నమ్మిన • కొమ్మననవె
యింపుగా నను గాఁగి • లింపుమఁ బ్రాపి ర.
హింపుము రతులఁ దే • లింపు మనవె
జాలనే విభుఁ బాయఁ • జాలనే యీచలం,
బేలనే నీకైన • గోలననవె
వెచ్చఁగా మైకాఁక • లెచ్చఁగా విరితూఁపు,
లిచ్చఁగా మరుఁ డేపఁ • గుచ్చె ననవె
తే. నీరు నన్నంబు నిద్రయు • నిగ్రహించి
వేఁగుచున్నట్లు మనవిగా • విన్నవించి, చెలియ... 7

సీ. అధరమధువులు మోవి • కందియియ్యకగాని,
విడెముసేయఁడు గదా • వెలఁదులార
యొనసి యుద్దఁజమఁ బో • త్తున భుజింతుముగాని,
వేఱుభుజింపఁడే • వెలఁదులార
పొంకమ్ముగా నేను • బూయక పరిమళ,
గంధంబు వలఁదఁడే • కాంతలార
పడకింటిజవ్వాది • బరిణఁ దేఁబోయిన,
పడిగ వెంబడివచ్చు • వనితలార

తే. గడియ యెడఁబాయఁ జాలఁ డే♦కారణంబొ
రాక యున్నాఁడు నన్నింత ♦ యట్టు సేసి, చెలియ ... ౮

సీ. నావిభుఁ డీలాగు ♦ పోవుట లెఱిఁగిన,
నెనరుగా బతిమాలి ♦ నిలిపికొందు
నిలువక కోపించి ♦ నిక్కిపోఁదలఁచినఁ,
గదిమి పయ్యెద నంటఁ ♦ గట్టికొందుఁ
గట్టుల వదలించి ♦ కదలిపోఁదలఁచిన,
జంటాడి వదలక ♦ వెంటనుందు
వెంటరా మఱపించి ♦ వెళ్లఁగాఁదలఁచిన,
విడఁజాల నని మ్రొక్కి ♦ వేఁడికొందు

తే. నిట్లు సేయుట గలనైన ♦ నెఱిఁగియున్న
రమణు నిలువెళ్ల నిత్తునా ♦ నిముసమైన, చెలియ ... ౯

సీ. వెలఁదులు నాప్రాణ♦విభుని డాయఁగఁజూచి,
చెంత నేమఱకుందుఁ ♦ జిగురుఁబోఁడి
యచ్యుతం డెలదోట♦లందుఁ జరింపఁగా,
నండఁబాయక యుందు ♦ నంబుజాక్షి
వేడుక నాపతి ♦ వేఁటాడఁ బోవునో,
జంటగాఁ బోదునో ♦ చంద్రవదన
శ్రీహరి నిద్రింపఁ ♦ జేరి యాశయ్యపై,
గదిసి నేఁ బవళింతుఁ ♦ గంబుకంఠి

తే. యిన్నివిధములుగాఁ గాఁచి ♦ యున్నప్రభుని
ముదిత మాయలలోఁగొనె♦మోసపోతి, చెలియ... 10

సీ. అతఁ డేమియాడిగ ♦ మానతిచ్చిన దాని,
నడుగుదాఁటక చేతు ♦ నంబుజాక్షి!
గీతప్రబంధసం♦గీతముల్ గోరిన,
నింపుగాఁ బాడుదు ♦ నిందువదన!
యేరీతిబంధంబు ♦ లెనయుద మన్నను,

మేనాత్యములనాడ • నిచ్చలోఁ దలఁచిన.
పొలుపుగా నాడుదుఁ • బువ్వుఁబోణి !
తే. ప్రాణనాథునికెదురు నేఁ • బలికి యెఱుఁగ
నలుగఁ గారణమేమని • యడుగుమమ్మ, చెలియ ... 11

సీ. దానివగలపెక్కు • తళుక్కులచిక్కుల,
మాయల కతఁడు లో•నాయెనమ్మ
దాని వా కౌఁగిలిం•తలనాటపాటల,
జిలిబిలిసుద్దులఁ • జిక్కెనమ్మ
దానికెమ్మోవుల • దలరాపుమందుల,
మమతలఁబడి యిందు • మఱచెనమ్మ
దాని జగ్గులరీవిఁ • దఱుచైన మైతావి,
బలునోయారములకు • బ్రమసెనమ్మ
తే. యిట్టిపెనుజంత యగుదాని • యిల్లుజేరె
దలఁపు లొనఁగూర్పనాకైన • దానవివు, చెలియ... 12

సీ. ఏలనే రాఁడు వాఁ • డేలనే యేఁచేది,
మానెనో నాపేర్మి • మందయాన !
వీఁడఁటే హరిచన • వీఁడఁటే యీరేయి,
నొంటి నెట్లోర్తు న•యోయ్య మృగజాక్షి !
వేఱుగాఁజూడ న•వ్వేఱుగా కనఁడాయెఁ,
గపటమైతిరిగదమ్మ • కంబుకంఠి !
మందుచేవలచె నే • మందుఁ జేసేతి నే,
మోముమూపులు పాసె • మోహనాంగి !
తే. వగలదక్కులు జిగిబిగి • వలపునగవుఁ
దక్కు లొలయించుదానిచేఁ • జిక్కినాఁడు, చెలి... 13

సీ. కోయిల ! యూరక • కూసెదు కొ్రవ్వటే,
వట్టికెంజిగురు నీ•వాఁతిఁబడను
జంత మయూరమా ! • యింతగర్వం బఁటే,
పిఱిసిపై పొఱలెత్తి • విచ్చఁబాఱ

జడియక కాసేపు ♦ జాబిల్లి ! నీరూపు,
పదియాఱు తునియలై ♦ వఱదఁగలిసి
మదన ! నాయెద నాట ♦ మాఱితూపు లేయుదు,
చెదరి నీయస్త్రముల్ ♦ చెట్లఁగలియ
తే. ననుచు నే నెన్నిదిట్టిన ♦ నాన లేక
యతఁడు రాఁడయ్యెనని యుంద ♦ ఱజ్జఁగనిరి, చెలి... 14

సీ. ఉత్సాహకరణమౌ ♦ నుద్యానవనము ద,
ర్పక కాననమురీతి ♦ భయదమయ్యె
దర్పణఖచితమై ♦ తనరు చిత్రపుటిండ్లు,
తెఱలిచూడఁగ మది ♦ దిగులు దోఁచెఁ
గడు సుందరంబులౌ ♦ కమలాకరంబులు,
పంచబాణునిపొది ♦ పగిదిఁదోఁచె
వీనుల కింపులౌ ♦ వీణానినాదముల్,
కర్ణశూలంబుల ♦ కరణిఁ దోఁచె
తే. నిట్లు దోఁచెడుకారణం ♦ బేమొకాని
దినదినంబును మదిలోన ♦ దిగులుపొడమ, చెలి... 15

సీ. భయమునొందితి నని ♦ నయముగాఁ దెల్పెరు,
కూనగాడ్పులమెల ♦ గోలువచ్చె
బెదరకుమని యెంతొ ♦ బీరము ల్పలికేరు,
పికములకైలాట ♦ మిఁకఁ గడంగ
వెఱవకు మనుచు నం ♦ దఱుఁ జేరి నవ్వేరు,
చెల్లఁబో గానరో ♦ చిలుకపౌజు
జడియకు మని యెన్నఁ ♦ జలచి సొక్కెననేను,
కదిసె గన్గొనుఁడు తు ♦ మ్మెదల గుంపు
తే. లిదిగో మదనుఁడు శరముల ♦ నెక్కువెట్టి
నడఁచె మీకేమి నావెత ♦ ల్నాకుఁదెలియు, చెలి... 16

సీ. అతివకు నిట్టూర్పు ♦ లధికమై పొఱలుచు,
భామ నేఁ డేమొకో ♦ పవ్వళించెఁ

ఁగసి దీఱ మోవి నొక్కుచు మొఱ్ఱెక్కెద నటంచుఁ
గాంతనిద్దురలోనఁ ♦ గలవరించుఁ
బతి వచ్చె నని వేఁగఁ ♦ బరవశమ్మై లేచి,
గ్రక్కున బయలంటఁ ♦ గౌఁగిలించు
హో! యని మేల్కొని ♦ యంతదెస ల్గని,
తలవంచు లజ్జించుఁ ♦ దల్లడిల్లు
తే. నంగజ జ్వరవేదన ♦ యతిశయించె
దడవుసేయంగఁ గూడ దింత్తఱని మనము, చెలి... 17

సీ. పెదవు లెండె నటంచుఁ ♦ బేర్మినీ రిచ్చేరు,
దీనిచే నెండుటల్ ♦ దీఱునఁటకె
మైకాఁకకును జల్వఁగందుల బెట్టేరు,
వీనిచేఁ గాఁకలు ♦ దీఱునఁటకె
శ్రమబిందు లుడుగంగఁ ♦ జల్లఁగా వీచేరు,
దీనిచేఁ జెమ్మటల్ ♦ దీఱునఁటకె
అచ్చటఁ జెమరించె ♦ నని మందు లిచ్చేరు, ..
దీన నామంటలు ♦ దీఱునఁటకె
తే. నాశరీరగుణంబు నానాధుఁ డెఱుఁగు
నింక నాలస్యమొనరింప ♦ నెక్కడగును, చెలియ... 18

సీ. అతనిపేరురమున ♦ నంటె గుఱిమ్మ్రకగాని,
గుబ్బలపొఁగ రెట్లు ♦ గుదురునమ్మ
వాతెఱమొనపంట ♦ వడిగ నొక్కకగాని,
యధికదాహం బెట్లు ♦ లడఁగునమ్మ
సురతబంధంబుల ♦ సొక్కిచిక్కకగాని,
గబ్బిమదం బెట్లు ♦ గఱఁగునమ్మ
కవఁగూడి పెనఁగొని ♦ కౌఁగిలించకగాని,
తమివెగ్గలం బెట్లు ♦ తఱుఁగునమ్మ
తే. ఛాయ మిఱకను నిల్వదే ♦ కంబుకంఠి
నే నతనియూనపాఱిణముల్ ♦ నిల్పినాను, చెలియ... 19

సీ. ఎమ్మెతోఁ బ్రాణేశు • నెదుట వర్తింపని,
సొమ్ముల జగ్గెల • సొగసు లేల
కడు ప్రేమవిభునెదఁ • గదసి గ్రుచ్చఁగలేని,
గబ్బిచన్గవయేల • కాయమేల
పతితోడఁ జొకిలి•బంధముల్ పెనఁగని,
తనువేల యాచక్కఁ•దనములేల
వయసుప్రాయపువేళ • వరుఁడు దగ్గఱ లేని,
బ్రతుకేల మెచ్చుసౌ•భాగ్యమేల
తే. యిట్టిబలుజవ్వనపుఁగోర్కు • లెట్లు దీఱుఁ
గంట నిద్దురఁ గలనైనఁ • గాననైతి, చెలియ... 20

సీ. చెలువ సాష్టాంగంబుఁ • జేసి వేఁడెద నటంచుఁ,
బలుమాఱు నెనరునఁ • బలుకరమ్మ
తమక మగ్గల మాయెఁ • దాళఁజాల దటంచు,
వినయోక్తులను విన్న•వించరమ్మ
బిగిగబ్బిగుబ్బల • పొగరు కోర్వదటంచు,
తిన్నఁగా మది నాటఁ • దెల్పరమ్మ
మాటికి నినునెంచి • మాఱువని పల్కులు,
సెలఁగి హెచ్చె నటంచుఁ • జెప్పరమ్మ
తే. మరునికేళికి రాకున్న • మానెఁ గాని
మోముఁ జూపించి పొమ్మను • ముద్దుగుమ్మ, చెలి... 21

సీ. కటకటా యిటువంటి • కడిదిలేఁబ్రాయంబు,
విరులపానుపున క•ర్పింపఁబడియె
సూనశరాళికి • సుక్కినచన్గవ,
కాయజునకు దార•వోయఁబడియె
వేఁడివెన్నెలకాఁక • వేగిన మేనును,
చెడుగుచందురుపాలు • సేయఁబడియె
వగడువ్రాఁతలు వ్రాసి•నట్టి యాపరమేష్ఠి,
సుఖ మెసఁ జేయఁగాఁ • జూడఁబడియె

తే. గుబ్బచనుదోయివణఁకఁగఁ • గుల్కి మ్రుక్కి
యున్నసఖియలఁజూచి నో • యూరసాగె, చెలియ .. 22

సీ. పదియేండ్లకే గబ్బి • పాల్యంబు వచ్చెనో?,
వచ్చినమదు లిల్లు • పెచ్చునేమొ?,
పెచ్చుఁబోవానిపై • నీవింత మరు లేమొ?,
మరులాతనికి లేని • మర్మమేమి?
మర్మంబు దెలియక • మగువ నంపిన నేమి?,
యంపిన దానుపో • మన్న నేమి?
పొమ్మనెఁబో మరు • పోరాటమది యేమొ,
పోరఁగా మమతల • బోరలుకేమి?
తే. యేమొ? యీమాయవలపు పోఁ బేమొ మనకు?
నైన వినాశికి నవ్వుచుఁ దలఁచినాఁడొ, చెలియ... 23

సీ. తమి చాల హెచ్చెనే • తాఁబొసలిచ్చెనే,
యాఁడువచ్చెనే • యతివలార!
వలపెందు దాతునే • వదునెట్లు చూతునే,
నేనేమి సేతునే • నెలఁతలార!
హంత నైనబాలనే • యెపుడు వాఁడేలనే,
యింకఁ దాళఁజాలనే • యింతులార!
వలరాజు డాసెనే • వడినమ్ము లేసెనే,
విభుఁ డెడఁబాసెనే • వెలఁదులార!
తే. మనసిజాశుగదావాగ్ని • మధ్యమందు
నిన్నుఁ దలఁచుచుఁ దపియించు • చున్నదనరె, చెలి... 24

సీ. కోమలినెఱికురుల్ • కొప్పున కందెనా,
వింజామరలసేవ • వేడ్కఁ జేతు
మగువవాజ్మాధురి • మాటాడనేర్చెనా,
చూరవుత్తును బంచ • దార రాశి
చెలియపాలిండ్లు పూఁ • జెండులంతయ్యెనా,
యమరింతుఁ బైఁడికుం • భములఁగుడిచి

ఏణాక్షి వేఁగ మీఁ • డేరి నన్నొందెనా,
చేయింతుఁ దిరునాళ్లు • శ్రీధవునకు
తే. నంచు నాకనివేల్పుల • కందఱకును
మ్రొక్కి నన్నేలినాఁడమ్మ • మోహనాంగి, చెలియ ... 25

సీ. గోముగా నాకురుల్ • గొప్పవెట్టినవార్త,
సకియ చెప్పినబన్న • సరము లొసఁగె
నట, చనుల్ నిమ్మపం • డ్లంతలాయె నటంచుఁ,
బల్కినబోఁటికిఁ • బతకమొసఁగె
నందమౌ నూఁగుటా • రమరిననద్వార్త,
మగువ సెప్పిన కంఠ • మాల నొసఁగె
నతిశుభంబుగ ఋతు • మతినైనవార్తలీ,
వెతిఁగింప వేవరా • లిచ్చె నీవు
తే. నిట్లు నామీఁది ప్రేమచే • నీవు లొసఁగి
మచ్చికలు చేసి యపుడె యా • మమతమఱచె, చెలియ ... 26

సీ. జంపులై సొంపులై • జాలు నీకురులకు,
సామ్యమౌ బిరుసైన • చామరములు?
నిష్కళంకంబైన • నీమోము తేఁటకు,
సకళంకచంద్రుఁడు • సాటియగునె?
నీమధురాధర • నిర్మలరుచికి నీ,
రసమౌ ప్రవాళవా • రంబు సరియె?
కఠినముల్ మృదువులు • గాని నీచండ్లకు,
జంటనుండెడు కల • శములు సరియె?
తే. యనిగణించిన కథలెన్న • నలవి యగునె?
నమ్మికలఁగూర్చి యిట్లేచ • నాయమగునె, చెలియ ... 27

సీ. విరులుకొప్పున దోఁపు • వేడ్కమైఁ జూచు మే,
సొమ్ములఁ దగవేసి • చోద్యమందు
దిలకంబు చక్కఁగా • దిద్ది ముద్దిడుకొను,
కంచుకంబును బూన్చి • కౌఁగిలించు

వలువ జగ్గుగఁ గట్టి • వగఁగని మోహించు,
పైట సొంపుగ దిద్ది • బ్రమసి పొంగు
గడెగడె కొకవింత • గాను శృంగారించి,
తిల యూఁచి యజునిస్తో • త్రంబు సేయు
తే. నింతి ! యతిమోహనమైన ప్రా • ణేశుఁ డిట్లు
నన్నుఁ బాయుట కలనొక • నాటి కెఱుఁగ, చెలియ... 28

సీ. సుదతి నీనెమ్మోము • సుందరంబును జూచి,
యిందుబింబముఁ జూచు • నిచ్చ తొలఁగె
బాలఁతి నీగుబ్బల • పొంకంబులను జూచి,
కమలజక్కవలఁ జూచు • కాంక్ష తొలఁగె
కలికి నీసోఁగక • న్నుల యందమును జూచి,
మత్స్యమీనములఁ జూచు • మమత లుడిగె
పడఁతి నీచాకత్రి • బంధరీతులఁ జూచి,
యన్యకాంతలఁ గోరు • నాస లుడిగె
తే. ననిన మమతల నానాఁడె • యాఱుమూఁడు
సేసి మఱచెను నేనేమి • సేతుఁ నమ్మ, చెలియ... 29

సీ. కలువలు నీసోఁగ • కండ్లఁ బోలుటఁ జేసి,
యవి దేవతతికి యో • గ్యంబులయ్యెఁ
జక్రవాకములు నీ • చన్గవఁ బోలఁగా,
మిన్నఁగా నక్కవు • లెన్నఁగన్గె
పగడంబు నీమోవి • పగిదిని దీపింపఁ,
దొమ్మిదోరత్నమై • యెమ్మెఁ గాంచె
పళులు నీకురులనై • ల్యంబులఁ బోలఁగా,
మారునారిగమీఁటి • మహిమఁ గాంచె
తే. నిను సృజించినయజుని వ • ర్ణింపఁదరమె !
యని మనోహరుఁ డీలాగు • ననుఁ గణించు, చెలి... 30

సీ. కమలాక్షి యనువాలు • గన్నులజిగిఁ జూచి,
శశిరేఖ యనుమోము • సొరుఁజూచి

బింబాధరా! యనుఁ, బెదవినిగ్గులఁ జూచి,
చలివేణి! యనుకుంతలాళిఁ జూచి
. . కుచా! యనుగిబ్బిగుబ్బ లొప్పఁగఁ జూచి,
సారసాక్షి యటంచు సుమధ్యంబుఁ జూచి
గజగమన! యనుచు మందగతుల చోద్యంబుఁ జూచి,
లలితాంగి యను మేని చెలువుఁ జూచి
తే. గడియ కొకపేరుననుఁ బిల్చి గారవించు
దయితునకు నిష్టు నేఁ గానిదాననైతి, చెలియా... ౩౧
సీ. తిలకంబు నీటుగా దిద్ది మోమటు చూచి
బలుదర్పణము దిప్పి పాఱవైచు
కురులకొప్పమరించి విరినిగా నటుచూచి
నిడుసీలములఁ దిప్పి విసరివైచు
కంచుకం బమరించి కడువేడ్క నటుచూచి
పూలబంతులఁ దిప్పి పుడమివైచు
సొమ్ము శృంగారించి సుందరం బటుచూచి
తెప్పునరత్నముల్ దిప్పివైచు
తే. నిన్ని విధముల నన్ను మోహించి యేలు
మచ్చికల నెట్లు మదిలోన మఱచినాఁడొ, చెలి... ౩౨
సీ. అతివ నే నీమధురాధరంబును గ్రోల
నాసుధామధురంబు లరుచులయ్యె
నీమోముకళల పూర్ణశమును జూచిన
నిందుబింబముఁ జూచు నిచ్చ దొలఁగె
భామ నీపాలిండ్లపైఁ బవ్వళింపఁగా
శేషతల్పముమీఁది చిత్త మెడలె
రామ నీయౌవనరాజ్యంబు నేలుచో
సకలాధిపత్య మసహ్యమయ్యె
తే. నింక నినుఁ బాయఁజాల నేనెన్నటికిని
అనినమాటల మఱచినాఁ డల్లనాఁడె, చెలియ... ౩౩

సీ. కడుమేలుగా జాత • కములు వ్రాసిరిగాని
పతియొల్లఁ డనుచు దై • వజ్ఞు లనరు
సాముద్రికముఁ జూచి • సంతసించిరిగాని
నొచ్చుకొందు నటంచు • నుడువరైరి
పొంతనంబులు చాలఁ • బొందు లందురుగాని
యెప్పుడీయెడఁ బాట్లఁ • జెప్పరైరి
పేర్మి నేలు నటంచుఁ • బెండ్లి సేసిరిగాని
యతిజారుఁ డని ప్రాజ్ఞు • లాడరైరి
తే. యందఱు భ్రమింప నతనికి • నజుఁడు గూర్చె
నిపుడు తలపోసినందుల • నేమిఫలము, చెలియ ... ౩౬
సీ. తరుణిరో! నానిశ్చి • తంబునకై రాఁగ
ద్విజు లిద్ద ఱెదురైరి • తెరువులోన
నింతిరో! వరునిఁ దే • నేగఁగా నాకేళఁ
బూర్ణకుంభంబులు • వొడమె నెదుట
సుదతిరో! మంగళ • సూత్రంబు గట్టఁగా
బహుశుభంబుగ గాళి • వలికె నపుడు
వెలఁది! నేను గృహప్ర • వేశంబు సేయఁగాఁ
దీపుగా గరుడుండు • తీర్చి తిరిగె
తే. శకునదేవత లెల్ల నా • శత్రు లగుచు
నిట్టినిర్దయునకుఁ గూర్చి • రేమిసేతు, చెలియ ... ౩౭
సీ. విరులేల? ముత్యాల • సరులేల? ప్రాణేశుఁ
డూఱక ననుఁ బాసి • యున్నయపుడు
వగలేల? మెయినిండు • నగలేల? విభుఁ డిట్లు
దూరీకరించి హా! • తొలఁగినపుడు
గృహమేల? మాయను • గ్రహమేల? నానాథుఁ
డలుక నెమ్మదిలోన • నిలిపినపుడు
జగ్గేల? మేనికి • నిగ్గేల? సరసుండు
మించుగా మది మచ్చ • రించునపుడు

తే. మగఁడు చూడనిసొగసేల? • మగువలకును?
బురుషుఁ డెడఁబాయ కేలుటే • భూషణంబు, చెలి... 36

సీ. విభుఁడు దగ్గఱలేని • వెలఁదివాగ్చతురిమ,
పాడింట చిలుకలు • పల్కినట్లు
పతి నెడఁబాసిన • భామశృంగారంబు,
రాజబింబము లేని • రాత్రియట్లు
ప్రాణేశుఁ డెడసిన • పడఁతియొయ్యారంబు
లడవికోనల నెమి • ళ్లాడినట్లు
పురుషుఁ డొల్లనియట్టి • పొలఁతియౌవనమెల్ల,
ముష్టిచెట్టది పూలఁ • బూసినట్లు
తే. ఈవిధం బాయె నాబ్రదు • కేమిసేతు
నేల పుట్టించె నజుఁడు నన్నిట్టులేచ, చెలియ... 37

సీ. తిలకమ్ముఁ జక్కఁగా • దిద్దనేరనివాఁడు
జగ్గుగా సొగసులు • సలుపనేర్చె
సతివలయెదుట మాటాడనేరనివాఁడు
చదురులాడఁగ నేఁడు • సాహసించె
నెపొద్దుఁ గోపించి • మెఱుఁగనేరనివాఁడు
మిన్నక నలుకల • మెలఁగనేర్చె
లీల నొంటిగఁ బవ్వళింపనేరనివాఁడు
తెగువమై రేలొంటిఁ • దిఱుగనేర్చె
తే. నెవతె నేర్పెనొగా! చెల్ల! • యేమిసేతు?
మందు తలకెక్కి యలదాని • మఱఁగినాఁడు, చెలి... 38

సీ. నినుఁ బాయలేనని • నెఱబాస లిచ్చిన
మాటల నానాఁడె • మఱచినావా?
నీపుక్కిటివిడెంబు • నెలఁత! యిమ్మని వేఁడు
మచ్చిక నానాఁడె • మఱచినావా?
యలరేయి సుపరతిఁ • గలసి నిన్నొచ్చిన
మరుకేళి యానాఁడె • మఱచినావా?

యులిఁగిన ననుఁ బల్కు • మంచుఁ బల్కులు మొ్రొక్కు
మరుల నీ వానాఁడె • మఱచినావొ ?
తే. యనుచు నేఁ బల్కినట్లుగా • నతనిమనసు
తాఁక నాడుము నాకైన • దానవీవు, చెలియ... 39
సీ. ముదమున సామికి • మ్రొక్కితి నని దెల్పి
శీఘ్రింబు నాయిల్లు • సేరమనవె
యిందే వసింప నీ • కిచ్చ లేకుండెనా
నెలకైన నాయింట • నిలువుమనవె
నిలువఁగా నతనికి • నెనరు లేకుండునా
యీ రేయి రతిసుఖం • బీయుమనవె
రతిసుఖం బిడుటకా • రాముకు వెఱచునా
యింపుగా ననుఁ గౌఁగిలింపుమనవె
తే. యంతమాత్రింబునను భయం • బందెనేని
యాననమునైనఁ జూపి పొమ్మనవెనేడు, చెలియ ... 40
సీ. బాలప్రాయమునాఁడు • పతి యని యెఱుఁగక
యూఱక కొన్నినాళ్లుంటినమ్మ
పూవప్రాయపువేళఁ • బురుషుచెంతకు రాక
వెఱపుచేఁ గొన్నినా • ళ్లరిగెనమ్మ
కౌమరుప్రాయంబునఁ • గోర్కులు దాఁచిన
యంగునఁ గొన్నినా • ళ్లరిగెనమ్మ
గబ్బిప్రాయంబున • ఘనుఁడు నాయెడ నల్గ
నెనయక గొన్నినా • ళ్లేగెనమ్మ
తే. యుబ్బురంబైన జవ్వనం • బడవిఁ గాయు
నట్టివెన్నెల వైఖరి • వ్యర్థమయ్యె, చెలియ... 41
సీ. బలిమిని నేనయ్యె • పలుకరించుటగాని,
యాదరంబున మాట • లాడ నెఱుఁగ
ముందుగా నేనట్లు • ముద్దిడుటేగాని
యతఁడు నేర్చిమను మోవి • యాను టెఱుఁగ

కదిసి నేనటుగ్రుచ్చి • కౌఁగిలించు టెగాని
చేపట్టి యక్కునఁ • జేర్చు టెఱుఁగఁ
గ్రక్కున నేనటు • కదిసి కూడు టెగాని
కోరె యంగజుకేళిఁ • గూడు టెఱుఁగ
తే. పతులుసతులును దమపాణి•పదములట్లు
చూచికొనియుంట కేనోము•నోచికొనిరొ, చెలియ ... 42
సీ. ఇటుమల్లినను గౌఁగి•లింతునో నేనని
యువ్విలిమోముగాఁ • బవ్వళించుఁ
బ్రేమతో ముద్దిడఁ • బెట్టుదునో యని
మాయనిద్దురఁగొని • మలయుచుండు
బలిమిగా రతికి నేఁ • బైకొందునో యని
యెదకయ్యె నొయ్యనఁ • గదియఁజేయు
నరసి యే నేపూట • లాడుదునో యని
బిగి దుప్పటి ముసుంగుఁ • బెట్టికొనును
తే. దానిపై మోహమున నన్నుఁ • దలఁపఁ డనుచుఁ
దెలియ లేనైతి కపటంబు • తేఁటపడిమె, చెలియ ... 43
సీ. వడలు పాయసము లం•వాౘరి సేయింతుగా
విభుఁడు ప్రేమను గార•వించెనేని
బండ్లపైఁ జక్కెరఁ • బంచి పెట్టింతుగా
ప్రియుఁడు రమ్మని చేరఁ • బిలిచెనేని
గోపురంబులఁ బైఁడి•కుండ లెత్తింతుగా
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మఁ • గలిగెనేని
తిరుపావడ ఘటించి • తిరునాళ్లు సేతుగా
కరుణఁ బ్రాణేశుండు • గలసెనేని
తే. యనుచు దేవతలను వేఁడు•కొనినయపుడె
తలఁపు లోనఁగూడకుండునా • ధవళనయన, చెలియ... 44
సీ. విరులు చుట్టఁగఁబోఁగ • వేఁగ దిగ్గున లేచు
మడుపు లీఁబోవంగ • మాఱుమసలుఁ

బదము లొత్తఁగఁబోఁగఁ • బదములు విహమను
పడిగఁ బైకొనఁబోఁగ • వగలుచేయు
ముద్దిడంగనుబోఁగ • ముచ్చటలాడించు
మోవి నానఁగఁబోఁగ • ముసుఁగుపెట్టు
కౌఁగిలించఁగఁబోఁగఁ • గలకలమని నవ్వు
కదిసి కేళికిఁబోఁగఁ • గతలు సెప్పు
తే. మమత లలదాని పైనున్న • మర్మ మపుడు
దెలియలేనైతి మర్మంబు • దేఁటపడియె, చెలియ ... 45
సీ. వనితరో యీరేయి • వల్లభుఁ డిటువచ్చి
లెమ్మని నిద్దుర • లేపినట్లు
లేపిన ముసుఁగిడి • లేవక బిగువున
నలిగి యేఁ బొమ్మని • యున్నయట్లు
అన్నంత నామోవి • యాని కౌఁగిటఁ జేర్చి
మనవిగానను బతి • మాలినట్లు
బతిమాలఁగాఁ బ్రేమ • పట్టఁజాలక యప్డు
గ్రక్కునఁ బతితోడఁ • గలసినట్లు
తే. నూయకలఁగని బెఁగజాలి • మలసినాను
ఇట్లు రానేల రాక న • న్నేచువాఁడు, చెలియ... 46
సీ. చల్లవెన్నెలఁ గాయు • చంద్రబింబంబది
ప్రళయాగ్నినిభ మయ్యెఁ • బాపమేమొ
హాయిగాఁ బ్రాణుల • కనువైన తెమ్మెర
వేఁడివీఁపులవీచు • విధ మదేమొ
రమణీయశుకపికా • రావము ల్చెవులకు
విన నింపుగానట్టి • విధ మదేమొ
సరసమౌ సంగీత • సాహిత్యములఁ బ్రీతి
నెక్కొనకుండెడు • నిక్కమేమొ
తే. వింతలెల్లను నానాట • విస్తరించె
నొంటి నీరేయి విభుఁ బాసి • యుండుటెట్లు, చెలి... 47

సీ. ఈరేయి ప్రాణేశుఁ • డింటు వచ్చు నటంచుఁ
బల్కఁ గల్గునటేమ • భామలార
గబ్బిగుబ్బలనెదఁ • గదియనే నదుముచుఁ
బవళింపఁగలనటే • పడఁతులార
కుసుమాస్త్రకేళిని • గొసరి నాతమిఁ దీఱఁ
గలయఁగల్గునటేమొ • కాంతలార
వలరాజుతోఁ బోరు • వదలి నిర్భయముగా
నుండఁగల్గునటేమొ • యువిదలార
తే. విభునిరాకకు వేఁచి నే • విసివినాను
గడియయేఁడుగ నెన్నాళ్లు • గడుపుదాన, చెలియ ... 4

సీ. ప్రాణేశుకౌఁగిటఁ • బవళించునట్లుగాఁ
గాంతరో నేఁ గల • గంటినమ్మ
యలుకఁ దీర్చుచుఁ జెక్కు • లదిమి ముద్దిడి మ్రొక్కఁ
గడువేఁడె నని కల • గంటినమ్మ
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మ • గాఢరతులఁగూడి
కళ లంటెనని కల • గంటినమ్మ
కమ్మనా తేఱఁ బంటఁ • గసిదీఱ నొక్కఁగాఁ
గలిగితి నని కల • గంటినమ్మ
తే. మొన్నఁ డిటువంటికలల నే • నెఱుఁగనమ్మ
యెచట నున్నాఁడో రాఁడాయె • నేమిసేతు, చెలి... 4

సీ. పతివచ్చె ననువార్త • పలికినసఖికి నా
పతకంబు మెడవేతుఁ • బంకజాక్షి!
సొంపుగా విభుమోముఁ • జూపిన నాముద్దు
టుంగరం బిత్తునే • యుత్పలాక్షి!
యతని నాతో మాట • లాడింప వజ్రాల
కమ్మల నిత్తునే • కంబుకంఠి!
గ్రక్కునఁ బ్రాణేశు • కౌఁగిలిఁ జేర్చిన
చిలుకతాళిని నిత్తు • చిగురుఁబోఁడి!

తే. వానిఁ గలిసినఁ జదివేలు • వచ్చినట్లు
సామ్ము లిపి యేమిగణ్యమే • సుందరాంగి!, చెలి... 50

సీ. నిలిచినచోటను • నిల్వనీదు మనంబు
మున్నె నిద్రాహార•ములు దొలంగె
నీరీతి రేవగ • లెమరెమ రీక్షింప
నట తలవాకిలే • యయ్యెనిల్లు
పట్టగా రానినా•బలుగుబ్బలవి నిక్క
కడువడిఁ బగిలించెఁ • గంచుకములఁ
గడు విరహాగ్నికిఁ • గాఁగి ముత్తెపుసరుల్
వన్నెఁ దక్క కఱంగి • సున్నమయ్యె
తే. వానిఁ దలఁచక యుండ నా•వశముగాదు
తలఁచి తమిహెచ్చఁగా నోర్వఁ•దరముగాదు, చెలి... 51

సీ. నిదురఁ బోవుచు లేచి • నిట్టూర్పు లధికమై
నెలఁత నేఁ డేమొ క•న్నీరునించె
చివ్వనఁ దా లేచి • చిలుకను ముద్దాడి
దయ యుంచు మని చాలఁ • దల్లడిల్లె
వీణానినాదముల్ • వెలఁదులచేరికల్
కడుభారము లటంచుఁ • గళవళించెఁ
జెక్కిటఁ జేఁ జేర్చి • చింతించు నూఱక
తలవాంచి కాల భూ-తలము వ్రాయు
తే. నన్నపానీయములఁ గోర•కున్న దకట!
యతివ యొక వేళఁ దెగునేమొ•యంచుఁ దెలిపి, చెలి... 52

సీ. బలువిసం బైనట్టి • పాలుచక్కెరఁ ద్రావఁ
బోవ వేఁడెదరు పూఁ•బోఁణులార
వెన్నెలచిచ్చులో • వే నురికెద నన్న
నడ్డముల్ వచ్చెద • రతివలార
తెగువతోఁ బూదండఁ • దీసి మత్తుకనిడఁ
జూచి వద్దనెదరు • సుదతులార

బాగుగా నెదను బూ•బాకునఁ గ్రుమ్మఁబో
దోలఁగింతు రిద్దాని • చెలియ
తే. యోర్చి యిఁకఁ బ్రాణములు బొంది • నుంచఁదరమె
నెనరు మీకును లేకున్న • నిల్వఁదరమె?, చెలియ... 53

సీ. శుకమ నావెతఁ జూచి • చూడన ట్లున్నావు
ప్రియుని రమ్మని వేఁగఁ • బిల్వరాదె!
పికమ నావెతఁ జూచి • ప్రేమలేకున్నావు
విభునకు నెన రుట్ట • వేఁడరాదె
హంస నావెతఁ జూచి • యట్లూఱకున్నావు
పతిమతిఁ గృపపుట్టఁ • బల్కరాదె
తేఁటి నావెతఁ జూచి • మాటాడ కున్నావు
శ్రీహరితోఁ జేరి • చెప్పరాదె
తే. యనుచు బతిమాలునది యని • మనము సోఁకు
నట్లు సెప్పంగఁ గరుణతో • పచటి కిడ్డు, చెలియ... 54

సీ. పంచశరుం డొక • ప్రళయకాల యముండు,
చిన్నవెంపుడుచిల్క • చిట్లకొఱవి
నాకు నీకోయిల • చంపెడు పెనుభోయ,
సంతరించిననెమ్మి • చాడికత్తె
పవనంబుచూడ నిర్భరమైన మృత్యువు,
వెనుఁగొన్నతేఁటులే • యనలరాశి
ప్రియమైన హంసల • పిల్లలు పిడుగులు,
చందురుండు పగవాఁడు • శత్రుకోటి
తే. మైనవారలెకాని నా•కైనవారిఁ
గాన నేనెట్లుజీవింతు • వానిఁగనక, చెలియ... 55

సీ. జఘనం బబ్జబింబంబు • లందుఁ జొప్పింతును,
తరుపత్రముల శుక•తతిని వైతు
కోకిలంబులఁ జెట్టు•కొనల నుండఁగ బంతు,
నడవిఁ గల్పుదు మయూ•రావళులను

తెమ్మెర నురికింతు ♦ దిగ్దేశములమీఁద,
జాబిల్లిఁ గిళలంట ♦ నమయఁ జేతు,
వంటలఁ గలువుదు ♦ మన్మథుశరములు,
వేఁగ నచ్చటి కేఁగి ♦ విభునిదెత్తు
తే. నిపుడు పిల్వఁగ రాకున్న ♦ నిందువదన
యే ననినపంతముల నిర్వహింతు ననవె, చెలియ... 56
సీ. విభుని నేఁ బిలిచెద ♦ వేఁగ రాఁడామెనా,
యతినిష్ఠురోక్తుల ♦ నందుఁగాక
రాక నన్నేచి మా ♦ ర్వాలికిన విడుతునా,
తెగువఁ జేతులఁ బట్టి ♦ తెత్తుఁగాక
యంతలో నది చూచి ♦ యడ్డంబు వచ్చెనా,
వెఱవక జడఁగొని ♦ వేతుఁగాక
యిందుల కతఁడు వహించుక వచ్చెనా,
దానితోఁ దగవాడఁ ♦ దలఁతుఁగాక
తే. యింతమాత్రంబుసేత నా ♦ కెంత గనఁగ
నిలను మర్యాద కోర్చితి ♦ నింతదనుక, చెలియ ... 57
సీ. ప్రాణేశుఁ జేతేరఁ ♦ బారఁజూచుచు వాని,
కెను రేగి కౌఁగిట ♦ నిడఁగ లేదొ
యాకుమడుపుల నిచ్చు ♦ నంతలో దమి హెచ్చి,
కరుణతో నుపరతిఁ ♦ గలియ లేదొ
యలిగి నే ముసుఁగిడి ♦ యటు వవ్వళించిన,
విభుఁడు వల్మఱు నన్ను ♦ వేఁడ లేదొ
ప్రియుఁ డల్కఁగొనినన్ను ♦ వెసడాయక యయున్న,
నక్కునఁ జేర్పనే ♦ మొక్కలేదొ
తే. నాఁటివారము గామె యీ ♦ నాటికిట్లు
దైవ మతనికి ననుఁగాని ♦ దానిఁ జేసె, చెలియ ... 58
సీ. కోకిలలవిడాలఁ ♦ గూయసాగు నటంచుఁ,
బదమున్నతర్థాయిఁ ♦ బాడ వెఱతు

చిలుక లాలించినఁ • జెలఁగి పల్కెనటంచు,
నోటఁ దిన్నఁగ మాట • నుడువ వెఱతు
నళులు గన్గొన్న ఝంమ్మనుచు మ్రోగునటంచుఁ,
బయ్యెద జడనుండి • పావ వెఱతు
నిలువెళ్లఁగాఁ జంద్రుఁ • డేచ్చి కాయునటంచు,
వేఁడివెన్నెలఁ జేతి • చూడ వెఱతు
తే. వీరికెల్లను నేనింత • వెఱచుచున్న
వేడ్కలోద వెను వెఱపించి • వెంబడింప, చెలియ... 59
సీ. మరుని కేతనములు • మదువులఁ గలవంచు,
నందుల జలకంబు • లాడ వెఱతు
దర్పకు ధనువిక్షు • దండంబటంచు నే,
నేమఱి చెఱకుపై • రెత్త వెఱతు
విరులెల్ల మన్మథు • శరజాలము లటంచు,
ముచ్చటకై పూలు • ముడువ వెఱతు
భావజుచతురంగ • బలము లటంచును,
శుకపికనికరముల్ • సూడ వెఱతు
తే. నోట వలరాజటంచును • నుడువ వెఱతు
వెఱచుచున్నను దయలేక • వెంబడించె, చెలియ... 60
సీ. పక్షులఁ దిట్టుట • పాపమంచు గణింప,
నెదురొడ్డి కూయుట • లేమిపికమ ?
యందఱ కనుకూలి • వని దయఁ జూచిన,
తాపంబు పెంచెదు • తగదు చంద్ర!
ప్రాణికోట్లకు నీవు • పరమాప్తుఁడని యోర్వ,
నెప్పుడు వీఁచెద • వేమిపవన ?
తనయుని శపియింపఁ • దగదని తాళిన,
నిషువుల నేసెద • వేమిమదన ?
తే. యనుచు నయభయముల నెన్ని • యనిన వినరు
బహుదురాత్ముల కేటికి • పారసంబు. చెలియ 61

సీ. అడవిలో నొకవృక్ష • మైపుట్టఁగావచ్చు,
బుడమిపై నాఁడుదై • పుట్టరాదు
కడుఁబెద్ద చట్రాయి•గాఁ బుట్టఁగావచ్చుఁ,
బుడమిపై నాఁడుదై • పుట్టరాదు
పురుషులై పలుమారుఁ • బొదలి పుట్టఁగవచ్చుఁ,
బుడమిపై నాడుదై • పుట్టరాదు
పక్షులై మృగములై • పఱఁగఁ బుట్టగవచ్చుఁ
బుడమిపై నాఁడుదై • పుట్టరాదు
తే. ఆడుదై పుట్టనీచమౌ • నదియుగాఁక
పురుషు నెడఁబాయుదానిదౌ • పుట్టుకేల?, చెలియ...62

సీ. మహినూతనప్రియుల్ • మగవాండ్రటందురే,
యామాట నిక్కువం • బయ్యెనమ్మ
ననఁబోడి పురుషుల • నమ్మరాదందురే,
యామాట నిక్కువం • బయ్యెనమ్మ
యాఁడుది వలచిన • హాయి లేదందురే,
యామాట నిక్కువం • బయ్యెనమ్మ
యధిపులు కఠినాత్ము • లని జనులందురే,
యది యిప్పు డనుభవం • బయ్యెనమ్మ
తే. సకియ ! పెద్దలమాటలు • సటలు గావు
పలుకు సామ్యంబులెల్ల ద•బ్బరలు గావు, చెలియ... 63

సీ. వలపుమం దెఱిఁగినవారిని నడుగరే !,
దానిపై మోహంబు • దఱుఁగుఁగాని
మంత్రజ్ఞులను బిల్చి • మక్కువ లడుగరే !,
వేగంబ యలదాని • విడుచుఁగాని
మచ్చుఁజల్లెడుయుక్తి • మఱుఁగుగా నడుగరే !,
యూఱక ననుఁ బాయ • కుండుఁగాని
యంత్రమ్ములను వేయు•నధికుల వెదుకరే !,
వడిగ నాయింటికి • వచ్చుఁగాని

తే. యయిన నొకసారి పోయిరా ♦ వమ్మ! విభుఁడు
రాకయుండిన నాకర్మ ♦ మే కదమ్మ, చెలియ... 64

సీ. కమలాక్షు వా తెఱఁ ♦ గసిదీఱ నొక్కి నా,
పగఁ దీర్చికొందునో ♦ పంకజాక్షి !
చన్నొత్తులనె యుర ♦ స్థలము నొప్పించి నా,
చలము సాధింతునో ♦ చంద్రవదన !
యక్కున బిగఁజేర్చి ♦ యలయికఁ గ్రమ్మించి,
మచ్చర మ్మీడేర్తు ♦ మందయాన !
వాఁడిచూపులఁ జూచి ♦ వరుని వేఁడగఁ జేసి,
కోర్కులఁ బోషింతుఁ ♦ గోమలాంగి !
తే. ఆతఁ డిచ్చటఁ జేరిన ♦ యంతలోన
నేను బలికినశపథముల్ ♦ నిర్వహింతు, చెలియ... 65

సీ. బలువిడి బోయఁడై ♦ పగలు సాధించునే,
మీనధ్వజుని కెంత ♦ మిడిసిపాటొ !
గబ్బిచన్గవలపై ♦ ఘనసాయకంబులఁ,
గ్రుమ్మువీనికి నేమి ♦ దిమ్మవట్టె ?
మర్మస్థలం బంట ♦ వాఁటి తూపులేయునే?,
తనయింటిపైఁ గీడు ♦ దలఁచు ద్రోహి
పతులను బాసిన ♦ భామల నేఁచునే,
రేఁడుతోడునఁ బుట్టఁ ♦ డమ్మ వీఁడు
తే. దలిరుబోఁడులయును రింత ♦ దాకదయ్యొ
విభుఁడు రాఁడని దెలిసి నా ♦ వెంట నంటె, చెలియ... 66

సీ. వాసుదేవుని వివి ♦ వక్షోరుహంబులు,
వీనిపై బాణముల్ ♦ వేయఁబోకు
నామానధనము శ్రీ ♦ నాథున కిచ్చితి,
నిఁక బోఁకముడి వీఁడ ♦ వేయఁబోకు
మతనికిఁ దనయుండ ♦ వౌదువునీకు నేఁ,
దల్లిని నాపేరుఁ ♦ దలఁపఁబోకు

జనని తిట్టినతిట్టు • చయ్యనఁ దగులును
గుణహీనతను దిట్లు • గుడుపఁబోకు
తే. మనుచు మరుఁ డనుద్రోహి నే•మనిన వినఁడు
వాని మెఱుఁగనియూహాప•వర్తనుండు, చెలియ... 67

కడు బీదకును బెద్ద•కత్తియుఁ గలదుగా
నాకలు విరులమ్ము•లామెఁ గదర!
చెంచువానికినైన • మించువిల్లుండంగ
నయ్యారె? తుంటవి•ల్లామెఁ గదర!
కొఱగానివానికి • గుఱ్ఱంబు లుండఁగ
నడవిచిల్కల నెక్కు • నామెఁ గదర!
యాకృతు ల్ప్రాణుల • కందఱకుండంగ
నంగహీనపుబ్రిదు • కామెఁ గదర!
తే. చెడుగుబుద్ధుల నీవిట్లు • సెడితివంచు
నెన్ని చెప్పిన మత్సరం • బెచ్చెనమ్మ, చెలియ... ౬౮

సీ. చిలుక నెక్కియు నిన్ని•చేష్టలఁ జేయునే!,
తురగ మెక్కఁగనుమై•మఱచు నేమొ!
తుంటవిల్ చేఁబూనఁ • దుర్విళ్లుపాట్లబ్బెనే!,
ధనువైన నెఱిపోఁ • దలఁచునేమొ?
ననవిరిశరముల • గని విఱ్ఱవీఁగునె!,
ఘనవజ్రమైనఁ గ • న్గానఁడేమొ?
కాయంబు లేకయే • కడుఁ బోరుచుండునే!,
మేనుగల్గినయంత• మిడిసిపడునొ?
తే. మగలఁ బాసినస్త్రీలపై • మచ్చరించి
యేఁచఁ జొచ్చినమదనున • కేటిలజ్జ, చెలియ...

సీ. నామీఁద నేయుసూ•నశరంబు లతనిపై,
నెందుకు వేయవ•దేమి మార?
నావంటిదే యల•నలినాక్షి దానిపై,
నిగురుఁదూపుల వేయ • వేమి మార?

యండజ మొకనవు • మోహము దానిపై,
నింత యక్కటికం బ•దేమి మార ?
మగలను బాసిన•మానినీమణులను,
హీనత బాధించు • టేమి మార ?
తే. యనుచు రోషమున్ రానెగ్గు • లాడి విసివె
వానికౌర్యంబు నాయెడ • వదలఁడమ్మ చెలియ... 7(
సీ. మగవాఁడవై సరి•మగవాండ్రఁ బోరక
యాఁడువారల నేఁతు•వటర మదన !
వీరులపై శర • వేగంబు సూపక
యాఁడువారల నేఁతు•వటర మదన ?
పరమేశుఁ దాఁకి వై • రము దీర్చుకోలేక
యాఁడువారల నేఁతు•వటర మదన !
మాగోప్యసీమ నీ•మందిరంబై యుండ
నాఁడువారల నేఁతు•వటర మదన !
తే. యయ్యయో ! యింతసిగ్గు లే • దయ్యెననుచు
అట్టుఁ జేసిన వానికి • రాదు బుద్ధి, చెలియ... 7
సీ. వేఁడెద నినుఁగోరి • వేఱుపల్కనుమార !,
వయ్యెద నెదమీఁద • వెయ్యనీర !
మొక్కెద నిదె పోఁక•ముడిపిడెరా మార !,
కట్టుఁగొంగైనను • గట్టనీర !
విన్నవించెద నీకు • విరితూపు లేయకు,
మైగాయములనైన • మాననీర
బతిమాలి విసిఁగితి • బడలినానుర మార !,
తఱుచైనయలుకలఁ • దఱలనీర
తే. మనవిచేకొను మొక్కెద • మారమార !
యనఁగ శరవర్షమంతంత • నతిశయించె, చెలియ...
సీ. పాణేశు కౌఁగిటఁ • బాయకుండిననాఁడు,

మగఁడు నాపైఁ జాల • మమత నించిననాఁడు,
నీమార్గణము లేడ • నీళ్లఁగలిసెఁ ?
గవకూడి వసి నేను • గడుసుఖించెడునాఁడు,
చెఱుక! నీబలమేడ • చెట్లఁగలిసె?
వేడుక రతి నన్ను • విభుఁడు గూడెడునాఁడు,
నీధ్వజరాజ మే•నీటఁ బడియె ?
తే. నోరిమన్మథ ! నేనొంటి • నున్నవేళ
వేయవద్దనఁగాఁ దూపు • లేయుచమ్మ, చెలియ... 73

సీ. నినుఁజూడ రోసెగా • నీచుఁడ! నీతండ్రి,
యవతారములఁ దాల్ప • నవనిఁజేరె
నినుఁ గన్నపిదప నొం•దినయపకీర్తికై,
మెచ్చిన కార్చిచ్చుఁ • జొచ్చెఁ దల్లి
నీమాట వినలేక • నిర్మోహపాశమై,
ప్రాణికోటులనోళ్లఁ • బడియె వదిన
నినుఁ గొన్నవగచేత • నీయన్నతలఁ బట్టి,
కోపంబుచే శూలి • కొట్టివైచె
తే. ననుచు సిగ్గంతఁ గడిగి ద్రో•హముల నెన్న
మత్సరంబెచ్చి తనమోజ • మానలేఁడు, చెలియ ... 74

సీ. నీకుఁ గేతనమూట • నీచత్వ మనికదా ?,
వడిగ చావున కొప్పి • వలను బడుట
నీకు బలంబాట • నీచత్వమనికదా ?,
నగుఁబోటులనకె కా•నలను బడుట
నీకుఁ దావిల్లాట • నీచత్వ మనికదా ?,
తెగువలకోర్చి గాఁ•నుఁగులఁ బడుట
నీకుబాణము లాట • నీచత్వ మనికదా ?,
పవమానసంగతి • నవనిఁ బడుట
తే. యిన్నిఁటికి సిగ్గు రాఁగ నీ • కేలరాదు
మార! యిఁకఁ బోరవలదన్న • మానఁడమ్మ, చెలి...75

సీ. భామల నిక్కించఁ ♦ బట్టిగదా చంద్ర!
నీలోఁ గలంకంబు ♦ నిలిచిపోయె
తరుణులయును రట్టు ♦ తాఁకికదా చంద్ర!
దిగ్దేశములఁ జెడి ♦ తిరుగవలసె
తెఱవల నెల్ల బా♦ధింపఁగాఁగద చంద్ర!
దినదినంబును గళల్ ♦ దీసిపోవు
నబలలు నీరాక ♦ కడలఁగాఁగద చంద్ర!
రేయిఁ జోరుఁడవై చ♦రింపవలసె
తే. రాజ వయి స్త్రీలఁ బోరాడ ♦ రాదటంచు
నెన్నిఁజెప్పిన మత్సరం♦బేల మాను, చెలియ... 76

సీ. మగువల నేఁచుట ♦ మారుతమా చూడు
మెపుడు నిల్వక పరు♦గెత్తవలసె
సుపిదల బాధింప ♦ నోపవనా! చూడు
మేఁటిపాములు నిన్ను ♦ మ్రింగవలసెఁ
గాంతల బాధింపఁ♦గాఁ దెమ్మెరా! చూడు
మట్టినీకడుపునఁ ♦ బుట్టె కోతి
గరితల నెరియింపఁ♦గా సమీరా! చూడు
బహుదేహములు సొఱఁ♦బడుట లాయె
తే. ననుభవించియు నీస్థితు♦లరయవీవు
మానుమన్న స్వభావంబు ♦ మానఁడమ్మ చెలియ... 77

సీ. బొట్టుగట్టినపతి ♦ పోఁద్రోయుచుండఁగాఁ
బత్తులఁ దిట్టిన ♦ ఫలమదేమి?
మగఁడు నామీఁద సమ్మతి లేక యుండఁగాఁ
బవనుని దూషింప ♦ భాగ్యమేమి?
పరసుఁడు చలమిట్లు ♦ సాధించుచుండఁగా
బుష్పాస్త్రుఁ దెగడినఁ ♦ బుణ్యమేమి?
అతిప్రియతముఁ డిట్లు మతి నెన్నకుండఁగాఁ
జంద్రుని నిందింప ♦ సౌఖ్యమేమి?

తే. చెలువుఁ డీలాగు నన్నిట్లు • సేయుచుండ
వారివారిని దిట్టిన • వచ్చునేమి? చెలియ... 78

సీ. వానివౌ శరములు • వడిగఁ దిట్టెదమన్న
నవియుండదఱకు యోగ్య • మైనవిరులు
వానిబలంబుల • వడిగఁ దిట్టెద మన్న
చెట్లకొమ్మల నుండు • జీవకోట్లు
వానిగేహము పాడు•పడఁ దిట్టుద మటన్న
మనమానములె వాని • మందిరములు
వానినే పాడుగా • వడి దిట్టుద మటన్న
నన్నేలు శ్రీహరి • చిన్నికొడుకు
తే. తెలిసె నీకమీఁద నంగజుఁ • దిట్టరాదు
వలపెఱుంగనివిభు నన • వలెను గాని చెలియ... 79

సీ. తలిదండ్రులను బాసి • దానొకరింటిలో
బెరిఁగినవానికిఁ • బ్రేమగలదె?
మాటమాత్రిన మేన•మామను జంపిన
కఠినాత్మునకు నేల • కరుణపుట్టు?
జారచోరులుగాంచు • జాతల మెలఁగెడు
పలుగాకి కిపుడేల • భ్రమలుపుట్టు
నాఁకట నెంగిలి • నైన రోయక తిను,
దుర్బుద్ధి కేలాగుఁ • దోఁచు మమత?
తే. ఇట్టివాఁడని మావరి • కెఱుకలేక
యిచ్చినప్పుడు గుణదోష • మెంచనేల? చెలియ... 86

సీ. గోవులఁ గాయఁగా • గోపాలుఁడితఁడని
పెంపఱఁ బిలిచెడి • పేరు గలిగె
వసుధలోపలఁ జంద్ర • వంశసంభవుఁడౌట
విఱివియౌ కులముకుఁ • గఱయుఁ గలిగె
మేటిబలాఢ్యులు • మిత్రులై యుండియు
రాజ్యాధిపత్యంబు • పూజ్యమయ్యె

నలజోగిగములకు • నణఁగినవాఁడౌట
కేవల మానవ•కీర్తి గలిగె
తే. నిట్టివాఁడని గుణముల • నెన్నుచున్న
సిగ్గుతలయెత్తనీ దేమి • సేతునమ్మ చెలియ... 81
సీ. తల్లిదండ్రులయింటఁ • దనపొట్టపూడక
గొల్లవై గోవులఁ • గోరికాచె
నంతటనైనఁ బే•రాఁకలి దీఱక
లీలవెన్నను దొంగి•లింప సాగె
కట్టుబట్టలు లేక • కాంతలు వదలిన
యంశుకంబులఁ బొంచి • యపహరించె
జారచోరత మీఱి • సంచరించు చునుండి
చెట్టుకుఁ దల్లిచేఁ • గట్టఁబడియె
తే. ననుచు నీవల వింటినే • యమ్మ చెల్ల
మున్నె యెఱిఁగిన నేనేల • మోసపోదు చెలియ... 82
సీ. సిగ్గింతయును లేక • చెల్లెలికై దాను
గుంటెనకాఁడైన • కొంటె యితఁడు
తన మేనమామను • దయయింతయును లేక
దుంచివైచిన గొప్ప • ద్రోహి యితఁడు
జనకునితోఁబుట్టు • చనరాదు నాక యూ
రాధను బొందిన•వ్రాచ్యుఁ డితఁడు
కులసతీమణు లింటఁ • గోరిచరింపఁగాఁ
బరభామలను బొందు • పాపి యితఁడు
తే. అనుచుఁ జెప్పుట నిజమయ్యె • నతివలార !
యిట్టికఠినాత్ముఁ డీఁక నన్ను • నేచఁడటరె చెలియ...83
సీ. ఎప్పుడే నల్లఁగా • నింట నుండెడివాఁడు
దిన్నఁగా నలుకల • దీఱసాగె
పలుకక సైగలఁ • బనులు సెప్పెడివాఁడు
చెప్పకమును పనుల్ • సేయసాగె

కొదువల నెన్నుచుఁ • గోపగించెడువాఁడు
పడఁతి గోపింపఁ దా • నడలసాగె
మ్రొక్కి వేఁడినగాని • మోడి మాననివాఁడు
పెక్కులు బతిమాలి • వేఁడసాగె
తే. వలపుమందులు దలకెక్క • వలచెఁగాక
లేక యుండిన వాఁడేల • రాకమాను, చెలియ... 84

సీ. పొరుగింటి కేలాగు • పోతివిరా! యంచు
జడఁగొద్దిఁ గొట్ట నా • కెపద రాదు
మాపు లాయింతితో • మాట లాడితి వంచు
మూఁతులు బొడువ నా • చేతఁ గాదు
దక్కినమగనిచే • మ్రొక్కించుకొనియెడు
చాతురి నేర్పు నా • చేతఁ గాదు
రతిఁ గోరి పతి నన్ను • బతిమాలుకొనఁజేయు
చేతలవగలు నా • చేతఁ గాదు
తే. గనుకఁ దా నందు నున్నాఁడు • కరుణ లేక
యట్టినడవడి నాచేత • నౌనఁటమ్మ, చెలియ... 85

సీ. కులగోత్రములు రూపు • గుణము మానము లేని
వానికి నన్నియ • వచ్చునఁటరె ?
నీఁటుగఁ బాముపై • నిద్రించు మాయల
వానికి నన్నియ • వచ్చునఁటరె ?
యెల్లజోగులమనం • బిల్లుగాఁ దిరిగెడు
వానికి నన్నియ • వచ్చునఁటరె ?
వావివర్తనబంధు • వర్గంబు లేనట్టి
వానికి నన్నియ • వచ్చునఁటరె ?
తే. యిట్టివానికి మావార • లిచ్చినపుడె
వడ్లతోఁ దట్ట యెండఁగా • వలసివచ్చె, చెలియ... 86

సీ. మరుశరవృష్టిచే • మాలేమ దాళక ।
విరహాగ్నివెతలను • వేఁగె ననవె ?

వేఁగించుచో మోహము ♦ వెలవెలఁ బోవుచు
చిడిముడిచే శయ్యఁ ♦ జేరెననవె ?
చేరి తా నటు చల♦చిత్తయై వాకిట
నీకై నిరీక్షించి ♦ నిలుచు ననవె ?
నిలిచి నీరాకలు ♦ నిక్కముల్ గామికి
మించినతమిఁ దత్త♦రించె ననవె ?
తే. తత్తరంబున జీవముల్ ♦ దాళ వనుచు
నెనరుఁగాఁ దెల్పఁజాలిన ♦ నెఱఁతవీవు, చెలియ ... 87

సీ. విరితూపులను గల్గు ♦ వెతల నీవి యెఱుంగు
మేటివెన్నెలకాఁక ♦ మే నెఱుంగు
చనుఁగవపొగరుల ♦ సడి రైక యెఱుఁగును
తమితమకంబు చి♦త్తం బెఱుంగు
కడువడి మైకాఁక ♦ కట్టువల్వ యెఱుంగు
కలఁగి వేసటపాటు ♦ గం డ్లెఱుంగు
నచ్చోటిపులకల ♦ ననఁ బొందొడ లెఱుంగు
మఱిమఱి కోర్కుల ♦ మన మెఱుంగు
తే. నీకుఁ దెలియునో నావెత♦ల్నాకుఁ దెలియుఁ
దడవుసేయక నీ వతి♦త్వరితముగను, చెలియ... 88

సీ. ప్రాణేశుఁ డూరికిఁ ♦ బయనమై పోవంగఁ
దోడఁబడి యెను రాముఁ ♦ డుమ్మనైతి
నది యెంత కాదని ♦ యశ్రద్ధఁ జేసిన
బోరానిదిన మని ♦ బొంకనైతి
నాపైపై మరు లున్న ♦ దని యేగఁజూచిన
నడ్డమై నిలిచి పో♦రాడనైతి
కపటమైత్రినిఁ జూపి ♦ కదలిపోఁ జూచిన
పొంచి నే మఱి వెంబ♦డించనైతి
తే. నీయుపాయంబు లానాఁడె ♦ యెఱిఁగియున్న
వెఱ్ఱిదాననె నే నేల ♦ విడుతు నతని, చెలియ... 89

సీ. జంటఁ బాయక పైఁడి • కంటులు దిరుగఁగాఁ
జూడ నామది కెంతొ • వేడు కయ్యె
పెంటిపై మరులూని • వెన్నాడుమృగములఁ
జూడ నామది కెంతొ వేడుకయ్యె
రతిబంధముల చిత్ర • రచనలప్రతిమలఁ
జూడ నామది కెంతొ • వేడుకయ్యె
కవఁగూడి సతిపతుల్ • గలసి పెనంగుటల్
విన్న నామది కెంతొ • వేడు కయ్యె
తే. నెట్టిజంతువులందైన • నెవరికైన
విభులు మగువల నిట్లేఁచ • వింటిరఁటరె, చెలియ... 90

సీ. మగని నేమఱక బల్•మమతల నుండెడి
సతు లెట్టివ్రతములు • సలిపినారొ
పతికి నెంతోప్రాణ•పదముగా నుండెడి
వనిత లేవరములు • వడసినారొ
ప్రాణేశుకౌఁగిటఁ • బాయకయేయుండు
నింతు లేదానమ్ము • లిచ్చినారొ
ప్రియునితో రతికేళిఁ • బెనఁగుచు నుండెడి
చేడె లేధర్మముల్ • సేసినారొ
తే. యేమి నేఁ గోరి నోఁచితి • నిందువదన?
యలుక విభునికి నానాఁటి • కతిశయించె, చెలియ... 91

సీ. అతివల సారెకు • నంపి వేసారితిఁ
బ్రత్యుత్తరంబైనఁ • బలుకఁడయ్యె
వరుసఁగా ఖచితముల్ • వ్రాసి పుత్తెంచితి
బాగుగా నవి చేతఁ • బట్టఁడాయె
ప్రియురాండ్రచేతఁ జె•ప్పించి వేసారితిఁ
గట్టిమదిఁ జెవిఁ • బెట్టఁడాయె
నితరుల కేలంచ • మిచ్చి నే బడలితి
నందులఁ బతి కల్క • లధికమాయె

తే. నతనియిటురాక లవి మిథ్య • లమ్మలార!
నాతి! నాప్రియురాలిత•నంబుఁ గనవె, చెలియ... 92

సీ. మున్ను వాఁ డొకనాఁడు • నన్ను ముద్దిడు మన్న
మో మటు ద్రిప్పితి • మోహనాంగి!
బతిమాలి పాలిండ్లఁ • బట్టనీయవె యన్న
కసరి కొట్టితినమ్మ • కంబుకంఠి!
కుసుమాస్త్రకేళిని • గూడ రమ్మని వేఁడ
మాటాడనైతినే • మందయాన!
యలుఁగకువే యంచు • నటు కౌఁగిటను దార్పఁ
దాళుకొమ్మంటినే • ధవళనయన!
తే. యాస లెఱుఁగనిపాపాత్ము•రాలఁ గనుక
ప్రాణపదమైన విభు నెడఁ•బాయవలసె, చెలియ... 93

సీ. మోస మాయెనుగదే • మోహాతిశయమునఁ
బతి యెంత వేఁడినఁ • బలుకనైతి
పలుకక వానిపై • యలుకచే నే నున్న
నుంచరైతిరి వాని • నుపచరించి
యుపచరింపక మీర • లూరకుండిననేమి
నేనె రారా యని • నిలువరాదె
నిలువ నాలో నేర్పు • నేర్పు లేదాయెఁబో
ప్రేమతో నతఁడె న•న్నిలువరాదె
తే. యన్ని యననేల? యొకరి నే • ననఁగ నేల?
తిన్నఁగాఁ జేరి నెనరు రా • విన్నవించి, చెలియ... 94

సీ. కరుణతో నిటు మళ్లి • కౌఁగిలింపు మటంచు
ముదముతోఁ బలుమఱు • మ్రొక్కినమ్మ
యధరబింబముఁ బంట • నదుమని మ్మనుచును
మనవిగా ననుఁ బ్రతి•మాలునమ్మ
గట్టిగాఁ జనుఁగవఁ • బట్టనీయవె యంచు
వేమాఱులకు నన్ను • వేఁడునమ్మ

కాముకేళి నొకింత • కలయనీయ మటంచు
విభుఁడు మెల్లన విన్న•వించు నమ్మ
తే. యిట్లు మరులైన ప్రాణేశు • నెట్లుపాసి
మందబుద్ధిని నేనెట్టు • లుందునమ్మ చెలియ... 95

సీ. ప్రాణేశుఁ బాసినఁ • బ్రాణంబులుండవు
నెలఁత! నామే నెట్లు • నిలుచునమ్మ
పొత్తునఁ నేకాని • భుజియింప నొల్లనే
యిపుడన్న మెటు రుచి•యించునమ్మ
కౌఁగిలి వదలినఁ • గడుఁ దల్లడిల్లును
నిదుర కంటికి నెట్లు • పొదలునమ్మ
యలిగినఁ బలుకుమా • యని వేఁడుకొంనునే
యువిదరో! మన సెట్లు • లోర్చునమ్మ
తే. రమణ నేనేమొ బలుచట్లు•తాయినమ్మ
మఱచి నావలె బ్రిమక దే•మగువమైన చెలియ... 96

సీ. పతిరూపరేఖలు • పటమున వ్రాయించి
సొంపుగాఁ గండ్లకుఁ • జూపరమ్మ
హారికరంబులగంధ • మప్పళించుక వచ్చి
పొంకంబుగాఁ జండ్లఁ • బూయరమ్మ
మాధవుపలునొక్క • మడుపులఁ దెప్పించి
యొప్పనా కెమ్మోవి • నుంచరమ్మ
నలినాయతాక్షుని • నఖములఁ దెప్పించి
చిగురుఁగెంజెక్కులఁ • జేర్పరమ్మ
తే. పొడము మదనాగ్ని యెందుల • నణఁగ దింక
నూఱకయ మీరు జాగు గా • నుండఁదగునె చెలియ...97

సీ. వలపుమై నాప్రాణ•వల్లభుఁ గూడిన
పడఁతి వేయేఁడులు • బ్రదుకవలయు
కమలాక్షు నెప్పుడుఁ • గౌఁగిటఁ జేర్చిన
కాంత కైశ్వర్యంబు • గలుగవలయుఁ

బతితోడఁ జౌశీతి • బంధముల్ పచరించు
పల్లవపాణి వ • ద్దిల్లవలయుఁ
గృష్ణదేవుని రతిఁ • బ్రీతి నొందించిన
యుపిద చల్లఁగ నెప్పు • డుండవలయు
తే. ననుచు దీవించరమ్మ యెం • తైనవాఁడు
సంతసించినఁ జాలు నీ • సారికైన చెలియ... 98

సీ. పారిశేశుఁ డెచ్చటి • పరభూమి నున్నాఁడొ
యాదిత్యదేవ! కా • పాడుమయ్య
సరసుఁడు వలచి యే • సఖచెంత నున్నాఁడొ
యుడురాజ! పోషించు • చుండుమయ్య
పసుఁ డేనెలంతకై • వనమున నున్నాఁడొ
సేవింతుఁ బవన! ర • క్షింపుమయ్య
ప్రభుఁ డేవెలందిని • విడఁజాలకున్నాఁడొ
యనిమిషోత్తములార! • యరయరయ్య
తే. యనుచు వేఁడెద నాతఁ డెం • దైన లెస్స
నున్నదే చాలునేఁ జూడ • కుండలేను చెలియ ... 99

సీ. అతిదయాపరమూర్తి • యగుకేశవుండు నా
మదిని విచారంబు • మాన్పఁదలఁచి
నిన్నరే యిటువచ్చి • నెనరున ముద్దాడి
యక్కునఁజేర్చి నా • యధర మాని
చాశీతిరచనల • చాల నన్నలయించి
యలుకల మఱపించి • యాదరించి
శృంగారశతకంబుఁ • జెప్పిన డబ్బీరు
నరుసు ధన్యునిఁజేసి • దురితహరుఁడు
తే. మదనజనకుండు ఆస్థాన • మండపమునఁ
జెలఁగుచున్నాఁడు భక్తులు • సేరి కొలువఁ
జెలియ నీవేగి కలువాయి • చిన్నికృష్ణు
తోడుకొని వేగ రాఁగదే • తోయజాక్షి. 100

శ్రీరస్తు.

# పతివ్రతాధర్మబోధిని

అను

# స్త్రీనీతిశతకము.

శ్రీరమణుఁడే తనపతి యని
కం. యేరమణి తలంచి భక్తియొప్పఁగఁ గొలుచు నా
నారీమణి కిహపరములఁ
దారసిలు న్శుభము లనుచుఁ దలఁపుము తరుణీ.

క. జనకుం డేపురుషునకుం, దను బెండిలిచేసె నతఁడె దైవము పతియుం
దన కఖిలబంధుజనమని, మనమునఁ దలఁపఁగనువలయు మగువకుఁ ద.

క. తల్లియుఁదండ్రియు దైవం, బెల్లసుహృద్బంధుకోటి యతఁడే యవిలో
నుల్లాసమొప్పఁగ నిజపతి, నెల్లప్పుడుఁ గొల్వు టొప్పు నింతికిఁ ద.

క. కోపియును దుష్కులుండు కు, రూపి పరస్త్రీరతుండు రోగియునగు నేవం
దీపించుభక్తిఁ బతిభజ, నాపసయగుపతియె గను జనస్తుతిఁ ద. 4

క. పతి చెప్పినచొప్పించుక, మతిఁదప్పక తిరుగుసట్టిమగువ ధరఁ బతి
వ్రతయని సమస్తసుజన, స్తుతి నున్నతిఁగాంచి కీర్తిశోభిలు త. 5

క. కడుపిడుతరి తల్లివలెం, బడకయెడ న్వేశ్యపోల్కి పనులడకువఁ జే
సెడువట్ల దాసిచందముఁ, బడఁతుక పతి కుపచరింపవలయుం ద. 6

క. సచివునివలె నాలోచన, ముచితస్థితిఁ జెప్పి యోర్మి నుర్వికి సెనయై
యచలోపమధైర్యాన్విత, వచనంబులఁ బతికిఁ దోడువడనగుఁ ద. 7

క. పతియింటికి నరుదెంచిన, సతి కాసనమందు నుండఁజన దెదురుగవో
యి తగంబరిచర్యలచే, నతనిం బరితుష్టుఁ జేయనగు నో త. 8

క. పతికన్న వేరుదైవం, బతివకు నెవ్వార లింక నతనిఁ గొలచుటే
వ్రతముగ జరించునతికిం, గతి తం గెటిఁజన్న కరణి గలుగుం ద. 9

క. పలుమారు శిరస్నానము, వల దిలసౌభాగ్యవతికి వలదు మొగమునం
దిలకంబులేక యెన్నఁడుఁ, గలకంఠికి మగనిమోముఁ గాంచుట త.

క. నిలయము వెలువడి యెడుతఱి, వలయుం గుప్తాంగి యాటవలదు బెళుకుఁ
జూ, పులు వెలయాలితెఱం, గున వనితాధర్మ మిట్టులెసఁగుంద. 11
క. అరుగం జనదెన్నండును, బొరుగిండ్లకు నుబుసుపోక పొలఁతికి దానం
బరగునపఖ్యాతి యిలం, దరుగుం గులగౌరవంబు తప్పక త. 12
క. తులువలగు చెలులు పలువురు, కలసిన వెసవచ్చుఁ గలహాగతులూరకన
తుల్కలజ కటనిలుపఁ బ్రత్యు, క్తులు వలుక నొకవ్వడైనఁ గూడదుత.
క. బద్ధకమున నైన న్నిరి, యుద్ధతి చేనైనఁ బతికి నొరులవలన దు
ర్బుద్ధి మెయిం బరిచర్యల, నిద్ధరణి న్నడుపఁగూడ దింతికిఁ ద. 14
క. జడవిప్పి గోళ్లదువ్వుచు, నడవీధి న్నిలువఁ జనదు నాతి పడిగని
ప్పుడు మాటలాడ రాదె, క్కుడువడి నవ్వుటయు నెపుడుఁ గూడదుత.
క. అత్తయెడ న్మామయెడ, న్బత్తియుభయమునిచి యాడుపడఁతులతోఁ
డం, బొత్తువహించి మెలంగిన, యత్తన్వి సుఖంబు యశము నందుంద.
క. చెనువొసఁగెఁ దనకుఁ బతియని, వనితయెద న్భయము విడచి వర్తింపఁగ
రా, దనయమటు తిరిగినేనియు, మునుగలకూర్మికిని మొదలమొరపగుద.
క. తనకుఁ బతివశుఁడు కావలె, నని మందులు మాకులిడిన నాతని కవికీ
డొనరించు బాననపయశ, మును బాపము సౌఖ్యహాని బోరయుంద.
క. పతియన్యవనితఁ గూడిన, మతికోపము నాదరంబు మగువగనక స
మ్మతి నతని భక్తిఁ గొలచిన, నతఁడే వశ్యుఁడగుఁ గీర్తియుల వడుఁ ద.
క. తనువలచి వరుఁడు పిలచిన, వనిఁ దీరిచి వత్తుననుచుఁ బలుకు లజాలం
బొనరింప కతనిమనసున, కనుగుణముగ మెలఁగవలయు నంగన త.
క. పొలయలుక నైనఁ బతితోఁ, గలికికిఁ గఠినోక్తి వలదు కాంతుఁడు తనతోఁ
గలయం గోరినయెడ న. వ్వలకైనం జరుపరాదు పొలఁతికిఁ ద. 21
క. ధరయదర వేగ నడువక, కరములు విసరకను మెల్లఁగా నడువఁ జనున్
శిరమెత్తి దృష్టులిటునటుఁ, బరుపక తలవంచి తిరుగవలయుం ద. 22
క. ఇరుగిండ్లకుఁ బొరుగిండ్లకు, నరుగం జన దన్వహంబు నట్లరిగిన వోఁ
దరుగుం గౌరవమంతయు, ధరణిన్ దుష్కీర్తి గలుగు తప్పక త. 23
క. సతిపతులకు మాతు లెడలెడు, గతికలహము బెట్టునట్టి కాంత విధవయై
క్షితిమరుచటిపుట్టువునం, దతిహేన్యత దుఃఖనమితి నందుం ద. 24

క. ఋతుదినములఁబసిపిల్లల, నతిమదువకమున్నఁజూడఁజనదటుగన్నన్
క్షితిమరుచటిపుట్టువునన్, మృతశిశువులఁగాంచి దుఃఖమొనయుం ద.
క. సతిపతులు రతులఁగలయఁగఁ, బతితాత్మకయగుచుభంగపరచుమగు
వఁడు, క్షితిమరుచటిపుట్టువున, స్థితి హైన్యముఁగాంచువిధవయగు మం.
క. ఉల్లాసంబున సతిపతు, లల్లికమై రతులఁ గలయు టకసిరయేనిన్
బల్లులయి భిత్తికలయుం, దెల్లెడఁదిరుగంగవలయు నింతులు త. 27
క. సతిపతులకలయికలు గను, నతివలు రతిలోలలగుచు నన్యపురుషసం
గతికాశింతురు మరుశర, తతిమర్మస్థలములందు దాకఁగఁ ద. 23
క. పలుదినములు పుట్టింటను, నెలవుగనిలువంగఁజనదు నెలఁతకుదానన్
దలవంపగు నుభయకులం, బులకున్ ధర నిందచాలబొరయుం ద.28
క. సవతులయెడఁ బతికిన్నె, య్యవయెక్కువయగుటఁగాంచి కోపింపక నే
యువతి పతిననుసరించునో, ధవునకు నాయువతియందు దయతగుఁద.
క. కలహింపరాదుసతి సవ, తులతోనొక్కప్పుడైన దురుసున దానన్
గలుషించుం బతితనయెడఁ, గలప్రేమన్వీడుచు నమ్మకము చెడి త.
క. పతికిం బాదములొత్తక, సతినిద్దురఁబోవరాదు జడముడువకయే
మితిదప్పినని(ద్రానం, గతి నొడలెఱుఁగక పరుంట కలుషము త. 32
క. సొగసిడుచు నెపుడువిడువక, సుగుణమ్ములుతోడవులగుచు శోభిలుచుం
డ, న్నగలునుజీరెలలంకృతి, కగుననియాశింపవలవ దతివకుఁ ద. 33
క. పతికన్న మున్నె మేల్కని, సతి మోమునుగడిగి బొట్టునవరించి య
తం, డుతనంతటమేల్కనువర, కతిభక్తిం బదములొత్తనగునో త.
క. వరునకుగృహకృత్యంబుల, భరమింతయుఁ దగులనియక పడతివహిం
ప, న్గరమతఁడుసుఖితుఁడగుచు, న్వరలున్దనయెడలనగునువరదుఁడుత.
క. పతివంకచుట్టముల నే, యతివ నమాదరమనస్కయగుచుఁ దనువునో
క్షితినాసతి యార్యస్తుతి, యతిగౌరవమును యశంబునందుం ద. 36
క. పతిభుక్తశేషమామృతము, గతినాదరమొనఁగఁ గుడువఁగాఁజనునిత్య[illegible]
బతివకది విడువఁగాఁజన, దతిదురితము దానఁగల్గునందురు త. 37
క. పతియుపవసింపఁ గుడుచుట, సతికింజనదతఁడుగుడువ జడమతియగు
చు, న్సతికుపవసింపఁజెల్లదు, గతియించుక దానఁదనకుఁగల్గునెత.

క. అతినిద్రయు నతిభుక్తియు, నతిబద్ధక మలిపిహాసన మనవరతంబే
నతి కెనఁగునో దారిద్ర్య, స్థితి నానతిగాంచుననుచుఁ దెలియుము తం.
క. అతివాచాలత చనదెపు, డతివకు నద్దాన నిందనందఁగి నౌ నా
స్థితిఁగని పతిదానివస, హ్యాతఁజూచుం బ్రీతివిడఁబియడఁచుంద. 40
క. పొరుగిరుగువారికెరుకఁగ, వరుఁడుతనుంగొట్టెననుచు వందురి తనవా
తెఱఁదెఱచియేడ్చుటొప్పదు, విరిఁబోఁశికి దాఁ నింద వెలయుం ద. 41
క. ముసుఁగిడి యెవ్వరుపిలచిన, గనరుచు భుజియింపనొల్లక పరుండుసతి
నెవ్వసవుంబావనుచుఁ బ్రియుం, డుసమిాగింపంగనొల్లఁడు వఱం ద.
క. కొట్టిన నేడ్వక పతితనుఁ, దిట్టినఁబౌరుషముగనక తెలివ పతియెడం
దట్టిన భక్తి భజింపుచుఁ, బట్టుదలన్ హింసఁ గీర్తిపరగుం ద. 43
క. పతిపాతివ్రత్యోన్నతిఁ, బతివ్రతిఁగన దండువలనఁ బడఁతికిసౌభా
గ్యతయు సుఖంబును జేకురు క్షితిసజ్జనసన్నుతి కీర్తి వెలఁగుం ద. 44
క. పరిపెన్ను తెఱఁగుదోఁపఁగ, ధరఁ దనయౌన్నత్యముచ్చపరవాగకొ
లఁడి, నేరికోర్చి వినయమొసఁగం, దరిగెను సకియన్నుతింత్రు తుదవిజులు.
క. చెలువమనోవాక్కాయక, ములనేనియు నన్యపురుషు పొంతకుఁబో
రా, దిలనిందయు నరకంబ, వ్వేఁదలవం కిఖలబంధువరులకుఁ ద. 46
క. వగునకుఁబగతుండగు నా, పురుషుఁడు తన కెంత బంధుమైనన్
న్యేరిబోణి కతనితో నా, దరమున మాటాడరాదు తప్పది తె. 47
క. అతిథులకు నన్నమిడుమని, పతియనినఁబండ్లుకోఱికి పడఁతి మెటికలు
ద్ధతివిడువక కౌతూహల, మతివారికిఁ గూడు పెట్టఁగాఁజనుఁ ద. 48
క. భిక్షుకులువచ్చి వాఁకిట, భిక్షాందేహీయనినిల్వ బిత్తఱివారిన్
వీక్షించి యింటిపనుల ను, పేక్షింపక పెట్టవలయు భిక్షం ద. 49
క. నట్టింట చిట్టుముకయు, వ్వట్టులు భిత్తికలఁ జెత్త వాఁకిటఁ బెరటం
దట్టమయిన పెద్దమ్మకుఁ,బట్టగునాయిల్లు సిరియుఁబాయుం ద. 50
ముంగిండ్లు నిండ్లు శుచిగా, నంగన లతిశుభ్రపఱచి యనవరతంబున్
శృంగారించిన ధనమటఁ, బాంగారు నిరియునిలచిపాలుచుం ద. 51
క. పిల్లలు తమొత్తుక్కొనకపరి, యల్లర సేయంగవినికి యదయతఁ గొట్టం
జెల్లదు చల్లనివలుకుల, మెల్లన నూరార్చవలయు మొలఁతలు తె. 52

క. బిడ్డలఁ బతిశిక్షింపఁగ, నడ్డము రానొప్ప దెప్పు డతివకు దానన్
జెడ్డతనఁబె వారికి, దొడ్డగఁ బెరుగుటను దెప్పు దోసఁగులు త. 53

క. చను వెల్లప్పుడు సేయఁగఁ, జన దెప్పుడు పిల్లలయెడ జననికి శిక్షా
ఘనతయునుజనదు తఱఁగని, చనువున్భయమునుపనగును చనుగతి త.

క. వనితపసినాఁటనుండియుఁ, దనయాలికి నీతిగరుపఁదగువారును న
ట్లనెయులవాౖరైదప్పక, మునకరుగరు దాన మేలుపొసఁగుం ద. 55

క. పుట్టినయింటికిఁ దనుకా, ల్పెట్టినయింటికిని గీర్తి పెంపెసఁగఁగ నే
బొట్టియచరించు నదియే, ఘట్టినయది తక్కువారు బొల్లియ త. 56

క. చెలువ్రఁడు తనతోఁబలికిన, పలుకులు వెలిపుచ్చరాదు పడఁతికిదాన
న్గలుగుఁబతికలుక నమ్మక, తొలఁగుం దనయెడలఁ బ్రీతితోవదు త.

క. ఇంటఁ బెర వారు లేనపు, డొంటిగసుతుతోఁడన్నైన నువిదకు నొకచో
నుంట తగదతివ బ్రతుకిటు, వంటిది కదళీదళంబువడువునఁ ద. 58

క. ఋతుమతియైమూనాళ్లును, పతికింబొట్టునిచికొనఁగఁజఁదామూనా
ళ్ళతిమోహమునుగ నుఁగొనరా, దతనికి నర్ధాననాయువడగుం ద. 59

క. కలకొలఁది రుచిగ శుచిగా, లలి బాక మొనర్చి యతిధులకుబంధుజనా
దులకుఁ బతిపంక్తినముమగఁ, గలకంఠికి గుడువఁబెట్టఁగానగుఁద. 60

క. తనసుతుల సవతితనయుల, మనమున భేదంబు లేక మన్నింపఁదగున్
వనితకదె తనతనూజుల, మనుచుటకని తెలియవలయు మదినో త.

క. ధనమోహము తనుబలము జ, వ్వనమున్నంతవఱ కెట్టి వనితయు సేవిం
చునునదు నవిమూతనికిం, బొనుగుపడంగొల్చునదియె పొలఁతుక త.

క. పతివర్యుఁడు వీరలన, మ్మతినాకేమనుచు నత్తమామల నిర్ల
క్ష్యతఁ గనునతివకుదుర్గతి, యతినిందయుఁ గల్గునందు రార్యులు త.

క. వనితలకుఁ జదువుటుచితం, బనుచున నద్గ్రంథనిచయ మరయఁ జెడుగు
లా, గొనము లెతరుచై యడఁచు, న్మనుదమకుంగల్గుసుగుణములునో.

క. దమయంతీ సావిత్రీ, ప్రముఖపతివ్రతల విమలపాతివ్రత్య
క్రమమును దెలిపెడునద్గ్రం, థములనుజదువంగవలయుఁ దన్వీ కేద.

క. ఇలనుబతివ్రతలని నుతి, వెలయునతీమణుల వివిధవిమలచరిత్రం
బులు చదువవలయు తత్క్రమ, మలవడి యశమెనగఁ జేయునతివకు.

క. మలినములగువస్త్రంబులు, మలినాంగంబీమ్నునడలుమలినహృదయమ
ము, స్థలలలనయింటనిలువక, దొలగున్నిరివచ్చునెక్కొదొనఁగులుత.
క. తనయింటిగుట్టు వెలికి, జ్ఞనకుండఁగఁగాచికొనుట పతికిం గనుకీ
ర్తినిదెచ్చు బంధుజనములు, వినుతింతురు మగని(స్త్రీని) వెలయుండ.
క. తనయింటికి నరుదెంచిన, వనితల కాదరము గౌరవము చేయఁదగున్
ధనగర్వముననవాదృతిం, గనఁజనదదినింద తెచ్చుఁగాంతకుఁద. 69
క. తగదెప్పుపంక్తిభేదం, బుగవడ్డనచేత దానఁబోలఁతికిహాముసం
దగునింద బంధుజనులకు, వెగటగు మగఁడెఱుఁగఁ దన్నువిడచుంద.
క. చెలువకు నిరుచేతులతోఁ, దలగోకికొనంగఁదగదు తగదిరుపాదం
బులుతగులునట్లునడచుట, కలకంఠికి నదిదరిద్రగతియగుఁ ద. 71
క. వృద్ధత్వంబుననైనన్, బద్ధకమించుకయు లేక పతిసేవయెడన్
శ్రద్ధాభక్తులు గలసతి, కిద్ధరణిం గీర్తి సుగతి యొనగుం ద. 72
క. జననీజనకులు బాల్యం, బున జవ్వనమందు మగఁడు పుత్రులుముదిమి
న్వనితల కొడయులుగావునఁ, జనఁగాఁదగు వారివాక్యసరణిం ద. 73
క. స్వాతంత్ర్యముచనదెన్నఁడు, నాతికి నద్దానినింద నాటున్ పంశ
ఖ్యాతియు నడగుంగావున, నేతద్విధమెఱుఁగవలయు నింతికిఁ ద. 74
క. పలుమరు నప్పాలకయిపీ, ధులవెంటనుదిరుగ రాదు త్రొయ్యలులకదే
వలుచఁదన మింటఁగలిగిన, కొలఁది న్సరిపుచ్చివాడికొనఁజను ద.
క. తనమోముసీటఁగనుఁగొని, వనితలుబొట్టిడుకొనంగవలదెన్నఁడు దా
ననుతనకన్నీరంతగ, ఘనతరదుఃఖములఁ గార్చుఁగానగుఁ ద. 76
క. తనకుం బతిదాచఁగని, చ్చినధన మొక్కింతఖర్చు చేయంజన ద
ట్లొనరిచి తక్కిరిబిక్కిరి, గను మరువందగదు నమ్మకము చెడ త.
క. అదిలే దిదిలే దేగతి, మొదలుపుదుంగాపురమని మొలఁత చెవికిఁజే
దొదవపలుమారుపతితో, నదనెఱుఁగక పల్కుటుచితమగునే త.
క. చెలువుఁడుపొరుగూరికిజన, పొలఁతుకతలదువ్వి పూలుముడుచుట రు
చ్యం,బులుదినుట నగలుదాల్చుట, వలవదువ్రతనిష్ఠనుండవలయుం.
క. పతికి న్సంతనమొదవిన, నతిసంతోషంబునాత్మనందుటయును నా
యతదుఃఖతుఁడగుతఱి నా, తతదుఃఖతయగుట సతికిధర్మము త.

క. గురులకడభక్తి బంధువు, లకు బెంచినగౌరవంబు నతిథులురానా
దరమును దీనులయెడదయ, గురిపతివాక్సరణి సతికిగుణములు త.
క. జారిణులను జోరగుణో, దారులు నగుచెలుల చెలిమి తప్పక నిందా
వారముఁగూరుచు రచ్చలఁ, దారిచి గౌరవముఁజెఱచుఁ దన్వికిఁ ద.
క. వసనమొసన తనుశోభకు, వసపుంగుంకుమపుబొట్టివస, మోమునకున్
లసమానసుగుణవిసరమె, వనగలనగలఁగ నెంచవనితకిభరములు త.
క. ధర బాలవిధవయును గను, బరమపతివ్రతలుగాంచుపద మెట్లన్నన్
నిరతము నియతాశనమును, వరధర్మవ్రతసునిష్ఠఁబరగినఁ ద. 84
క. తినకన్నమున్న పతిమృతిఁ, గనుచో నయ్యతివభక్తిగరిమంబున నా
తనిమతిఁగొల్చుచు నియతా, శనకలశ్రమయున్నఁ గాంచునద్గతిత.
క. పతివిరహాభరము సైపక, యతివలుమరణింపనెంతు రవివేకత దు
ర్గతిహేతువు బలవన్మృతి సతికల్లెన్నఁడునొనర్పఁజనునే? త. 86
క. అలుకనెడ ముచ్చుతుడువఁగ, వలయుంజీమగమిత్రాలఁగవందునెడన్గ
ట్టిలనుండుపురుగులరయ, న్వలయుం జెలులేమరంగవలదివి త. 87
క. తరుగునెడఁ గూరగాయల, పురుగులుకనుఁగొనగవలయు పొలఁతిపను
లలోం, దరనరయక తరుగుటకడు, దురితంబగునట్టికూరదూష్యము.
క. చెలువలయాచారంబున. నిలచు న్సిరియింటనెపుడు నిలుకడగా నా
చెలులయనాచారంబునఁ దొలఁగున్సిరి వచ్చునెన్నొదొనఁగులు త.
క. స్మితమధికసంతసంబున, మితభాషణమన్నియెడల మెలఁతలకుచితం
బతిసగవు నమితభాషణ, మతివలకపకీర్తిదంబు లవనిం ద. 90
క. వనితలుగృహలక్ష్మిపూ, జనమిరుప్రౌఢధికభక్తిజరుపఁగవలయున్
గనఁదగుశుభములనెల్లను, గనఁదగునద్దానసిరియుగలుగుం ద. 91
క. పతిపూజయు వరలక్ష్మీవ్రతమును గృహలక్ష్మిపూజ వనితామణు
లా, తతభక్తిఁజేయఁగాఁదగు. నితరవ్రతములుదలంపనేటికి త. 92
క. మిగులంగంత్రరవంబున, మగువలకున్ లజ్జవిడచి మగవారలలో
తగుదునని పాడుటుచితం, బగునే నగుబాటుదాననగునో త. 93
క. తనభక్తియుక్తి మగనికి, మనసెక్కఁగతిరుగునట్టిమగువ కిహమునం
గొనఁదగు శుభములు సుఖములు, గననగున్స్వర్లోకసౌఖ్యగరిమయు.

క. సతికిన్ దురితక్షితికై, పతిపాదోదకముతప్ప పరగంగలదే
క్షితిలో వేరొకతీర్థం, బతిపల కదితీర్థరాజమరయం ద. 95
క. కిలకిలలాడుచు మోమున, కళలూరఁగఁ గలిమిచెలియగతిపతికడకు
న్చెలువుమెయి చెలువకరుగ, న్వలయుంబతిమనసుకరుగువలపునఁద.
క. తనమానము చెడకుండఁగ. వనితకుఁగాపాడికొనఁగవలయును దానన్
జనమానవతి యనంగాఁ, దన కెనపేరవనియందుఁ దనకుం ద. 97
క. పతిరోగపీడ భీభ, త్సతనుండఁగ నేహ్యమందఁదగ దాతనికా
తతభక్తిం బరిచర్యల, సత్రీతిం జేయవలయు సతివకుఁ ద. 98
క. పెక్కులువచింప నేటికి, మక్కువమై మగనిగొల్చుమగువకుశుభము
ల్పెక్కులిలనందనగుఁబెం, పెక్కంగీర్తియును సుగతి యింపుగఁద.
క. పెద్దలుచెప్పినసుద్దుల, హద్దియెడనై సమీాఅ కతివతిరిగినన్
దద్దయునిల యశమొలయును, గద్దుపరంబుననుసుగతి కాంతకుఁ ద.
క, నరసింహారాయఁడును దా, మెరకులజుఁడు నీకుఁదండ్రి మిహిరాంశు
యశుం, డుకుసంప్రీతినినీతులు, గరుపఁగనాకొప్పగించెఁగేత.
క. ఓసూరమాంబ నీవివు, డీసూరిహితోక్తులెఱిఁగితేఁయు సుయశో
భాసురవు సర్వసంప, ద్వాసితవై భవవునగుచు వరలెదవవనిన్. 102
క. చెలికాని లచ్చరాయు, న్విలసిత సుయశోవిశాలు విభునిగమును శ్రీ
లలనహరి స్వలెఁగొంటివి, యిలసకలశుభంబులంది యొసఁగుముత.
క. ఈమహితనీతిశతకము, భామలకింపుగన మండపాకకులజుఁడౌ
కామకవిసెప్పె రామ, స్వామిసుధీకవిసుతుండు వసుధవెలయఁగన్.
క. మునుమజ్జనకునిమాతృక, తనపతిచేఁబంటిననుచుఁ దగనాకెఱిఁగిం
చెనుదీని గానసతులీ, ఘనతరనీతులనుజదివి కాంచుడు శుభముల్.

క. సతులీశతకము నిత్యం
బతికుతుకంబునను జదువ నమలశ్రద్ధా
న్వితలై విన వ్రాసిన నీ
క్షితిని బతివ్రతలునగుచుఁ జెలఁగుదు రెలమిన్. 106

సంపూర్ణము.

శ్రీమత్యై దేవతాయై నమః.

(తిరుపతి వేంకటీయము.)

# కామేశ్వరీశతకము.

శా. శ్రీరామా రమణాది నిర్జర శిర♦స్సేవ్యంబు సంసార సా
ఖ్యారామాంకురదోహదంబు పరితా♦పానార మత్యంతశో
భారమ్యంబు పరార్థదాయకము నీ♦పాదంబు మోదంబు దై
వారన్ గొల్తు నమస్కరింతు మది సం♦భావింతుఁ గామేశ్వరీ. 1

శా. నేరంబేనియు నేఁపేనియును మ♦న్నింపన్ భవత్పాద మా
ధారంబౌనని నిశ్చయించికొని నా♦తప్పొప్పులంజెప్పి సం
సారాంభోనిధి నుత్తరించుటకు ని♦చ్ఛన్నిచ్ఛలుంగోరి ని
న్నారాధింపఁగఁ బూనినాఁడ దయ లే♦దా? తల్లి కామేశ్వరీ. 2

మ. అనురాగానుగతాంగనాజితుఁడనై ♦ యానందశబ్దార్థమున్
వనితా సౌఖ్యపరమ్ముఁజేసి మనమున్ ♦ వారింపగాఁ లేని నా
జననంబేమిటికంచు నొక్కొకయెడన్ ♦ జర్చించియున్ మానసే
రని నన్నెట్లు భరించెదో యెఱుఁగఁగా ♦ రాదంబ కామేశ్వరీ. 3

మ. తలచే నెప్డు విరాగమందు మదిసం ♦ ధానింతుపన్ మాటనీ
కెఱుఁగన్ రానిదె? అట్టినాదుమది కే♦దేనొండు వైకల్యమున్
బొరయన్ జేయు నిమిత్తమేర్పరచి యే♦మోహాంధ్యముం గూర్చెద
క్కరణి న్నేను దరింతుఁ? దెల్పుమిది సౌ♦ఖ్యంబౌనె? కామేశ్వరీ. 4

మ. చదువన్ లేదొకవిద్యకేనియు యదృ♦చ్ఛాలాభమే కాని నే
నొడుగన్ లేదొక జేనికేనియును నో♦హో యంటయే కాని నే
వెదకన్ లేదొక వేడ్కకేనియును దా♦విందాటయే కాని యి
య్యది యేరీతిగ నెల్లకార్యములు నా♦కౌఁగాక కామేశ్వరీ. 5

మ. ధనమార్జించితి నిచ్చితిన్ యశమునం♦దన్ గంటి భోగమ్ములన్
దనివిన్ జెందితిఁ దత్కటాక్షమున వి♦ద్వాంసుండనై మించితిన్

జననీ! యెందుఁగొ నంత నాకు లవలే♦శంబైననున్ లేదనీ
చనవున్నప్పుడొకంటరిక్తుఁ డగునే? ♦ సంసారి కామేశ్వరీ. 6
మ. జననంబందుట పెద్దయాటయు గృహా♦స్థత్వమ్ము గైకొంట నం
దనులం గాంచుట పెండ్లిసేయుట యిటుల్ ♦ నానాఁటికే దేనియున్
బనియున్నట్టులె తోఁచు నొక్కొకపనిన్ ♦ బైపై విసర్జించి శాం
తినివేగన్ గనినిన్నుఁ గొల్చుటయె ము♦క్తిప్రాప్తి కామేశ్వరీ. 7
మ. ధనమార్జించుటగాదు సూ?ఫలము వి♦ద్యల్ నేర్చుకొన్నందు కి
మ్మనమున్ సత్క్రియలందుఁ జొన్పవలె సా♦మాన్యమ్ముగా ధర్మమే
తనకృత్యంబని యెంచికోవలయు న♦గ్దానన్ బరిజ్ఞానమున్
గొనినానాఁటికి నిన్నుఁ జేరవలెఁ గో♦మ్మ లీవ్వడి కామేశ్వరీ. 8
శా. దేహస్వాస్థ్యము కన్న వేఱొకటి ముక్తి ♦ ప్రాప్తికిన్ సాధనం
బూహింపంబడ దెందు, దానికి మహాయో♦గుల్ త్వదీయాంఘ్రిసే
వాహంభావము హేతువందురది నిన్న♦ర్థించుచున్నాఁడ సం
దేహంబేటికి? దేహియన్నప్పుడు శ♦క్తీ! తల్లి! కామేశ్వరీ. 9
శా. ఆధివ్యాధిసమేతమైన తనకాయం ♦ బర్థిఁ బోషించుచున్
శోధింపన్ వలె వేదశాస్త్రములు సం♦శోధించి యద్దానిచే
సాధింపన్ వలె ముక్తిమార్గమదియున్ ♦ సాధించి మోక్షార్థికిన్
బోధింపన్ వలె జన్మమన్న నదియే పో! ♦ దేవి కామేశ్వరీ 19
మ. ధనమున్నన్ సతిలేక తత్సుఖము సం♦దర్శించినన్ సంతతిం
గన సౌభాగ్యము గల్గ వేఱొకటి య♦క్కామ్యంబు చేకూర నిం
కనునొక్కండది గల్గనొక్కఁడదియున్ ♦ గల్గన్ మఱొక్కండు లే
దను కోర్కెప్పుడు తృప్తియెక్కరణి ల♦భ్యంబౌనో? కామేశ్వరీ. 11
మ. జననాభావమనుగ్రహింపు మది నీ♦శక్యంబుగాదేని పై
జననంబందును నాకొసంగుమెటులో ♦ సంగీతసాహిత్యముల్
పనిలేదీయుదరంపుఁ బోషణకునై ♦ భాషాంతరంబుల్, జగ
జ్జననీ! దీనికి నింత వ్యర్థపుఁ బ్రయా♦సంబేల? కామేశ్వరీ. 12
మ. ఎవఁడే కీర్తిని బెట్టి పుట్టునటులే ♦ యేర్పాటగున్ వాని వృ
త్తివిశేషమ్ములు, దీనికింత మదిను♦ద్రేకించి తానక్కడో

వ్యవసాయంబొనరింపనేమి యగుఁ ద్వ•త్రాపణేశుఁడా! బిచ్చమె
త్తవలెన్ గర్మముదాఁట నెవ్వఁడికి సాధ్యంబౌనె? కామేశ్వరీ. 13

మ. ఇలువేల్పైనను దాతవైనను మహిం • కేమైనను న్నీవె నీ
బలమొక్కించుక కల్గువారలకు నై • శ్వర్యమ్ము హస్తస్థితా
మలక ప్రాయము, నిన్నువీడి నరులం • బ్రార్థింపఁగాఁ గల్గునే
కలుముల్, ధేనువుగాకదున్న లెటుదు • గ్ధమిచ్చుఁ? గామేశ్వరీ. 14

మ. నరనాథుల్ పలుమంది మిత్రులయియు • న్నన్ గాని తత్సన్నిధిన్
స్థిరవాసమ్మొనరించునట్టి పనినా • చేఁగాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఱిఁగి వి • ద్యాబుద్ధులన్నేర్చి నేఁ
బరులన్నిత్యము గొల్చుటొప్పగునె? యం • బాదేవి! కామేశ్వరీ. 15

మ. ఋణబాధల్ వ్రణబాధలందు బుధులా • యీబాధ నాకిప్డు దా
రుణమైతారసిలెన్ దరిద్రనప•ర్ణుం డీతఁడన్మాట ధా
రుణిభావత్కకటాక్ష వీక్షణము లా • రోపించి వేఱొక్క కా
రణమింకెయ్యెడ లేదిదేనిజ మప•ర్ణా? తల్లి! కామేశ్వరీ. 16

శా. నారుంబోసిన దేవుఁ డెట్టిగతినై • న న్నీరుదాఁబోయఁడే
"యేకీతిన్మన కేగుఁగాల"మని లో • నేడ్వంగనేమహా? జనిం
దారుల్ మాత్రము సర్వరీతులను మో • దంబందిరే? లోటు లే
దే? రారాజునకైనఁ, దృష్టికలవాఁ • డే రాజు కామేశ్వరీ. 17

మ. "తమపుత్రుల్ స్వమతేతరమ్ములగు వి • ద్యల్ నేర్చి పోషింతు"రం
చు మతభ్రష్టులఁజేయు పండితులు నీచుల్ • గారె? వీరింకద్రి
వ్యమ్ముకై కూఁతులరో వెలందులుగఁ జే • యన్ లేరె? యెవ్వారిదా
రమజేమాఁగలికాలపున్మహిమ వా • ర్యంబౌనె? కామేశ్వరీ. 18

శా. ఆచారమ్ములుపోయె వేదములయం • దాసక్తి లేదాయె దు
ర్ధీచాతుర్యము హెచ్చె నీచులకు నా • ధిక్యమ్ముదావచ్చె సం
కోచం బెందును లే"దిహామ్ముపర"మన్ • గొండాటకుంబోరువా
రేచోటన్ గనరారు పాపమిదియే • మిరా? తల్లి! కామేశ్వరీ. 19

మ. మునునుద్యోగులు లేరొ? వారలుధన • మ్ముంగూర్పరో? పూర్వవ
ర నలన్ మానిరె? పూనిరే? మలినమా • ధర్మము వారిటు. లీ

మనవచ్చున్ బ్రకృతప్రపంచగతి, వ♦ర్ణాచారముల్ మాఱె న
వ్వారినెవ్వండని నిశ్చయింపఁదగు? నో♦ వామాక్షి! కామేశ్వరీ. 20

మ. సకలమ్ముం గొఱిగించుకొందురకటా! ♦ సన్న్యాసులో? కారు బో
ట్లో కయింతేనియు ఫాలమందిడరదే♦మో? ముండలో? కారు వి
ప్రకులోత్తంసులకిట్టి పాటుకలిగెన్ ♦ బై వారియాచేలు? యెం
దుకు లోకంబిటు మాఱె? నీకెఱుఁగరా♦దో? చెపె! కామేశ్వరీ. 21

శా. అచ్ఛాఫీసులటంచు హూణులు ఘుపా♦ధ్యాయుత్వమంచున్ మఱిన్
వెచ్చన్ బిచ్చెడిబచ్చుటిండఁ గడన్ ♦ వేదాంతమంచున్ మహో
ద్యచ్చారిత్రులు పండితుల్ [illegible]గా♦నయ్యెంగదా పొట్టకై
చచ్చున్ గాలమువచ్చె గౌరవమునా♦శంబయ్యెఁ గామేశ్వరీ. 22

మ. "బలిపాడాయెను గర్దభన్ జెడియె వి♦ప్రస్వాములర్థించు కో
ర్కెలనీఁబూని, మఱెవ్వఁడెట్లునిలుచున్ ♦ బ్రహ్మస్థలిన్, దాతగా
వల"దం(డ్రజ్ఞులుగొంద, ఱిందుఁగలలా♦భంబింతగు[illegible]ంప రి
క్కలికాలంబిటు కాఁబుచున్నయది ది♦క్కా[illegible] మొ[illegible] కామేశ్వరీ 23

శా. నానానీచకృతుల్ పొనర్చి సుతుహూణా♦ప్రక్రియాధ్యక్షుఁడౌ
వానింజేసినఁ "బొట్టకూటికిది నే♦ర్వంబడ్డ" దన్నట్టి వి
జ్ఞానంబించుక లేక వేదహానిన్ ♦ శాస్త్రమ్ములన్నన్ సదా
తానిందింపఁగఁజొచ్చువాఁడెఱుఁగునే? ♦ తత్త్వమ్ము? కామేశ్వరీ. 24

మ. గురువన్నన్ భయభక్తులించుకయు నే♦కోశమ్మునన్ గానరా
వరయన్ రావొకకొన్నియేనియును మ♦ర్యాదాస్థితుల్ హూణవి
ద్యరహిన్నేర్చెడిబాలురందు, భృతకో♦పాధ్యాయతాదోష వి
స్ఫురణంబియ్యది కాక వేఱుగలదే? ♦ మూలంబు కామేశ్వరీ. 25

మ. ధనమార్జింపదె? వేశ్య యంతకునునిం♦ద్యంబౌ ననత్యప్రవ
ర్తనయున్ సేవయు విప్రజాతులకు మే♦రౌ "నశ్వవృత్త్యా కదా
చన" యంచున్ మనువాడఁడా? "యిదియదు♦ష్యంబెట్టి కాలమ్మునం"
దనవర్ణాశ్రమపద్ధతుల్ విడుటయు ♦ న్యాయంబె కామేశ్వరీ. 26

మ. ఎవఁడేగోత్రినిఁ దప్పుదాని మఱి♦ వాఁడేకాక "తాఁజెడ్డ కోఁ
తి వనంబెల్లనుగాల్చు రీతిఁ" గులసీ♦తింబాఁట శంకించున

ట్టి వివేకాత్ములఁగూడఁ ద్రోయుటకుఁ జాడీకోసు లత్యంతగ
ర్హ్యవిధు ల్ప్రబోధనసేతు రియ్యెడను సహ్యించెదవె? కామేశ్వరీ. 27

శా. "మాల ల్దర్శనమండఁగాఁ దగునె? యామ్నాయమ్ము లంఘింపరా
దే,? లండన్ జననేమగున్? మడికిఁబో • స్త్రీబట్టలిందృంబె?" యం
చాలోచింతురు పూర్వమెవ్వగను లేరా? యింతవా రక్కటా!
పాలంబోలుకొలమ్ము నారలకు నీపాల్గ్లేల? కామేశ్వరీ. 28

మ. మనధర్మమ్ములు దప్ప లన్యమతధర్మమ్ముల్ పరిశస్తమ్ము లం
చును వాపోయెడిమూర్ఖులీయుభయమున్ • శోధించిరే? పొట్టకూ
డౌనరంబెట్టెడివిద్యకుం గలదె? యా • యుక్తాపయుక్తత్వమో
జన, తానియ్యది వేదమానొ? మఱి శాస్త్రంబానొ? కామేశ్వరీ.

మ. తనధర్మమ్మున కన్యధర్మము విరుద్ధంబేని యాంతగ్గై
కొని వర్తించినవ్యావహారికులు తన్ • గోష్టించిరే? యింటఁజే
సినయాచారము వారినేమిటికి హింసించున్? మతాచారమూ
నని మాత్రమ్మునఁ దాను బెద్దదొర యౌనా? తల్లి! కామేశ్వరీ.

మ. పెఱవారిన్ గికురించి విత్తముగొనన్ • బేరిరేపణ ల్సేయు ట
క్కరుల న్నిక్కము న్యాయవాదులని పల్కన్ దప్పు వేశ్యాగుణ
స్ఫురణంబంతయు వీరియందుఁ గనవన్నన్ వీరలు న్వారలున్
ధర గేస్తు ల్జెడఁజేయఁ గారకులు సత్యంబింత కామేశ్వరీ. 31

శా. ఈవే యింద్రుఁడ వీవె చంద్రుఁడ వం • చెన్నారినేని న్ధనా
శావేశమ్మునెయి న్నుతించు కవులా • హా! యెంత మూఢాత్ములో
దేవీ! వీరొక కొన్నిపద్యముల నీ • తేజమ్ము వర్ణింపరా
దా? విత్తమ్మునొసంగు దార్ఢ్యమది పెం • దా? నీకుఁ గామేశ్వరీ. 32

మ. కలవా రెందఱు? కర్తలెందఱు? ఱపు డిక్కంజాతభూసృష్టి నా
ద్యులు బంగారము మెక్కి మృత్తికఁ దద • న్యు ల్మెక్కుచున్నారె? యి
క్కఱలుము ల్నిక్కములో? పయస్సునత మో? • కాయంబునాపాయ
కలయేనిక్కలయో? మజేలధనికు • ల్గర్వింతురీ కామేశ్వరీ. [మో

మ. అతిథు ల్వచ్చిన గౌరవించుటకుఁ బ్రత్యబ్దమ్మునన్ మహా
వ్రతము న్సల్పుటకు న్సుఖమ్ముగను గార్హస్థ్యపరిచారమ్ము సం

తతము న్నొగ్గుటకు న్నరాసరి సిరిక • దల్లీ! నిన్నుం గోర ని
చ్చితి వామాత్రిమచాలు నెందు కధిక • శ్రీమత్త? కామేశ్వరీ. 34
మ. తలిదండ్రుల్ప్రనిబూని బాల్యమున వి•ద్యాబుద్ధుల న్నేర్పలే
దెలమి న్ద్రవ్యముగూర్చి యిచ్చుటయులే • దీనాకు సర్వమ్ము నీ
బలమే కారణమైయొసంగె జననీ! • ప్రార్థింతు నీరీతిగాఁ
గల కాలమ్మును బోవనిమ్మధికమున్ గాక్షింపఁ గామేశ్వరీ. 35
శా. ఈ వేళన్ మృతియేని రేపటికి రెం • డేతాదృశమ్మైన యీ
జీవమ్మందును గాయమందును సుత•స్త్రీబంధుగేహాదులం
దేవా రేనియు నాసనేయుటది త•ప్పేయొక్కచోఁ జేసినన్
భావింపన్వలె "నెంతసత్య"మనుచుం • బల్మారుఁ గామేశ్వరీ. 36
మ. తమ ప్రాయమ్మునఁ బూర్వలోకవులు చి•త్తభ్రాంతిచే స్త్రీసమా
గమముంగూర్చి రచించు నాటకములుం•గావ్యమ్ములుంజూచి బా
ల్యము నెట్లో వెడలించి యౌవనము రా • నాసౌఖ్యమందు న్మనిం
గి మనంబివ్వాడినీ! యటంచును విర•క్తింజెందెఁ గామేశ్వరీ. 37
మ. అనుమానింపక కల్పనారుచులపై • నాస ల్పిసాళించు నె
మ్మనముం ద్రిప్పఁగ లేక దుర్విషయము • ల్మన్నించుచు న్సాధుస
జ్జనసాంగత్యము వీడినట్టి పరమ•జ్ఞాని న్నను న్నద్ధవ
ర్తనుం దార్చిన నీకృపారస మపా•రంబంబ? కామేశ్వరీ. 38
మ. మతినూహింప సతీసుతాది గతసం•బంధమ్ము సర్వమ్ము క
ల్పిత మవ్వారల పోషణార్థమకదా? • లెక్కింపఁగా రాని దు
ష్కృతులందేహి యొనర్చు టక్కటకటా • యీబంధమే యీజగ
త్తినితికింగావలెనే? మఱొక్కగతి నీ•చేఁగాదె కామేశ్వరీ. 39
మ. ఒక కొంతేని నిజమ్ముగాని వనితా•యోగంపు సౌఖ్యమ్ము స్పృ
ష్టికి మూలమ్మనినిర్ణయించుటఁగదా • చేట్పాటు వాటిల్లె నీ
వొకటింజేయ మఱొక్కటొయొనిదియే•మో బ్రహ్మముంజూపు నం
చకటా! యొట్టిమహాత్ములుం జెడుదు ర•న్యాయంబు కామేశ్వరీ. 40
శా. జ్ఞానంబించుక లేని కన్నియలతోఁ • గైవల్యముం జెంది బ్రి
ష్మానందం బిదియంచు నెంచు బుధుల•న్నా? యెంత మూఢాత్ము లెం

తే నింద్యమ్ములని నోటఁబల్కుచును దే•వి నీవడఁగాలేరు వి
జ్ఞానుల్ దానిఁదలంచినన్బొడము నా•శ్చర్యంబు కామేశ్వరీ. 41

మ. గృహశృంగారము చేసి చేసి గృహిణీ•శృంగారముం జేసి చే
సి హృదంతఃప్రతిబింబితమ్ములగు ని•స్సీమంపుఁ గోర్కెల్ వృథా
బహుళత్వమ్మునుబొందఁ దన్మయత సం•భావింప లేఁ డన్య, మీ
యిహమే శాశ్వతమంచు నెంచుకుజనుండిం తేనిఁ గామేశ్వరీ. 42

మ. ఎవరేమన్న మజేమికాని మదిలో•నేనిట్టు లూహింతు నీ
యువనిన్ స్త్రీయనవేఱుకా దదియె మా•యాపుంజ మద్దాని కే
రు వశుల్ గారె? యధార్థము గ్రమముగా • రూపించి పద్మచ్ఛదాం
బువిధి న్వర్తిలు నేర్పుగన్గొనవలె • న్మోక్షార్థి కామేశ్వరీ. 43

శా. ఎన్నోసంసృతు లెందఱో తరుణులె•న్నేశయ్య లెన్నోగృహ
లెన్నో దేశము లెన్నియోవసతులై • యీమాయకాయమ్ము తాఁ
గన్నుల్గానదు ముందెఱుంగ దరయం•గా లేదు కాలత్రయం
బు, న్నీదా దయగల్గు నంతకుఁగదా? • మోహమ్ము కామేశ్వరీ. 44

శా. ఏయేకార్యములందుఁ దన్మయుఁడనై •యేనుంటినో మున్ను, నా
కా యాకార్యములెల్ల నిప్పటికి హే•యప్రక్రియం దోఁచు నీ
మాయన్ దాఁటుటకు న్త్రిమూర్తులకు సా•మర్థ్యమ్ము లేదన్నచో
జాయాపుత్రహితార్థులౌ నరులకు • న్శక్యంబె? కామేశ్వరీ. 45

మ. ఒకమాట న్వచియింతు మత్సుకృతమే•మోగాని నేనెట్టి దు
ష్టకృతి న్మగ్నతచెంది యుండినను రూ•ఢంబైనజ్ఞానమ్ము త
క్కక భక్తి న్భవదీయపాదయుగళిం • గల్పించె నీభక్తి మి
న్నక పోనేర్చునె? ముక్తి నాకిడదె? యె•న్నండేనిఁ గామేశ్వరీ. 46

మ. వ్యసనమ్ము ల్పదివేలుగల్గినను గా•మాసక్తికి ల్నొచ్చు త
ద్రసనసంసక్తులు దేహగేహములకే • రాగిల్ల రన్నప్పు డాం
డు సారన్నేర్చునె? వారిచిత్తముల, నే•ను న్వారిలోనెల్ల న
గ్రసరత్వమ్ము వహించి నిన్ను మఱవం•గాలేదు కామేశ్వరీ. 47

మ. మనమీదుర్వ్యసనమ్ముల న్మఱిగి ధ•ర్మంబెల్ల లంఘించి యీ
జననమ్ము న్వృథసేయుచుంటి మని ప•శ్చాత్తాపముం జెందుచు

న్నను మార్గవృత్తియొకింత కాలము ననుం♦గాఱించెఁ బ్రారబ్ధక
ర్మనిదేశంబని వార్య మన్నపలు కా♦మ్నాయమ్ము కామేశ్వరీ.
శా. కష్టంబేని సుఖంబులేనియును భో♦గమ్మేని రోగమ్ములే
నిష్టంబేని యనిష్టమేని మఱియుం♦ గేదేనిఁ బ్రారబ్ధ ని
ర్దిష్టంబై సమకూరు నన్నిగమా♦దేశమ్ము తప్పింపఁగా
సృష్టింజేసెడి బ్రహ్మకేనియుఁ దరం♦బే తెల్పు కామేశ్వరీ. 49
శా. ప్రారబ్ధమ్మునవచ్చు సంపదలు నా♦పత్తుల్, తదంతర్గతుల్
ధీరుల్ గా రొకభంగి నీయుభయమున్ ♦ దీర్ప న్సమర్థత్వమె
వ్వారల్ గాంతురొ వారె నేనులు బాధ♦లవ్వారే కవులవ్వారె య
వ్వారే ముక్తులు వారె నీవు మఱియ♦వ్వారేఁ? కామేశ్వరీ. 50
శా. అంబా? లేదని యేడ్వనున్నదని య♦త్యానందముం జెందనా
కుం బాల్యమ్మున నంటి యీపనిచేయ నూరె స్వభావత్వాదప
ద్మంబే యేడ్వఁడగాఁదంతు నితరుల్ ♦ దైవమ్ములే కారటం
చుం బాటింతుఁ దద్వైక్యమిట్లు కనవ♦చ్చు న్గొబె కామేశ్వరీ. 51
మ. జననంబేటికిఁ గష్టమందురి భవదం♦శస్ఫూర్తి మన్మూర్తికే
జననంబైన మఱేమి? కూర్మమును మ♦త్స్యమ్ము న్వరాహమ్మునై
కొనలేదే? సుఖమున్ యశమ్ము నళినా♦క్షుం,డింతకన్నన్ నిద
ర్శన మొండేమిటికంబ? నీదయ సమ♦స్తంబిచ్చుఁ గామేశ్వరీ. 52
మ. హరియన్నన్ స్మరుఁడంచు బ్రహ్మయనుచు♦ న్భర్గుఁడంచు న్నిశా
కరుఁడంచున్ బలుకీతులన్ జనులు శం♦కల్ సేయుదుర్ వీరుత
త్వకలాపోక్తురు నేనెఱుంగ రిది మున్♦దాఁగాళిదాసుండు శం
కరులున్నిక్క మెఱింగి రామత మనేఁ♦ గైకొంటిఁ గామేశ్వరీ. 53
శా. ఫాలమ్మందునఁ గుంకుమన్నలిపి విద్వ♦త్తా కవిత్వాదిక
త్వాలంబమ్ములు నీదుపాదములు చి♦త్తాంభోజమం దెవ్వఁడే
నీలోనుండయి నిల్పువానికిఁక నెం♦తేనిన్ జయంబబ్బువాఁ
డేలోకమ్మునకేగ నేమియగు? స♦ర్వేశ్యాండు కామేశ్వరీ. 54
మ. శతలేఖిన్యవధానిఁ జేయవొ వచ♦స్సారస్యముం గూర్పవో
వ్రితిలేరీతనికన్న పేరిడవొ? దృ♦ప్యంబీయవో? రాజుల

స్న తులన్ జేయవో? మెన్ని యేస్గతుల నా•నందంబు గల్పింపవో
గతిసీవే యనువారి కేమి కొదవో•కామాక్షి? కామేశ్వరీ. 55

శా. విద్యల్ నేర్చితి మంచు నిక్కెదరహో! • వేదమ్ములు న్శాస్త్రముల్
వాద్యు ల్పద్దులు గల్గియున్నవియె? యే•లానేర్వఁగా వచ్చు? నీ
పద్దాగ్ద్యంబది యేమి చేయఁ గలుగు? • న్సత్యవ్రతు న్మున్నుబల్
మొద్దు న్దిద్దితి తత్సము ల్గలరె? యీ•లోకానఁ గామేశ్వరీ. 56

మ. ధనికుం డెవ్వఁడు? రిక్తుఁ డెవ్వఁడు? భవ•త్కారుణ్య తచ్ఛూన్యతల్
పొనరించు న్మతి వానివీనిఁగ నరు • న్మానాయకు న్మతుజి
త్తునువేగ న్బరిమార్చి న్యాయ మెదయం•దున్ జేర్చి నాఁడా నుద
ర్శను రిక్తు న్బదభక్తు రాజుగ నొన•ర్ప న్లేదె? కామేశ్వరీ. 57

మ. మన యైశ్వర్యము లెంత? యెంత మన మం•ధాతకన్న న్మహా
త్రిపృవోత్తంసుని కన్న మొల్పిన వనే•త్రిన్ గోత్రశృంగమ్ము లి
ప్పనిదిం దిన్నది దక్కవమ్మని మదిం•జింతింపఁగా లేని దు
ర్ధనులు న్రాజులె? వారిఁజూచు కవియు • న్దమ్యుండె? కామేశ్వరీ. 58

మ. మనకన్ను ల్గనుచుండ నెందఱుదను • ల్మన్నైరో కానున్న వా
రునునిం కెందఱో యంచుఁ దెల్పి మొయి ధీ•రు ల్సంస్మృతిన్ లోన స
మ్మని వారయ్యును బైకి నమ్మనగతి • న్మన్నింతు రవ్వారివ
ర్తనమవ్వారికె గోచరం బితరదు•ర్వ్యాపమ్ము కామేశ్వరీ. 59

శా. లక్షల్ తెచ్చెదఁ గోట్లు తెచ్చెద సిరుల్ • రక్షింతు భక్షింతు న
ధ్యక్షత్వమ్ము వహింతు నంచు నిటులూ•హ ల్సేయుటే కాని తా
యక్షేశుండగునే? యథోచితముగా • నావేళ కావేళ యే
కుక్షిం దేల్చెడి నీదు భక్తులకుఁ జిక్కు ల్లేవు కామేశ్వరీ. 60

మ. అనవద్యాంగికి నాథుఁడొక్కఁడొకఁడో • హాస్యాస్పదంబైన కా
మినికి న్నాథుఁడు వేఱొకండిరువురం • జేర్మించుఁ దుల్యమ్ముగా
మన మేతాదృశమంచుఁ దెల్పుటయు సా•మాన్యంబె? యద్దాని తృ
ప్తి నిరూపింపఁ దరంబె? యయ్యదియిటు • ల్పీడించుఁ గామేశ్వరీ. 61

శా. కట్టు న్మేడయొకండు, వేఱొకరుఁడు • న్గట్టు న్గృహం, బన్యుఁడున్
గట్టు న్జిన్నకుటీర, మింకొకఁడు పా•క న్గాపురమ్మందు వాఁ

డెట్టు లోఁద్రిదముగాం చు వీరు నదియంత్రికాంతు నిరోధ్యులన్
గుట్టలుట్టలు సేయునట్టి మది కెంగ్రో? సిగ్గ? కామేశ్వరీ. 62

మ. తన విత్తమ్మని యన్యవిత్తమని యాత్మన్ గొంకు సుంకించఁగా
బనిలేదన్నియు స్వీకరింపనగు, నెప్పట్ల న్వ్యయిత్నమ్ముఁజే
సిన సూహాము స్మరితమ్ము, గర్మమున వచ్చెనో యెవ్వ నన్నట్టులుం
డనగున్, గల్గునె స్వీయమంచొకటి యెన్నండేని గామేశ్వరీ 63

మ. తనజన్మించినవేళఁ దెచ్చికొనెనో తాఁబోవునవ్వేళ గై
కొనునో రెంటికిఁగాని దెట్టిదియు మూర్ఖస్థల్ స్వీయమంచు స్థలం
చిన నేనొప్పరు గర్మమొక్కటియగున్ స్వీయమ్ము, వచ్చు ప్రజను
స్టనతోనయ్యది, తచ్చరిత్రి మతిచింతింబంబ? కామేశ్వరీ. 64

శా. సంతానమ్మున ముక్తిచేకురుటయే సత్యమ్ముగానిన్ జడ
స్వాంతమ్ముల్ పశుపక్షికీటములు మోక్షమ్మందుటే నిక్కమి
క్కాంత లక్కంతులు గొడ్డురాండ్రగుటయున్ గల్గు స్థటస్థింప వీ
చింతల్వానికటంట నిక్కమకదా? శ్రీదేవి కామేశ్వరీ. 65

మ. ధనమందిచ్చ యొకప్పు కాముసుల పైఁదాత్పర్య మొక్కప్పు గే
హానివాసమ్మున నొక్కవేళఁ బరదేశావాసమం దొక్కవే
ళను వైరాగ్యమువం దొకప్పుఁడొకవేళ న్దానికి న్భిన్నమం
దెను వర్తించుమనమ్ముగట్టు నరుఁ డెందు న్ముక్తి కామేశ్వరీ.66

మ. తనచిత్తమ్మును గట్టువాఁడు పరమానందన్నెర్పుఁ గాదాసికే
తనస్వాతంత్ర్యము లేనిచోఁ దనయు నిందత్తజ్ఞఁగావించి యా
తని సద్వర్తన కారణమ్ముగఁ బరస్థానమ్ము తానందునే?
ఘనులా జ్ఞానులతోరివ గామి సిది యజ్ఞానంబు కామేశ్వరీ. 67

శా. భార్యా పుత్రులయందు రక్తియును ద్రవ్యంబందునాసక్తియే
యార్యుల్చెందరు? చెందుమాత్రమున నేమాయె? న్మనమ్మందు నై
శ్వర్యంబస్థిర మాత్మజాతులరు లెజన్మంబనిత్యం బస
చ్చర్యల్ త్యాజ్యము లన్నజ్ఞాని గను నిస్థానమ్ము కామేశ్వరీ. 68

శా. ఎంతే ద్రవ్యము దేశము ల్తిరిగి యేదేరీతి నార్జించి భూ
కాంతశ్రీపహింపఁ బో నొకఁటనిక్క జక్కఁ బొచ్చున్నవో

నింతిం బిడ్డల నన్నవస్త్రములకై హింసింపఁగాఁ గానుగా
స్వాంతంబెందుల కింక నేనిఁ గుడియింపవ న్నార్చెదు? కామేశ్వరీ. 69

మ. మన మీపాటికి శాంతము న్నలుపు మంబా? సర్వభోగమ్ములుం
గనినాఁడ న్నగమాయె నాయువును, సంస్కారుల్ "కలౌ పష్టి" నా
వినమే? పైనగమైన బ్రహ్మమువినా విశ్వమ్ము సర్వ మ్మస
త్తనుచర్చన్ గమనింప నిన్ను త్రికము ప్రార్థింపఁ గామేశ్వరీ. 70

మ. ధనమంచు న్గలదొక్కఁచి క్కఁదిగొన స్థైర్యమే లేనిచో
జననాథు ల్మతి మెందఱుందురో కవీశద్వారముల్ గొల్చుచున్
బనియే మొక్కనితోడ నొక్కనికి నీపాత్రిర్బమే కాక కోఁ
తిని గొండెక్కిన దానినయ్యది త్యటింపించుఁ గామేశ్వరీ. 71

మ. ఎవ రేమన్న మ జేమి? నిన్ను మదిలో నెవ్వాఁడు తాఁ నమ్ము వాఁ
డు విశేషమ్ముగు సౌఖ్యముం బడయువాఁడు న్బాఱుఁడు గ్రుఁడు
గ్గవిముంగాఁగలఁ డాపద ల్పోరయు వెక్కాలమ్మున న్పోఁగ
ర్మవిధిన్ గల్గినచోఁ దొలంగు నతిశీఘ్రంబుబ కామేశ్వరీ. 72

శా. వారు న్వీరును దిక్కటంచు మది సంభావించుటే కాని యా
వ్వారు న్వీరును గష్టమబ్బిన మొఁడ న్వారింపఁగా లేరు నీ
వా రాఁగో యొకవానితోడ నవియే దోరితి వారింతు నీ
వే రాజిల్లుము నాకు దిక్కగుమ, నిన్నే గొల్తుఁ గామేశ్వరీ. 73

శా. ఈ వేపోవని దానవే నపుడు నన్నే నారురక్షించి? రా
యీ వారింపఁగ రానివ్యాధియు ఋణంబెన్నేని పైచిక్కులున్
నై వాలాయము వాలి నన్నిటిఁ దృటి న్వారించి కేళీగన్
జీవంబిచ్చుటటుఁడ మాన మిడవే? శ్రీదేవి కామేశ్వరీ. 74

మ. మనుజుల్ గొల్వఁగనేల? యన్యులను "నో మాతుః పరాదేవతా"
యనువాక్యమ్మున మాతృశబ్దమున కన్యార్థమ్ము గానేర్చునే
జననీరూపమున న్సదా సులభవై శాసించు నిన్ను న్భజిం
చినఁ జేకూరవె భుక్తిముక్తులు యశశ్శ్రీ లెందుఁ గామేశ్వరీ. 75

శా. గాయత్ర్యర్థము నిన్నుఁ దెల్పుటయె నిక్కమ్మని దన్మంత్రమే
ధ్యేయంబేని నమస్త విప్రులకు, నీ తేజంబమేయుంబ యే

నాయుశ్శ్రీబలపుష్టికీర్తు లిహమం • దాపైని ముక్త్యాప్తి తా
మై యీనన్నువరింపవే యనుచుధై • ర్యం బంబ? కామేశ్వరీ. 76

శా. ఇంద్రుండెవ్వఁడు? చంద్రుఁడెవ్వఁ డనిలుం • డెవ్వాఁడు కంజోద్భవో
డెందే శివప్రముఖు ల్మఱెవ్వరు? భవానీ? త్వన్మహో లేశ మీ
యిందుం గిందునిఁ బెంచుఁ ద్రుంచు నఖిలం • బీవే భవత్కృత్యమే.
నిందై త్రైలోక్య మశక్తమై పొలువదు • న్నిక్కంబు కామేశ్వరీ. 77

శా. ఏ వేళ న్మతియే స్థలమ్మునను నే • యేరీతిగానున్నదో
ఆవేళ న్మతి యా స్థలమ్మునను నా • యారీతిమై తీరునూ
ర్యావిర్భావము ప్రొద్దుగ్రుంకుటయు దృ • ష్టాంతమ్ము లిప్పట్ల నీ
భావం బింతయెఱుంగ ధైర్యము మది • బాటిల్లుఁ గామేశ్వరీ 78

మ. బలమిచ్చున్ యశమిచ్చు సంపదలిడు • న్భంజించు గుంజించు దు
ర్బలులన్ జేయు బలాఢ్యులం బొనరుచు • న్బాలించుఁ దేలించు నీ
కళ యేతాదృశమంచు నిక్కమెఱుఁగం • గా శక్యుఁ డెవ్వాఁడు లో
కులు వల్ రీతుల నట్టిసంగతుల నా • క్రోశింతురి కామేశ్వరీ. 79

శా. సంసారంబతి హేయమం చెఱిఁగియుం • జాలించుకోనేర మా
శంసాపాత్రముగాని యీజగమువన్ • జాపల్యమా హెచ్చు ప్రి
ధ్వంసాభావము ప్రాగభావమనుచుం • దర్కించు శాస్త్రమ్ము లీ
హింస న్మానుపనేరవయ్యది మనం • బే నేర్చుఁ గామేశ్వరి. 80

శా. ఎన్నేఁ దెచ్చితిఁ దెత్తునింక మఱియె • న్నే వస్తువు ల్వీనిలోఁ
గొన్నింటి న్దిని గొన్నిడాతుననుచుం • గొండాడు టేకాని తాఁ
గన్నుల్మూసెడినంతలో నొకటియుం • గన్పట్ట వీనీటిపై
చిన్నెల్ నమ్ముటకన్నఁ బండితునకుం • జేటున్నె? కామేశ్వరీ. 81

మ. తన తెల్వి న్ధనవాంఛచే జడులచెం • తన్ బూదెపన్నీటి పో
ల్కెను వమ్ముం బొనరించుకన్న వినియో • గింపందగు న్విద్యలో,
నని నాసమ్మతి, యెంతరాజయినఁ దా • నాపైనొకండుండు వి
ద్య నఖండమ్మ్వము త్వత్కృపావశమునం • దన్వచ్చుఁ గామేశ్వరీ. 82

మ. నినునేనమ్మినదాని కీయిహమున • న్నేర్పున్ గళావత్తయున్
ధనము న్భోగము రాజపూజ్యత కవి • త్వమ్ము న్యశమ్ము న్సుఖం

బును సంప్రాప్తిగనిచ్చుచు న్నిరతముం • బోషించు చున్నావిఁకే
వ్వానిఁగొల్వంబనియేమి యిక్కరణి నె • వ్వండిచ్చుఁ గామేశ్వరీ. 83

మ. ధనికుండైనను రిక్తుఁడైనఁ గడులు • బ్ధత్వమ్ము నన్నించు దు
ర్ధనుఁడైనన్ నృపమాత్రుఁ జే నరిగిసన్ • దాతృత్వపర్యాప్తుఁడై
వినయంబొప్పఁగ నూఱులాఱులిడి బం • ల్విశ్వాసముం జూపు నీ
యనిమిత్తంబగు పేర్మిగాక యిదినా • దా? శక్తి కామేశ్వరీ. 84

మ. ఇలువేల్పంచును నిన్నుఁగొల్చుటయు కాం • దీ రేడులోకమ్ములన్
గలవేల్పెవ్వరు? నీకుఁదక్కఁ జననీ? • కళ్యాణముల్ గోరియో
కలుము ల్గోరియొ సౌఖ్యముల్పడయఁగాఁ • గాక్షించియో నిన్ను ని
చ్చలు సేవించెద నెందుకే నగుఁగటా • క్షంబున్నఁ గామేశ్వరీ. 85

శా. నానాసాలవిశాలమై మఱియు నా • నాకల్పవృక్షాఢ్యమై
నానారత్నమయాచలాకలితమై • నానామరప్రాప్యమై
నానాశక్తికమై సుధాలసదుద • న్వత్క్షేయమై యొప్పు ద్వీ
పానన్బ్రోచెడి నీకు మ్రొక్కెద నను • న్బాలింపు కామేశ్వరీ. 86

మ. కలనైన న్గనఁజేయ మొక్కవరి వేం • డ్క న్మంత్రిణుల్వము
క్తులుగానమ్ములు సేయఁ దక్కఁగలశ • క్తుల్వేనవేల్చుట్టునె
చ్చెలులై సేవయొనర్ప మధ్యగతమా • చింతామణిం గొల్వుకో
పలఁ బేరోలగముండు నీచెలువము • న్బ్రేక్షింతుఁ గామేశ్వరీ. 87

మ. ఋతురాజుల్వసియించు చోటు సకల • శ్రీయమ్ముల గూర్చుమం
త్రితతుల్వ్యాప్చెడితావు నత్కలలు వేం • దమ్ముల్పురాణమ్ములున్
స్మృతులు న్యాయముదాల్చియుండు నెడ లో • కైకేశ్వరుం డాత్మనీ
పతితో వెలుగొందుదీవి మదిసం • భావింతుఁ గామేశ్వరీ. 88

శా. స్త్రీలై రెయ్యెడలన్ దిరిమూర్తు, లెచటం • జెల్వొందు దీవెప్పుడా
వాలం బెయ్యదిముక్తి, కెద్దిలయము • న్బాపింపదేవట్ల, నె
చ్చోఁ దత్వాద్యములు నెచ్చెలుల్ కలుములన్ • జోడించు నెద్దానిపే
రాలాపించినమాత్ర, ద్వీపమది వం • ర్ణ్యంబౌనె? కామేశ్వరీ. 89

మ. పరగేహమ్మునభుక్తి యన్యసతితో • భాషించు జల్రక్తి య
క్కఱసుం గానిపరిసక్తి నేటొకనికిన్ • గంపించు ధీశక్తి నీ

చరణమ్ముల్ గనలేనిభక్తియును ని•స్సారమ్ము లీపైఁడిటి
నమ్ములగన్నీకుము మనమ్మనంబిదియు ని•న్బ్రార్థింతుఁ గామేశ్వరీ. 90

శా. అంబా? నాదుప్రమాణపూర్తిగ నొకం•డాలింపువాక్రుత్తు నీ
చంబా జన్మమునెత్తుఁగాక గడుఁదు•శ్చంబైన దుర్వృత్తియుం
దుంబూర్ణుండగుఁగాక నెమ్మనమునం•దు న్భక్తిమై నీదుసే
వం బాటించెడి వానికెల్లజగము • న్వశ్యంబు కామేశ్వరీ. 91

శా. ఏనాఁడో భవదాజ్ఞ యాక్షణమ నే•నీసర్వము న్వీడి శ్వ
ద్ధ్యానైకాత్ముఁడనై చరించుటకు సి•ద్ధమ్మంత సిక్కెంబు నే
నే నానాశము గుర్తెఱుంగుదును గా•ని భ్రాంతియుంగల్గు నే
మో సేవించుకమున్న తెంపవలెఁ జు•మ్మో త్రల్లి? కామేశ్వరీ. 92

శా. ఆమూవిద్యలనన్నిటి న్స్వయముగా • నార్జింపఁగాఁజేసి నీ
వేయంచు న్బుధులెంచు బ్రహ్మగురు లో•కేశ్యాగ్రణుంగా సహా
ధ్యాయింగా నలతిర్పతిన్నిపి శా•స్త్రప్రక్రియ న్స్వల్పమే
నాయానమ్ముక్రవినాగ నిచ్చినదినున్ • ధ్యానింతుఁ గామేశ్వరీ. 93

శా. నేనేకర్మమెఱుంగ నన్నను భవా•నీ? మాక్కవిత్వ ప్రసా
రా నూనాశు శతావధానకృతి క•త్యాశ్చర్యపర్యాప్తులై
యీ నేర్పాజగదంబయే యిడె నటం•చెల్లన్ గవుల్ రాజసం
స్థానస్థుల్ వచియింతురియ్యది యపా•ర్థంబానె? కామేశ్వరీ. 94

శా. ఈనాఁడెందఱులేరు సత్కవులు, వా•రెవ్వరుమగ్రప్రజ్ఞ లో
లో నెన్నేని వికల్పకల్పనల నా•లోచించుచుట్టుండఁ బ
ద్యానీకమ్ముల నెన్నిట న్నను నితాం•తానందముం గావింప రం
బా! నాశక్తియన స్వశంబె? యిది, నీ•దౌశక్తి కామేశ్వరీ. 95

మ. సకలమ్ము న్సమకూర్చి దేహమొకటే • సామాన్యముం జేసి తే
మిక తెంబో? సకలామయమ్ములును నె•మ్మిన్నన్ను సేవించు ని
ట్టికలంకం బెడవాపి యెప్పటికిన•ష్టే నీవు నన్నేరిమ్రఁ గొం
డికనాఁ డాదిగఁ గోరుచుచుంట మనుచుం•టిం జుమ్మి కామేశ్వరీ.

మ. తృణము న్వజ్రముగాఁగఁ బందినొకనం•దింగా నమర్థించు నీ
వణుమాత్రంబు కటాక్షముంచి యొక మా • జాలోకనన్ జేసినన్

గణుతింపంగ వశమ్ముగానిబలము ♦ న్నైశ్వర్య మారోగ్యమున్
బరిణతుల్సేయుము నామొఱ న్నిలువరా•వా? దేవి! కామేశ్వరీ.

శా. ప్రారబ్ధమ్మది భోగ్య మన్నవిధి నీ•ప్రాపున్న మాబోంట్లకున్
గారా దయ్యది చారితార్థ్యమును బొం•దన్వచ్చునన్యత్ర, ని
న్నారాధించినదానికి న్ఫలము నే ♦ నాసించుటే యొక్కటే
భారం బెంచక దీని నిమ్మదియె స•ర్వంబిచ్చుఁ గామేశ్వరీ. 98

శా. హెచ్చౌ యోగముచేసి వెంబడిని నా ♦ కేదేని రోగంబు నీ
వెచ్చో నిక్కము మూడఁజేసెదవు వీఁ ♦ డీలాగు గాకున్నచో
నిచ్ఛన్నన్ను స్మరింపనేరఁ డని, లో ♦ నీక్షించితేమో మతే
రచ్ఛన్నిన్ను స్మరింపనో నొడువు మ•ర్మంబేల? కామేశ్వరీ. 99

మ. కరుణన్నీపతి ప్రోచె మున్ను నలమా•ర్కండేయుని, న్నన్ను నా
తురునిం బ్రోచి తదీయసామ్యమును బొం•దుంగాక నీపేర్మి, యం
బరొ? యీలాగున నెంతకాల మిఁక నీ•భక్తుండ నయ్యుం దురు
ద్ధరమౌ వ్యాధి భరింతు నీకిది యసా•ధ్యంబౌనె? కామేశ్వరీ. 100

మ. పడిసెంబో తలనొప్పియో జ్వరము తా•పంబో మతేమంచు నీ
నడికాలమ్మున గృధ్రనామకపుము•న్నర్కంపురోగంబు నా
కడకున్ ద్రోచితి దీనిపేర్దలఁచినన్ ♦ గంపించు దేహంబు, నీ
యడుగు ల్మ్రొక్కెద దీనిబారికిఁకఁ ద్రో•యంబోకు కామేశ్వరీ.

శా. పున్నెం బెన్నఁడుచేసి, నేనెఱుఁగ, నే•ప్రొద్దు న్మహాపాపసం
పన్నుండ; న్పరదూషకుండను; పశు•ప్రాయుండ; దుష్టుండ; నా
పన్నుండన్; శరణంటి; నాపిదప, నా•భాగ్యంబు, నీచిత్తమా
పన్నార్తి ప్రశమౌషధాయిత కృపా•పారీణ కామేశ్వరీ. 102

మ. "వదరాపావదరా" యటంచు మెడపైఁ ♦ బాశంబులం బెట్టి గెం
టుదు రాకాలునిభృత్యు లంచు మదిలో• డొంకింతయున్ లేక నీ
పదభక్తిన్విడనాడి పందనయి పా•పం బెన్న నార్జించి నీ
పదరాజీవము లాశ్రయించితిని సం•పాలింపు కామేశ్వరీ. 103

శా. బాల్యంబెల్లను గ్రీడచే నరుగుఁ బో, ♦ భామారతిప్రక్రియా
లోల్యోద్రేకముచేత యౌవనము నే•లంగూలు; సంతప్తమా

మాల్యంబో యన నొప్పువార్ధకము దా • మాయుంగదా? చింతల
న్నల్పంబు ల్మిగులున్ ద్వదీయపదవి • న్సాధింపఁ గామేశ్వరీ. 104

మ. తపముం జేయఁగ లేదు, దానములు నేఁ • దథ్యంబుగాఁ జేయ లే
దెపుడుం, బెద్దలువల్కు చట్టముల యం • దిచ్చం జరింపంగ లే
దిపు డేలాగుననో, భవచ్చరిత మం • దిష్టంబు గల్గెన్ మదిన్
నెపము ల్మాత్రలకుం దొలంచి ప్రోవుమి ననుం • న్నీచాతుర్యఁ గామేశ్వరీ.

మ. జననీగర్భములోనఁ గొన్నిదినము • ల్సాధుత్వముం జెందియుం
టినొ లేదో వివరింప రా,దవల నా • తీవ్రుల్గణింపంగ నీ
తను శక్యంబని యెంచఁబో ననిన, నా • కుంజక్కఁగా నీకడ
న్మనవిం జేయఁగ నెట్లు శక్యమగు? న • న్మన్నింపు కామేశ్వరీ. 106

శా. 'శ్రీరంజిల్లెడిపద్యము ల్శతకమై • చెన్నొందఁ నీమీఁద నే
నారంభించిన దాది నిన్నడుగు నా • యాకోర్కులన్ గొన్ని మున్
దీరన్ దీరుచునుండెఁ దీరఁగల వీ • తీ రొక్కింత సూచ్యార్థతన్
గూరన్వచ్చెడి దాని సూచనలెటుం • గున్ గాదె? కామేశ్వరీ. 107

సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

తిరుపతి వేంకటేశ్వరులు.

శ్రీరామాయనమః.

# రామచంద్రాహరిశతకము.

## 1. స్తుతిదశకము.

శా. శ్రీసీతాహృదయాబ్జ భాస్కరదరా రివిస్ఫురద్బాణ బా
ణాసోపేత లసచ్ఛతుష్కరశరీ రాశ్లిష్టగోదా ఝరో
చ్ఛ్వాసపోల్లలదంబుశీకర నిజ స్థానైక భద్రాద్రియు
గ్ధాన శ్రీకర నన్నుఁ గైకొనుము పేం ద్రా రామచంద్రాహరీ. 1

శా. నాకస్త్రీఘనశీలోకమండన యహీన స్వర్ణశైలోపమా
నైకస్థాణుశరాసఖండన ప్లవం గేశాధిపత్యోదితో
ద్రేకాఖండల పుత్రదండన శర శ్రేణీశితా రాజి సే
నాకృద్ఖండన నన్నుఁ గైకొనుము పేంద్రా రామచంద్రాహరీ. 2

మ. సదసద్వస్తు వివేకకారణ దశా స్యక్రవ్యభుగ్ధోశ్శికః
కదళీకాననమత్తవారణ న గాకారస్ఫురత్కుంభక
ర్ణదురంతాభ్రమహాసమీరణ గతి గ్రావారిదిత్సాధ్వన
ప్రదమాయారణ నన్నుఁ గైకొనుము పేంద్రా రామచంద్రాహరీ.

మ. స్ఫురదష్టాపదదివ్యభూషణ మహా హాభంగసందోహ దు
స్తరగంభీరపయోధిశోషణ నిర స్తస్థూలదేహోజ్జ్వల
ఖరమారీచవిరాధదూషణ వివే కశ్రీకశుశ్లోక నా
దరసంభాషణ నన్నుఁ గైకొను ముపేంద్రా రామచంద్రాహరీ. 4

మ. అతిపాపౌఘసమీరతక్షక ఖరేంద్రారాతిపుత్రాతికా
యతనూకాననసర్వభక్షక సదీ క్షారూఢమానిక్రతు
ప్రతికూలామరవైరిశిక్షక మహా పంకేజగర్భాండ సం
తతిసంరక్షక నన్నుఁ గైకొనుము... 5

శా. ఘోరాఘూర్జనమర్త్యపావన బహు క్షుద్రాసురానీక సం
హారార్ధాశ్రితదండకావన ప్రసూ నాస్త్రక్రియానంభ్రతో

దారైకాత్మకళత్రయావన రహ•స్స్తోత్రోపదేశక్రియా
ధారార్హ్యావన నన్నుఁ గైకొనుము... 6

శా. పీతాజ్ఞానజనప్రపూజిత చతు•ర్వేదేతి హాసాగమ
శ్రౌత్రి గ్రంథపికైకకూజిత పయో•రాకేందు నీహారతా
రాతు లోద్యుదయశోవిరాజిత సము•ద్రిస్వాంత నీరేరుహా
వారితభ్రాజిత నన్నుఁ గైకొనుము ... 7

మ. వనజాతాయతచారులోచన మహా•వాల్మీకిచేనన్షి వా
గనుయోగోత్తరకావ్యసూచన మహో•ద్యన్మౌనియోషాఘనా
ఘనసంయోగదశావిమోచన నిజాం•గన్యస్తకర్పూరచం
దనగోరోచన నన్నుఁ గైకొనుము... 8

మ. అజభూపాలసుతాగ్రనందన సమ•స్తామర్త్యమౌనిద్విజ
వ్రజచేతః పరితాపచందన చతు•ర్వారాట్ప్రకీర్తావనీ
సజనాధీశకృతాభివందన హితా•గస్త్యాయమానేశ ప
ద్మజసంక్రందన నన్నుఁ గైకొనుము ... 9

మ. అమరావజ్జలదప్రభంజన మహో•గారణ్యసంవాస సం
యమివిద్వేషసురారిభంజన ప్రపం•చాదృశ్య వేదాంతవే
ద్యమహావస్తునిదర్శనాంజన స్థిర•ధ్యానానుసంధాన భ
క్తమనోరంజన నన్నుఁ గైకొనుము... 10

## 2. వాక్యోన్నతిదశకము.

శా. శ్రీవైదేహసుతాదరీ స్ఫురదరీ • చింతాసరివంతీతరీ
కైవల్యాగ్రపురీ భవద్విరదశి•క్షాకేసరీ భూమిభృ
జ్జావాల్మీకిలసద్వచోమృతఝరీ • శౌరీ దరీ పోషిత
గ్రావారీ దయ నన్నుఁ గైకొనుము... 1

శా. రామా పాపవిరామ సూర్యకులపా•రావారరాకాసుధా
ధామా భక్తహృదబ్జధామ భువనాం•తర్యామివౌ నిన్నుఁ గన్
సామా న్యోక్తులనెన్న సర్వపదవా•చ్యత్వంబు నీదౌట నే
నామోదించితి నన్నుఁ గైకొనుము... 2

మ. సతతానేకముఖ ప్రవాహతతిచే నీ•సంజాతహేతుక్రియా
న్నతధాత్రీధరపంక్తితుల్యులగు నా•నాలోకభాషాకృతి
ప్రతిభోత్పత్తినిదానమత్కవుల నేఁ•బ్రార్థింతువారెల్ల భా
రతిసారూప్యులు నన్నుఁగైకొనుము ... 3

మ. ఘనమేధాంజన సత్కవింబలెఁ గృతి•స్ఫూర్తి సౌఖ్యదార్థార్థముం
గనవేరంథపరంపరాళిఁ గవుల•ర్కాపాంశు సంతానముం
గని హర్షింపఁగఁ జక్రవాకములవీఁ•కన్ ఘూకము ల్బాలునే
దనుజౌఘాంతక నన్నుఁగైకొనుము... 4

మ. క్షితినేకాదశసంఖ్యచే దశకము•ల్చెన్నొంద మాణిక్యవ
జ్రితతింగూర్చినహారపంక్తిగతి గీ•ర్వాణాంధ్రశబ్దంబులన్
శతకగ్రంథమొనర్చి నీకొసఁగెద • న్సర్వేశ యస్మత్కవి
త్వతపస్సిద్ధికి నన్నుఁగైకొనుము ... 5

మ. అమలాంభోమయమౌ భగీరథికినీడై • యాద్యభాషాకృతుల్
యమునా ముఖ్యనదీయుతా పగకుజో•డై యష్టభాషామయాం
ధ్రమహోద్యత్కృతులొప్పఁ దత్కృతులతా•త్పర్యామృతం బా
త్మసా, నముగావించెడి నన్నుఁగైకొనుము ... 6

మ. సకల శ్రీశతకంబనేరథమున • న్శార్దూలమత్తేభనా
మకవిక్రీడితవాజులం బెనఁచి స•మ్యక్సంస్కృతాంధ్రోక్తి కా
ర్ముకబాణంబుల నర్థసూతు నుపమా•రుక్మధ్వజంబు న్సము
త్సుకతంబూన్చితి దానినెక్కియుట మ•త్పుణ్యేతరోత్కరక కం
టకులందుంచుచు నన్నుఁగైకొనుము ... 7

మ. పలుకీతి స్మినుఁబల్కుకావ్యము గ్రహిం•పంజూడు మూతప్ప లిం
దులలెక్కింపకు మీకృప న్శబరిమా•ధుర్యార్థమై తొల్త నే
ఫలముల్ దాఁచవిగాంచి నీకొసఁగిన • న్భక్షింపవే యెంగిలిం
దలఁపంజూచితె నన్నుఁగైకొనుము... 8

శా. శంకాతంకవిమోచనాష్టవిధ భా•షాశబ్దసంసిద్ధిసా
లంకారైకకృతు ల్సుధారుచులఁ గో•లల్గంజాలుటీలన్ గతా

లంకారాంధ్రీకృతు లెంచింపవననే•లా నీరమేసాక్షి సా
హంకారుంగృప నన్నుఁగైకొనుము ... 9

శా. దివ్యత్మ్రజము వర్ణపుష్పఫలమం• క్తింబోల్చినట్లొప్పు భ
వ్యవ్యాహార రసోపమానపదశ•య్యా సిద్ధిసిద్ధించుఁ ద
తాఁకావ్యం బెవ్వరు విన్నవౌనని శిరః•కంపంబు గావింపరే
కవ్యాదాంతక నన్నుఁగైకొనుము ... 10

## 3. దాససంగతిదశకము.

శా. శ్రీవిశ్వేశ్వరయాత్రవార్తలు ధరి•త్రీభర్తకు న్వందితాఁ
గైవారంబొనరించి తెల్పుగతి లో•కస్వామివౌ నీకిఁక
న్నావృత్తాంతము విన్నవింతుఁ జెవిసిం•డం జిత్తగింపందగున్
దైవగ్రామణి నన్నుఁగైకొనుము... 1

మ. జననీదుర్భరగర్భనారక నివా•సక్లేశతంబుట్టి పు
ట్టిననాఁ డాదిగ జంత్రపుంబ్రతిమమా•డ్కిన్ బాల్యకౌమారయౌ
వనవార్ధక్యములందుఁ గాలవశత • న్వర్తించుచున్నాఁడ నేఁ
డనుకంపామతి నన్నుఁగైకొనుము ... 2

మ. జననంబాదిగ సంసృతింబడి దురా•శాపాశబద్ధుండనై
నినుఁగీర్తింపఁగనైతి నిప్పుడయిన • న్నీనామ మావృత్తిఁ గొ
ప్పిన నాజిహ్వకునిల్పు పావకమయః • పిండంబునందుండ దా
ధనముక్తిప్రద నన్నుఁగైకొనుము ... 3

శా. ఆవాసాంగణ భూమిఁ దాఁగతుకుకై •యాస్థన్ దివారాత్రులెం
తో వాపోయెడు సారమేయముగతిన్ • దుర్వ్యాప్తి దారాదిర
క్షావృత్తింబడి వ్రిల్లదింతునెపుడు• న్నంపన్నుఁగొల్చి సీ
తావామాక్షిప నన్నుఁగైకొనుము ... 4

మ. తలఁపన్ జాగ్రదవస్థ సర్వమును నే•దారాదిరక్షార్థమై
బలిమిన్ వ్యర్థము నేయఁజొచ్చితిఁ బహు•ప్రాయుండనై ధర్మముల్
వలుకంగా వినుమన్ క్షణంబయిన నిన్భా•వింపలేనైతి నో
నలినక్షేవణ నన్నుఁగైకొనుము .. 5

మ. చిరకాలంబు మహోపలంబుగతి నే • జీవించువానిం బలెం
బురుషార్థత్రితయంబుఁ గోరి జనత • న్మోక్షం బపేక్షింపక
స్థిరదారాదికపోషణార్థము పరా • ధీనుండనైతి న్నమా
దరచేతోగతి నన్నుఁ గైకొనుము... 6

మ. ప్రతివీథి న్మశకంబువై ఖరిఁ బ్రతి • గ్రామంబుఁ గాకాకృతిం
బ్రతిగేహంబు బిడాలముం బలెవిధి • ర్వఁజొచ్చి వర్తించుచుం
బ్రతిమర్త్యాధమునిం బిశాచముబలె • న్బాధింతు విత్తార్థమ
ప్రతిమమ్మట్టిమ్మని నన్నుఁ గైకొనుము ... 7

శా. శాంతస్వాంతముగల్గి యింగితమతి • న్సత్సంగతిం గోరి యే
కాంతగ్రంథముఁ జూడనోపక నిహా • వ్యాపారవిద్యాపరి
శ్రాంతిన్మూర్ఖుఁడనైతి మర్కటకిశో • రన్యాయతన్నిన్ జగ
త్కాంతున్నీవడవి నన్నుఁ గైకొనుము... 8

శా. అన్యస్త్రీదర్శనాన్నకాంక్ష బహుపు • ణ్యాపాయ మీదేశకా
లాన్యోన్యవ్యతిరేకతం బరవశ • వ్యాసంగత న్నాకు సామా
న్యవ్యక్తిం ఘటించెనేని కరుణ • న్మార్జాల లీలాకిశో
రన్యాయంబున నన్నుఁ గైకొనుము ... 9

మ. అతిథిబ్రాహ్మణదేవతాపితృపద • ర్యాదూరుఁ బాపాత్ముసం
తతవేదోదితకర్మహీనుఁ గృపణు • న్నన్నెట్లు రక్షింతువా
పతితప్రాకృతపావనాఖ్యుఁ దలం • పన్ హానిప్రాపించు నీ
క్షితినిల్చైననటంచు నీవు కరుణం • జేపట్టితే నేము దు
ర్మతినై పేర్లెదు నన్నుఁ గైకొనుము... 10

## 4. మనోవృత్తిదశకము.

శా. శ్రీనాథా సకలేంద్రియంబులు మనో • వృత్తిం బ్రబోధంబులై
దానిం గూడ నినాడ బోధములుగున్ • ధారాధరంబు ల్జగ
త్ప్రాణాధీనములైనరీతి సదితో • ల్త న్సర్వసంకల్ప మూ
లానుష్ఠానము నన్నుఁ గైకొనుము... 1

మ. తనుసర్వేంద్రియనాయకంబగు మనస్తత్త్వంబు నిత్యప్రవ
ర్తనత స్వర్గగుఁడైన గాఢ్వగతి మిథ్యావృత్తి వర్తించు న
ర్థనిమేషంబును నిల్వదొక్కెడ భవత్పాదారవింద ద్వయా
ర్చనమెట్లబ్బెడు నన్నుఁగైకొనుము... 2

శా. ఆకాశంబునఁదోఁచు శబ్దగుణకంబైన న్మదిందన్నభో
నీకాశంబనఁగూడదయ్యెఁ దెలియన్నిశ్శబ్దతా వాప్తిఁదృ
ష్టాకామ్యోన్నవహేతు చిత్తమఖిలజ్ఞానేంద్రియాపేతమో
రాకాబ్జానన నన్నుఁగైకొనుము ... 3

శా. ఆశాసంజనితానలంబు విముఖాశావాప్తిఁ దానొందుచో
లేశంబైన గతించుకాలము తటిల్లేఖాగతిం జిత్తమో
దేశంబంత తలంచుమంత్రినెప్రిఁ వర్తించు న్మహాసూక్ష్మమై
దాశార్హాహ్వాయ నన్నుఁగైకొనుము ... 4

శా. సంకల్పంబులు బంధకారణము లాసంకల్పవర్గంబు ని
శ్శంకాకల్పితమోక్షమూల మిరుపక్షప్రాప్తికిన్ హేతువే
కాంక్షుండైన గతి న్మనంబు జనకంబై యొప్పు నారెంటికా
తంకస్వాంతుని నన్నుఁగైకొనుము ... 5

మ. గిరులంగూడిరహించు స్వేచ్ఛబయలంగ్రీడించు నెందేపయో
ధరమంత్రిక్షితమైన వైఖరిని జిత్తంబిందిరోపేతమై
తిరుగున్ జాగ్రత నొంటిస్వప్నమునవర్తించు న్సుషుప్తిన్ ధను
ర్ధరశూన్యంబగు నన్నుఁగైకొనుము... 6

శా. దేవాపత్యహ మీషణత్రితయవృద్ధింగోరి భ్రాంతి న్భవ
త్సేవాశూన్యమునొందెఁ జిత్తము పిటస్త్రీజారభోగాశచే
జీవేశత్రితశూన్యమైన కరణిం జేతోవశాభావ క
ర్మావేశుండను నన్నుఁగైకొనుము... 7

మ. ధర నేనూకృతిఁదాల్చునో యపుడు దద్భావప్రసంగైకచా
తురివర్తించిన వేషధారిగతిఁజేతోవృత్తి యొక్కొక్కవే
శరజస్సత్త్వతమో గుణత్రయము లీలంగూడి తత్తద్గుణో
త్తరబోధ్యంబగు నన్నుఁగైకొనుము ... 8

మ. పగలున్రేయును లేక యెప్పు డవినా•భావైకసంబంధమై
న గుహాక్రాంతతమంబువైఖరిని శూ•న్యజ్ఞానిచిత్తంబు మె
చ్చుగ నేకాలములౌక్యచింత నొనరిం•చున్ సంసృతివ్యాప్తికిం
దగులంబొనది నన్నుఁగైకొనుము... 9

మ. చనుచుం గుమ్మరిపుర్వమేన లవలే•శంబంతయుం బంకమం
టనిచందంబున జ్ఞానిచిత్తముఘుదా•ర్ఢ్యంబైన యీసంసృతిన్
వనటంగూరుచు మీఁదెఱింగి తదగ•వ్రాతంబు రానొంద దా
త్మనెచింతించును నన్నుఁగైకొనుము... 10

## 5. సంసారదశకము.

శా. శ్రీనారాయణ యీషణత్రితయవా•రిం గామభంగాళిఁ దృ
ష్ణా నిద్రాదికజంతుపంక్తిఁ దగు నీ•సంసారవారాశి దు
రాత్మనాజ్ఞానతఁగూలి దరిఁజేర న్నే•రనైతి న్రమా
ధానప్రేమత నన్నుఁగైకొనుము... 1

మ. జడతిఁజొచ్చిన తుంగభంగిఁ దటినీ•సందోహనీరంబుకై
వడినిస్సారము దుర్విచారము మృషా•వాక్పూరసంసార మం
దడుఁగున్ వైదికలౌకికక్రియల నే•నార్జించువిత్తం బిఁకం
దడయంజూడక నన్నుఁగైకొనుము... 2

శా. పారంబెంతటఁ గానరాక నడుమ • న్భంగక్రియల్గల్గి దు
ర్వారంబై జడతాభివృద్ధిగతస•త్త్వంబై భృశంబైన సం
సారాంభోనిధిఁ జిక్కినాఁడ వెసఁ•న్నక్యంబె వేవేమహా
త్కారుణ్యంబున నన్నుఁగైకొనుము... 3

శా. అంతర్దాహక బాడబాగ్ని గలయ•య్యంబోధి చందంబునన్
గాంతాదీషణ వృద్ధిఁదోఁచెడి మహా•కామాదివర్గంబుచే
సంతప్తంబగు భంగసంగతిని సం•సారంబు యుష్మత్పదా
క్రాంతస్వాంతుని నన్నుఁగైకొనుము... 4

మ. ఘనఝంఝూ పవనప్రకంపిత తటిం•గాండప్రకాండాబ్ధి దా
ర్కొని లోనఁగుదియించురీతి జడధీకు•క్షింభరా యీసమ

ర్త్యాని సంసారము దుష్టకష్టజనితా • ర్తుంజేయు నోహో జనా
ర్దన కారుణ్యాతినన్నుఁ గైకొనుము . 5

మ. బహుకామోత్కములు క్రోధబాడబములో • భయోరము నోహ దు
స్సహనిమ్నంబు మదాంబువాహిచులు మాత్సర్యోరుసత్త్వంబులి
మ్మహి సంసారపయోధిఁ దార్కొనఁదరిం • ప న్శక్యమే దుష్టని
గ్రహ శిష్టావన నన్నుఁగైకొనుము... 6

మ. దురిహిణాహఃపరిశయంబునందు నిఖల • ద్వీపంబుల నావ్ధివి
గ్రహ మూర్తింగబళించుదీతి నిహసం • సారాగ్నులంగాల స
న్నిహితంబైనఁ గలంచిముంచు గిరమీ • నిస్సార సంసారమో
యహిభృద్వందిత నన్నుఁగైకొనుము... 7

మ. అమితాయామ సమత్రుష్ణిజీవనమతి • వ్యాయామ కల్లోల మ
ల్పమనోగమ్యము గోచరప్రచురమీ • పంకాంకితాతంక దు
ర్దమ సంసారము సాగరోపమ మహో • దానిందరింపంగ శ
క్యమె మూర్ఖాళికి నన్నుఁగైకొనుము... 8

శా. ఆశోపేతము బద్ధదూర మవిధే • యంబైన సంసారమీ
యాశాంతంబున బద్ధసంగతి విధే • యత్వంబు నంబొల్పు వా
రాశిస్మృతి ద్విజాలినైన నదరిఁ జే • రంబోవఁగా నీదనం
తాశాబద్ధుని నన్నుఁగైకొనుము... 9

శా. నారాంభోధిని బోల్పనీడగునె సం • సారంబసారంబ నా
ధారంబైనను దుస్తరత్వము సహో • తత్త్వంబు వాటించి ము
న్నారోపించిరి దీనికార్యులుప • మేయ త్వోపమానత్వముల్
ధారాళంబని నన్నుఁగైకొనుము... 10

## 6. మాయాదశకము.

శా. శ్రీ సర్వేశ స్వయంప్రకాశివగుచుం • జెన్నొందు నీసచ్చిదా
భాసంగప్పినమాయ నీకుశలబ్ర • హ్మాత్మ జీవత్వముల్
దాసంఘిల్లఁగఁజేసి గర్భగతము • క్తాశుక్తిచందంబునన్
భాసిల్లుంగద నన్నుఁగైకొనుము... 1

మ. తనప్రాగ్భావము ప్రాగభావమును నిత్యభ్రాంత చింతాదరి
దుర్రి చాపల్యమనోరథంబు కరణి నూరించుచున్ విశ్వమో
హనమూర్తిం దనచాతురీమహిమ మాయాశక్తి వర్తించునో
యనిరుద్ధాహ్వయ నన్నుఁ గైకొనుము... 2

మ. అవనీముఖ్యసమస్తతత్త్వ సమవాయత్వాకృతి న్నీదుమా
యవివాదస్మృతినొప్పఁ దంతుసమవాయత్వాంబరంబుంబలెన్
భువనంబు ల్దనమూర్తిగాఁ బెనుపుచుం బోకార్చుచుంబొల్చు దా
నవగర్వాపహ నన్నుఁ గైకొనుము... 3

మ. తనయంతత్వముఁ దెల్పుచుం బకృతిచిత్రింబా ననాదిత్వముం
దనకున్నైజగుణంబుగా నిరుపమానఘ్రాణి యుష్మద్దశా
నన ఘోరావహ రూపముం దెల్పుచుండన్ దాని చాతుర్యమే
మని యెన్నందగు నన్నుఁ గైకొనుము... 4

మ. సగుణావిద్య రజోగుణాశ్రయమున న్సత్త్వత్వము న్శుద్ధస
త్త్వగుణాఖ్యాతిని బోషణత్వముఁ దమోధాటి న్లయత్వంబుఁ బూ
ని గుణంగాలవిభేదతంద్రివిధనై నిష్ఠాక్రియారంభ సం
ధ్యగతిన్వర్తిలు నన్నుఁ గైకొనుము... 5

శా. మధ్యస్థ యకార్యకార్యముల నమ్మంజేయు నిద్రిన్సహ్య
నిర్ధ్యావిద్యత దాకృతిన్ భవనము న్నిర్మించి మాయించుచున్
సాధ్యాభావత శాశ్వతంబని ప్రపంచం బెల్లనమ్మించు నా
త్మధ్యానప్రియ నన్నుఁ గైకొనుము... 6

మ. లయకాలాగ్వపుమేనులందుఁ జిరకాలభ్రాంతిఁ బుట్టించి మో
హయుత స్వాంతులఁ జేసె మాయ "మమమాయాదురత్యీనాందుర
త్యయ"యంచున్నరుతోడ నీవనిన గీతావాక్యమే రూఢి నీ
దయకుం బాత్రుఁడ నన్నుఁ గైకొనుము... 7

శా. ప్రారబ్ధానుభవాంతముం బ్రకృతిసర్వప్రాణిదేహాంతముం
దాయాపించె రపప్రభాంతమె దినాంతంబైనరీతిం దదా
కారప్రాకృతదేహదుర్మతు లెఱుంగన్నేర్తురే తచ్చమ
త్కారప్రౌఢిమ నన్నుఁ గైకొనుము...

శా. ఇష్టాశ్చర్యములన్ స్మరించి సభిరు • ల్వీక్షింప మాయించునా
సృష్టత్వవ్యసనేంద్రజాలికరణిన్ • సంకల్పమాత్రిన్ జగ
త్సృష్టిస్థిత్యవసానము ల్ప్రకృతి దా • జెల్లించుచుండు న్మనో
దష్టకోర్రిఘుని నన్నుఁగైకొనుము ... 9

మ. కలిమిన్లేమిని నెండమావులగతిం • గాయంబులన్ బుద్బుదం
బులరీతిన్ క్షణభంగురంబులనుచు • న్భావించు విద్వన్మహా
త్ములు నూకున్వీనువారినైన నపుడే • మోహింపఁగాఁజేయు మా
యలఘుస్వాంతుని నన్నుఁగైకొనుము... 10

7. తత్త్వదశకము.

శా. శ్రీదామోదర పద్మజాండసహజ • క్రీడామహత్త్వముల్
వేదాండావయవంబు లద్దములలో • లీనంబులై తోఁచు మ
ర్యాదన్ సూక్ష్మములై సమస్తమును బిం • డాండంబులందుండుఁ గా
దా! దీనావన నన్నుఁగైకొనుము... 1

మ. ప్రకటంబై తగుభూత తద్విషయక • ర్మజ్ఞానము ల్నాల్గుపం
చకము ల్చిత్తచతుష్టయంబుఁ గృతిగా • సంధిల్లుటేనూయ త
త్ప్రకృతింబోఁచిన నిన్ను జీవుఁడనుచుం • దత్సాక్షివౌ నిన్ను వే
ఱొకషడ్వింశతి తత్త్వ చుయ్యఁ డనియా • ర్యు ల్బుద్ధిలెక్కింతు రెం
తకు సాంఖ్యంబిది నన్నుఁగైకొనుము ... 2

మ. ఘనసిద్ధాసనమందు యోగిగురువా • క్యప్రౌఢి లక్ష్యత్రియం
బునఁ దన్నంగనుమండలత్రితయధా • ముం బిమ్మటన్ శాంభవిం
గనుచున్ ఖేచరిముద్రిపూని పరసౌ • ఖ్యప్రాప్తుఁడౌ తారకం
బనుతత్త్వంబిది నన్నుఁగైకొనుము... 3

మ. విమలాత్ముండగు రాజయోగివరుఁ డ • న్వేషించు భ్రూమధ్యభా
గమునన్ లోనమనస్కముద్రను జిదాకా • శంబునం దైక్యమం
దమనస్తత్త్వముఁజేర్చి వెన్నెలబయ • ల్దర్శించు నద్వైతుఁడై
యమనస్కంబది నన్నుఁగైకొనుము... 4

మ. తలక్రిందై పిపమాను చు న్విగతత • త్త్వస్వాంతునింజేయు గుం
డలినిభ్యాసిత కుంభకుండటు త్రికూ • టస్థాన మెక్కింపరే

వెలుఁగు నాగ్రహువుపట్టినట్లొడిసి కీ•విందాగ్రప్రథీవ్యక్తకళా
పలపీయూషము నన్నుఁగైకొనుము ... 5

మ. మునుదర్శింపనశంబుగాని తనమో•ము స్వర్ణోపాధిఁ గ
న్గొని నట్లాత్మగురూపదేశమున యో•గుల్గాంతు రేకాంతద
ర్శన యోగైక్యసమాధిచేఁ ననరియ•ప్రత్యక్షమైయున్న యా
త్మను గారుణ్యత నన్నుఁగైకొనుము... 6

మ. మహిగంగాయమునాసరస్వతుల సం•బంధంబునం దత్ప్రయో
లహరింబొల్చ త్రివేణిక్రింకఁ జనసే•లా యిడ్యాపింగళా
సహితంబైన సుషుమ్నలోని మన స•స్నానంబపేక్షాతమో
రహితంబైనది నన్నుఁగైకొనుము... 7

మ. పికమాది స్వభుజిష్ణువాసగతమై • పెంపొందిచేవేసవిన్
స్వకులశ్రేణినిగూడినట్లు పరత•త్వజ్ఞాని సంసారవా
హకుఁడైనాఁ దగికర్మపాకసమయంబై • నంబరంబందు నా
త్మకళాగామక నన్నుఁగైకొనుము... 8

మ. నిజగేహంబునఁ గల్గువాయసము దు•క్షితివిసర్జించి య
న్యజనాన్నంబు భుజింపఁగోరు గతినా•త్మారాముని న్నిర్వికా
రుజున్నాథుఁ బరేశునిన్నుఁ బ్రతిమా•రూపంబులన్ లక్ష్యదూ
రజనుల్గొల్తురు నన్నుఁగైకొనుము 9

మ. తొలుతన్నాల్గిటి నాలుచేర్పఁ బదినొం•దు న్వానిబండ్రెంటిలోఁ
గలుపన్ షోడశసంఖ్యచేరు నవి వే•గనెంటితోఁగూర్ప ని
ర్మలభద్రాసనమందు షణ్ముఖిని బు•ర్వభ్రమ్యతపాకైనఁదై
జలముల్వాలనుగూడినట్లు హాంసం•స్కారుండు నిర్వాణదునో
దళసంజ్ఞాత్మక నన్నుఁగైకొనుము ... 10

8. అభేదదశకము.

శా. శ్రీరామా మహదంబరంబు ఘటకు•క్షిచ్ఛిన్నమైతోఁచి న
ట్లారూఢింద్రిజగన్మయుండవగు నీ•వద్వైతనూపాధుల
న్వైరైతోఁచుచెలిఁగి నిశ్చయమతి • న్వైద్వజ్ఞుల్ సోహమం
చారాధింతురు నన్నుఁగైకొనుము... 1

మ. శతపత్రాప్తికి వృద్ధిసంక్షయము లెం•చంగల్గునే తత్కళా
తతికింగాక తదాకృతిస్ఫుట విధో•త్పత్తి ప్రణాశంబు ల
ద్భుత చైతన్యవిశిష్టదేహములఁకొం•దుంగాక జీవాత్మకా
తతమైకల్గునె నన్నుఁ గైకొనుము... 2

శా. దివ్యంబై రవిమింటనుండిన ఘృణు•ల్దీపించు చందంబునన్
ద్రిస్ఫారగుణాత్మకా స్థిరశరీ•రస్థేంద్రియంబుల్ నిజాం
తవ్యాపారమొనర్చు నీవును దట•స్థవ్యక్తి నుండం దురం
తవ్యాసంగుని నన్నుఁ గైకొనుము... 3

మ. ముకురోపాని పరంపరంగ్రమగతిం • బొల్పొందుబింబాను బిం
బకదంబంబులబోలెన్ భవన్నిరుపమా•భాసాను భాసాప్రతి
ప్రకరంబొప్పఁ దనూపరంపరలలో • భాసిల్లునద్వైత సా
ధకదృష్టాంతత నన్నుఁ గైకొనుము... 4

శా. ధేనుస్తోమ మనేకవర్ణములఁ బృ•స్వస్వర్తిలుం దత్తనా
ధీనక్షీరము లేక వర్ణమగురీ•తిం బెక్కుభిన్నాంబు లీ
నానాదేహము లాత్మలొక్కటగుఁగా•న న్నివెకాజీవసం
తానంబైతివి నన్నుఁ గైకొనుము... 5

మ. ఉదకస్థప్రతిబింబసంచలన మ•య్యూర్ధ్వప్రచార ప్రసి
ద్ధదినాధీశునకుంబలె న్మహదపి•ద్యారూపసంబంధ తా
విదితాభాసలసంటుకర్తము మహా•విద్యామయు న్నిన్నునోం
దదభేదప్రియ నన్నుఁ గైకొనుము... 6

మ. కలశోపాధిఁ బృథగ్విధంబున నదీ•గర్భంబునందుం జలం
బులుగానంబడుకీతి నీవును జగ•త్పూర్ణుండవై యుండి లో
కుల దేహస్థితిభేదమైతివిఁక నీ•కున్ దేహికి న్భేదముల్
దలఁపంగల్గునె నన్నుఁ గైకొనుము... 7

శా. దేహాప్రకరణంబుచేత సదస•ద్భేదంబుచే జీవసం
దోహంబు న్నినువేఱుగాఁదలఁతు రెం•దున్భేదవాదప్రియుల్
వ్యాహారార్థము లర్థభేదములఁజే•య న్నైక్యమేముక్తుఁడా
సోహంబన్నను నన్నుఁ గైకొనుము... 8

మ. అమితోచ్ఛ్వాసము చర్మభస్త్రిగతి వేఁడై యుండి తత్పూర్వకర్మ
ద్రుమునంజాతి మహానిలుంగలయు మధ్యాదన్ శరీరావృతి
భ్రమత న్వేరని తోఁచు జీవుఁడు భవాపాయంబునన్ యుష్మదై
క్యము నొందుం గృప నన్నుఁ గైకొనుము ... 9

శా. బ్రహ్మైవాహమటంచుఁ దెల్పు నిగమగ్రంథాంత వాక్యంబులన్
బ్రహ్మజ్ఞుల్మది విశ్వసించి శమమొప్పం దామె నీవంచుఁ జి
ద్బ్రహ్మానందముఁ బొందుచుండు దురభేదత్వప్రసిద్ధంబుగా
బ్రహ్మేంద్రార్చిత నన్నుఁ గైకొనుము ... 10

9. దీనత్రాణదశకము.

శా. శ్రీగోవిందసపంజరాండజము శుష్కీభూతమైనట్లు వి
ద్యాగర్వాంధజల గ్రహగ్రహణవాదద్వంద్వుఁడై కుంఠిత
న్నాగేంద్రస్తుతివైఁ జేసి చిరచింతం బాపి రక్షింపవే
రాగగ్రస్తుని నన్నుఁ గైకొనుము ... 1

మ. సతము న్సత్వరజస్తమోవృతికళా సంక్షేపతాపవరా
కృతినాక్రాంతతమః కనిష్ఠజననీ కృత్యావమానంబునన్
గతవాంఛామతిమానినైయొస ధ్రువునాకాశస్థలంబంద నా
రతుఁ గావింపవె నన్నుఁ గైకొనుము... 2

మ. ప్రసవాంధత్వపుఁ దల్లివాతఁబడి యాపత్తిం బ్రలాపించు దు
ర్వ్యసన వ్యాఘ్రకిశోరముం బలెఁ దమోరాగాంధుఁడై తండ్రి తా
మసదుర్బాధలఁ గుందుచున్న సుమతిం బ్రహ్లాదు రక్షింపవే
యసమప్రాభవ నన్నుఁ గైకొనుము ... 3

మ. ననుదాజ్ఞానతనోదయంబుఁ బడి కష్టప్రాప్తిచే నష్టధీ
తిమిరవ్యాప్తి నశించు నక్కరిణికిన్ శాపసంజాతక
ష్టము నంగుందెడి యా యహల్య చిరదుష్కర్మంబు మాయించి గౌ
తమునిం గూర్పవె నన్నుఁ గైకొనుము... 4

మ. క్షణదాంతంబున భాస్కరాభ్యుదయశంక న్వాల్వాలంబోవు రో
హిణి జేఁడుఁ బలెనన్నచే బయ్యశోహీనాత్ముఁడై కుందుచున్

రణవీథింగృశియించు భానుజుఁగృపన్ రక్షింపవే వాలివా
రణపంచానన నన్నుఁ గైకొనుము... 5

మ. తనగోత్రాంతభయావహంబునకుఁ జింతంగుందు మైనాకుఁడ
బ్ధిని సేవించినరీతి గోత్రిలయభీతి న్నిన్ను భక్తింభజిం
చినసద్దోషి విభీషణుంగరుణచేఁ జేపట్టవే తద్దశా
ననసంహారక నన్నుఁ గైకొనుము... 6

శా. కాదంబోర్మిసమునుంగ మేఘుఁడు తటిద్గర్జాళివర్షింప నె
చ్చోఁ బ్రేగం దెరువేదిగానని మనుష్యంబోలు దారిద్ర్యచిం
తానిర్మగ్నుఁ గుచేలుదత్పృథు లివెన్నన్మైక్య సౌభాగ్యసం
ధానింజేయవె నన్నుఁ గైకొనుము... 7

శా. భ్రాంతింజాలరు లల్పవారిఁ దనమర్మంబు ల్గనంజొచ్చుచో
నెంతే గంగగలంగినట్లు సభలో సిచ్చన్ రిపుల్సేయు మా
నాంతావస్థనుఁ గుందుద్రౌపదిని నీవాయక్షయాచ్ఛాద నా
క్రాంతంజేయవె నన్నుఁ గైకొనుము... 8

మ. తపనగ్రీష్మ్రక రార్చులంబొగులు తప్తభ్రాంతచింతా చకో
రవుఁ బక్షింబలెఁగుందు పార్థశరపర్యంకస్థ గంగాసుతున్
స్వపురావేదనమాన్పి పూర్వపువసుత్వంబిచ్చి రక్షింపవే
యపరాధింగృప నన్నుఁ గైకొనుము... 9

మ. నిజగర్భస్థిరవిద్విషద్గణ కృతానేకశ్రమ ప్రోద్గగం
బుజనేత్రింబలె వేదనంబడఁగ తామోదోత్తగం గుక్షిసా
చ్చి జడప్రాణి శరాగ్నినార్పి శిశువున్ జీవింపరక్షింపవే
యజురుదాగ్రిర్చిత నన్నుఁ గైకొనుము ... 10

10. అవతారదశకము.

శా. శ్రీనాకిప్రియ పాంచభౌతికవపుర్జీవేత రాభాసల
న్నినారాయణ నామరూపశికొఱకో నీరేజగర్భాగమా
ఖ్యానగాప్రిహానిదుర్లింపనో తొలుతమీనాకారతన్వార్ధి నీ
వానిందెచ్చుట నన్నుఁ గైకొనుము... 1

శా. పూర్వోగ్రాకృతి లేని స్వాన్వయహితాం♦భో వర్తనంబూననో
గీర్వాణాదుల నష్టజీవనులఁగాఁ ♦ గేడింపవో కూర్మరూపుం
బర్వబ్జానన మేను లెత్తి వసధి♦న్బాసిల్లుటల్ భూరిముగాం
తర్వేదస్థిత నన్నుఁగైకొనుము ... 2

మ. తొలిజన్మంబుల లేని భూస్థలసరి♦త్కూల పరిచారంబులం
బెలుచంబూననొ భూమిచక్రహరణా♦పేక్షున్ హిరణ్యాక్షు దో
ర్బలవృత్తి న్వధియింపవో కిటిశరీ♦రం బెత్తి యుద్ధారుణి
స్థలివర్తించుట నన్నుఁగైకొనుము... 3

మ. నడిమెన్విన్నను దొంటిమైగనని పం♦శ్చాద్గోచరత్వంబు ని
ష్పాడమిం దెల్పఁగనో హిరణ్యకశిపున్ ♦ భూతపరిప్రాణత్వ మం
దడఁగం దోఁచి వధింపనే మొ నరసిం♦హాకారతన్ ధాత్రిసం
దడిగావించుట నన్నుఁగైకొనుము... 4

మ. మునునీవెత్తిన మూర్తిఁజొప్పడని సం♦పూర్ణైకరూపత్వముం
గొననో లేక జితామరావళిబలిన్ ♦ ఘోరాహిలోకంబు డా
యనిలం దొక్కనొ వామనాకృతిని నీ♦వంఘ్రిత్రయీమాత్రి గో
త్రిను సూచించుట నన్నుఁగైకొనుము... 5

మ. గతమూర్తింబడయంగరాని నిఖల♦క్ష్మాదానశౌండత్వ మ
ప్రతిగాఁ దెల్పనొ కార్తవీర్య ముఖ భూ♦పవ్రాతము
...తవఃపాత్రమడంపనో పరశురా♦మాఖ్య న్నిరాఘాట శూ
రతవర్తించుట నన్నుఁగైకొనుము... 6

శా. నీతొల్లింటి భవంబునంగనని ని♦ర్ణేతృస్వకర్మక్రియా
వ్రాతంబం దెఱింపవో త్రిభువనా♦వశ్యున్ దశాస్యున్మరు
చ్చేతఃప్రీతివధింపనో ధరణిపై ♦ శ్రీరామమూర్తి న్విహా
ఖ్యాతిం జెందుట నన్నుఁగైకొనుము... 7

శా. ప్రాగుత్పత్తినసంభవంబగు సవ♦ర్యంగృష్ణుఁ డొప్పింపనో
యోగోపాలనహేయతం గపటను♦ష్టారిష్టులం దుచ్ఛవి

ద్వ్యాగర్వోద్ధతులం జంపనెమొ బలరా • మాఖ్యుండవై పొల్చుటల్
యాగోక్తిప్రియ నన్నుఁ గైకొనుము... 8

మ. భవదుర్వృత్త మూర్తులం జొరని య • పర్యాప్తతా కార్యము
ల్బువిగావింపనొ రాక్షసీపరితపం • బుం దత్పురోన్మత్తదా
నవులం గాల్పనొ బుద్ధరూపమును బా • ణాఖ్యంబుసాధించి యి
య్యవనింబొల్చుట నన్నుఁ గైకొనుము... 9

మ. నీపుణ్యోద్భవమందు సంధిలనిదానిం • జేత నత్యాకృతిం
బ్రాపింపంగఁదలంచి యో స్వకులకర్మ • భ్రష్టులం దుష్టులం
గోపోద్వృత్తి హరింపనో కల్కివై క్షో • ణింబ్రవర్తిల్లుటల్
తాపింఛచ్ఛవి నన్నుఁ గైకొనుము... 10

## 11. నీతిదశకము.

శా. శ్రీసంపన్నుఁడఁజిచ్చు విద్యబుధగో • ష్ఠింగల్గు హృద్వేద్యమం
దేసాధించిన యోగ్యమాత్రకులవృ • త్తింజేయు సంపాద్యము
త్సాహసన్నాతిథి పాద్యసయ్యతిథితోఁ • బ్రాశించునైవేద్యమిం
పైసొంపొందెడు నన్నుఁ గైకొనుము... 1

మ. జనకుం డన్నముపెట్టుదాత తనుకృ • చ్ఛ్రచ్ఛేదియేభ్రాత పెం
చిన శాతోదరిమాత పుత్రిసముఁ డ • ర్చిష్కర్మసంధాత జీ
వనముం జేసినవాఁడెనేత పరదై • వంబాంతరద్యోత మో
యనఘప్రాభవ నన్నుఁ గైకొనుము .. 2

మ. స్వకులాచారత మేలుచెందు బలవ • చ్చర్చ స్వతంత్రంబు గ
ర్వికిఁ గార్యంబొనగూడదెందుఁ దనవారిం తూఱుటేకందు లో
భికి మాటంవ్యయమందు రాత్మవిదుఁడే • పెంపొందు నిందందు స
ర్వకళా మేళన నన్నుఁ గైకొనుము... 3

శా. ఇచ్ఛాహానిదె కీర్తికాంత నిరతా • భీష్టార్థదేవంత సా
మ్రచ్ఛన్నోదెపోకొఱంత ధనికుం • డావానిదేచింత వే
చచ్చేవాని దురాశసంత మెపుడా • శస్వీయుఁడేకాంత ము
దృచ్ఛక్రాయుధ నన్నుఁ గైకొనుము... 4

గీ. తండ్రిపోలిక సుతులకుండగా నాకొక్క-
గుణము మేలయ్యె నయము నాకుండగనిక భూ... 44

సీ. అఘటనాఘటనా సమర్థుఁడవంట కు
శనకాశ్యతులుబూను ॥ శ్రుతులుసాక్షి
కంజజాకృతములంఖ్యం బటంటకును మా
ర్కండేయ మానివర్యుండుసాక్షి
సబలుదుర్బలుఁజేయు ॥ జాణవంటకుంద్వన్ష
గోత్రాటనుఁడు దశాస్యుండు సాక్షి
కూటస్థుఁడవటంట ॥ కునుద్వావీయేక్షణ
సంజాతుఁడైన శ్రీజానిసాక్షి
గీ. సాక్షిగోధివితాంత మేచకశిరోధి
హాతవిరోధి యుపారదయాపయోధి భూ... 45

సీ. గోహయసీలెంక వాహనంబులుగదా
దేవతురంగమైరావతములు
సత్పాత్రకులుగదా ॥ సంగీతసాహిత్య
చణులునారదుఁడును ॥ శారదయును
మండనంబులుగదా ॥ మహితచక్రుచ్ర్శవ
స్సార్వభౌముండును ॥ జందురుండు
శ్వశురగేహాస్వీయ ॥ సదనంబులేకదా
హిమనగశ్వేతమహీధరములు
గీ. నాలుదోనలువియున్నది ॥ యమృతజలధి
సీయశంబిట్టిదనుచు వర్ణింపఁదరమె భూ... 46

సీ. కుంభిదైత్యస్ఫీత ॥ కుంభముల్ మోదవే
తోడరిమెమెయ్యొనలకై ॥ ముష్ప్రగహించి
శార్దూలయామినీ ॥ చరుఁగదనంబులో
జదుకవే చంద్రహాసమాధరించి
ప్రాకటపురనుంద ॥ రీకంఠసూత్రము
లండింపవే పినాకమువహించి

దునుమవే జాలంధ♦రునిఁ బదాంగుష్ఠసృ
దబ్ధిజావర్తమ♦యారిఁబూని
గీ. తేజరిలె నీప్రతాపకాం♦తి ఖగరాజు
మోరఁగలవెల్లఁదనమెల్లఁ ♦ జూరఁగొనియె భూ... 47

సీ. అర్ధనారివి నేయ♦ర్ధాంగంబుగాఁ బూను
షాకారివని గొని♦యాడుటెట్లు
కౌమారైన బవిరిగ♦డ్డముగల్గు కతమునఁ
జెలిమియటంచు వ♦చించుటెట్లు
నిరతంబును సమర్చ♦నీయ లింగస్వరూ
పుఁడవు క్లీబుఁడవంచు ♦ నుడువుటెట్లు
తలఁపఁబరేత భూ♦తలనికేతనుఁడవు
గృహమేధివనుచు న♦గ్గించుటెట్లు
గీ. మాతృపితృవర్జితుండవు ♦ జాతిలేదు
పెక్కుపేరులు నీకొక ♦ పేరులేదు భూ... 48

సీ. ఆతతశూల స♦మేతుండవయ్యును
వ్యాధివిదూరుండ♦వై వరలుట
యతులితసోమాహ్వ♦య ప్రదీపితుఁడవ
య్యును గమలాప్తత ♦ నొందుటయును
నిక్కంబుపుష్కర ♦ నేత్రుండవయ్యును
బుణ్యజనావన ♦ స్ఫూర్తిఁగనుట
కడువడిగంగాధ♦రుఁడవయ్యు జటులకృ
శానుతేజోవృద్ధిఁ ♦ బూనుటయును
గీ. నిర్భరాశ్చర్యములుకదా ♦ నీమహిమలు
మహీనసాధారణములు సా♦మాన్యులకును భూ... 49

సీ. కమనీయముద్రికా♦కటకకేయూరాద్య
లంకారమండలా♦లంకృతంబు
తుహినావనీధర♦దుహితృమతల్లికా
వితతనేపథ్య స♦ద్విరచనంబు

ఘావర్ణఘంటికా • రావబంధురవృష
　　　స్కంధాగ్రభాగసం • స్ఫాలనంబు
లోకభయంకర • కాకోలజంబూఫ
　　　లాకారకృన్నిపుం • ణాంచితంబు
　　గీ. నైనభవదీయహస్తము • నభవనాదు
　　　మస్తకము పైని జేరిచి • మాన్పుభయము భూ... 50
సీ. సౌగంధికాంభోజ • రాగప్రవాళ ప
　　　ల్లవసముజ్జ్వలకాంతి • లాలితములు
ఝువమాలధ్వజశంఖ • చక్రాబ్జ పవిధను
　　　రాదినవీనరే • ఖాన్వితములు
ఘటజవసిష్ఠముఖ్యముసీంద్ర హృత్పద్మ
　　　కర్ణికా పీఠికా • గ్రస్థితములు
భాషాసుయోషా వి • శేష సీమంతసిం
　　　మారబిందూరు సిం • దూరితములు
　　గీ. నగుభవత్పాదములు చూపం • దగదె నాదు
　　　చిత్తమిత్తఱిం దమినిగు • రొత్తెసామి భూ... 51
సీ. అసమానబాహువీ • ర్యవిజృంభణాదిత్య
　　　తనయోగ్రదంత తాం • డనకరములు
వాణీశముఖమౌళి • మాణిక్యదీపికా
　　　ప్రాజ్యనీరాజన • భాజనములు
స్తబ్ధరోమర్షభో • ద్యద్వర్షధార్యబ్ధి
　　　వరజావరాదృష్ట • వైభవములు
ప్రత్యగ్రశీతల • భానుసంకాశ న
　　　ఖశ్రేణికావిభా • విశ్రుతములు
　　గీ. నగుభవదంఘ్రిపయోజము • లస్మదీయ
　　　మానససరోవరంబునం • బూనికొలుతు భూ... 52
సీ. ఉపనయనుండవై • యొప్పవేధరంబంచ
　　　యజ్ఞపమండని • ప్రాజ్ఞులనంగ

రాజశిఖామణివై ♦ జేయువేదమ్ము
　　　　శిక్షణంబును శిష్ట♦రక్షణంబు
యార్యుఁడవై యన ♦ యము బాహుపాల్యప్ర
　　　　భావమందవె పశు♦పత్యభిఖ్య
వృషలుండవై సదా ♦ విఖ్యాతిఁగాంచవే
　　　　త్రివిధవర్ణానక్తి ♦ తేజరిల్ల
　　గీ. బ్రాహ్మణక్షత్రియోరు భూ♦పాదభవుల
　　　లోనన్నెవ్వండవో గొల్తు♦నానతిమ్ము భూ... 53

సీ. బ్రహ్మచర్యముఁగదా ♦ పావనగారిత
　　　　పోవనంబునకును ♦ బోవుటఁగన
గార్హస్త్యమేగదా ♦ కరముశర్వాణితో
　　　　తిరముగాఁగూడి కా♦పురముసేత
మిగులవానప్రస్థ♦మేకదా జడలుధ
　　　　రించియెల్లపుడు ♦ చరించుటెల్ల
యత్యాశ్రమముకదా ♦ నిత్యంబుభిక్షాన్న
　　　　మారగించుటవర్ణి ♦ సాంబజటిల
　　గీ. భిక్షుకాఖ్యలు సహజముల్ ♦ ప్రత్యక్షనీకు
　　　నిదియదియటంచు మదినిశ్చ♦యింపనేర భూ... 54

సీ. అంబికాధరనవ్య ♦ బింబికాఫలరస
　　　　గ్రహనవ్యవసకీర ♦ గిర్వదూర
కాళీమనఃపుల్ల ♦ నాళీకమకరంద
　　　　పానషట్పదరాజ ♦ భవ్యతేజ
దాక్షాయణీపీన ♦ వక్షోజకాశ్మీర
　　　　పక్షకవాట మ♦హోక్షఘోట
నీహారగిరినంది ♦ నీదృక్చకోరక
　　　　రాకామృగాంక ని♦రస్తపంక
　　గీ. కృతసురావనసంరంభ ♦ ధృతకురంగ
　　　డింభసంభరితాజాండ ♦ కుంభభ్రోవు భూ... 55

సీ. చాయుతత్పూరుషా • ఘోరసద్యోజాత
వామదేవేశాన • వక్త్రమూర్తి
సతతవరాభయా • జగవత్రిశూల ప్ర
ముఖకరాంభోరుహా • మోఘమూర్తి
హేరంభషణ్ముఖ • వీరభద్రక్షేత్ర
పాలాదిపరివృతి • భద్రమూర్తి
జలభూనభోనభ•స్వద్భాన్వదిందీవ
రప్రియాధ్వర్యగ్ని • దీప్రమూర్తి
గీ. బుధజనస్తోమ సన్నుత•భోనభన్య
హారివయస్య నిరంతరా • చరితలాస్య భూ... 56

సీ. అనుదినాకర్ణన • మునురోమహర్షణ
మందనియురగత్వ • మందఁగోర
శారీరమానసా•క్షయ్యబాధలుగల్గి
యుండెడుమనుజత్వ • మొందఁగోర
లలితనిద్రాహార•ములు లేకయుండెడు
యురుతరదేవత్వ • మొందఁగోర
నిర్మోహనిస్సంగ • నిర్ద్వంద్వనిరుపాధి
యుతమైనప్రమథత్వ • మొందఁగోర
గీ. నాయభీష్టము విజ్ఞాప•నంబొనర్తుఁ
జిత్తగింపుము తాదాత్మ్య • సిద్ధియొనఁగు భూ... 57

సీ. ఆనందకాననంబాల•వాలముగాఁగ
విలసితంబగుజడల్ • ప్రేళ్లుగాఁగ
బాహుయుగంబులు • ప్రచురశాఖలుగాఁగ
లలితాంగుళులు కిస•లములుగాఁగ
కొమరునఖంబులు • కోరకంబులుగాఁగఁ
బొక్కిలికోటర • స్ఫురణగాఁగ
నవ్యస్మితంబు సూ•నంబులుగాఁగ ఫ
లముచంద్రమశ్ళక•లమ్ముగాఁగ

గీ. నగజ బెనఁగొనులతగాఁగఁ దగినకల్ప
శాఖివిమదిష్టఫలము లొసంగిగావు భూ... 58

సీ. నిస్తులోరుల ప్రతిష్ఠాస్తంభములుగాఁగ
భుజములు బిసముల పోల్కెఁగాఁగ
కరములు వికచపుష్కరములుగాఁగ న
ద్వళులురువీచికా వళులుగాఁగ
నాభికాకుహరమెన్నం దగుసుడిగాఁగ
కంఠంబుదివ్య శంఖంబుగాఁగ
చటులజటాచ్ఛటల్ శైవాలములుగాఁగ
లలితకృపారసము జలంబుగాఁగ
గీ. దనరుయుష్మత్సరోవరమున మునింగి
పావనంతాపముక్తుఁడనై పరఁగెద భూ... 59

సీ. రమణీయయానంబు రాజహంసలుగాఁగ
నారుమేల్తుమ్మెద బారుగాఁగ
పటుచితకుచములు చక్రవాకములుగా
స్వరమువనప్రియ వరముగాఁగ
నాస్యంబు పుష్కరాహ్వముగాఁగ మంజులో
క్తులుశుకశాకుంత కులముగాఁగ
పక్ష్ములుఖంజరీ టౌఘముగాఁగఁ గ
చంబుసుబర్హిబర్హంబుగాఁగ
గీ. నొప్పుప్రాలేయగిరిజావయోవిలాస
మరయ నీమోహజాలమ్ము నందుఁబడదె భూ... 60

—• నవరసములు. •—

సీ. నవవజ్రమకుట వైభవధాళధళ్యరు
చుల్ శీర్షమందు సంశోభిలంగ
మండితహారిపేల కుండలచాక చ
క్యప్రభల్ గల్లభాగములఁ బొదల

మాంగళ్యశోణర • త్నాంగదధాగధ
గ్ద్యుతులంసము • లందువెలుఁగ
ముత్యాలబలుసర • ముల తాళదళ్యదీ
ప్తులునిజోరస్థలిఁ • దొంగలింప
గీ. మేల్కడెంబులు మణికట్ల • మెఱయుచుండు
నీదుశృంగార రసమెన్నఁ • గాఁదరంబె భూ... 61
సీ. వదలకద్వాదశ • వత్సరాయుర్దాయ
పరిమాణుఁడగువశి • వర్యశిశువు
నీక్షించిక్రుద్ధుఁడై • దక్షిణాధీశుండు
కాలపాశనిబద్ధుఁ • గానొనర్పఁ
బెంపువేఁజెడి విలా • పింపుచుదేవ ర
క్షింపురక్షింపు ర • క్షింపుమన్న
సాక్షాత్కరించి క • టాక్షవీక్షాపాళిఁ
జూచి తదర్భకుఁ • గాచిహేళి
గీ. సుతునిభవదీయ పార్ష్ణిపీ • డితునిఁజేసి
వీరరసమువహింపవే • విభ్రమముగ భూ... 62
సీ. మందరాహార్యంబు • మంథానముగఁజేసి
వాసుకినూత్రంబుఁ • జేసియనిమి
షాసురుల్ డాసి దు • గ్ధాంబురాశిమథింప
విషముద్భవంబంది • వెసజగములు
గాలుపనడలి జే • జేలుపదంపడి
పార్వతీశ్వరపాహి • పాహియనుచు
కైవారమొనరింపఁ • గావారలఱుదందఁ
గాలకూటమువేడ్కఁ • గ్రోలిప్రోవ
గీ. వేచతుర్దశ భువనము • ల్విస్తరిల్ల
నిబిడకరుణారసము మది • నివ్వటిల్ల భూ... 63
సీ. స్యందన కేతుపుల్ • జ్యానంతములునియం
తాశుగములు భార • తిశమేశు

లురగరుత్తూణాము•ల రుణానుజాబ్దుల
ర్వప్రతోదములాగ•మప్రణవము
లుర్వీభృదురగవ•ర్యులు ధనుస్సింజిను
లతిరథాంగముల •హర్పతిసుధాంశు
బింబముల్ జేసి పు•రంబులుమూఁడు క
రంబుని మేషమా•త్రంబులో చె

గీ. లంగుచునులీల నేలఁగూ•లంగఁజేసి
యద్భుతరసంబుఁజూపవే • యమరులమర భూ...

సీ. కాత్యాయనీపృథు • కబరికాభరమున
విరులదండలుజుట్టి • వెలయువేళ
హైమవతీలలాటా•గ్రమందు సితాభ్ర
తిలకంబుసొగిసుగా • దిద్దువేళ
లసదపర్ణాకపో•లములు కస్తూరిచేత
వారకమకరిక•ల్వ్రాయువేళ
నగజాకఠోరస్త•నస్తబకద్వంద్వ
మంచుఁ గుంకుమవంక • మలఁదువేళ

గీ. సుమకుఁగిలికించితములు సే•యుచును హాస్య
రసముఁజూపవె స్మేరవి•రాజితాస్య భూ...

సీ. పసిపాపనిహిరణ్య • కశిపుఁడునొప్పింపఁ
గరివరదుఁడు నృ•కేసరిశరీర
మలవడనద్దను • జాధమువధియింపఁ
గనిఘనక్రౌర్యంబు • గడలుకొనఁగఁ
దడయక నెనిమిది•యడుఁగుల మొకఁపురూ
పముఁగొంతసాళ్వరూ•పంబుగొంత
తగువిగ్రహముఁబూని • తనాత్మనవమృగేంద్రు
పటుదర్పమొఁ దృణ•ప్రాయముగనొ

గీ. నర్చితివి భళియని సుమ•నస్తతి మిముఁ
బ్రస్తుతింప భయానక•రసమునిగుడ భూ...

సీ. శ్రీకంఠ మిము వెలిఁ • జేసి దక్షుఁడు యాగ
మొనరింపఁగ నెఱింగి • కినుకతోఁడఁ
జని పూషుదంతము • ల్పడలించి శశిని షో
డశఖండములుగ న•డంచి భగుని
కన్నులు పెరికి పెం•న్గాలినెచ్చెలికాని
నాల్క లేదును గోసి • నలువచెలువ
ముక్కు గ్రక్కునఁ జెక్కి • మురవైరిచక్రంబు
చక్కలమ్ముగఁ బుక్కి • వెక్కసముగ
గీ. దక్షుతలఁ ద్రెవ్వనేసియుఁ • దక్షిణమున
భర్గభీభత్సరసముఁ జూ•పవె మహాత్మ, భూరి... 67

సీ. మదనుఁ డనంగుఁడు • గద మత్తమధుపగు
ణము నిష్ఫలమ్ము చా•పము నలాదు
లస్త్రము ల్పబలసై•న్యము పతంగంబులు
తేరనిలంబతీం•ద్రియుఁడు సూతుఁ
డారయ పడగ వి•సారమౌట యెఱింగి
నిజసత్వ పరసత్వ • నిర్ణయంబు
దెలియక నీమీఁద • నలరు*తూపుల నేయ
నలికాగ్నిచేతఁ ద•దాత్మభవుని
గీ. భస్మ మొనరించి జగములు • భయము నొంద
రౌద్రరసరేఖఁ జూపవే • రభసమునను, భూరి... 68

సీ. అక్షయ మభవ మ•నాద్య మనంత మ
ద్వయ మనామయ మనా•హ్వయ మచింత్య
మవ్యక్త మనుపమ • మనుపద్రవ మజేయ
మనసూయ మనపాయ • మప్రమేయ
మనపాయ మలఘుత్వ • మనఘత్వ మచలత్వ
మగుణత్వ మమితత్వ • మమలినత్వ

---

* (తూపులు నేయ) అనిరయుం గలదు.

మశిశుత్వ మవయోత్వ • మజరత్వ మస్త్రీత్వ
మపురుషత్వ మషండ • మైన మంచి
గీ, తామలస్ఫటికాకృతి • నై వెలుంగు
మూర్తివై శాంతరసమున • మొనసి తౌర, భూరి...
సీ. ఉరులింగమూర్తివై • యుదయింపఁ గని రమా
కాంతాబ్జభవులు వి•భ్రాంతులైరి
సతతము హాటకే•శ్వరు భజించి రసాత
లాధినాయకులు కృ•తార్థులైరి
వాలాయముగ మ•హాకాళేశ్వరునిఁ గొల్చి
భూలోకవాసులు • పుణ్యులైరి
తారకేశ్వరు నిరం•తరము గౌరవమునఁ
బూజించి దివిజులు • పూజ్యులైరి
గీ. యిన్నిరూపులు నీవౌట • యెఱుఁగరాదె
శాస్త్రవేత్తల కేలకో • సందియంబు, భూరి...
సీ. భాసురతరమహా•భవనముల్ తగునయ్య
యఖిలాంతరాత్ముఁడ • వైన నీకు
కనదురుదీప్తికై•కస్నేహవర్తిష్ణు
తస రేస్వయంప్రకా•శసుఖి నీకు
సూర్యులసంగతి • యొప్పునే పరికింప
నహాహా నిరాకారి • వైన నీకు
మేటిశీతాంగాదు • లేటికిఁ బరికింప
హరవిరాడ్మూర్తివుఁడ • వైన నీకు
గీ. నాదిమధ్యాంతశూన్యుఁడ • వైన నీవె
దేవుఁడవు నేను పరుల నుతింపఁబోను, భూరి...
సీ. ఉపనిషదర్థసా•ధోపరితలములఁ
జరియించు నెవ్వాఁడు • సంతతంబు
సకలజంతుఫలద్రు•సరణి నజాండముల్
భరియించు నెవ్వాఁడు • ప్రకటమహిమ

ఆపాదమస్తకా•భ్యంతరాళములందు
ధరియించు నెవ్వాఁడు • ధవళకక్ష
యాఢీఁ గామక్రోధ•లోభమోహాదులు
హరియించు నెవ్వాఁ డ•హర్నిశంబు
గీ. నట్టి భగవంతుఁ గీర్తిది•గంతు శాంతు
దాంతు శ్రీమంతు ధీమంతుఁ • దగభజింతు, భూరి... 72

సీ. అవిముక్త రాజధా•నీవిరాజమానకో
దండరాజము లేఖ•తటిని గొనము
కేవల లోలార్క•కేశవుల్ కోటికలు
మహనీయధర్మంబు • మార్గణంబు
గోఘ్న ద్విజాతిఘ్న•గురుతల్పగానపా
ద్యాదనస్వర్ణాపహార ముఖ్య
కలుషజాతంబు ల•త్యము సిపు ధానమ్ము
చూడామణివి నిన్నుఁ • జూడఁగోరు
గీ. వారిసుకృతము వర్ణింప • వశముగాదు
ధాత్రికయిన భుజంగమ•నేత కైన, భూరి... 73

సీ. అడవులు మేయవే • మేఁకలు నీటిలో
వలను మెలంగవే • జలచరములు
వృక్షశాఖల వ్రేల•వే గబ్బిలమ్ములు
చెప్పినఁ బలుకవే • చిలుకగములు
వాయువుఁగ్రోలవే • వ్యాళము లనయంబు
విపినవాసము సేయ•వే మృగములు

---

72 వ పద్యమునం దురీయపాదమున (యాఢీఁ గామక్రోధ•లోభమోహాదులు) అని ర ల లకు విశ్రమము గలిగించినాఁడు. ఈపుస్తకము కవి స్వహస్తముతో వ్రాసినాఁడు. ఈయతి యగ్రాహ్యమని అప్పకవి వ్రాసె. ప్రయోగము లల్పము. కావున (భూరికామక్రోధ•మోహాలోభాదులు) అనినచో బాగుగనుండునని లోఁచుచున్నయది. తె. వె. సన్యాసిశర్మ.

ధ్యానంబుసేయవే • తద్దయు బకములు
గుహాలవర్తింపవే • కోరి హారులు
గీ. జపతపస్స్నానసంధ్య లా•సద్గతికిని
కారణంబులు దృఢబుద్ధి • కాక భళిర, భూరి...
సీ. దారాదికేషణా•త్రయము వర్జించి స
త్త్వాదిగాఢగుణత్ర•యంబు విడచి
తాపత్రయముఁ బరి•త్యక్తముఁజేసి స
య్యాన మలత్రయవిమో•చన మొనర్చి
వాసనాత్రయమును • వదలి పెద్దయు మండ
లత్రయాగమ్యస్థ•లములు వెదకి
యంగత్రయోజ్వల • వ్యాపారము నెఱింగి
లింగత్రయాంతర్వి • లీనులైన
గీ. వారలకు దుర్ఘటామృత•ద్వాఃకవాట
విఘటనముసేత సేకూరు • వేగిరమున, భూరి...
సీ. ఏఁబదిరేకుల•చే బిందుసంయుక్త
పంచాశదక్షర•పంక్తిచేత
నలరారెడు సమంజ•సాధారనామచ
క్రాదిషట్చక్రముల్ • హర్షమలర
గ్రమమున శోధించి • ఘనతదీయోపరి
భాగసహస్రార • పద్మవిహార
మాణమరాళసా•మ్రాజ్యవిలోకన మాచ
రించు మాన్యులకు సి•ద్ధించు ముక్తి
గీ. కామినీసంగమము వృథా • పామరులకుఁ
గలుఁగునె సుధీవచేళిమ • కల్పభూమి, భూరి...
సీ. భూతధాత్రీముఖ్య•భూతపంచకమును
శబ్దాదివిషయపం•చకము మఱియు
శ్రవణాదిధీంద్రి•యోజ్వలపంచకంబు వా
క్ప్రముఖకర్మేంద్రియ•పంచకంబు

నతిమనోబుద్ధి చి • త్తాహంకృతి చతుష్ట
యంబు జీవాత్మ స • మావృత మగు
పంచవింశతి త త్త్వ • భాగ్దేహనివహాహ్వా
ద్వనమధ్యముల నీ • వారశూక
గీ. విధమున నజస్రమును వెల్గు • విభుఁడ వీవె
కావె దేవేంద్రనుత వేగ • రావె బ్రోవ, భూరి... 77
సీ. రజ్జువునందు స • ర్పంబు ముక్తాస్ఫోట
మందు రౌప్యంబు ప్రే • ష్ఠాంబువులఁ బ
యస్సు మరీచిక • యందు నీరంబు భ్రాం
తి జగంబు నీయందు • దృశ్యమగును
దహనునియందును • దాహకత్వంబును
దపనునియందునఁ • దాపవంబు
సలిలమునందున • శైత్యంబుఁ బూర్ణని
శాకరునందుఁ బ్ర • సన్న మల్లె
గీ. నొగిఁ బ్రపంచంబులోపల • నుండు దీవు
విష్టపమ్ములకును నీకు • వేఱు గలదె, భూరి ... 78
సీ. ఉభయపార్శ్వముల ధా • తృప్రేంద్రు లురువడి
వింజామరమ్ములు • వీచుచుండ
ఛత్రమ్ము వజ్రివ • శ్యాత్మీపతిఁ బట్టఁ ద
ర్పణము పురోవీధి • వహ్ని నిలువ

---

79 వ పద్యమునకుఁ బాఠాంతరము.

సీ. భైరవ శంకరా • భరణ గుండక్రియ, నాటవరాళి పు • న్నాగ సురటు
పూరి సావేరి ము • ఖారి సారంగ సౌ, రాష్ట్రి యాహిరి మేఘ • రంజి కాఫి
కేదారగౌర కాం • భోజి బిలాహరి, కళ్యాణి తోడి ఖం • గాళ దేవ
గాంధారికాదిరా • గములు హాహాహూహూ, వులు చిత్రములు తల • లూఁచ రాలు
గీ. గరఁగ మోదులు చిగురింపఁ • గాను బాడఁ
జొక్కియున్నాఁడ వేమొ నా • చక్కిఁ గనవు, భూరి...

తె. వై. సన్యాసిశర్మ.

శౌరి భీకరగదా • ధారియై నిలుచుండఁ
గర్బురేంద్రుఁడు పాదు • కలు ధరింప
వరుణుఁడు కాళాంజి • వట్ట సమీరుండు
వీడియముసఁగంగ • విత్తవిభుఁడు
గీ. చేరి కైదండయిడఁగఁ గ • చేరియందు
గద్దెపైఁ గూరుచుండవే • కడుముదమున, భూరి...
సీ. హరిరాట్కిశోరంబు • హరికిశోరముగాదె
నీవిక్రమమునకు • నిభముగాక
గ్రావవతంసంబు • గ్రావమ్ముగాదె నీ
ధీరసంపదకును • దీటుగాక
సింధురాజం బల్ప • సింధువుకాదె యు
ష్మద్గభీరతకును • సవతుగాక
ఖద్యోతబింబమ్ము • ఖద్యోతమగుఁగాదె
నీప్రభావటలికి • నీటుగాక
గీ. భీమ నీశౌర్య ధైర్యగాం • భీర్యరుచుల
కేమి సదృశముఁ దెల్పెద • నింకఁ దెలుపు, భూరి...
సీ. ఉత్పలప్రియుఁడు మ • హోత్పలప్రియుఁడు
పూదండగా మేల్బండి • యుండగాఁగ
బలవిరోధియు మహా • బలవిరోధియుఁ బడ
వాలుగా మేల్మేడ • నూలుగాఁగ
రజితాచలము మహా • రజితాచలము నివ
సనముగా నవశరా • సనముగాఁగఁ
బద్మాక్షిపతి మహా • పద్మాక్షిపతియును
జోడుగా సంగడి • కాడుగాఁగఁ
గీ. జెలఁగు నిను జిన్మయుండంచుఁ • జెప్పుచుండు
నెపుడుఁ బ్రాజ్ఞమనుజులు నెడ • యింత లేక, భూరి...
సీ. అవిరతగుణశాలి • వాట నిజంబు దూ
రపులయ్యె నన్నవ • స్త్రములు నీకు

విరతశైవాసక్తి • నిర్ణిద్రుఁడవుగదా
ధర్మవిద్వేషమ్ము • దవిలె నీకు
లావణ్యయుక్తనూ • లసితుండవేకదా
తూరసంపర్కంబు • గలిఁగె నీకు
వివరింప నిర్మోహి • వేకదా ధరలోన
నసమాతృయుగభిక్ష్య • హత్తె నీకు
గీ. పెద్దవారికి నైనను • జెడ్డగొనము
కొంత గలుఁగదె కలిఁగినఁ • గొదువయేమి, భూరి... 82

సీ. అనుపమచిత్రకా • యయుతుండవై హాత
చిత్రకాయుండవై • చెలఁగినావు
రాగముక్తుండవై • రతిరాజభస్మంగ
రాగయుక్తుండవై • ప్రబలినావు
సారంగధరుఁడవై • సాహసం బేపార
సారంగహారుఁడవై • గేరినావు
గోత్రవర్జితుఁడవై • గోత్రాధిరాధగ
రిష్టత్వ మంగీకరించినావు
గీ. తారుమారయ్యె నీ ప్రవ • ర్తనలు చూడ
నబ్రముగదయ్య సానుమ • దతినికాయ, భూరి... 83

సీ. ధీరాళ్యభీష్టదా • తారం గణాధినే
తారం సపత్నహం • తారమఘవి
దారం యమీంద్రమం • దారం సువితరణో
దార మంకస్థిత • దారము రగ
హారం హాలాహలా • హారం మహీధ్రవి
హారం విచారప్ర • హారమమిత
సారం విధూతసం • సారం ధృతాభ్రకా
సారం ఘృణారసా • సార మీశ
గీ. మహముపాసే యటంచుఁ బ్ర • త్యహముఁ దలఁతు
భాసురే భాసురత్వగ్వి • లాసవాన, భూరి... 84

సీ. సంగోరుమెయినిడ్డ • చలిమలబిడ్డతో
వడిగల గిబ్బవా•ర్వమ్ముతోఁడ
మూఁడవకన్నుతో • ముయ్యంబు వాలుతో
సిరులీను రుదురక్క•సరులతోఁడ
నగవొప్పుమోముతో • జిగిఁకప్పు మెడతోఁడ
గాలిమేతరిసూడి•గములతోఁడ
బూచులగములతోఁ • బూవజాబిలితోఁడఁ
జంకను బెట్టిన • జింకతోఁడ
గీ. వేగమున నాకుఁ బొడసూవ•వే గడంకఁ
గందు మనసారఁ గన్నుల•కరవుదీర, భూరి...
సీ. అనృతోక్తు లాడింప • నాలోచనము చేసి
కపటముఁ బన్నిన • గాధిపుత్రి
కొఱకు హరిశ్చంద్ర•కువలయేశ్వరుఁడు భా
ర్యను నందనుని విక్ర•యంబొనర్చి
తాను చండాలునొ•ద్దను మధుమాంసముల్
మోచుచుఁ గడలేని • నీచవృత్తిఁ
దిరుగుచునుండఁ ద•ద్విభునకు సౌహార్ద్ర
మొప్పఁ బ్రీత్యుత్కమై • యున్నతముగ
గీ. సర్వసర్వంసహాచక్ర•ధూర్వహత్వ
జేసి వాసిగఁ జెలఁగితి • వౌ సితాంగ, భూరి...
సీ. అభినవగానవి•ద్యాశక్తిచే మనో
బుజమలరింపఁ దుం•బురుఁడఁగాను
బరిహాసవాక్యవై•ఖరిచేఁ బ్రమోదంబు
ఘటియింప నే భృంగి•రిటుఁడఁగాను
విపులకవిత్వప్ర•వీణత మెప్పింప
వావిరి గంధర్వ•వరుఁడఁగాను
వాస్తవముగ నీ స్త•వం బొనరింప ని
మ్మహిలోఁ బరాశరా•త్మజుఁడఁగాను

గీ. యిట్టులొనరింప నాచేత • నెట్టులగును
నీదుచిత్తము నాభాగ్య • మోదయాబ్ధి, భూరి... 87

సీ. పంచామృతంబు గూర్పఁగ లేకయుండిన
శుద్ధోదకంబు దెచ్చుకొనలేనె
తెల్లఁదామరవిరుల్ • తేలేక యుండిన
జిల్లేడుపూలఁ బూజించలేనె
మాలూరపత్రిస • మాజంబు లేకున్న
నూడుగుపత్రి • యుంచలేనె
పాయసం బర్పణ • సేయలేకుండినఁ
బేర్మిఁ గొబ్బెరంబు • బెట్టలేనె
గీ. గొప్ప కొద్దియుఁ గలుఁగునొ • కో సుభక్తి
మాత్రసులభుఁడవౌ నీదు • మానసమున, భూరి... 88

సీ. వారాంగనామణి • వక్షోజ మర్చించి
సాలోక్య మొకఁడు హ • ర్షమునఁ జెందె
నీపదజైకిక • రీష మారాధించి
సామీప్య మొకఁడు హ • ర్షమునఁ జెందె
జానుప్రదేశపూ • జానూనదక్షుఁడై
సారూప్య మొకఁడు హ • ర్షమునఁ జెందె
ప్రస్థార్పనాకౌశ • లస్థిరత్వమ్మున
సాయుజ్య మొకఁడు హ • ర్షమునఁ జెందె
గీ. నిటుల నాచేతనగునె యొ • క్కటి జడుండఁ
గుటిలచిత్తుఁడ మత్తుఁడ • గుణరహితుఁడ, భూరి... 89

సీ. చిరితొండభక్తుండు • శిశుహంతఁ గావించె
నక్కటికం బిసు • మంత లేక
గాటకోటుఁడు పితృ • ఘాతుకత్వముఁ బూనె
జగతిలో నిందకు • శంక లేక
రోహిణీశుఁడు గురు • ద్రోహ మాపాదించెఁ
బరలోకహానికి • భయము లేక

దురితంబనాక మా•తులవధక్రియొనరించె
యాదోనిధీశక•న్యాధవుండు
గీ. యిట్టి సాహసికులఁ బ్రోచి•నట్టి సామి
నన్ను రక్షింప వింత య•న్యాయ మేమి, భూరి...
సీ. బ్రాహ్మణుఁ డొకఁడు స•ర్వక్షేత్రగామియై
వెనుక రుద్రావాస•మునకు వచ్చి
యొకనాఁడు రూపరే•ఖోన్నతియుక్తయా
మధువిక్రయాబలా•మణి సురఁగొని
రాఁ గని తనయభి•ప్రాయమ్ముఁ దెల్పిన
నొడఁబడి తనయింటి•కడకు దెచ్చి
సురతంబుఁ దేల్చిన • తఱి జీవితేశుండు
చనుదేరఁగా సాధ్వ•సంబుమీఱఁ
గీ. గాఁగులోఁబారునిడి నిండఁ • గప్పుఁబోయ
మేన్ దొరఁగి లింగమూర్తియై • మెఱసెఁగాదె, భూరి...
సీ. నిశ్రేయసాపేక్ష•నియతిచే శివశర్మ
యను బ్రహ్మవంశవ•ర్థనుఁ డయోధ్య
యును మధురయు మాయ•యును గాశి కాంచి కా
వంతికా శ్రీద్వార•వతులు తిరిఁగి
యును హరిద్వారమం•దునఁ గాలధర్మంబు
నొంది వైకుంఠంబుఁ • జెంది పిదపఁ
బార్థివుండై పుట్టి • పట్టికిఁ బట్టంబుఁ
గట్టి కాశికి నేగి • కాంచె ముక్తి
గీ. భళిర నీపుటభేదన•ప్రాభవంబుఁ
బ్రణుతియొనరింప నలవియే • ప్రాకృతులకు, భూరి...
సీ. ఒడయనంబినిగాను • యుడుఁగకఁ బరమనా
చినిమిత్త మెలమిఁ గుం•టెనకుఁ బంప
సాంఖ్యతొండడఁగాను • సందేహపడక న
హోశిలాపహరణ • లాచరింప

సవ్యసాచినిఁగాను ♦ సమరాంగణమునందుఁ
గడిమి నీపైని సిం♦గాణి విసరఁ
జందయాఖ్యుఁడఁగాను ♦ శరణుబుల్చూడంగ
వేమఱు నిను వెను♦వెంటఁ ద్రిప్ప
గీ. నన్యథాశరణం నాస్తి♦యనుచు నున్న
వానిపైఁ గనికారము ♦ మానఁదగునె, భూరి... 92

సీ. అధికాయు వీయవే ♦ యల్పజీవనుఁడునా
నెసఁగు నిరాబారి ♦ నిసువునకును
సమకూర్చవే పుణ్య♦జనభర్తగా దుష్కృ
తాసక్తు గుణనిధి ♦ యనెడి ద్విజుని
నరకస్థుల స్వకీయ♦నగరమ్ముఁ జేర్చవే
తావకీనమను ప్ర♦ధానమహిమఁ
దారుణ్యమొసఁగవే ♦ కారుణ్యరస మొప్ప
నతివృద్ధుఁ డగు గుండ♦యాహ్వయునకు
గీ. దేవ యివినిజమైన న♦న్నోబ్రోవరాదె
కాలయాపన మొనరింప♦నేల చాల, భూరి... 93

సీ. అమలవాఙ్మాధుర్య ♦ మబ్బునే హాలాహ
లాశ్లిష్టకంధరా♦వాప్తికతనఁ
జల్లనిచూపులఁ ♦ జెల్లఁబోఁ గనుపెట్టు
లగణితోగ్రాక్షుఁడ ♦ వగుటవలన
మార్దవ మేభంగి ♦ మనమున నొనఁగూడు
నకట గిరీశుఁడ ♦ వగుటవలన
స్థావరస్థితి సమా♦సాధ్య మేగతియొకో
జంగమాభిధచే మె♦లంగుకతనఁ
గీ. దాత మేతాదృశుఁడవుగ♦దా జనులకుఁ
గొడుకుపై ఋజుభావమ్ము ♦ వొడమకున్నె, భూరి... 94

సీ. అంతరంగోపవ♦నాంతరంబున సదా
శివశిఖావళమును ♦ జేర్చు నెవ్వఁ

డనితరాత్మ్రలాన • మందున మలహార
ద్వీపలలామంబు బం•ధించు నెవ్వఁ
డుల్లఁపుదామర • నుడురాజభిత్తమ
హోత్రంనుఁ డనుదేఁటి • నుంచు నెవ్వఁ
డఱఁదుగ హృదయపం•జరమునమృడుఁడను
రాచిల్కఁ బ్రీతిమీఱ నెవఁ డుంచు
గీ. నట్టి సుశ్లోకుఁడె మదా ప్తుఁ • డంచు నుందు
నన్యులా బంధువులు శత•మన్యుసేవ్య, భూరి...
సీ. సీతనూజుపతాక•వై తామ్రచూడరా
జంబు కాలజ్ఞాన•సంజ్ఞ నొందె
నీవు గుట్టంబాల•నే నందికేశుండు
ధర్మస్వరూపినాఁ • దగెధరిత్రి
నీరవణంబైన • నిడుపరాయఁడు మించె
శేముషీధారేయ•శీలనమున
నీనేత్రమై చిత్ర•భానుండు భువి జగ
త్ప్రాణసఖుండునాఁ • బ్రౌఢిమెఱసె
గీ. నుర్వి మహదాశ్రమము బహు•యోగ్య మనుచు
విబుధజనములు వచియింప • వింటిఁ గంటి, భూరి...
సీ. అఖిలజన్మార్జితాం•హస్సంహతి హరింప
భారంబుఁ బూనె సు•పర్వవాపి
అన్నపానీయాదు • లాదరమ్మునఁ బెట్టి
నాయత్తపడెఁ గదా • యన్నపూర్ణ
సకలాంతరాయభం•జనమొనర్పఁ బ్రతిజ్ఞఁ
గావించెఁగద డుంఠి•కరటిముఖుఁడు
దక్షిణామూర్తియై•గా క్షితిపైఁ దెల్లు
ప్రాణికి స్వస్వరూ•పము నొసంగ
గీ. నీవు ప్రతిసరమూనితి•వే విచార
మేల నరులకుఁ గాశీపు•రీచ్ఛ వలదె, భూరి...

సీ. ముందు విశ్వేశ నీ • సందర్శన మొనర్చి
బిందుమాధవునకు • వందనమిడి
వరఢుంఠిగణపతి • చరణంబులకు మ్రొక్కి
దండపాణికి వేడ్క • దండ మొసఁగి
భైరవునకు నమ•స్కారంబుఁ గావించి
కేరుచుఁ గాశికిఁ • గేలుమోడ్చి
ఘనగుహాలోకన • మొనరించి గంగనీ
క్షించి భవానిద•ర్శించియు మణి
గీ. కర్ణికాప్లావనముఁజేసి • కడఁక నిటుల
యాత్రసలిపినవారు మ•హాత్ములుగద, భూరి... 99
సీ. చంపక దేవ కాం•చన భూమిజ కురంట
కాశోక నీలోత్ప • లాబ్జ కుబ్జ
మల్లికార్జున గిరి • మల్లికానీప మ
ధూక శిరీష బం•ధూక కర్ణి
కార శామంతికా • కరవీర కృతమాల
మాలతీ ద్రోణార్క • మదనపారి
భద్ర నంద్యావర్త • పాటల నందివ
ర్ధన బృహతీ దేవ•దారు దవన
గీ. నాగ కేసర వకుళ పు•న్నాగములను
బూజ నీకొనరింతు నేఁ • బుష్కలముగ, భూరి... 100
సీ. దండంబు మిహికాంశు•ఖండ రాజన్మస్త
దండంబు మేరుకో•దండహస్త
దండంబు నిష్ఠుర•కాండకల్పిత శౌరి
దండంబు పరిభూత•దండధారి
దండంబు నూత్నవే•దండకృత్తికటీర
దండంబు ధృతజగ•దండవార
దండంబు పద్మజా•ఖండలస్తుతనామ
దండంబు కోటిమా•ర్తాండధామ

గీ. దండ మశ్రాంతసాత్త్వికో•ద్దండ నీకు
దండ మతిజవవద్భద్ర•కాండ నీకు, భూరి... 101

సీ. ఒదుగుచు సాష్టాంగ • మొనరింప నావంతు
నీవంతు రయమున • లేవనెత్త
నపరాధి ననుఁగావు•మని పల్క నావంతు
నీవంతు తప్పులె•న్నియు క్షమింప
దారిద్ర్య మొసఁగుమి• త్రతియన నావంతు
నీవంతు ధనవంతు•నిఁగ నొనర్ప
గద్యపద్యములు వ•క్కాణింప నావంతు
నీవంతు సావధా•నివయి వినుట

గీ. పెక్కుమాట లికేటికి • దిక్కు మాకు
నీవ నీవానిఁజేసి మ•న్నింపవలయు, భూరి... 102

సీ. కలుఁగవే స్కాంద మా•ర్కండేయ గారుడ
బ్రహ్మాండ నారద • బ్రహ్మ విష్ణు
శివ లింగ మత్స్య కూ•ర్మ వరాహ పద్మాగ్ని
వామన బ్రహ్మకై•వర్త భాగ
వత భవిష్యదభిఖ్య•యుతపురాణంబు ల
ష్టాదశసంఖ్య రూ•ఢముగ నందు
రవి కోటి కృపీట•భవున కొకండు ధా
తకు రెండు నాల్గు మా•ధవునకుఁ బది

గీ. యర్ధి నినుఁజెప్పె నీమహా•త్మ్యము గణింప
దుర్లభంబని జనులకుఁ • దోఁచుఁగాదె, భూరి... 103

సీ. కరిముఖ నరముఖ • కపిముఖాహిముఖోష్ట్ర
ముఖ సింహముఖ మేష•ముఖ వరాహ
కర్ణ ఘంటాకర్ణ • గజకర్ణ శంఖక
ర్ణ ద్వికర్ణ త్రికర్•ణ ప్రచండ

---

101 వ పద్యమునందలి యెత్తుగీతి 2 వ చరణము (జవవద్గోపకాండ) అని యొకపాఠాంతరం గలదు.

కుండోదర నికుంభ • కుంభోదర ప్రకంప
న మహాకాళ క•పర్ది వజ్ర
పాణి సుదర్శన•పాణి శూలాయుధ
సూర్యపాతన నంది • సోమనంది
గీ. నందిషేణాదిగణము లా•నందమున భ
జింప వెలుఁగొందు నిన్ను భ•జింపుచుందు, భూరి ... 104

సీ. శ్రీనీలగిరిని భు•జించుటయును మంగ
ళాద్రిపై నిల్చి దా•హంబుఁ గొనుట
సింహభూధరమున • సిరిగంధమలఁదుట
వేంకటాచలమున • విలువలేని
మానికమును సొమ్ము • లూనుట ద్వారకా
పూర్వరమందు న•పూర్వలీల
స్త్రీలతో నిధువన•క్రీడలు సల్పుట
శ్రీరంగమందు ని•ద్రించుటయును
గీ. నిన్ని సౌఖ్యము లొందుట • వెన్నుఁ డిలను
గన్న నీకర్పణముసేయు•క తనఁగాదె, భూరి... 105

సీ. మురహరుం డవతార•ములు దశవిధములఁ
బరిపాటిగా భూత•భావియుగము
లం దుద్భవించుచు • సంతంబు నొందుచుఁ
బడరానిపా ట్లెల్లఁ • బడి బడసెను
బెనుమసనంబులోఁ • బెద్దనిద్దురఁ జెందు
పంచజనుం డొక•పరి సమస్త
నాకవాసులు మెచ్చ • నేకాదశాకార
ముల కిరవగు రూప•మును ధరించు
గీ. నౌర పరిత్యక్తుకై లాన • మనఁగఁ బరఁగు
క్షితిని సమ మెందుఁగలదె నీ•క్షేత్రమునకు, భూరి... 106

సీ. ఆవిర్భవించునే • యాఁకలి దప్పి నీ
కటకంబునందు లిం•గములు గన్న

శ్రీమఁజెందునే సదా ♦ జ్ఞానవాప్యాద్యమ!
హాదీర్ఘికలు ముద♦మారఁ గన్న
బడలికఁగలుఁగునే ♦ కడకఁ బంచక్రోశ
గమనాభిలాషంబు ♦ గడలుకొనినఁ
గొందలమొందునే ♦ కుక్కుటస్థానాది
మంటపతతిఁ గడ♦గంటఁ గన్న
గీ. మాటిమాటికి నేను నీ ♦ పీటితోడ
సాటిగల ప్రోళ్లు లేవంచుఁ ♦ జాటుచుందు, భూరి... 107

సీ. స్వర్ణవేత్రములూని ♦ చండప్రచండులు
పరువులెత్తుచుఁ బరా♦బరు లొనర్ప
సరిగమపధనిసు♦స్వరనయాభినయంబు
లలర రంభాదివే♦శ్యలు నటింప
రతనంపుటారతుల్ ♦ జతనంబుగాఁ జార
సారసయాన లా♦నక్తినొనఁగఁ
గాహళవేణువీ♦ణాహుడుక్కాతాళ
మురజభేరీవాద్య♦ములు చెలంగఁ
గీ. గోరికలుమీఱఁగా మీరు ♦ స్వారివెడలు
హొయలు మాదృశులకు నల♦విమె వచింప, భూరి... 108

సీ. మహితాలికమున భ♦స్మము మూఁడు రేకలు
మునుకొని మొగదిగ ♦ మూఁడుకళ్లు
మెడ నొడలను జడ♦ముడులవన్నెలు మూఁడు
కేలునఁ గీలించు ♦ వాలునకును
మూఁడుమొనల్గడు♦వేడుక నీవు పూ
జలుగొను పత్త్రిరి ♦ వెలయు మూఁడు
దళములు నాప్తున ♦ కలర మూఁడడుఁగులు
నాఁటుమూఁడుగఁదోఁచె ♦ నయనము నీదు
గీ. బ్రతుకు నాకేమితోఁచ దే♦గతియొకాని
నిన్ను నమ్మినవారి కో ♦ యన్న చెప్పుమ, భూరి... 109

సీ. ఆహారపాత్రిహార • మనునృశంసుఁడు కిల్బి
షంబులుదొలఁగి ప్రి•శంసఁ గనఁడె
వాసియటంచును • వాకుృచ్చిన జనుండు
నిర్వాణ మొందఁడే • నిఖిలమెఱుఁగ
సానందుచే పడ•ఘురి నరుల్ వీనులా
నిరయంబవిడువరే•నిరయముభళి
తిరముగాను గురూప•దేశంబు నొందియుఁ
గొందఱు మోక్షంబు • నొందలేదె
గీ. జిహ్వ నీపేరు రక్తి భా•షించునట్టి
వారిసామర్థ్య మెన్నఁగ • వశముగాదు, భూరి... 110

సీ. ఔద్ధత్యమున బ్రిహ్మ•హత్యఁ గావించితి
క్రూరుఁటవౌట ని•ష్కృవముఁగాదె
దారుకాంతారకాం•తారతిప్రౌఢవు
జారుఁడవౌట ని•జంబుకాదె
గౌరీమనోధన•హారిపేశలుఁడవు
చోరుఁడవౌట వి•స్ఫురణగాదె
లింగపటోలికా•లీనుండవైతి భీ
రుఁడవౌట నిర్ణయ•రూఢిగాదె
గీ. యిట్టిచేష్టలు దొరలిన•యట్టి దొరకు
దాస్యమొనరించువాని కొ•దవునె యెఱుక, భూరి... 111

సీ. అష్టభుజుఁడు యంత•యయ్యెఁగా నీకుడ్డ
చేతులు గలవను•హేతు వెఱిఁగి
యర్చకుఁడయ్యె ద•శాననుఁ డరవది
మోములుగలవను • మూల మెఱిఁగి
పరశురాముఁడు ఛాత్రి•వరుఁడయ్యెఁగా ఖండ
పరశుఁడ వీవను • గురుతెఱింగి

110 వ పద్య తురీయపాదము (యుగపదాత్మీయగు•రూపదేశమునొంది, యఁను గొంద అపవర్గ • మొందలేదె) అనియుం గలదు.

హితుఁడయ్యె దరిద్రవినాథుఁ • డెంచ నకించనో
దంచనుండవటన్న • సంచెటింగి
గీ. పృథివి నీకంటె భక్తులే • యధికులనెడి
వార్త తార్కాణమయ్యె నే•వంవిధమున, భూరి ... 112
సీ. తిలకింప మడికాసు•మలమంచివెన్నెల
మహాలుగా వాచంయ•మవ్రివరులు
ఖోజ్జాలుగాఁగ మ•రుజ్జాతిసరదార్లు
గా జయవిజయులు • గాథమగు స
కీబులుగాఁగ మే•ల్గిత్తఘోడాగాఁగ
లచ్చి సైఁదోడుకు•శాయిగాఁగ
గబ్బుచంక మొకంబు•బెబ్బులితోళ్లు జా
మాతమానులుగా తు•మాంతలమున
గీ. నేనుమొగములసాహెబు•నా నలరితి
యవనకర్త సలాం జేతు • నాదరింపు, భూరి... 113
సీ. మండలేశ్వరుఁడయి • యుండఁడే యిప్పుడు
వసుమతిలో శాలి•వాహనుండు
గణుతింప భక్తాగ్రి•గణ్యుండునా మించె
గుండయ్య ధారుణీ•మండలమున
రామాయణగ్రంథ•రచనాద్రఢిమఁగాంచె
మొల్ల వధూటీమ•తల్లియనఁగ
మహిసూరునకు మహీ•మహిశాకళతుర్లై
రి కృతేభదానధు•రీణులనఁగ
గీ. ధరఁ గులాలాన్వవాయభూ•తవ్రసిద్ధి
నుదయమైరి తదీయకు•లోద్భవుండ, భూరి ... 114
సీ. అమలాపురాన్వయో•త్తముఁ డగు కాశీప
తికిని గంగాభవా•నికిని సుతుఁడ
సన్యాసినామక•సహితుఁడ శ్రీకాట్రి
కోన లక్ష్మణసమా•ఖ్యునకు వేంక

మాంబకుఁ బుత్రిక ♦ యగు కన్నమాహ్వయ
పత్నితోఁ గూడి మీ ♦ ప్రాంతమునకు
నరుదెంచి యేను గృ♦తాంజలినై పరిభూ
కానుక లివ్వఁగ♦లాన నీకు
గీ. నీకృతి రచించితిని గాని ♦ మాకు నైక్య
మొసఁగుమని వేడితిని నట్లు ♦ యొసఁగరాదె, భూరి ... 115
సీ. కాకిణికామాత్రి ♦ కనకంబు శ్రీకురు
క్షేత్రమం దొసఁగు వి♦శేషఫలము
మఱియుఁ బ్రయాగలో ♦ మకరమేళనమాఘ
మునఁ ద్రివేణికయందు ♦ మునుఁగుఫలము
గవిసురద్రుమపంచ♦కంబునా వెలయు పం
చారామదర్శన ♦ మబ్బుఫలము
ధృతిగయలోపలఁ ♦ బితృవర్గమునకును
బిండంబు నొకమారుఁ ♦ బెట్టుఫలము
గీ. కలుఁగు నీశతకము వ్రాయఁ ♦ గాంచఁ జదువ
విన్న జనులకు నీకృపా♦విలసనమున
భూరిగుణయూథ కాశికా♦పురసనాథ
విదళితామర్త్యరిపుయూథ ♦ విశ్వనాథ. 116
క. శ్రీవిశ్వనాథశతకము
భావుకమతి నెవ్వరేని ♦ పారాయణముం
గావించిన వారలకున్
జీవన్ముక్తి యొసఁగూర్చు ♦ శివుఁ డనేకదయన్.

సంపూర్ణము.

# శతకముల ప్రథమ సంపుటము

## దీని వెల రు 2—12—0 మాత్రమే.

ఈసంపుటము నందుఁగల శతకములు విడిగాఁగూడ దొరకును.

| | | | |
|---|---|---|---|
| 1 | కాళహస్తీశ్వరశతకము | (ధూర్జటికవి) | 0—3—0 |
| 2 | భాస్కరశతకము | (మారదవెంకయ్య) | 0—3—0 |
| 3 | సీతాపతిశతకము | (సాహేబురాణ రామనకవి) | 0—3—0 |
| 4 | శ్రీరామలింగేశ్వరశతకము | (అడిదము సూరకవి) | 0—3—0 |
| 5 | కుక్కుటేశ్వరశతకము | (కూచిమంచితిమ్మకవి) | 0—3—0 |
| 6 | దేవకీనందనశతకము | (వెన్నెలకంటి జన్నయ) | 0—3—0 |
| 7 | కవిచౌడప్పశతకము | (చౌడప్పకవి) | 0—2—0 |
| 8 | నృసింహశతకము | (శేషప్పకవి) | 0—3—0 |
| 9 | ఇందుశతకము | (పుసులూరి సోమరాజామాత్యకవి) | 0—4—0 |
| 10 | నమశ్శివాయశతకము | (చామర్తి శేషగిరికవి) | 0—1—0 |
| 11 | మహిజామనోహరశతకము | (రేమళ్ల రామదాసు) | 0—2—0 |
| 12 | వరాహలక్ష్మీనరసింహశతకము | (గోగులపాటి కూర్మదాసు) | 3—0 |
| 13 | దాశరథీశతకము | (కంచెర్ల గోపకవి) | 0—2—0 |
| 14 | జగన్నాయకశతకము | (వరాహగిరి కొండ్రాజామాత్యుఁడు) | 0—2—0 |
| 15 | ప్రసన్నరాఘవశతకము | (నరసింహకవి) | 0—2—0 |
| 16 | లావణ్యశతకము | (పోలిపెద్ది వేంకటరాయకవి) | 0—2—0 |
| 17 | నారాయణశతకము | (బమ్మెర పోతరాజు) | 0—3—0 |
| 18 | ఆంజనేయశతకము | (చల్లాకోటయ్యకవి) | 0—3—0 |
| 19 | ప్రసన్నాంజనేయశతకము | (చిత్తూరివరకవి నారసింహుఁడు) | 4అ. |
| 20 | సచ్చిదానందరామశతకము | (మం॥ వెంకయార్యుఁడు) | 0—1—0 |

కలయువారు:—కార్యదర్శి,

చిత్రాడ;

పిఠాపురంపోస్టు, గోదావరిజిల్లా.

శ్రీరస్తు.

# శ్రీ రాజశేఖరశతకము.



శ్రీకర దాసమానసవ•శీకర హైమవతీముఖాబ్జశో
భాకర సత్ప్రభాకర కృ•పారసపూరితమంజువాక్సుధా
శీకర వైరిభీకర వి•శేషలసద్గుణరత్నపాళిర
త్నాకర సర్వలోకసము•దారదయాకర రాజశేఖరా. 1

ఉ. ఈశ జగత్ప్రకాశ నమ•దింద్రదిగీశ శరీరకాంతిసం
కాశ నిశేశకాశ ధృత•కాశ గిరీశ ధరాదిసర్వభూ
తేశ నిశాటనాశ జగ•దీశ విలుంఠితకర్మపాశ గౌ
రీశ వియత్సుకేశ పర•మేశ కృపాకర రాజశేఖరా. 2

ఉ. రాజత ధారుణీధర వి•రాజిత భూరిసువర్ణదుర్గస
ద్రాజ సురారినాగమృగ•రాజ పదానతభక్తియుక్తగో
రాజ యశోజితాబ్జఘృణి•రాజ సఖాంచిత రాజరాజ రా
జులకెల్ల నీవెగద • రాజవు శ్రీకర రాజశేఖరా. 3

ఉ. తారగిరీంద్రధామ ధృత•తారకనామ సురాద్రిధీమ సం
పూరితభక్తకామ పరి•పోషితదేవలలామ దానవ
ద్దారుణశత్రుభీమ గజదానవదానవిరామ శేఖరా
కారశిరస్థసోమ కృత•కామ మహేశ్వర రాజ... 4

ఉ. భవలతికాలవిత్ర నత•పాపవిమోచనసూత్ర సారసో
ద్భవ దివిజేశ్వరాదినుతి•పాత్ర త్రినేత్ర గుణత్రయోల్లస
ద్భువననిదానచిత్ర ఘన•పుంగవపత్ర పవిత్రసత్కథా
శ్రవణవతీకళత్ర ఘన•సార యశోభర రాజ... 5

ఉ. అంగజగర్వభంగ శర•దభ్రశుభాంగ విలోలసత్కృపా
పాంగ నగాత్మజాహృదయ•పంకజభృంగ యశోజితేంద్రసా

రంగ దయాంతరంగ జల•రాశినిషంగ మహీశతాంగ శ్రీ
పుంగవరాడ్తురంగ ఘన•పుణ్యగుణాకర రాజ... 6
ఉ. సరసిజజానురేంద్రముఖ•సన్నుతదివ్యచరిత్ర భీ
కరదురితౌఘకాననని•కాయవినాశనవీతిహోత్ర భా
స్వరఘనసారగాత్ర విల•సన్మతి హైమవతీకళత్ర కి
న్నరగణరాజమిత్ర వర•నాకధునీధర రాజ .. 7
చ. హితకవితాభిలాష, సుక•వీశ్వరపోష మనోజ్ఞవేష సం
తతపరితోష దాసజన•తాకృతదోష తమిస్రపూష సం
భృతఫణిరాజభూష సర•సేందుకరాంచితమంజుభాష సం
హృతరిపువర్గరోష నత•హృద్వరమందిర రాజ... 8
చ. సురగిరిచాప దివ్యతను•శోభితభోగికలాప పార్వతీ
కరమణివల్లకీమృదుల•గాననినాదపరీతచూధూర్
భగసరిదంతరీప ముని•భావితభాసురచిత్స్వరూప సా
దరసరసానులాప నిజ•దాసదయాకర రాజ... 9
ఉ. మంజులభక్తలోకకృత•మానితగానరసానుకూల స
ద్రంజితకంజజాదికవ•రాప్రరతత్త్వపకార్యజాల ద్వి
డ్భంజనపాటవాంచితవి•భాసురకోటిలసత్త్రిశూల స
త్కంజహృదబ్జఖేల నత•భూరికృపాకర రాజ... 10
ఉ. పన్నగరాజకంకణ ప్ర•పన్నజనావన భక్తియుక్తిసం
పన్నమత్కవీంద్రభవ•పాపవిమోచన దేవతాధిరా
ట్సన్నుతపొల్లసచ్చరణ • సాగరతూణ రమేశబాణ యా
పన్నజనార్తిసంహరణ • భవ్యకృపాగుణ రాజ... 11
చ. నిగమసమూహఘోట బల•నిర్జితఘోరనిశాట పాపహృ
ద్గగనతరంగిణీకుముద•కాండముదావహచంద్రికాధగ
ద్ధగితదిశాంతరాళహిమ•ధామకిరీట ప్రసన్నఖేట భ
ద్రగిరజతాద్రికూట నగ•రాజసుతేశ్వర రాజ... 12
చ. తొలుత నువిఘ్ననాయకుని • దోరపుభక్తిఁ దలంచి భారతీ
లలనకు మ్రొక్కి లక్ష్మికిఁ జెలంగుచు నంజలిఁ జేసి నమ్రదిన్

గుబుకుచు సర్వమంగళను • గొల్చి పితామహుఁడు నెంచి య్యారసూ
కళాతు నుతించి నేఁడు శత•కంబొనరించెద రాజ... 13

చ. వలనుగ రాజతాద్రియు ని•వాసము హేమనగంబు చాపమున్
గలధనివైన నీకు మరి • కాన్క లికేమియొసంగువాఁడఁ జె
న్నలరఁగఁ జంపకోత్పలసు•మాంజలుల న్మధుబిందుబృందముల్
జిలుకఁగఁ గూర్చి నీకిడెదఁ • జేకొను శ్రీకర రాజ... 14

ఉ. సారెకు ముద్దుగుల్కెడు ల•సత్కవితామృదులత్వము న్సుధా
ధారలు జిల్కుపల్కుల సుం•దారపుభక్తియు నాకొసంగ రా
రా! రజతాద్రివాస! నగ•రాజసుతాహృదయేశ సాహితీ
సారమొలర్ప నీమహిమ • సన్నుతి చేసెద రాజ... 15

ముక్తపదగ్రస్తచంపకము.

సరసకవీంద్రసన్నుత ల•సత్పదసారస సారసాంబకా
పరిమితబాహువిక్రమని•వారణ వారణదైత్యఖండనో
త్కర శరలగ్నమేరుగిరి•కార్ముక కార్ముకనక్తభార్గవీ
వర వరబాణ బాణహత•పాపపురాసుర రాజ... 16

చ. పలుమరు శబ్దగుంభనలు • భవ్యసుధారసబిందుబృందముల్
జిలికినరీతి వాగ్రచన•చే సుకవిత్వమొనర్ప నేర్చియు
జ్వలభవదీయపాదనుతి • సల్పని జన్మము జన్మమే మహీ
స్థలి నటుగాన నిట్టికృతి • సల్పెద శ్రీకర రాజ... 17

ఉ. నారదముఖ్యసన్నుత స•నాతన తావకసత్కథాసుధా
వారిధివంతయున్ దవిలి • పానముసేయఁగ నెవ్వఁడోపు భా
గీరథినీరముల్ గరులొ•గిన్ మశకంబులు గ్రోలుచుండవే
కూరిమి తృప్తియున్ దులగ • గోత్రసుతావర రాజ... 18

చ. తరికిట తాంధణాంకిణత • తఝ్ఝణు తద్ధిమితాకితక్కఝ్ఝుం
తరి యని తాళలీలల మృ•దంగ ధిమిద్ధిమిఃక్వణార్భటిన్
సరిమసధల్ క్రమాక్రమత • సల్పనుఁ బొల్పగురీతి శుద్ధసా
హురి నిదె గీతిసేతు భవ•దుత్తమనామము రాజ... 19

చ. కురువక మాధవీ వకుళ • కుంద శిరీష లవంగ యూలకీ
నగిళలతా వితాన ధర • సారస పాటల జాల మాలతీ
గురుతర పారిజాత నవ•కోరక చాయలతాంత భూజను:
పరివృత రాజతాద్రిమణి•భాస్వరమందిర రాజ... 20

ఉ. చారు నమేరు నీప హరి•చందన నింబ కదంబ జంబు జం
బీర మధూక బిల్వ కర.వీర తమాల రసాల సాల మం
దార మహామహీరుహవి•తాన విరాజితరాజతాద్రి సం
చార శుభప్రచార భవ•సాగరసాధర రాజ... 21

ఉ. సారస చక్రవాక విల•సత్కలహంస జలాట కుక్కుటీ
వార విహార ధీరసుర•వారవధూకుచలిప్తచందనో
దార మృగీమదాతిపరి•ధావనగంధిలవా:ప్రపూరకా
సారపరీతరౌప్యగిరి•సన్మణిమందిర రాజ... 22

చ. లలితమృదంగవాదనక•లాతతనాదఘుమంఘుమిన్ శ్రుతుల్
గలయుచు రంగురక్తియునుఁ • గ్రాల లయాతతగీతసాహితీ
కలనఁ జెలంగఁ బాదముల • గజ్జెలుకట్టి ప్రదోషతాండవం
బలర నొనర్చునట్టి త్రిపు•రాసురసంహార రాజ... 23

చ. నిటలతటాంజలిప్రణత•నీరజగర్భశిరఃకిరీటసం
ఘటితమసారనీలరుచి•కాండమదాళిపరంపరాంచితో
ద్భటభవదీయపాదనవ•పంకజయుగ్మము సర్వసంపదల్
పటుతరలీలఁగూర్చు నిజ•భక్తుల కిద్ధర రాజ.. 24

ఉ. సారయశోజితాబ్జఘన•సార తుషార పటీర హీర మం
దార శతార తారి దర • తారక పారద నారదా భ్రకా
సార మరాళ హార శర•శారద నారద శారదా సుధా
సార దయాకరా వినత•సన్మునిశేఖర రాజశేఖరా. 25

ఉ. లలితకటాక్షవీక్షణక•లాపము చేఁ జెలువొందు మోమునన్
గుల్కెడు మందహాస మది • కోరి శిరస్థితచంద్రచంద్రికల్
గెలువఁగ నేఁగులీలఁ దుము•కింపఁగఁ దావకసమ్మదప్రభా
కలితకలావిలాస మెదఁ • గాంచెద శ్రీకర రాజ... 26

ఉ. సారలవంగ సత్క్రముక • శారదసార సమేతకమ్రవీ
టీ రసభార గంధవహ • డింభకవార విరాజితాననాం
భోరుహ వల్లభారచిత • భూవిలాసకలాప దీపనో
దారరతిప్రచార నిజ • దాసదయాకర రాజ... 27

ఉ. నాంకవగంధసార ఘన • సార మృగీమద రేణుగంధి వా
మాంక కుచోత్తరీయజని • తాంచిత శీతలవాతధూతమీ
నాంకవిలాస కేళిజని • తాయతనిర్మలఘర్మబిందుబృం
దాంకిత దేహజశ్రమని • రామయ విక్రమ రాజ... 28

ఉ. నాయక తావకీనశశి • నైల్యము సన్మదషట్పదభ్రమన్
జేయునటంచు శాంకరి వ • హించఁగఁ జంపకనాసపువ్వు నీ
కీమెడ నట్టిభ్రాంతిగల • దే ! యని నవ్వుచుఁ బ్రాణనాయకిన్
డాయఁగఁజేర్చి ముద్దిడఁగ • డంగెను శ్రీకర రాజ... 29

చ. కలువలదండలు న్వలె ని • గారపుమిన్కుల నీను పేరులన్
గళమునఁ బూనినాఁడవని • గౌరి రహిన్ బరిహాససూక్తులన్
బలుకఁగఁ గల్వదండ లన • వచ్చును నీచిరునవ్వు వెన్నెలన్
గులుకుటవంచుఁ బల్కెదవు • కూర్మి దయాకర రాజ.. 30

చ. గళమున నొప్పు నబ్బెడఁగు • కప్పమరాళిని దెప్పగా మహో
జ్జ్వలదరహాస మల్లెడలఁ • జల్లని వెన్నెల గ్గుఁగుప్పగాఁ
జిలుకలపల్కురీతి సుధఁ • జిల్కఁగఁబల్కెడు గౌరిముద్దుప
ల్కులగమి యొప్పగా మిగుల • గుల్కెడు శ్రీకర రాజ... 31

ఉ. కీర మయూర కోకిల శుకీ కలహంస శకుంత శారికా
వార కలధ్వనుల్ గలిగి • భాసిలుచుండెడు పువ్వుఁదోఁట వి
స్తారపురాకృతాతిభవ • తారక తావకసత్కథాసుధా
ధారలు గ్రోలుపుట్టము ము • దంబిడు శ్రీకర రాజ... 32

చ. సురలతిభీతులై శరణు • జొచ్చిన వారల నాదరించుచున్
మురహరుని న్వసుంధరను • భూరిమహీధరము న్మహాంబుధిన్
శర మరదంబు చాపము ని • షంగము గాగ ధరించి యాజిలో
నురవడిఁద్రుంచి తౌర త్రిపు • రోద్ధతదైత్యుల రాజ... 33

ఉ. తావకసంస్తవాప్తలలి•తంబగు వాక్ఫణితిన్ గవుల్ ధనా
శావశులై కదర్యమద•శాలిన్నృపాలురపాలు సేతు రా
హా! వియదాపగాసలిల • మబ్బినపట్టున నింబభూజమున్
వావిరిముంచి పెంచు నల•బాలిసులట్లను రాజ... 34

చ. రసమును గుర్తెఱుంగఁ డతి•రమ్యకవిత్వముఁ జూచి మెచ్చఁ డే
డసహనమొంది గుందు నహా•హా! సుకవిత్వమొసర్వ లేదన
ద్విసరము సేయునట్టి యవి•వేకికిఁ బొందికయుండు గాక యు
ర్వనుమతియందు నిందలకుఁ • బాలగు నాతఁడు రాజ... 35

ఉ. కొండెము సెప్పఁ బండితుఁడు • కొండొకవిద్య నెఱుంగఁ డెంతయు
న్మొండితనంబు నొందు గడు•మూర్ఖుఁ డనార్యుఁడు తిండిపోతు నీ
చుం డతిబుద్ధిహీనుఁ డగు • సోమరి సత్కవినింద సేయుచో
నుండదు కిందుమీఁదుల న•హా రిపుభీకర రాజ .. 36

ఉ. పరులకు విద్యనేర్పుటకుఁ • బాల్పడఁ డొక్కఁడఁ జెప్పనేరఁ డా
మరుగిడి తెల్పు మత్సరుఁ డ•మానుషుఁడు పల్కినపల్కు నిల్వఁగా
దొరకొని కయ్యమాడుటకె • తూఁగను గుచ్ఛితుఁ డట్టివాని కీ
ధరను బ్రతిష్ఠ లేమిగద • దాసపరప్రియ రాజ... 37

ఉ. మానితగీతరీతియును • సుందరమాధ్యమతారకంబులున్
దాన వితానవంగి తులఁ • దాళగతుల్ గడురంగురక్తియున్
గానవిహీన గానము సు•గంధవిహీనతఁ జెందునట్టి యా
సూన మహాత్రిదానమును • సొంపుదహింపదు రాజ... 38

చ. మనమున నొక్కతీరు పలు•మాటల పై కొకరీతిచేయఁ బూ
నిన దొకదారిగా నిటుల • నీతివొలంగి మెలంగు వారితో
జను లతిమైత్రిసల్పు నురు • సద్గుణధుర్యుని విప్రయోజనుం
డను చును గంటిఁజూడరు అహా•హా! సుగుణాకర రాజ... 39

చ. విరివిగ నోటఁ దా ననుభ•వించక దీనుల కివ్వనట్టివాఁ
డణిమణి భూమినుందిడిన•యర్ధ ఘనర్ధకవా తుదిన్
మరుగునఁ దాగియుండి మధు•మక్షికముల్ దగఁ గూర్చు తేనె దా
బరులకుఁ జెందురీతి నగు•భవ్యగుణాకర రాజశేఖరా. 40

చ. సతతము యాచకావళికి సారధనంబిడు వాఁడె వదాన్యుఁడౌ
చతురుఁడు తత్క్షణంబొసఁగ సయ్యన లేదని త్రిప్పువాఁడె బల్
చతురతరుండు, లేదనఁడు జాలము సేయుచు నిచ్చురీతి సం
తతము నుదిర్పువాని యభిధానము గానము రాజశేఖరా. 41

ఉ. కోరికతో ధనాఢ్యుఁడని కుత్సితు నల్పుని దుష్టచిత్తునన్
జేరినవార లీప్సితము జెంది సుఖింపరు హానిఁ గాంతు రా
చారుఫణాగ్రభాగవిలసన్మణిరాజము గల్గి వెల్గినన్
ఘోరభుజంగమున్ గవయఁ గూడునె శ్రీకర రాజశేఖరా. 42

చ. నరులు స్వదేహశోషణము నర్చన దానని ముక్తి గల్గునం
చరయుదు రెంతవింత యహహా! యవివేకము వారి నొందు, ని
ర్ధర నొకపుట్టపై మిగులఁ దాడన సేయఁగ నంతమాత్రి న
య్యురగ మణంగునే నతదయోదయ శ్రీకర రాజశేఖరా! 43

ఉ. భూతి శరీరమంతటను బూసి జటాజినవల్కలాంగుఁడై
శీతజలాతపాదుల వసించుచు వేషముఁ బూను దాంభికుం
డాతత భక్తియుక్తుఁడగు నప్పరతత్త్వవరు స్వలేన్ మహా
భూతపతీ! భవత్పదముఁ బొందునె శ్రీకర రాజశేఖరా. 44

చ. విమలతర ప్రబోధముగ వేదము శాస్త్రపురాణపుంజముల్
గ్రమమున నభ్యసించి యటఁ గర్మవిమోహితుఁడై జనాళికిన్
శ్రమముఁగాని బోధ సేయుచును సత్పరతత్త్వము గానలేఁడు దా
నమరియుఁ దర్వి పాకరసమానని కైవడి రాజశేఖరా. 45

ఉ. ధీరుఁడు భక్తిఁ గల్గి భవదీయకృపావశుఁడౌట శాస్త్రమున్
గోరి పఠించి సారమును గూరిమి మీఱ గ్రహించి పిమ్మటన్
ధారుణి కర్షకుండెటుల ధాన్యము నెంచి పలాలసంహతిన్
దూరము సేయునట్టిగతిఁ ద్రోయును శాస్త్రము రాజశేఖరా. 46

చ. అసితము లంతరాయము లనంతములై విలసిల్లు శాస్త్రముల్
మనుజుల కాయువల్పము సమర్థతఁ గల్గుట దెట్లు గావునన్
ఘనమగు శాస్త్రసారమును గైకొను, ధన్యుఁడు నీదు సత్కృపన్
వనమునఁ దుగ్ధ మంచవలెఁ భక్తియుతాదర రాజశేఖరా. 47

చ. శిరము వహించుఁ బుష్పములను, జెల్వుగ నాసిక యానుగంధమున్
గురుమతితో గ్రహించు నధి కుండొకఁడెయ్యెడ సర్వశాస్త్రముల్
దొరకొని తాఁ బఠించుఁ గడుఁ దోరపులీలఁ దదర్థమాత్మలో
నరసి సుఖంబు నొందెడు మహాత్ముఁడొకండిల రాజశేఖరా. 48

చ. హరి యనుచున్ హరుండనుచు నంబుజగర్భుఁడటంచుఁ గొందరీ
వసుసను బల్కుచున్ బ్రకృతి బద్ధులు గావున జ్ఞానహీనులై
పురికొని వాదమొందెదరు ముప్పురికివ్వలమూలమౌ పరా
త్పరు నవికారుఁ గాంచునదె తత్త్వము శ్రీకర రాజశేఖరా. 49

చ. హరియె హరుండు శ్రీధరపు రాముల కైక్యమటంచు వేదముల్
మొరలిడుచుండఁగా వినుచు మూఢత భేదము సేయనేల దు
ర్భరమగు నయ్య విద్య నెడ వాపి పరాత్పరతత్త్వ మానుసు
స్థిరమతిఁ దా సుఖించును సుధీజనతాదర రాజ... 50

చ. తనువు మనంబు ప్రాణములుఁ దద్దయు నిందియజాల మైక్యము
స్సనరఁగఁ జేసి భక్తిఁ గొని తావకపాదసరోజచింతనం
బునఁ గడు మోదమొందు ఘనపుణ్యుఁ డొనర్చిన సర్వధర్మముల్
బొనరఁగ నీకొసంగుచును బొందు భవద్గతి రాజ... 51

ఉ. పావనతావకాంఘ్రియుగ భావనయ న్వరసూర్యదీప్తి లే
కేవరుసన్ దమఃపటల మేగును గేవలశబ్దబోధచేఁ
బోవునదెంతయు న్విరతిఁ బొందునె చీకటి దీపవార్తచేఁ
గావున నీదుభక్తి గొనఁగావలె శ్రీకర రాజ... 52

చ. వ్రతములు దేవపూజలుప వాసములున్ బహుదానధర్మముల్
గ్రతువులు తీర్థయాత్రలును గన్గొన వేదపురాణశాస్త్రముల్
గుతుకముతో భవత్పదముఁ గోరి భజించు మహాత్ముఁబోవ్రవ-నీ
యతులితభక్తిఁ బోలవు దయాకర శ్రీకర రాజ... 53

ఉ. ఆటఁ జోటనైనఁ బరిహాసపుమాటలనైన నీటుగాఁ
బాటలనైన భీతిఁగొని బాటలనైనను మాటిమాటికిన్
నోటను నీదునామము వినోదముగాఁ గొని ముక్తిబోటితోఁ
గూటములన్ సుఖింతురట గోత్రసుతావర రాజ... 54

చ. కలిబలిమిన్ రచించు ఘన • కల్మషముల్ వహియించి చెంగటన్
నిలిచి భజించుభక్తులను • నీదు కృపారసవార్ధిచేత ని
ర్మలినులఁ జేయుచుందువట • మానక మానుగనీనునట్టి గో
వులు దమవత్సల న్వలెను • భూరిదయాకర రాజ... 55

ఉ. చారువిలాసవాసముఖ • సారససారమృదూక్తిమాధురీ
ధారవిరాజమానరతి • భావజభావజచాతురీపరీ
తారభటీకటాహవని • తాజనతావశులై నితాంతనం
సారముఁగోరి నిన్నుఁ గన • జాలరు మూఢులు రాజ... 56

ఉ. కాలగతుల్ దలంచి భవ • కల్పితకార్యము లొందియు న్నతి
లోలురుగాక క్రోధ మద • లోభము లెల్ల నణంచి కల్మషో
న్మూలనమాచరించి సమ • బుద్ధివహించి భవత్పదాబ్జభ
క్తాళులు నిన్నుఁ జెందుదురు • హా పరమేశ్వర రాజ... 57

ఉ. నాంబ కృపావలంబ బుధ • జాతవినీతపరీతశీలతా
లంబ నితాంతభక్తినుతి • లాలసమోదయుతాంకసక్తహే
రంబ త్రిశూలచాలనప • రాజితఘోరసురారిభీకరా
డంబ భవత్కథల్ శుభవి • డంబనలీశ్వర రాజ... 58

చ. సలలితతావకాంఘ్రిజల • జాతయుగాంచితభక్తుఁ డల్ల నూ
ర్తుల ధనదుర్మదాంధుల ను • తుల్ విననొల్లఁడు తా భజించునే
కొలఁదిరసాలసాలమధు • కోమలపల్లవఖాదిమత్తకో
కిల చలపత్రిపత్రము లొ • కించుక శ్రీకర రాజ... 59

చ. నరులెవరేని నీదు భవ • నంబున కొక్కప్రదక్షిణంబు సు
స్థిరమతితో నొనర్చి పద • సేవకులై శివ శంకరా శివా
వర వరదా యటంచు బహు • భక్తిఁ బఠింపఁగ దండపాణిమం
దిరమదిగాంచ రెన్నఁడును • ధీర మహేశ్వర రాజ... 60

చ. అమితభవత్పదాబ్జభజ • నామృతపానవిశేషమత్త
త్తము కలనైనఁగోరదుగ • దా ఖలసేవనలన్ ప...
విమలతరంగమాలికల • వేడుకతోడను దూఁగురాజ...
సము జలరాశికేగునె వెస న్బరమేశ్వర రాజ... 61

చ. హర త్రిపురాసురాంతక ద•యాకర శూలి కపాలమాలికా
ధర గిరిజాపతీ యని స•దా నుతిసల్పెడు భక్తకోటిపా
దరజము మచ్ఛిరంబునను • దాల్తు నటేగణుఁడంచు జంకి కిం
కరులకుఁ దెల్పుచుండునట • కాలుఁడు శ్రీకర రాజ... 62

ఉ. శంకర భక్తమానసవ•శంకర దుష్టనిశాటఝాటనా
శంకర శంఖ పంకరుహ • చక్ర హలాంకుశ చాపముఖ్యరే
ఖాంకిత తావకాంఘ్రియుగ • మాదరలీల భజించునట్టి నీ
కింకరుఁ జేరరల్ల యమ • కింకరు లీశ్వర రాజ... 63

ఉ. సారెకుఁ ధీసులైఁ సుగుణ • సారతమోఘ భవత్కథాసుధా
ధారలఁ గ్రోలుచున్ చరణ • దాస్యముఁ సల్పెడు వారి వారినిన్
జేరిన వారిదారికినిఁ • జేరకు డంచు యముండు దూతలన్
దూరుచుఁ బల్కుచుండు భవ • దూర, దయాకర రాజ... 64

ఉ. వారక సత్యదూరుల ని•వారితదస్యులఁ గర్మబాహ్యులన్
ఘోరుల బ్రహ్మఘాతకుల • గోఘ్నుల దుష్టుల దుర్మదాంధులన్
వారినిఁ జేరు వారిదరి•వారిని పారెకుమీఁటి చీరఁగాఁ
జారులఁ బంచు కాలుఁ డని•శంబు పరాత్పర రాజ... 65

ఉ. లాలితభర్మనిర్మితవి•లాసభవన్మణిమందిరస్థఘం
టాలపితధ్వనుల్ శ్రుతివి•డంబనగా వినుచున్న వారల
క్కాల లులాయకంఠపరి•కల్పితభూరితరోగ్రఘంటికా
జాలనినాదముల్ వినరు • సారగుణాకర రాజ... 66

చ. లలిభవదుత్తమాంగపరి•లంబితదివ్యజటానటద్ధునీ
కలితతరంగఘుంఘుమిత•కమ్రనినాదము నాలకించు వా
రలును యమాలయాంగణవి•రాజితవైతరణీతరంగమా
లలఁ గలనైనఁ గాంచరు క•లాకలితాదర రాజ... 67

ఉ. ప్రకటహేమచౌర్యముఖ•పాతకఘోరభుజంగపాళికిన్
కేకులు నీదునామఘన•కీర్తనముల్ మధుపానపాతకిం
పాకరుతారధారలఘ•భంజన ! నీశుకథాభివర్ణనల్
చేకొనువారు దుష్కృతము • జెందరు శ్రీకర రాజ... 68

ఉ. పట్టితి నీపదాబ్జములు • భావుకలీల సమస్తసౌఖ్యముల్
ముట్టితి జన్మకర్మభవ•మోచన నీదుపదాభిలాషినై
మట్టితి లోభమోహమద•మత్సరరోషరికాయమిత్రతిన్
గొట్టితి సర్వపాపముల • గోత్రసుతావర రాజ... 69

చ. విడిచితి కర్మసంచయము • వేడ్కమెయిన్ నీదుపదార్పణంబుగా
గడచితి పూర్వజన్మకృత•కల్మషవారిధి శత్రువర్గమున్
బొడిచితి జ్ఞానచంద్రికను • బూని మదింద దమమంత వింతగాఁ
దుడిచితి మేరుచాపధర • దుర్జనభీకర రాజ... 70

చ. జగమున జీవకోటి శత•జాతులనొంది నరత్వమూను మా
నుగ నట విప్రజన్మముగొ•ను న్బహుపుణ్యముచేత శాస్త్రమై
తగియును విస్గన న్మదిని • దల్పక తా విడుచు న్బయత్నహ
స్తగతసుధారసమ్మువలెఁ • దత్త్వము శ్రీకర రాజ... 71

చ. సురలు నిశాచరు ల్గలిసి • సూటిగఁ బాటిలుదుగ్ధవార్ధి మం
ధరగిరిచే మథింపఁగ నుఁ•దారహాలాహల ముద్భవించి య
త్తఱి జగముల్ గలంచు నెడ • దానిని నీగళమంద నిల్పి శం
కరతను ముజ్జగంబులను • గాచితి వీశ్వర రాజ... 75

ఉ. కంజజముఖ్యఖేచరని•కాయు మట న్భజియించి మించి మృ
త్యుంజయ ! తేనమోస్తు భవ•తోయధినాధర ! తేనమోస్తు స
ద్రింజక ! తేనమోస్తు నగ•రాజసుతాధిప ! తేనమోస్తటం
చంజలిజేసి పల్కు విజ•యాకర శ్రీకర రాజ... 73

చ. పరమమునీంద్రదేవగణ•పన్నగఖేచరసిద్ధసాధ్యకి
న్నరగరుడోరగాదిగణ•నాథపరిష్కృత రాజతాద్రిమం
దిరమణిసింహపీఠయుత•ధీరలసన్మృదులాంకసక్తస
ద్గిరివరకన్యకారచిత•గీతరసాదర రాజ... 74

ఉ. సారెలుమేళవించి విల•సన్మణివీణలుపూని తుంబురుం
డారయ నారదుండును ల•యాంచితసంగతి గీతసాహితీ
సారముగా భవత్కథలు • సారెకు గానమొనర్చి తత్సుధా
ధారలు గ్రోలుచుందురు స•దా జగదీశ్వర రాజ... 75

చ. వితతకృపావలోకనసు•వీచిలసద్దరహాసచంద్రికల్
గుతుక మొనర్చి సేవకచ•కోరముల న్వెలసిల్లఁ జేయఁగన్
సతతము నర్మగర్భకలిత•చాతురి మీఱఁగ సర్వమంగళా
తతసరసోక్తుల న్ముదము•దాల్చెదు శ్రీకర రాజ... 76

చ. కరమణికంకణధ్వనులు • గ్రాల సలీలసువర్ణదండచా
మరమున వీచుచో నలరి • మంజులవాగ్రచనాచమత్కృతుల్
సరసహితోపదేశములు • సల్పఁగఁ బొల్చు నిజాంకసక్తశాం
కరినిఁ గటాక్షవీక్షలను • గాంచు దయాకర రాజ... 77

చ. కనకచిరత్నరత్నమయ•ఘంటలు మ్రోయ నడావు బర్వఁ బో
వును నతిబాజియన్ గదను • గున్నను చాతురథా మొదల్ రహిం
పా నడకలన్నటించు గడు•చోద్యపుఁ బుంగవరాడ్తురంగ మె
క్కి నగజఁగూడి నాప్తుల కొ•గింజను శ్రీకర రాజ... 78

చ. అరమరఁగ నొక్కబిల్వదళ • మర్పణసేయు నితాంతభక్తిసు
స్థిరమతి యిందిరావిభులగు • దేవతలందె చెలంగు సర్వదా
మొరయుచుఁ దావకాంఘ్రులను • బూజలొనర్చిన సేవకుల్ భవ
ద్గిరినివసించు టబ్బురమె • దివ్యధునీధర రాజ... 79

చ. కరములు నీపదార్చనముఁ, • గన్నులు తావకదివ్యమూర్తి, సు
స్థిరమతి నీకథామృతము, • దేహము నీదగుసేవ, జిహ్వ సా
దరముగ నీదుకీర్తనలు, • తద్దయు వీనులు నీచరిత్రలన్,
నిరతము గోరు నిర్ఝరధు•నీధర శ్రీకర రాజ... 80

ఉ. చల్లని నీకృపారసము • సారెకుఁ గూర్మిమీఱ నాపయిన్
జల్లఁగఁ జాలు పూర్వభవ•సంచితకల్మషతాపసంచయం
బెల్లనడంచెద న్ధృతిన•హీనభవత్పదభక్తిబీజముల్
జల్లుచు నారుఁబెంచెదను • సారదయాకర రాజ... 81

చ. పతితుఁడనయ్యు నీపతిత•పావననామనమశ్శివాయమం
త్రితరణిచేఁ దరింతునుగ•దా దురితాఖిలవారిరాశి స
న్నుతనిహసౌఖ్య మొందుటకు • నామది సందియ మొందనైతినో
సతతదయానిధీ! సుకవి•సన్నిధి శ్రీకర రాజ... 82

ఉ. శంకర సర్వసంపదలొ • సంగుము సంతసమొంది శాంకరీ
పంకజగంధి దా నిడు న • పారకృపామతి నెల్లవిద్యలన్
గొంకక నట్టివేడుకను • గోరికలీరిక లెత్త మిమ్ము ని
శ్శంకభజించుచుందు నిక • సాధుజనాదర రాజ .. 83

ఉ. వేడుకనైన దాడిఁబడి • వేదననైన ముముక్షుపాళితో
గూడికనైన భక్తిఁగొని • గొల్చుచునైన తపస్సమాధులన్
వీడకనైన శంకరపవిత్రచ • రిత్రయటంచుఁ బేర్కొనన్
దోడఁక వారికౌదవు కు • తూహలమేదుర రాజ... 84

చ. ఇహపరసౌఖ్యదాయకుఁడ • వీవె యటంచు సదా ముదంబునన్
రహిని భవత్పదాబ్జములు • రంజనమీఱ భజించి సత్సదా
వహమగు నీకథామృతము • వారక గ్రోలి సుఖించుచుంటి న
న్నహమును దత్సుఖంబుగొను • వాంఛను శ్రీకర రాజ 85

ఉ. దీనతలేనిజీవనము • దివ్యకళాన్వయమైన నీపద
ధ్యానము పూర్వజన్మభవ • తారకతావకసత్కథాసుధా
పానము నిచ్చుట న్నది భ • వస్థితికి న్ననువేళ వేదనల్
గాని నిరామయతన్ మొనఁ • గన్వలె శంకర రాజ... 86

ఉ. భాసురతావకాంఘ్రివర • పంకజపంజరమధ్యవర్తిగాఁ
జేసెద నిప్డె మామకవ • శీకృతమానసరాజకీరమున్
శ్వాసకఫాదిరోగములు • వారక నుత్తుక నొత్తువేళ నా
యాసముచేత నీస్మరణ • యాఱెటు లీశ్వర! రాజ... 87

చ. సరసుఁడెఱుంగు సత్కవన • సారము సారెకు సారసోదరో
త్కరమకరందమాన్యుల ఘు • టారవ మధుపాళి మొప్పఁగాక ద
ర్దురము సమర్థమౌనె భవ • దూర! ధరాధరకన్యకావరా!
సరసతగాంచుకావ్యరస • సారసుధాదర రాజ... 88

చ. మదయుతుఁడన్ దురాగ్రహుఁడ • మందుఁడనైనను సర్వవైభవా
స్పదమగు నీపదద్వయము • భావనసేయుచు నున్నవాఁడనో
సదయగుణాంబుధీ! దురిత • సంఘము వీడంబి సమస్త సౌఖ్యసం
పదలనొసంగుమీవు పరి • శుభ్రగుణాకర రాజ... 89

ఉ. గౌళ బిళాహరి శహాన • కాఫి కమాచి ముఖారి నాట భూ
పాల మతాణ బేగడయు • భైరవి తోడి వరాళులన్ శ్రుతుల్
మేళవచేసి తాల్గరుగ • మెండుగ నీవయి సత్కృతుల్ సదా
ళివిరంగు రక్తిఁదగ • బాడుదు శ్రీకర రాజ... 90

చ. సరసకలాకలాప పిల • సత్కవివర్ణ్యమహావిలాస సుం
దర కరుణారసార్ద్రసము • దారకటాక్ష భృదీక్షణాతి భా
సురమ ఖమాందహాస వరి • శోభితహార్మ్యవిరాజమానస
ద్వరస్పృహ వాకతిప్పపుర • వాస! మహేశ్వర రాజ... 91

చ. సుమతిఁ భక్తి భక్తజన • కోటి నితాంతము సేవ సల్పఁగాఁ
బరమకృపామతిన్ దగుశు • భంబు లొసంగి యభీష్టసంపదల్
గురియుచుఁ బార్వతీపతినిఁ • గూడి సుఖించుచు వాకతిప్పనుం
దిరమున నిల్చి పొల్చ నగ • ధీర మహేశ్వర రాజ... 92

చ. ఘనుఁడతినీచుఁ జేరి మెలఁ • గన్ ఘనమంతదొలంగు నీచుఁ డా
ఘనునెడబాయకున్కి నన • ఘా ఘనమొందు నిజంబు నావచే
తను శిలలెన్నియో జలధి • దాటుచు సూత్రము నూనరాజితోఁ
బనుపడి యుత్తమాంగమున • భాసిలు శ్రీకర రాజ... 93

ఉ. త్రోవఁదొలంగి దుర్గతులఁ • దూగి విధూజనమోహ మద్యమున్
ద్రావి పవిత్రుఁడై పొట విత • తంబగు సంసరణాటవిన్ సదా
తా వసియించుమూఘుఁడు క • దర్యుడ రామ్యగ రాజు చేతఁ గో
ల్పోవఁబడుంగ లేదు నత • భూరికృపాకర రాజ.. 94

చ. శతధృతివానవాదుల.క • సాధ్యము నీదుమహత్త్వమెన్న దు
ర్మతులకు మాకశక్యమను • మాటలికేల భవన్నుతిన్ బవి
త్రిత స్వరిగాఁ దలంచెద సు • ధారసమాధుటచే సురల్ గుళ
వ్రితతిఁ బవిత్రమౌటగని • భక్తజనాదర రాజ .. 95

చ. జనకుఁడ వీవె శంకర ని • జంబు ధరాధరరాజపుత్రి మ
జ్జనని పురాణదంపతులు • సాకృపామతులైన మీరు పెం
చిన తనయుండనౌట నుతి • చేసితి తప్పులుగాచి ప్రోచి భూ
జనునుత భక్తిముక్తుల నొ • సంగుడు శ్రీకర రాజ... 96

చ. సురుచిరసత్యవాలుకులఁ•జుండను వేంకటరాయపుత్రుఁడన్
ధరణిని సుందరాహ్వయుఁడఁ • దద్దయు మంత్రివరుండ శాంకరీ
వరపరిలబ్ధసారమృదు•వాక్కలితాతతగీతసాహితీ
పరిచయుఁడన్ భ•వచ్చరణభక్తుఁడ శ్రీకర రాజ... 97
ఉ. నమ్రతమీరఁ బ్రీశతక•సారము గోరి పఠించుచున్న నా
రిమ్మహి వస్తువాహనమ•ణీధధరారమణీయభోగభా
గ్యమ్ములనొంది పొందికల • నారవితారకముఁన్ సుఖించి ని
క్కమ్ముగఁ బుత్రపౌత్రులను • గాంతురి మహేశ్వర రాజ... 98
ఉ. మంగళమందు పౌరనిజన•మానితపాదసరోజ నీకిదే
మంగళమందుఁ గాన్యరస•మార్దవగీతవిలోల నీకిదే
మంగళమందు చారుతర•మంజులసత్యసుభావ నీకి -
మంగళమందు సాధుజన•మానససంచర రాజ.. 99
చ. హర గిరిజామనోహర సు•రాదిశరాస మహేశ సాంబ శం
కర పరమేశ్వరా గరళ•కంధర భూతపతీ మహానటా
సురగిరిచాప భూతిధర • శూలి గిరీశ భవా మహేశ్వరా
పురహార దేవదేవ పరి•పూర్ణదయాకర రాజశేఖరా. 100

సంపూర్ణము.

# ఆముద్రితాంధ్రగ్రంథసర్వస్వము

సంపాదకులు,

కావ్యనిధి, శ్రీ చెలికాని లచ్చారావుగారు.

——(o)——

| | | | | |
|---|---|---|---|---|
| 1 | జాహ్నవీమాహాత్మ్యము (ఏనుఁగు లక్ష్మణకవి) | 0 | 10 | 0 |
| 2 | సీమంతినీకళ్యాణము (పెనుమళ్ల సోమన్నకవి) | 0 | 10 | 0 |
| 3 | విజయనందనవిలాసము (మంగళగిరి ఆనందకవి) | 0 | 10 | 0 |
| 4 | వాల్మీకిచరిత్రము (రఘునాథభూపాలుఁడు) | 0 | 8 | 0 |
| 5 | రంగనాథరామాయణము (కాచభూపతి, విఠ్ఠలరాజు) | 1 | 0 | 0 |
| 6 | శ్రీరంగమాహాత్మ్యము (కట్టా వరదరాజేంద్రకవి) | 1 | 8 | 0 |
| 7 | సారంగధరచరిత్రము (కూచిమంచి తిమ్మకవి) | 0 | 12 | 0 |
| 8 | భార్గవపురాణము (కాండూరి వేంకటదాసు) | 2 | 0 | 0 |

వలయువారు—కార్యదర్శి:—

చిత్రాడ; పిఠాపురంపోష్టు, గోదావరిజిల్లా.

---

ఆంధ్రభాషావిలాసినిపత్రికనుండి వెలువడి విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మిత్రవిందాపరిణయము (శ్రీ రాజా రావుజనార్దనరంగారాయణింగారు) (బొబ్బిలి) | 0 | 10 | 0 |
| 2 | ప్రేమమయిరాధ (చిత్రావూరు కామేశ్వరరావుగారు బి. ఏ.) | 3అ. | | |
| 3 | నానార్థనిఘంటు | 0 | 4 | 0 |

ఆంధ్రభాషావిలాసినీకార్యస్థానము,

చిత్రాడ, పిఠాపురంపోష్టు, గోదావరిజిల్లా.

శ్రీరస్తు.

# దీనచింతామణిశతకము.

శా. శ్రీరుక్మిణ్యధినాథ పద్మభవ గౌరీభర్తృపాకారి ప
ద్మాశ్రీశానసఖాభ్రిరత్నముఖదివ్యస్తోమచూడామణి
స్ఫారత్కాంతివిశేష భూషచరణాబ్జద్వంద్వవజ్రాదిరే
ఖారూఢాంచవిలాసనాథ హరి కృష్ణా దీనచింతామణీ. 1

మ. షవభూషాయుతవేదచామరహలాంభస్ఫూర్తి జంభారిహే
తిదరచ్ఛత్రరథాంగమీనసురధాత్రీజాంకుశప్రఖ్యచి
హ్నాదమత్కాంతిగుణాంకసూరినివహప్రార్థ్యాంబురుణ్మంజులా
స్పదపాపాపహపాదమోదకర కృష్ణా దీనచింతామణీ. 2

మ. వరకల్యాణగుణుండు లక్ష్మణమునిస్వామి ప్రబంధోక్తి వా
గ్ధిరమాసోదరుఁడై చెలంగు విమల శ్రీశైలతాతార్యరా
డ్గురుఁడే తావకమూర్తియంచు మది గీల్కొల్పంగ లేనట్టి దో
షరతస్వాంతుఁడ నెట్లుబ్రోచెదవొ కృ... 3

మ. నిరహంకారు లపేతకల్మషచయుల్ నిర్మత్సరుల్ వత్సలుల్
మరుదైశ్వర్యవిరాగమానసులు శ్రీమద్వేదమార్గాదియు
గ్బిరుదాంకు ల్భవదీయజంగమవపుస్ఫీతు ల్మహాత్ము ల్బుధుల్
శరణంబంచు భజింపఁజేయఁగదె కృ... 4

మ. అరిషడ్వర్గవిభంజనుల్ వరవిశిష్టాద్వైతసిద్ధాంతబం
ధురరక్షాచణవైదికాన్వయవరుల్ దోషాపహుల్ దేవతాం
తరమంత్రాంతరసాధనాంతరవరిత్యాగు ల్బుధేంద్రు ల్భవ
చ్చరరూపంబులటంచుఁ దెల్పఁగదె కృ... 5

మ. కవితాతత్త్వమెఱుంగ లక్షణమెఱుంగన్ జాల శబ్దార్థభా
వవికాసంబులెఱుంగఁ బూర్వకవివాగ్వైచిత్ర్యలంకారశా
స్త్రవిచారంబులెఱుంగ నేనిటు కవిత్వప్రక్రియల్పూన హా
సవశాత్ముండనుగానె లోకములఁ గృ... 6

మ. శిశువాక్యంబులు తండ్రికిం బ్రియములై • చెన్నొందుచందాన ప
ద్యశతంబు న్ఘటియించుదాసునికి నీ • యాజ్ఞం బ్రసాదించి శ్రీ
దశరూపా! కృపఁ జిత్తగించి ధరణిం • దద్వృద్ధిఁ గావింపవే
శశభృద్వంశలలామ నందసుత కృ... 7

మ. పతితుండంచుఁ గృపావిహీనుఁ డనుచు • న్బద్ధాత్ముఁడంచుం దమో
న్వితచేతస్థితినుండు భూరికలుషా•న్వితుండ నంచు న్నను
న్మతినూహించకు నీదృశున్మనుచుటే • మాతండ్రి నీకు న్మహో
న్నతి సత్కీర్తి యజామిళాద్యవన కృ... 8

మ. వసుధ న్వర్ణిత నిన్నుతించ నజశ•ర్వసర్వజ్ఞులేజాలర
న్న సమగ్రస్తుతిఁజేయనేర్తునె యశై•న న్వాంఛికి న్నీకు రీ
తిసమంబా యన నిన్నుతించుతఱి నం•తేచాలు లోపంబువా
య సహాంసంబులుఁ జందునంటునటు కృ... 9

మ. బహుమాత్రస్తనదుగ్ధముల్ గొనియు న•ప్పా వేయికింగ్గఁగా
ముహురేనఃక్రియలాచరింపుచు మహా•మోహాంబుతోనుంటి పా
పహరా నీదుపదాబ్జభక్తియను మే•ల్పాలిచ్చి నన్బ్రోచు దా
సహితోల్లాస సహాస చారుముఖ కృ... 10

మ. అలనాఁ డాకురురాజు పీట ద్రుపద•క్ష్మాధీశ బాలాంబర
స్ఖలనం బుద్ధతిగాఁగ నానతి దయా•కల్పా హరే యంచు న
త్యలఘుప్రక్రియ వేడిన న్మనుచు దే•వా నన్ను సుజ్ఞానవ
త్ప్రలసద్విగ్రహుఁజేసి బ్రోవఁగదె కృ... 11

మ. అరిషడ్వర్గసకంటకాటవివితా•నాజ్ఞానకాసారవా
స్ఫురితాహంకృతి నక్రపీడితుని న•న్బ్రోషింపవే చక్రహ
స్త రమానాయక మున్ను వన్యకరిచిం•తం బాపు చందంబుచే
నరసారథ్యవినోద సర్వగత కృ... 12

మ. ధ్రువురక్షించితివంచు రావణునకుం • దోఁబుట్టువౌ వాని రా
జ్యవిభుంజేసితివంచు దానవకుల•స్వామ్యార్భకుం గాచితం
చు వనేభేప్సితమిచ్చితంచు జగతీ•శు న్నమిత్రిన్నిన్ను దీ
నవన శ్రీమధుమాస మాసహిత కృ 13

మ. కులవిద్యాధనమత్తతం జెలఁగి స•ద్గోష్ఠిక్రియల్మాని మూఁ
గలరీతిం బరుషోక్తిఁ బల్కుచు మహా•గర్వాంధకారంపు చి
క్కులలోఁ జిక్కుటులుండి నిన్ను గరుడాం•కు న్మాత్రనవు న్భక్తవ
త్సల సేవించఁగఁ జాలనైతి హరి కృ... 14

మ. పలుమారు న్మదమత్తులం గనియు నా•పాలింటి శ్రీరామచం
ద్రులు నీలాద్రివిభుండుఁ గృష్ణబలభ•ద్రుల్ సింహశైలేంద్రవా
సులు మీరేయని కుక్షిరక్షణకు నే•చోప్చటం బ్రసంగించు భా
షలు గల్పించితి వెంతవాఁడవయ కృ... 15

మ. పరనారీధనలోలుఁడన్ జటులకో•పక్రూరమశ్శీలుఁడ
న్నిరతాజ్ఞానవిశాలుఁడన్ సుగుణభృ•న్నిందాకథాఖేలుఁడన్
దురితాభీలుఁడ బాలుఁడ న్నను దురా•త్ము న్వేడ్కరక్షించితే
నరయన్వచ్చు భవత్ప్రభావ మిలఁ గృ... 16

మ. పరివాదంబులు సేయనేర్తుఁ గలహా•ప్రస్తావము న్నేర్తు భూ
వరులంగాంచి నుతించి తద్భవములన్ • వాక్రుచ్చి తేనేర్తు నే
ర్తు రసజ్ఞావళిఁగూడి యట్లుబలుకన్ • రూఢంబుగా నేర మీ
చరణాంభోరుహపూజసల్పుటయ కృ... 17

మ. బుధుల న్వంచనసేయనేర్తు బరుల • న్నొప్పించఁగానేర్తు పా
పధనంబు ల్సమకూర్పనేర్తు ననృత•ప్రజ్ఞ న్వినోదించనే
ర్తు ధరామర్త్యుఁడఁ బండితుండఁ గవి నెం•తోవాఁడనంచు న్ధనే
చ్ఛ ధర న్వర్తిలనేర్తు ధూర్తుఁడను కృ... 18

మ. జనకాచార్యసహోదరీ జననికా•ఱూత్రదేవదేవాగ్రజా
త నరాధీశకళత్ర మాతృగురువి•ద్వదార్యరాట్పూరత
మ్యనిరూఢిం గననట్టిదుర్జనుల నా•హా శిక్షసేయంగలే
వనరాదే గద సామి వీవనుటఁ గృ... 19

శా. హారంబుల్ మణికుండలాంబరసువ•ర్ణాగారముల్ గాఁగ నా
నేరంబుల్ సమకూర్చి కానుకలుగా • నే నిచ్చెద న్నాని శృం
గారంబు ల్గద యంచుఁ దాల్చి నను వే•డ్కన్ప్రోవు [illegible]
పారంబుల్ భవదీయధామములు కృ... 20

శా. రాకాచంద్రనిభాస్య చంద్రికధరా। రాకావరామ్నా క్త్రహా
రాకల్పాంక పరాక శ్రీకరసహా। సారా కవిస్తుత్యతా
రాకల్పాంచితకీర్తిపూర కుణసా। రా కాంతసంచార ఘో
రాకారారినిరాకరానుకర కృ... 21

శా. నాదేవాదిమదేవ రాఁగదర య। న్నారార నాదేయ వా
దాదేయోదయ రా దయోదయక ళాదా। రా యుదారా యశో
దాదేవీసుతరాజ రా ఘనయశో। దారా త్రివర్ణైక్యచి
న్నాదామోదవినోద రాఁగదర కృ... 22

శా. కానన్ దీప్రతపమ్ము చేసినను య। గన్వర్ణదానోదధి
స్నానధ్యానచతుశ్చిరంతనసర। స్వత్యాదిలబ్ధిం బ్రధా
ధీనుండై నను యుష్మదంఘ్రియుగభ। క్తిం జెందలేకున్న ని
త్యానందస్థితిఁ బొల్చునే నరుఁడు కృ... 23

మ. భవదీయంబగు మామకాత్మ కిఁతర। ప్రావీణ్యముం జేయు ధూ
ర్తు వికారాత్ము మదీయమాననమనే। దొంగ న్భవద్భక్తినూ
త్రివశుంజేసి భవత్స్వరూపగురుశూ। రప్రాప్తుఁ గావించు దా
నవశంబా భవదీయతద్ధనము కృ... 24

మ. మమతాహంకృతి దంతివడిప్రహయ। ఙ్మ్మముఖ్యభాన్వద్రిధో
త్తమరాగాదిభవాంగదుర్గమమదా। త్మక్షోణిపాలుండు గ
ర్వముచే మీఱెను వానిచేత నువచా। రప్రాక్కరంబందవ
య్య మనోమంత్రిప్రాతిన్ నృపేంద్రుఁడవు కృ... 25

మ. నినుఁ గీర్తించనివానరంబులు ఘనా। నీకావృతంబు ల్భవ
ద్ఘనగాధారహితప్రబంధములు దు। ష్కావ్యంబులౌ నీనివే
దనఁగావించని వడ్రిసాన్నము లహ్య। ద్యంబుల్ త్రియామార్గవి
జ్జనము ల్దెల్పువిధంబులం దెలియ కృ... 26

శా. వేదాంతోన్నతసౌధవీధుల రమా। విశ్వంభరాంకస్థలిన్
గోదాసూక్తుల గోపికాగృహములన్। గోవర్ధనేభాద్రిరం
గాదిప్రాకటదివ్యదేశములలో। నందంబునో నందదా
యాదాయాదవపా దయాదరణ కృ... 27

మ. వసుధన్ శ్రావణకృష్ణపక్షవిలస♦ద్దైవధాత్రీతారాష్టమిన్
వసుదేవప్రభుదేవకీసతులకు♦ న్నాద్యంబు లాస్యంబు గీ
తిసమేతంబుగ వేల్పు లచ్చరలు బ్రీ♦తిం జేయ జన్మించితీ
వసమానంబుగ లోకరక్షణకుఁ గృ... 28

మ. ధరలో మర్త్యగురుండు బట్టి విరజం ♦ దాటించి లక్ష్మీపయో
ధరదుగ్ధంబిటు గ్రోలఁజేయు ననుచం♦దం బేర్పడన్ సారిసో
దరిసిందాటఁగఁ దండిఁ బ్రూనుచు యశో♦దాస్తన్యముల్ గ్రోలఁజే
య రహిం గ్రోలితి వుండకన్మధుర కృ... 29

మ. భవదీయాంచితకీర్తి ధాత్రిఁ దొలుతం ♦ బ్రాపించెనా నీకు స
ర్వవిధప్రాపితకింకరత్వములచే ♦ రాజిల్లు శేషాహి కా
గ్రివరోత్పత్తి లభింపఁజేసితివి నా♦రాజాభనగోద్భవ
వ్యవహారంబున సంచలించె హరి కృ... 30

మ. అమృతప్రాయము లైనవస్తువులు నీ ♦ కాహారమర్పించు భ
క్తిమిళచ్చిత్తుల కీవె నీపద మరా♦తిప్రేరితేందారివ
ద్మముఖీపీనపయోధరోద్ధవిషదు♦గ్ధంబుల్ కృపం గ్రోలి య
య్యమ కాత్రస్థలమిచ్చుపుణ్యుఁడవు కృ... 31

మ. చరణప్రాంతగతుల్ దురాత్మ శకట♦స్వర్గద్విషున్ మహా
పురసంచారునిఁ జేసి తీవనఘవి♦స్ఫూర్తి న్భవత్పాదపం
కరుహప్రాంతమునందు సాగిలి నమ♦స్కారంబుగావించు స
న్నరులం బ్రోచు టదెంతవింతపని కృ... 32

మ. పడి నిర్గల్మషిమై హరించిన తృణా♦వర్తు న్భవాంభోనిధిం
గడవంజేయు దయాసముద్రుఁడవు ని♦క్కంబైనసద్భక్తి నీ
యడుగుల్ గొల్చుచు నిన్వహించుజను జ♦న్మాంభోధిదాటించి యె
న్నఁడుఁ జేటొందనిచోటఁ జేర్చవటె కృ... 33

మ. పశుపాలేందుముఖీవతంస గృహశుం♦భద్రిజ్జయంత్రస్థశుం
భశతక్షీరము లేమరించి గొనుపీ♦భావంబు నీదాస్యమె
న్న శరణ్యంబని నమ్మ దొంగతనమై♦నన్ జేసి నిర్వ్యాజసే
యు శరీరుల్ ఘనులంచుఁ దెల్పుఁగద కృ... 34

మ. పరమార్థశ్రుతిగోచరద్వయము మిలన్ బ్రాపించి యుష్మత్సుభ
క్తరసాన్వేషిత శేషసారసుధ జెందన్ ధన్యుఁడౌ మర్త్యుఁడ
న్వరుసల్ దెల్పుట గోపికాజనకుచద్వంద్వంబు చేపట్టి త
త్సరసాగ్ర్యాధరపాయి వీవగుట కృ... 35

మ. విషకీలల్ముఖపాళిలో వెడల బిట్వడా ఫణాపంక్తి ప్రా
రుషవృత్తి న్నటియించి పాదయుగ మారోపించి కాళీయుని
న్విషదుంబ్రోచుట యట్టిపాతకినిటు న్వేఁ బ్రోతునంచున్ మహా
జసడాస్వార్పితఁ బూనియుంటఁగద కృ... 36

మ. అల గో గోపముఖుల్ భవన్మహిమ నిర్వ్యాజస్థితి న్నమ్మి పె
ద్దలు మెచ్చ న్భవదంగుళీధృతనగాధక్షోణియందుండి రి
ట్టులు నీత త్త్వమెఱింగి నమ్మినగుణాఢ్యుల్ నీమహాపట్టణ
స్థలముం జెందుదురంచుఁ దెల్పకిరియుఁ గృ... 37

మ. పటువక్షోరుహపీడనాధరసుధాపానాదులన్ గోపికా
తటిదాభాంగుల నేలి భక్తుఁ డొకఁ డింద్ధపేర్మితో రాఁగ నం
తట నబ్బోఁటుల నీవువీడుటయు కందర్పాత్ముఁడౌ దేహి యా
న్నటికైనన్ గుణియౌట మేలనుటఁ గృ... 38

మ. నినుఁ బిల్వ న్భవదీయమాతులుఁడు న న్నీచెంతకుం బంపినాఁ
డని యక్రూరుఁడు విన్నవించ వాలితో నజ్ఞాతుఁ నారాయణుం
డను నామంబు నిజంబుగాఁ దెలియ నయ్యూర్కత్మజావారిలో
న నిజాకారముఁజూపె నాతనికిఁ గృ... 39

మ. యమునన్ దివ్యఫణాసహస్రఫణిరాడ్భాంగస్ఫురచ్ఛయ్యపై
రమణీభూషనితల్ భజింప దరచక్రంబుల్ గదాఖడ్గశా
ర్ఙ్గములుం బాణులశోభిలం గనకవస్త్రస్ఫూర్తి నక్రూరభా
గ్యమున న్నిల్చితి వేమి నీకరుణ కృ... 40

మ. రజకు న్వస్త్రములీవు తేమన్న నసుదారత్వంబుతో మేనితో
డ జగారంగులుగుల్కు చేలములు రూఢవ్యక్తి వాఁడీయ నా
రజకున్ దివ్యవిభూషణాంబరశరీరవ్యాప్తిఁ గావించి జ
న్మజరానాశవిహీనుఁ జేసితివి కృ... 41

శా. అబ్జాతాహితమిత్రనేత్ర మధురా♦హార్మ్యాంకరథ్యాగతన్
కుబ్జం గాంచి విలేపనంబు లడుగం ♦ గోవ్యాంచు నర్పించ త
త్కుబ్జత్వంబు హరించి రూపమిడి య♦త్కామ్యం గృపం బ్రోవవే
యబ్జాతోద్భవు డబ్బురంబనగ గృ... 42

మ. ఇతడే కృష్ణుఁ డితండె రాముఁడు కుభృ♦ద్ధీరాంగులౌ వీరె యీ
క్షితి రక్షించ వహించు కర్త లరిభృ♦చ్ఛేషాంశజాతు లని
స్తుతులంచు న్మధురాంగన ల్పలుకరే♦తు ల్నీకృపంగాదె పూ
ర్ణతరప్రాభవపోషితాజభవ కృ... 43

శా. దామంబుల్ మధురన్ సుదాముఁడు హరీ ♦ దామోదరా నీకు గా
దా మోదంబెసఁగ న్నొసంగి నిను భూ♦తప్రేమయు న్నిపద
వ్యామోహంబు భవజ్జనార్చనయు కై♦వంగోరె నీదర్శనా
ఖ్యామంత్రోన్నతు లేమిచెప్పనగు కృ... 44

మ. కరినాథుండు సహస్రవత్సరము లా♦క్రందింప రక్షించె నీ
వరి తా నట్టులుగాక శీఘ్రమున ని♦త్యస్థాయినౌదున్ సమి
త్కరసంపర్కమిషాంగ సేవనను చం♦దంబేర్పడం గంసకుం
జర మాలంబుఘటించి చెందె నినుఁ గృ... 45

మ. అమరీకైరవహంసుఁ గంసుఁ గరికుం♦భాంసు న్భవన్మాతృకా
సమజన్ముగ్ర మహోగ్రు నొంచితివి శ♦శ్వద్భృష్టి శారీరబం
ధమమత్వం బిటుచిమ్మి యాత్మహితబం♦ధంబే జనుండెంచి స
త్యముగా నమ్ముట కేగదా నృహరి కృ... 49

మ. నిజకైంకర్యవిరోధి భోజవిభుని ♦ న్నిర్జించి కైంకర్యరా
జ్యజగన్మంగళవైభవోన్నతునిగా ♦ నంధించి యాయుగ్రసే
నజనాధీశుని పౌరదాసులను బూ♦ర్ణప్రీతితో నేలు దా
సజనాధారు హరిన్ భజింతు నినుఁ గృ... 47

శా. శ్రీలక్ష్మీఘటకత్వసిద్ధిగను ర♦క్షించందగున్ దాసులన్
మేలౌ గీర్తి దలిర్పనంచుఁ గమలా♦మేయాంశజం గూడి రా
డ్బాలన్ రుక్మిణిఁ బెండ్లియాడి మధుర ♦ న్భాసిల్లితౌ రేవతీ
నాళీకాక్షి హలి న్వరించ మును కృ... 48

మ. కురుకౌంతేయమిథోహితార్థమునకై • గుంభీభవించెంది త
త్పురిలో శ్రీవిదురాన్న మీవు గొనుటల్ • పూర్ణత్రియాశాస్త్రత
త్పరయుష్మత్పదపద్మదాస్యరహిత • బ్రహ్మర్షికిం బెస్ భవ
చ్చరణార్థుం డగుకాపు మేలనుట కృ... 49

మ. హరవేధస్సురరాజవంద్యుఁడవు నీ • వాధర్మపుత్రాదిభూ
వరులం గాంచి నమస్కరించుటలు భా•వంబందు నూహించ సు
స్థిరతన్ భాగవతార్యవందనము ల•ర్థిన్ సేత మేలంచు భూ
చరకోటుల్ తెలియంగఁ దెల్పుటలు కృ... 50

మ. వనజాతాసనముఖ్యసేవ్యుఁడవు దే•వా నీవు సంప్రీతి న
ర్జునసారథ్యము సేత భక్తభరమే • రూఢంబుగాఁ బూని గా
తునటంచున్ దెలియంగ సేత విలస•ద్దోర్దండచక్రాదిలాం
ఛన దీనావనలోల మౌనినుత కృ... 51

శా. శూలిన్ బ్రహ్మవృకాగమావహరర•క్షోబాధలం బాపు నీ
కేలా నీరజరాత్మజాతులకుగా • హీనస్థితిం బార దు
శ్శీలాలోకనమాచరింపమియె సౌ•శీల్యంబు నూ యన్న ని
త్యాలాపంబుఘటింపగాక హరి కృ... 52

మ. అల ధర్మాత్మజ మారుతాత్మజ సుభ•ద్రానీశ మాద్రీతనూ
జులచేపట్టి సుయోధనాదుల రణ•క్షోణీమహాదేవికిన్
బలిగావించుట సద్గుణాదృతిని పా•పక్రూరకామాదిసం
చలనాపాదనమే గుణంబనుట కృ... 53

మ. వనరుట్పాలివనాంతరాళమున గో•వత్సావళులం దాచ త
ద్ఘనరూపమ్ములు దాల్చియుంట సుజన•త్రాణారిశిక్షన్ నిజం
బునఁ గావించుట సృష్టిపాలనలయం•బుల్ సేయ నేనేసుఁడీ
జనులారా పఠినంచుఁ దెల్పుటలు కృ... 54

శా. వేదోద్ధారము మందరావహన ము•ర్వ్యంగోర వేఁ దాల్చుటల్
పాదాక్రాంతముగా నజాండమును నం•పాదించుటల్ మున్నె ప్ర
హ్లాదు ట్రోచుట రాజులంకియమున • న్నావ్యఘాతము లేసేత యా
హ్లాదం బుర్వికి సేయఁ బూనిగద కృ... 55

మ. మురళీరావముతో లలాటవిలస•న్ముక్తాకలాపంబుతో
నురుశార్దూలనఖాంకభూషణముతో • నొప్పారు కర్ణద్వయీ
చరదంచన్మణికుండలద్వయముతో • సౌవర్ణచేలంబుతో
హరి నీసేవదొసంగు దాసునికిఁ గృ... 56

శా. కస్తూరీతిలకంబుతో మణిఝణ•త్కారస్ఫురత్కాంతితో
మస్తన్యస్తమయూరపింఛములతో • మందారదామంబుతో
హస్తాంచన్నవనీతమంజరులతో • నాభీరశాబాలితో
హస్తాభీతియొసంగ రాఁగదర కృ... 57

శా. అందెల్ పాదములందు మ్రోయ నటుతన్ • హారంబు లల్లాడ బా
జ్బందుల్ సుందరబాహులం దగఁ గుసుం•బా మేల్జరీలాగు పా
ల్పొందం గాసెబిగించి లేనడుమునం • దొప్పార నాముందటన్
నందానందతఁ జెంది యాడఁగదె కృ... 58

దశావతారములు.

శా. నీకళ్యాణగుణాంక వేదములకై • నీరేజగర్భుండు మ
త్స్యాకారు న్నినువేడ వేదహరదే•వారిన్విదారించి వా
ణీకాంతు న్నిగమాఢ్యుఁ జేయుట భవ•న్నిత్యస్తవాసక్తమో
దాకల్పున్ భువిఁ జేతునం చనుట కృ... 59

మ. కమఠాకారము లోకమోహనతయుం • గైకొంచుఁ బీయూషమ
య్యమరశ్రేణి కొసంగి దైత్యుల కన•ర్హంబంచు నీఱుంట నీ
సుమహామంత్రిసుధారసంబు ఘటక•న్స్ఫూర్తిం జరివన్నాళికే
యమరు న్నిశ్చయమంచుఁ దెల్పఁగద కృ... 60

శా. కాయం బిందద్రిదిశాద్రి దంష్ట్రిశశభృ•త్ఖండంబు భూకాంతయుం
దాయత్తం బగులాంఛనం బలహిర•ణ్యాక్షుం డధఃపాత్యనం
ఖేయధ్వాంతముగాఁగఁ జూడఁదగు నీ • కిర్యాకృతి న్నాకు నే
ఛాయంగాంచ లభింపఁజేసెదవొ కృ... 61

శా. ఏకస్థానగతేశజీవులకు లే • దేకత్వమ ద్వైవత
త్త్వాకారంబువహించి తీవన నృసిం•హద్వంద్వరూపంబ గో

ప్యాకారంబునఁ దాల్చి దుష్టజనశి•ష్టాతోషసంతోషహూ
పాకల్పద్వయధారివై తి విలఁ గృ... 62

మ. త్రిపదావధ్యవనీతలంబు బలి సం•ర్థి న్వేడి త్రైలోక్యరా
జ్యపదం బెల్లఁ ద్రివిక్రమాకృతి మహేం•ద్రాధీనముం జేసి యా
త్మపదోద్ధాంబువు లబ్జజేశకలశీ•మస్తంబులం జేర్చు క
న్యపదాయాదుని నిన్భజించెదను గృ... 63

మ. పరశుభ్రాజితపాణివై కుజనభూ•పశ్రేణి ముయ్యేఁడునూ
ర్లురుషన్నివు వధించియుంటఁ దెలిపెన్ • రూఢంబుగా మీపదాం
బురుహద్వంద్వము నమ్మువారి కిటులే • బోనేకవింశన్మహో
నరకాపద్భయమెన్న వైభవము కృ... 64

శా. లంకాశోకవనీ గతావనిసుతన్ • లక్షించి సామీరికిన్
సంకేతంబుఘటించి శత్రుహ్యాత భూ•జం దెచ్చుటల్ స్థూలదే
హాంకాత్మన్ గురుశక్తి నీవరిచయ•వ్యాసంగముంజిమ్మని
శ్శంక న్సన్నిధిఁగూర్చు దెల్పుటలు కృ... 65

మ. అహిరాజాంశము మాధవాంశము భవి•ష్యద్దేశికేంద్రత్వము
న్మహిలోనం గపటానిలోద్భవ కుకు•తాత్మనాయకుద్దెల్ప ది
వ్యహాలస్ఫూర్తి కళిందకన్య దెలుపన్ • వర్ధిల్లు తాళద్రుచి
హ్నా హారీ నీదుపదంబులం గొలుతు కృ... 66

మ. త్రిపురాంభోజముఖీవతంసములఁ బా•తివ్రత్యధర్మంబు మీ
వపురాలింగనసౌఖ్యహేతువగుచు • న్వర్ధిల్లి సర్వాత్మజా
లపతిత్వంబుననొప్పు నిన్నె పతిగా • లక్షించుటే మోక్షవా
సపదంబంచును దెల్పఁగాదె జినకృ... 67

మ. ఖలసంహారము సాధురక్షణము జ•క్క్రంబూని జన్మించి శం
బలనామాంకపురిన్ దురంగమువయి •న్భాసిల్లుచు న్మందటన్
గలిదోషం బణఁగంజరింతువు తదా•కారంబుఁ జూపంగ దే
నలినాక్షా యిపుడే జగంబలరఁ గృ... 68

శా. సుజ్ఞానం బెటువంటిదో యెఱుఁగ వా•క్శుద్ధిప్రకారంబు లే
దజ్ఞానంబు మదీయమిత్రము మమ•తాహంకృతు ల్మామక

వ్రిజ్ఞాదేవతలిట్టి నన్ను నెటులఁ బ్రోవ! బ్రోచెదో దివ్యమో
క్షజ్ఞానైక నిదానపాదయుగ కృ... 69

శా. శ్రీమద్భాగవతార్చనం బెఱుఁగ నీసేవార్థినాగాను సా
దామిన్యస్థిరసంపదాశ మది సంధానింతు నేవేళను
ద్దామ క్షాంతిదయాగమోక్షుల కనాధ్యాయంబునాచిత్తమీ
శా మద్వృత్తి యిదే కృపన్మనుచుఁ గృ... 70

శా. వేదంబుల్భవదీయవందిజనముల్వేదాంతముల్నీకుఁ బ్రా
సాదంబుల్భవదాత్మజుల్మదనుఁ డబ్జాతప్రసూతుండు యిం
ద్రాదుల్ భృత్యులు నీకు శూలిభవదాఖ్యామాధురీవేది బ్రి
హ్లాదాహ్లాదవశంబె నిన్బొగడ కృ... 71

మ. కరుణాంభోనిధివి పాపభేదివి జగత్కల్యాణ సంధాయి వా
త్మ్రరమాభూవనితాశయుండవు నతత్రాణైక కేళీధురం
ధరచిత్తుండ వశేష శేషివని తత్త్వజ్ఞుల్మదిన్నమ్మి నీ
చరణాంభోరుహ పూజసేయుదురు కృ... 72

మ. హరవేధస్సురరాజులుండ సకలాత్మత్రీయముల్ రూఢిదే
వరవేయంచును వేదతత్త్వనిపుణుల్వ్యాఖ్యానసాంగంబుల
న్నిరతంబు న్భవదంఘ్రిపూజనకళాన్నిర్ణిద్రులై యుందురో
యరవిందాక్ష రమాక్షమానహిత కృ... 73

శా. సంకల్పశ్రుతి హేమపాత్రక తవన్నాన్వర్ఘ్యావసానాదులం
బంకేజేక్షణ నీదునామముగదా పద్యంబు తత్కర్మయో
గాంకూరాదినిదానమెక్కడను బ్రాయశ్చిత్తరూపంబు చ
క్రాంకా వేంకటశైలనాథ హరి కృ... 74

మ. ధనధాన్యాత్మజ కామినీతను ధరాధార్యాదులందున్న ప్రే
మ నిమేషార్థమునందునైనను భవన్మంత్రాంఘ్రినామంబులం
దున నిష్కర్షతగల్గనేని నరుఁ డొంమున్నీపదంబెన్న భూ
జనరక్షార్థనిజావతార హరి కృ... 75

మ. అవనంబాత్మను నేనగోరుదు ననన్యార్హుండనాగాను జ్ఞా
నవిశిష్టాత్ముఁడగాను దాస్యరతియౌన్నన్ లేదు బ్రాం

ధనసద్భావమెఱుంగఁ గింకరతసం • ధానించ నీమంత్రిరా
జవరాగ్రం బెదఁబూని లేదగుట కృ... 76

శా. నీ నిర్హేతుకజాయమానకృపచే • నిష్కాముఁడై నీపద
ధ్యానారూఢమనస్కుఁడై దురితబృం • దచ్ఛేదియై దివ్యసు
జ్ఞానాత్ముండగుఁగాక మర్త్యుఁడు నిజే • చ్ఛాలబ్ధశాస్త్రోద్భవ
జ్ఞానస్ఫూర్తి తదాత్ముఁ డెట్లగును ? కృ... 77

మ. కలకాలంబు దురాశబాల్పడి యహం • కారంబుచేఁజిక్కి చం
చలభావంబునఁ గామ్యకర్మరతినై • స్వస్వామిభావంబు ని
శ్చలతన్నాయెడ నీయెడం దెలుపు న • చ్ఛాస్త్రంబువర్జించి పి
న్నలలోన న్మరి పిన్ననైతి నిలఁ గృ... 78

శా. దేహంబుల్ సృజియించి వాని క్రమితా • ది క్షుత్పిపాసాదులు
న్మోహంబు న్మదమత్సరంబులును సం • మోదం బమోదంబు గ
ర్వాహంకారము లాదిగాఁ గలుగు హే • యంబుల్వడింగూర్చి నీ
వా హేయంబులఁ జెందకుండుదువు కృ... 79

శా. కావేరీసరిదంతరాళమున నోం • కారస్థలి న్నిమల
శ్రీవిశ్వంభర లిద్దఱల్పగత్తులై • సేవించఁగా మౌనులున్
దేవానీకము నన్నుతింపఁగ విభూ • తిద్వంద్వరక్షార్థమి
చ్ఛావృత్తి న్విహరించురంగఁడవు కృ... 80

మ. కిరినై యుండియు శేషభూధరమునన్ • గేళీగతిన్ స్వామి పు
ష్కరిణీతీరసువర్ణమందిరములోఁ • గన్పట్టి మంగాంగనా
పరమానందవశుండవౌ నిను మది • న్భావింతు శ్రీవేంకటే
శ్వర రూపా నతపాపసంహరణ కృ... 81

మ. భువిదంతావళ భూధరస్థితమణీ • పూర్ణ స్ఫురత్పుణ్యకో
టివిమానంబున దేవతల్బొగడఁగా • శ్రీవి న్విరాజిల్లి భూ
తివరంబు ల్దయసేయుచుండిన పెరుం • దేవీసమేతా హరీ
భవదుత్పత్తి మది న్భజించెదను కృ... 82

మ. తపనాబ్జారి సమానకాంతి విలస • త్కల్యాణ సుజ్ఞానమం
టపసంవ స్సుఁడవౌట భూజను లకుం • తజ్ఞానసంవాసులై

చపలత్వంబులు మానియుంటకుఁగదా • శశ్వద్ధమాగావదీ
నపసంపత్సుతయాదవాద్రిగృహ కృ... 83
మ. విరజావాహినిగాఁగ ధారదలఁప • న్వైనాంతధామంబు కే
సరిశైలంబు తదీయవైష్ణవులు శే • షక్ష్మేశకార్యాదుల
గ్గిరిపైనుండిన నీవఖండవిభుల • శ్రీభక్తవాద్యంత శూ
న్యరవీంద్రావక్ష నృసింహదేవ జయ కృ .. 84
శా. నైజాంతర్గత సత్వకాంతిరతిమే • నంజెందె నాశైలమై
రాజత్వద్దరమొప్పె నా ? నిజయశో • వాగ్రితంబు శ్వేతాఖ్యమై
దాగ్రిజింగాంచెననా ? వపుశ్శిఖరిమ్రు • తాన్నచంద్రికంగూడు ని
ర్వ్యాజానుగ్రహ కూర్మనాథుఁడవు కృ . 85
శా. హండీలం బరమ • న్నభక్త్యమృతద • ధ్యాదు ల్సమర్పించు నా
పండాలంగరుణించి రాముని జగ • ద్భద్రి న్సుభద్రి న్సదా
ఖండపేరిను దలిర్పఁగాంచుచు మరుత్కాండస్తుతింజెందు శ్రీ
చండాంశు ప్రభనీలశైలగృహ కృ... 86
మ. యదుదంతావళి దండశూకఘటికా • వార్యక్ష నీలాహిపై
దదరీమన్మణిమందిరంబుల సితాద్రిన్ రంగకోదండ భృ
త్పదవా నాద్రిగయా ప్రయాగ కనదంత ర్వేదుల న్భక్తర
క్షదయన్ నేయుటకై వసించితివి కృ... 87
మ. అలగోవర్ధన చిత్రకూటములలో • నల్లూర శ్రీరామతీ
ర్థలసత్పంకజనాథ చంద్రనగరీ • రమ్యాభదుగ్ధాద్రిలం
జిలపూరన్భవసౌఖ్య భవ్యనగరిన్ • జెన్నొందితౌదాసర
క్షలు గావించుటకేగదా నృహరి కృ .. 88
మ. శిరినొప్పన్ లకవారికోటనగరిన్ • శృంగారకోటన్ మహా
నరసాఖ్యాకపురిన్ గురంగనగరి • న్నందస్థలి న్భద్రిభూ
ధరపుష్పాద్రిలలో వసించితివి భ • క్తవ్రాతరక్షార్థమై
నరనారాయణరూప నందసుత కృ... 89
శా. సాకేతస్థలిరత్నసౌధమున భూ • జాతాసుమిత్రాంగనా
నైకేయీతనయు ల్భరతుస్సతుఁడు వే • ట్కఁగొల్వ వాఁడ్భవా

నీకాంతు ల్భజియింపఁగా వెలయుమా • నిశ్రేణిసంసేవ్య రా
మాకారా భవదంఘ్రిలంగొలుతుఁ గృ... 90

మ. ఒసర న్సర్వగతుండవయ్యును బర • వ్యూహావతారార్చతా
దనువుల్ దాలిచి రామసద్గురుఁడవై • దల్లబ్ధరంగేశ శే
షనగాధ్యక్షరమాన్నృసింహా యదుశా • శైలస్వామిసంజ్ఞ స్మదీ
యనివాసంబున నిల్చితీవుకృపఁ గృ... 91

శా. కాసారుండును భూతయోగి మహదా • ఖ్యాకుండు జకాంత్రిమ్మ్రఁడున్
శ్రీసేనేశజ కౌముదీక్షితిపతుల్ • శ్రీవత్సమున్ వైజయం
తీసంభూత సువర్ణశాజఠఫణిజుల్ • దీవ్యన్మతింగొల్వఁగా
హాసాస్యంబుననొప్పు నిన్గొలుతుఁ గృ.. 92

మ. భువినీ క్షాంతి యనంతగావున నఘం • బుల్ దానికర్పించి పు
ణ్యావితానంబులు గింకరత్వ మతినీ • యందేఁ బ్రతిష్ఠించి గ
ర్వవిదూరుండయి యున్మదంశగురుసే • వాలోలుఁడై యున్న మా
నవుఁడే నీపురిలో వసించుగదఁ గృ... 93

మ. ధనముల్గల్గిన గర్వలోభములచే • తన్బిన్నలం బెద్దలం
గని ధిక్కారము సేయుచుండుదును వి • జ్ఞానంబువర్జించి దు
ర్జనుఁడంతన్ ధనహీనుఁడై ధనమె సా • ధింపంగఁదాఁజూచు స
జ్జనుఁడై నీపద దానుఁ డెట్లగును కృ ... 94

మ. మలమూత్రాస్థిక ఫాసృపూయరసచ • ర్మవ్యాప్తమైనట్టి చం
చలదేహంబిది దీనిసౌఖ్యమునకై • నక్కామినీచందనా
దులనే గోరుచు మోక్షశత్రతను బం • ధుప్రీతి నేవేళ ని
చ్చలువర్తించు వివేకశూన్యుఁడను గృ... 95

మ. కులహీనుండు కులాఢ్యుఁడౌ ఘనకులాం • కుండౌ మహాత్ముండు దా
కులహీనుండగు సర్వభూమి పతిభి • క్షుత్వంబునొందు న్నిర
ర్గళభిక్షాచరుఁ డుర్విబోర్విఁదగు సు • జ్ఞానపరిపూర్ణుండు జ్ఞా
నలవాభావతఁజెందు జ్ఞానియగు నా • నాదుష్ప్రక్రియాపాది ని
శ్చలతింగాంచ భవద్విలాసమిది కృ... 96

మ. మదనారాతిచతుర్ముఖేంద్రులు భవన్మాయాంధులై యుండ నా
రదఋష్యాదులు నట్టులుండ నితరప్రాణుల్ భవన్మాయ దా
టెదమంచున్ దలపోసియుండుట నిరూఢిన్ దంతిచేఁగాని కా
ర్యదశం దోమఘటింపఁబూనుటలు కృ... 97

శా. కాళీశంకరులో గణాధిపతియో కంజాతసంజాతుఁడో
హేళీకాంచవిదారులో పరతరం బింకెవ్వరో యంచు వే
దాళింగాంతురు దచ్చిరస్సదను నిన్నర్థింపకే సాహసుల్
నాళీకాక్ష ముకుంద చక్రధర కృ.. 98

శా. శ్రీపాండ్యేశ సభాంతరాళమున లక్ష్మీనాథచిత్తార్యుచే
నీపారమ్యమశేషవేద్యముగ నిర్ణీతంబు గావించి శో
భాపూర్ణంబుగ మంగళంబుఁగొను గోపాలాహ్వ యాదవ
క్ష్మాపాలా వనసాఖ్యభవ్యపురిఁ గృ... 99

మ. అలచోళావని దుర్గశైల ధరసహ్యాఖ్యాద్రి సంజాత యా
కొలనే శ్రీవనసాఖ్యదివ్యపురి గోర్కుల్దీర్చు రంగంబు ని
శ్చలమౌ వర్ణవిమానమెన్నఁ బ్రణవస్థానంబు నీవమ్మహా
స్థలమందు న్వెలసిల్లు రంగఁడవు కృ... 100

మ. నవమాసంబులు మాతృగర్భమున భిన్నస్వాంతుఁడై యింక నే
నవమానించ మహోత్కలం జఠరవాసార్తి న్నివారించు దీ
నవశాత్మా హరియంచు నిన్దలఁచి నానాదోషముల్జేయఁ దా
నవనింబుట్టుచు జీవి కేమిగతి కృ... 101

మ. మధురంబుల్ గలహేతులన్యధన రామాకామముల్ సాధుమా
నధనాచార్య తిరస్క్రియాచరణముల్ నాకెప్పుడీరీతిగా
మధురంబుల్గతిగావు తావక కథామంత్రాహ్వయధ్యానపు
ణ్యధరా సంచరణాదికృత్యములు కృ... 102

మ. బహుజన్మంబులనొంది పాపములచే బద్ధుండనై సంతతా
గ్రహవృత్తి న్గురుమంత్ర భాగవత ధిక్కారంబుఁగావించు న
న్మహనీయస్తుత తాతసద్గురుఁడవై నమ్మించి రక్షించితీ
వహహా నీకృప యేమి చెప్పఁదగుఁ గృ... 103

మ. పనసాఖ్యాకపురీనివాస ......దాసోత్కరా
వనసోల్లాస విలాసహాస జగదా•వాసా తటిద్రూపకాం
చనవాసా సరసా సమాచరితరా•సా శార్ఙ్గబాణాసకాం
చన పుష్పోపమనాస మానహిత కృ... 104

మ. గజరాజావనదక్ష దైత్యసుతర•క్షాదీక్ష శ్రీమన్మహా
విజయస్యందనవాహాపీక్ష ద్రుపదో•ర్వీనాథజాపక్ష ద్రో
ఘ్న జయస్తుత్య విభీషణాభయకళా•సంధానసాపేక్ష దా
నజనస్తోమ సురేంద్రప్రక్ష హరి కృ... 105

శా. శ్రీవంశీఘనరావ సంతతముదే•శీతాంశువంశ్యాయ ల
క్ష్మీవాసాయ నతప్రియాయ కరుణా•సింధో మహాత్మన్ ఘన
శ్రీవత్సాంకితవక్షసే భవతుతే • శ్రీమంగళంబంచు భా
షానర్ఘాభజియింతు మంగళద కృ... 106

మ. హరినారాయణ వాసుదేవ సరసీ•జాక్షా మురారీ దయా
పర పీతాంబర చక్రహస్త శశభృ•ద్భాన్వక్ష వక్షస్థలీ
చరదబ్జాలయ హానిరాజవిమల • స్వాంతాంబుజేందిందిరా
నరనారాయణరూప నందసుత కృ•ష్ణా దీనచింతామణీ. 107

శా. భారద్వాజసగోత్ర కాండురికుల•భ్రాజిష్ణు రామానుజ
శ్రీరత్నాన్విత లక్ష్మణార్య తనయు•శ్రీ......వైష్ణవ
స్ఫారద్వేంకటదాసుచే శతకమి•బ్భంగిం బ్రవర్తిల్లనీ
వారూఢిం గరుణించితో సదయ కృ•ష్ణా దీనచింతామణీ. 108

సంపూర్ణము.

శ్రీరస్తు.

# చిరవిభవశతకము.

చ. సిరిమగఁడున్ బితామహుఁడుఁ జేరి భజింపఁగ వెండికొండపై
నరసి నవేందుకాంతమణి సౌధమునందుఁ బసిండిగద్దెపై
గిరిసుతఁగూడి వేడుకలఁ గేరెడు నిన్ను మదిన్ దలంచెదన్
చిరవిభవా భవా విజిత చిత్తభవా యభవా మహాభవా! 1

చ. కరులు హయుల్ చమూవరులు గాటపు మేల్నగరుల్ కడానిబం
గరులు నరుల్ తలోదరులు గంధమిళన్మృగనాభిచందనా
గరులు విరుల్ జగాసిరులు గల్గి సుఖింతురె త్వదీయు లౌ నరుల్
చిరవిభవా భవా విజిత చిత్తభవా యభవా మహాభవా! 2

చ. పరమకృపార్ణవా! తుహిన పర్వతరాజకుమారికాధవా!
వరవృషసైంధవా! కుటిలవైరి నిశాటసమిద్ధవా ఘనో
హరకరసారసాగ్రనిహితాజగతానతబాంధవా! శివా! చిర. 3

చ. నిరుపమ కూచిమంచికులనీరధిచంద్రుఁడు గంగమంత్రికిన్
బరమపతివ్రతామణియు భాగ్యసమన్వితయైన లక్ష్మికిన్
వరసుతుఁడైన తిమ్మకవివర్యుఁడ నే శతకంబొనర్చెదన్ చిరవి. 4

చ. శరనిధి కఖ్యమిచ్చుకిరియు సారసబంధున కాగతిచ్చువై
ఖరి నిఖిలాబ్జజాండచయకర్తకు నీకు సమగ్రభక్తి శ్రీ
కరముగఁ గోరి యొక్క శతకంబు సమర్పణ సేయఁబూనితిన్ చి. 5

చ. మరలని భక్తితోడ మును మల్హణ బిల్హణ మాఖ్యసత్కవీ
శ్వరులు కవిత్వవైఖరిని సాటెను నిన్ బ్రణుతించి ధన్యులై
బరగిరటంచు నేను నినుఁ బద్యముఖంబుగ సంస్మరించెదన్ చి. 6

చ. హరిముఖసర్వదిక్పతివృథార్చితపాదసరోజుఁడైన యు
క్కరిముఖుఁ డెప్పుడున్ వితతకౌతుకలీలఁ బొసంగఁ జేయుఁ బో
నిరతముగాఁ ద్వదీయపద నీరజభక్తు లొనర్చు సత్కృతుల్ చి.7

చ. శరశరదిందుకుందహరి•చందనహారతుషారతారకా
దరఘనసారవర్ణ వర•దండకుకాంబుజపాణి వాణి యా
దరమునఁ బ్రోచుచోఁ గవిక•దంబము నిన్బ్రణుతించు ధన్యమై చి.
చ. తరలనిభక్తి నాహృదయ•తామరసంబున సంస్మరింతు దు
ర్భరదురితాంధకారవిసర•ప్రసరన్మిళినీసుహృల్లస
త్కిరణములైన దొందులూరి•దివ్యకులోద్భవు లింగనార్యు స
ద్గురుచరణంబులుగ్రభవతో•యధిసంతరణంబు లెవ్వడున్ చి. 9
చ. గురుతరలీలఁ బిఠపురి•కుక్కుటలింగమహాప్రభుండవై
బరగెడు నిన్ను నేనిపుడు • భక్తిదలర్పఁగ నాశ్రయింతు నీ
వరకరుణానిరీక్షణము • వాలెమునావయి నిల్పిపోవవే చిర. 10
చ. నరపతి కొక్కకావ్యమిడి•నన్ ధనధాన్యమణీనిచోళముల్
పురములు వాహనంబులు వి•భూషణ గోవసుధాదికంబులుం
గురుకృపనిచ్చిబ్రోచు నిది•గో మరినీవిఁక నేమియిచ్చెదో చి. 11
చ. హర పరమేశ శంకర పు•రాంతక భర్గ గిరీశ చంద్రశే
ఖర మృడ కృత్తివాస శితి•కంధర శర్వ నగేంద్రజామనో
హర శివ మృత్యుసంహర య•టంచు నిను న్స్మరియింతు నెవ్వడున్.
చ. కరయుగళంబుమోడ్చి కుతు•కంబున మొక్కెద సర్వదేవతా
పరివృఢమౌళిభాగ్మకుట•పంకజరాగమణిప్రభాచ్ఛటా
నిరతవిరాజమాన రమ•ణీయుభవచ్చరణాగ్రపీఠికిం జి... 13
చ. తరమె నుతింప నేరికిని • దావకదివ్యపదప్రభావమున్
గరికిని సాలెపుర్వునకు • గాడుపుదిండికి మోక్షమిచ్చి యా
దరమున నేలుకొంటివట • దాన వరేణ్యులఁబ్రోచు టబ్రమా చి.
చ. తరలనిభక్తి నెల్లపుడు • ధ్యానముసేతు తుషారధారుణీ
ధరవరకన్యకావిలసి•తస్తనకుంభవిలిప్తకుంకుమా
గరుఘనసారచందనసు•గంధవిభాస్వదురస్థలు న్నినున్ జి... 15
చ. శరధిశయాంబకాయ రవి•చంద్రకృపీటభవాంబకాయ గో
పరివృఢకేతనాయ సిత•పర్వతకూటనికేతనాయ సు
స్థిరకరుణామతే భగవతే శివ తే నమయంచు మొక్కెదన్ చి. 16

చ. సరసిరుహాక్షు పద్మభవ • శక్రకృశాను కృతాంత యామినీ
చర వరుణానిలైల బిల • చంద్రకిరీట సుధామయూఖ భా
స్కరముఖదేవతాప్రముఖ • సర్వము నీవెయటంచు వేఁడెదన్ చి.

చ. శిరములు వేయిగల్గు నహిశేఖరుఁడైన చతుర్ముఖంబులన్
బరగువిధాతయైన సులభంబుగ నొక్కసుమంతయైన నీ
చరితము లెన్నఁజాలరట • శక్తులమే మముబోంట్లమెన్నఁగాఁ చి.18

చ. వరుణభవాత్రిగౌతములు • వ్యాసవసిష్ఠఘటోద్భవుల్ పరా
శరసుతకణ్వకౌశికులు • జహ్నుశమీకముఖాఖిలర్షి శే
ఖరులు నుతింపఁజాలరటఁకా నిను మాదృశు లెన్న నేర్తురే చి...19

చ. హరిణము ఢక్క శూలము గజాజిన మెక్కువశక్తు పావరా
సరములు బూదిపూత వినుజక్కర లేనెల పుక్క లెద్దు దా
నిరుమెయి కప్పుకుత్తుకయు • నెమ్మిగఁగల్గు నిను న్భజించెదన్ చి.

చ. ధరణి రథంబుగా శ్రుతివితానము వాజులుగా రమామనో
హరుఁడు శరంబుగా మరుదహార్యము సింగిణిగా బిలేశయే
శ్వరుఁడు గుణంబుగా నలువ • సారథిగాఁ దిగప్రోళ్లఁగూల్చితౌ చి.

చ. హరి మిము వేయుపద్మముల • నర్చనచేసిన సర్వలోక భీ
కరఖరదైత్యసంహరణ • కారణమై కనువట్టు చుట్టువా
లరుదుగ నిచ్చిమెచ్చి భువనైకధురంధరుఁజేసి యేలితౌ చి... 22

చ. తరణిసుతోగ్రపాశవితతవ్యథగాసిలి స్వేతుఁడర్థి నిన్
స్మరణము నొంద నజ్జము వెసంబడదన్ని ధరామరోత్తమున్
గరమనురక్తిఁబ్రోవవె జగంబున శాశ్వతజీవిఁజేసి మేల్ చి. 23

చ. అరుదుగ నింద్రకీలగిరి • నర్జునుఁడుగ్రతపంబొనర్చుచో
నరిగి కిరాతరూపమునఁ • జక్కఁగనిల్చి కరంబు వానితో
దురమొనరించి మెచ్చి కృపతోడుతఁ బాశుపతాస్త్రమీయవే చి.

చ. సురలును దైత్యులుం గదసి • సుక్కక వార్ధిమథింపుచున్నచో
నురుగతి నందు హాలహాల • ముద్భవమై జగముల్ హరింప న
గ్గరళము కంఠసీమనిడి • కావవె లోకములెల్ల నాఁదటన్ చి. 25

చ. కిరికలహంసరూపములఁ • గృష్ణుఁడు నంబురుహాసనుండు నీ
చరణములున్ శిరంబు గనఁ • జాగి రసాతలము న్నభంబు వే
సరిపెడుకంగ వారికిఁ బ్రఁసన్నతనొందవె లింగమూర్తివై చి. 26

చ. శరధిశయానుఁడైన హరి • సారసబంధుకులంబునందు దా
శరథి యనం జనించి బహు • సంఖ్యలుమీఱిన లింగమూర్తులన్
సరవిఁబ్రతిష్ఠఁజేసెనఁట • శక్యమె నీయధికత్వమెన్నఁగాఁ జి. 27

చ. గరువముతోడ నిన్ను వెలి • గానిడి దక్షుఁడు జన్నమొక్కెడన్
హరిహయపుండరీకన • యాబ్జభవాదులఁగూర్చి చేయుచో
నరుమగ వీరభద్రభయ • దాకృతిఁ గైకొని సంహరింపవే చి... 23

చ. కరముదుదార నల్వఁ దన • కన్న ఘనుండకు వేఱ్వ లేఁడటం
చురుగతి దేవతాసభ దు • రూక్తులుబల్కఁగ నల్గి వాని దు
ర్భరతరగర్వభారమును • బల్వడిఁద్రుంపవె భైరవాకృతిన్ జి... 29

చ. అరయ మృకండుసూనుఁడు ని • రంతరమృత్యుభయాకులార్తుఁడై
వెఱపుడలిర్ప నిన్ శరణు • వేఁడిన మిత్తినడంచి యమ్మునీ
శ్వర సుతుఁ బ్రోచినాఁడవట • శాశ్వతజీవునిఁ జేసి వాసిగాఁ జి. 30

చ. ముఱియుచుఁ గాశికాపురిని • మూఢత బాహువులెత్తి ధారుణీ
ధరములకన్న నెవ్వఁడును • దైవములేడని పల్కనప్పరా
శరసుతు బాహుయుగ్మకము • స్తంభనమొందఁగఁ జేసి కుంచవే.

చ. అరయ నశేషలోకముల • కాధ్యుఁడ వీవె నిజంబు బాలిశు
లెఱుఁగమెఱగాఁ దలంతుర్ కడిఁమిం బహిరంతరలోకరక్షకై
గరళము కంఠమూలమున • గట్టిగ నిల్పి వెలుంగ రే మొకో చి...

చ. హరి నరసింహరూపధరుఁ • డై సమరాగ్రమహోగ్రభంగి న
బ్బుగ మొదవన్ హిరణ్యకశి • పు న్వరిమార్చి చెలంగుచున్నచో
నరగిఁ దమగ్రితం శరభ • సాళువదేహుఁడవై యడంపవే చి...33

చ. సరసవిహారలీల విట • జంగమరూపముతోడ నేగి య
బ్బురముగ మున్ను భల్లణుస • పత్నిని చల్లమదేసఁగోరి యా
గురుకుచకౌఁగిట న్నిలవె • గోముబయ న్నెలనాళ్లపట్టివై చి...34

చ. ఇరవుగ దారుకావనము నందద్రివధూతిలకంబుల న్మనో
హరవటుకాకృతిం బొలిచి యబ్జశరాహవలీలలం గడున్
గరచిన నీవిలాసరతి కౌశలముల్ గణుతింపశక్యమే చి... 35

చ. సరభసలీల మున్మ్రనలి జంగముఁడై చిఱుతొండనంబి మం
దిరమున కేఁగి తత్తనయు నిం బొలఁకై వధియింపఁజేసి చె
చ్చెరనిజమూర్తిఁ జూపి కృప చిప్పిల వానిఁ గృతార్థుఁ జేయవే చిం.

చ. దొరకొని చెప్పుగాల తలఁ ద్రొక్కి యొకించుకనంజు డెంగిటన్
బొరసిన దప్పసంబొసఁగి పుక్కిటనీర్త్రయిఁ జిల్కుఁగోయకున్
సరగున మోక్షమిచ్చితఁట సజ్జనకోటుల కిచ్చు టబ్రమే చి...

చ. ఇరుసతిలోకము ల్మహిమ నేలెడుస్వామిపై నిన్ను వాకిటన్
దరలకయుండగాపుసిచి ధన్యతఁ జెందిన బాణదైత్యుఁ డే
కరణిని నిన్ను మున్నెరవుగాఁ గ్రోలఁగఁ బూజ యొనర్చెనో కదా చిం.

చ. మెరమెర లేకనీవు మును మేదరిసెట్టియు బోయతెంకయున్
బొరసుకులంపు చాకలియు బెట్టినయోగిర మారగించితౌ
సరిసరి నిన్ను నర్చనలు సల్పెడుచో నియమంబు లేలయా చి... 39

చ. పురుడెగణింప భక్తసులభుండవు నీకు నిలింపులెల్ల కి
న్నర నరుఁ డెట్టు లర్చన లొనర్చెనో కాని కడుంగడిందిగా
సెరబడి చేసివానికి విచిత్ర ధనాధిపతిత్వమివ్వవే చి... 40

చ. గరళము కంఠమూలమున గట్టిగ దాల్చుట నీకు నంగదల్
బరగునటంచు రుద్రపశుపత్యభిధానుఁ డెదంగలంగఁగా
నౌరిమెరసంకపీఠమున నుంచవె యాతని శాశ్వతంబుగాఁ జి... 41

చ. విరసముతోడ నిన్ శిలల వ్రేసియు లోకటఁగుమ్రిమ్మియున్ గృహాం
తరమునఁ గాపువెట్టియును సిద్ధముగా వెలివెట్టుకుంటిన
ల్దిరగఁగఁ జేసినట్టి ఘను లేతగుభక్తవరేణ్యులైరి మేల్ చి...42

చ, సురపతి వేణువుం గళిమికొమ్మమగండు మృదంగవాద్య మం
బురుహభవుండు తాళమును పొత్తము ముత్తవ వీణఁబూనఁగా
హరిసతి బాడినం జదల నద్భుతతాండవకేళిసల్పితే చి... 43

చ. ఉరగము లెమ్ములుం బునుక • లుగ్రపిశాచములుం గశానముల్
గరళము కంఠమూలమున • గట్టిగ నెవ్వాకు గల్గియుండియున్
బరమశివాకృతింబొలుచు • భద్రములిచ్చెద వబ్బురంబహో చి...

చ. ఇరవుగ నెల్లలోకముల • నేలెడు స్వామివి నీవు కూర్మితో
దొరతన మెల్లఁ గోకడచి • తుచ్ఛపుజాలరిపూవకన్నియున్
శిరమునఁ బెట్టుకొంటివఁట • చిత్రములౌర భవద్విలాసముల్ చి..

చ. హరుఁడు మురారి యబ్జభవుఁ డాఢ్యు • లటంచు పురందరుండు దే
వరయనుచు న్విభావసుఁడు • వహ్నియ యు వేల్పులటంచునెంతు ) బు
ద్ధిరహిత మానవు ల్పొగడ • తిత్వము నీయెడఁగల్గుటెన్నకే చి .. 46

చ. సరవి విధాతరూపమున • సర్వచరాచరముల్ సృజించి శ్రీ
హరివయి ప్రోదిచేసి నిటలాక్షుఁడవై యడఁగింపుచుందు వ
బ్బురముగ నీవెకా జనన • పోషణనాశనకర్త వారయన్ చి... 47

చ. శరనిధికన్యనాగ హిమ • శైలతనూజయనంగ వాణినాఁ
బరగువధూటులఁగూడి భవ • పాలన నాశములొలిఁ జేయుచున్
హరిహర ధాతృమూర్తివగు • నాఢ్యు నినుం గనుగొందు నీశ్వరా.

చ. ... ... ... 49
చ. ... ... ... 50
చ. ... ... ... 51
చ. ... ... ... 52, 53

చ. పురుషులలోన విప్రుఁడును • పుష్పకదంబములోన జాజియున్
దరువులలోన రావియును • దానచయంబుల నన్నదానమున్
ధరణిఁబ్రశస్తిఁగన్న ప్రియు • దైవములం దధికుండవీవయా చి. 54

చ. పరుసముసోక లోహము శు • భస్థితి బంగరమైనరీతి స
ద్గురుకరుణానిరీక్షణ మ • కుంఠితలీల నొకింతసోకినన్
నరుఁడు మహాత్ముఁడై బుధజ • నస్తుతుఁడై నినుఁజెందుఁబో తుదిన్.

చ. అరయఁగ నీరబుద్బుదము • లట్ల నశించుచునుండు మేనులున్
శరధితరంగమాలికల • చందమునం గనుపట్టు సిరులు
స్థిరమనినమ్మి నిన్గొలువ • నేరక రిత్తనశింతురొకులుల్ చి... 56

చ. పొరిఁబొరిఁబుణ్యభూములకుఁ • బోవఁగనేలఁ గడు న్దపోమహో
ధ్వరము లొనర్చనేల యుప•వాసములన్ గృశియింపనేటికిన్
హరహరయంచు నొక్కతరి • నాడినఁజాలు నఘప్రశాంతికై చిం

చ. తరణి సుధామయూఖ వసు•ధా యజమాన సమీర శౌనలాం
బరజలమూర్తివైన నిను•భక్తిఁదలంచినవారి కెందులన్
దిరుగఁగనేల యేశిలల • నిచ్చలుఁ గోరిభజింపనేలయా చి... 58

చ. నరవి చతుశ్శ్రుతు ల్నిఖిల•శాస్త్రపురాణ కథారహస్యముల్
విరివిగ నిచ్చనిచ్చలును • విందుముగాని తలంచిచూడ మా
గురుచరణంబులాన నినుఁ•గొల్వక యేరికి ముక్తి లేదయా చి...59

చ. గరుడముఁగన్న పన్నగని•కాయములట్ల మృగేంద్రుఁగన్న కుం
జరములకైవడిన్ దురిత•సంఘము లెల్లఁ దొలంగి పారుచో
నరుఁడొకచో ననాస్థనయి•నం భవదాహ్వయ ముచ్చరించినన్ చి.

చ. ధరణిసురు న్వధించిన మ•దంబున గోనిధనంబొనర్చినం
గురుసతిఁగూడినన్ మధువుఁ•గ్రోలిన హేమము మ్రుచ్చిలించినన్
దొరకొనుపాతకంబు లొక•తూరి శివాయనినన్ దొలంగుఁబో చి.

చ. గురుహరిణేక్షణామణినిఁ•గూడిన దుష్కులుపాత్రుఁ జంద్రునిన్
శిరమునఁ బెట్టుకొంటివఁట • చెప్పఁగ నబ్రమయారె మేలుమే
ల్గురుతర భక్తితోడ నినుఁ•గొల్చినవారికిఁ కేటిపాపముల్ చి...62

చ. దురితము లేమిసేయు గ్రహ•దోషపిశాచరుజామృగోరగో
త్కరభయమేలకల్గు నృప•తస్కరవహ్నిభయంబులే ప్రియం
బెరయు నరుం డొకప్డు నినుఁ•బేర్కొని నెమ్మది సంస్మరించినన్ చి.

చ. అరదము లందలంబులు హ•యంబులు రత్నవిభూషణంబు లం
బరములు చామరంబులు ద్వి•పంబులు నాదిగఁగల్గు శ్రీవులు
న్బొరసెడువారు మిమ్ము మునుఁ•బూజయొనర్చినవారె కారయా చి.

చ. వెరవిరవార సేవగిది • వేఁడినఁగానియు నియ్యలేని ము
ష్కరనరనాయకాధముల • సావడులంబడి ప్రేలువారికిన్
నిరతకృపార్ద్రదృష్టిమెయి • నీవిడ కన్యుఁడొసంగఁజాలునే చి. 65

చ. సరయువు కృష్ణ నర్మదయు • జాహ్నవి బాహుద తుంగభద్ర భా
స్కరసుతయు న్సరస్వతియు • గౌతమియుం మొదలైన దివ్యని
ర్ఝరులనుమున్గు పుణ్యమొక•పారి శివాయనినన్ లభించుఁబో చి.

చ. ధరను ద్రిమంత్రకోటికిఁ బ్ర•ధానము నాగమమాతయైన య
గ్గురుతరమంత్రరాజమున•కుం బతివీవని లోగణింపకే
వెరవరికొల్తురో ఖలులు • వెంగళులై కుఱుక్షుద్రవేల్పులన్ చి...67

చ. హరువులుదీర్ప నీవు హృద•యంబుననెప్పుడు గల్గియుండఁగా
వెరవరియందు నందులకు • వేరరులై చనుచుందు పామరుల్
నెరయఁగ వెన్నచేతినిడి • నేతికి ద్రిమ్మరులై వడింగటా ! చి...

చ. ఉరగము గాలిఁగ్రోలి గుహ•నుండదె యోగులు నించుకోనల
న్దిరుగదె మేక నీళ్ల వెను•దీయకఁ గ్రుంకదె కప్ప యెవ్వరే
శరణిఁ జరించుచున్న నినుఁ•గన్గొనకున్నఁ బరంబులేదుగా చి... 69

చ. హరహర ! మేరుభూధరము•నంత పదార్థము సంగ్రహించిన
న్సురనగరాధిపత్యము త్రి•శుద్ధిగ నిచ్చిన రంభయంతసుం
దరి నిజభార్యయైన మది•దార్కొను తృష్ణయడంగదేరికిన్ చి...

చ. బురదను పాళితో నురెడి•పుర్వు మెలంగుచునుండి యెప్పుడు
న్బురద రొకింతయైనఁ దనుఁ•బొందకయుండ మెలంగునట్లు నే
ర్పరి గృహమేధియయ్యు భవ•బంధమునంటక నిన్నుఁ జెందుఁబో చి.

చ. ఒరుల భజింపఁబోదుగద • యొక్కపుడు న్నినుఁగొల్చుమేటి భా
స్వరసరసామ్రభూరుహాల•సత్కిసలానుభవానుమోదియౌ
పరభృతరాజ మెందు నొక•పట్టున వేములఁ జేరనేర్చునే చి... 72

చ. నరవిని జీవనార్థముగ • చర్మసితాభసితాక్షమాల తే
నరుఁడు ధరించు కైతవము•నన్ భువినాతఁడశేషధారుణీ
భరణధురీణతాప్రచుర•భాగ్యసమన్వితుఁడై చెలంగుఁబో చి...73

చ. సురచిరభక్తితోడ మనుజుం డొకబిల్వదళం బొకప్పు నీ
శిరమున నుంచెనేని యది • సింధురసైంధవచామరధ్వజాం
బరమణిభూషణాదివిభ•వస్ఫురణ న్గనుపట్టియుండుఁబో చి... 74

చ. నరుఁ డొకనాఁడు నీ నగరు • నంగనఁబట్టి విచిత్రఘంటికో
త్కరరవమాలకించిన న•తండు వినం డెపుడున్ కృతాంతకా
నరకశఘంటికాప్రజవి•శంకటసాంద్రఘణంఘణారవ్వముల్ చి...75

చ. దురదురజాగిమర్త్యుఁ డొక•తూరి సమంచిత తావకీన మం
దిరమునకుం బ్రదక్షిణ మ•తిప్రమదంబునఁ జేసెనేని య
ప్పురుషుఁడు శేషభూభువన•పోషణధూర్వహుఁడై విరాజిలున్ చి.

చ. తిరమున నీ నివేశమున • దీప మొకానొక నాఁ డొకింత బం
ధురమతి నిడ్డధన్యుఁడు చ•తుర్ముఖముఖ్యనిలింపమాన్యుఁడై
నిరుపమతావకీనపద • నిత్యసుఖోన్నతుల న్నెలంగుఁబో చి... 77

చ. కిరణాలతాళవృంతములఁ • గ్రమ్మఁగ నెవ్వఁడు తావకాలయా
జిరమున నాఁడు నాతఁడువ•సించు విరాజితరాజ తాపసీ
ధరశిఖరాగ్రరత్న సము•దంచిత కాంచనసౌధవీథులన్ చి... 78

చ. పరిచితిమీఱ నీశిరము•పై పురిసెండుజలంబొకప్పుఁడా
దరమునఁజిల్కు బల్లిదుఁడు • తథ్యముగా నఖిలాఘదూరుఁడై
ధరఁగల పుణ్యతీర్థములఁ • దప్పకఁగ్రుంకు ఫలంబుఁ జేకొనున్ చి.

చ. బెరసిన వేడ్కయుల్లమునఁ • బిక్కటిల న్మనుజుండు నీకుఁ గ్రొ
వ్విరిసరమొక్కటచ్చపు వి•వేకముతోడ నొసంగిన న్బురం
దర ధరణీరుహ ప్రసవ•దామవిభూషితుఁడై చెలంగుఁబో చి... 80

చ. కరయుగమెత్తి నీకుఁ గుతు•కంబున మ్రొక్కినతండు శేషభూ
వరమకుటాగ్రరత్నసమ•వాయ సమగ్రవిభాసముల్ల స
చ్చరణ సరోజుఁడై వివిధ•సంపదలం గొదలేకయుండుఁబో చి...

చ. తొరలెడు భక్తిఁ గప్పురపు • ధూపము నీకు జనుండొసంగుచో
గొరగొర వానిమేనఁగల • ఘోరతరాఘపిశాచసంఘముల్
బరువడికూయిపెట్టుచును • బారిచనుంగద తక్షణంబునన్ చి...82

చ. పరునిఁబరేశు భక్తజన•పాలనశీలు ననంతు నాద్యున
క్షరు నపవర్గదాయకు జ•గన్మయు నద్వయు నప్రమేయు నం
బురుహభవాండభాండ పరి•పూర్ణపిచండుఁ దలంతు నిన్మదిన్ చి.

చ. హరునకు వందనంబు ఫణి•హారునకు న్స్మరణార్తి దేవతా
వరదునకుం జొహారు పుర•వైరికి మ్రొక్కు నగేంద్రజామనో
హరునకు జోతయంచు నన•యంబును నీకు నమస్కరించెదన్ చి.

చ. దిరమున స్నానసంధ్యలును • దేవ సపర్యలు సువ్రతంబులు
న్గురుభజనాదికంబులు న•కుంఠితభక్తి నొనర్ప నేర నీ
చరణము లాశ్రయించితి ని•జంబుగ నన్నిఁక నెట్లు గాచెదో చి.

చ. గురుఁడవు బాంధవుండవు స•ఖుండవు తల్లివి దండ్రివన్న వీ
శ్వరుఁడవు దాతవాప్తుఁడవు • సర్వము నీవె యటంచు నమ్మితి
న్వరముఁడవై కృపారసము • వావిరి నాపయిఁ జిల్కఁ బ్రోవవే చి...

చ. కెరలెడు ఘోరపాపతతి•కిన్మదిఁ గంపిలి యేయుపాయమున్
దొరకక యొక్క పెన్వెరవు • దోఁచిన నుబ్బుచు నిబ్బరంబుగా
హరహర యంచుఁ బల్కితి న•హో! దురితంబులు వీడి పారెఁబో చి.

చ. దొరకెను నాకు భాగ్యమున • దుస్సహదండధర ప్రచండ కిం
కర పటుదర్పసంహరణ • కారణమై యయిదక్షరంబులు
స్ఫురగిన మంత్రరాజము సు•పర్వులకైనఁ దలంక నేమిఁకన్ జి... 88

చ. గిరిశ నమోస్తు యోగిజన•గేయ నమోస్తు మహోగ్రదోషసం
హరణ నమోస్తు భోగికుల•హార నమోస్తు సమస్తదేవతా
చరణ నమోస్తుతే యనుచు • సారెకుఁ గోరి నమస్కరించెదన్ జి.

చ. వరదపరాకు భక్తజన•వంద్య పరాకు సమస్తపాపసం
హరణ పరాకు భక్తనివ•హావహదక్షపరాకు యోగిహృ
చ్చరణ పరాకు సేయకిఁక•సయ్యన నామనవాలకించవే చి... 90

చ. పరవనితాపరాస్థ నర • పాలకసేవల యందుఁగోరికల్
దొరలఁగనీక నీచరణ • తోయజ భక్తియు సూనృతోక్తి యొ
వ్వరికిని గీడు సేయమియు•వాలెము నాకొసఁగూర్చి ప్రోవవే చి.

చ. మురిపెముతోడ నక్షసర•ము ల్బసితంబు ధరించినాఁడ మ
ద్గురువరదత్తమై సకల•దోషములన్ దొలఁగించు ద్వాదశా
క్షరి జపియించినాఁడ కలు•షంబులు నాకిఁకఁ గల్గు టెట్లయా చి.

చ. ముసువుగ నక్షమాలయును ♦ మోదికఁబూనితి భూతిదాల్చితిన్
స్మరణగ నైదువర్ణముల ♦ మంత్రము వేమరు నుచ్చరించితిన్
దురితపిశాచముల్ దొరగి ♦ దూరముగా జనకుండ బెట్టఁకన్
చిరవిభవా భవా విజిత♦చిత్తభవా యభవా మహాభవా! 93

చ. గురువరభక్తిమీఱ మిముఁ♦గొల్చిన వాఁడ నటంచుఁ దద్దయుం
గరువముతోడ నేను కృత♦కర్మము లెవ్వియుఁ జేయనైతి దు
ర్భరసురితాత్ముఁడంచును ది♦రస్కృతిఁ జేయక నన్నుఁ బ్రోవవే
చిరవిభవా భవా విజిత♦చిత్తభవా యభవా మహాభవా! 94

చ. ఒరిమెఁ గవీంద్రుఁ డే మెఱుఁగు♦నోఁ బుని దర్శనమియ్యనోడి బ
ల్దారలును మూలసీగుమరు ♦ లోభమున న్నిను నే మఱేమియు
న్వరములు వేడ నాకిపుడు ♦ వైళము దర్శనమియ్యరాగదే
చిరవిభవా భవా విజిత♦చిత్తభవా యభవా మహాభవా! 95

చ. నరపశుపక్షివేఁట మృగ♦నాగఝషాదిక జంతుయోనుల
న్బొరిఁబొరి నెన్నిమార్లు ముసు♦పుట్టితినో యెఱుఁగ న్మహోఘముల్
హరు నినుఁగొల్చుభాగ్య మిపుఁ♦డబ్బినికే క్రియఁబ్రోచెదో సుమీ
చిరవిభవా భవా విజిత♦చిత్తభవా యభవా మహాభవా! 96

చ. ఒరుల నుతింపఁజాలఁ గలు♦షౌఘ మహాదహనాగ్నికీలమై
బరగు మఁ గామితార్థము ల♦పారముగానిడు నీదునామ సం
స్మరణయహర్నిశంబును బ్రి♦శస్తిగ నాకొనరించి బ్రోవవే
చిరవిభవా భవా విజిత♦చిత్త భవా యభ... మహాభవా! 97

చ. కరిముఖ నందిభృంగిరిటి♦కాళి సముద్భవ కాలభైరవా
దు్యరు బలవన్మహా ప్రమథ♦యోధవరేణ్యులు గొల్వ ధారుణీ
ధరసుతఁగూడి నాకిపుడు ♦ తాపక మో...నమూర్తిఁ జూపవే
చిరవిభవా భవా విజిత♦చిత్తభవా యభవా మహాభవా! 98

చ. న... భసలీల నొక్క నిమి♦షంబును నిన్భ... ంపలేక ఖల్
డెంపుల దుర్విచారములఁ ♦ దిమ్మరుచు ...ది యెన్నిచెప్పి
న్సగలదు పాపజాతిమతి ♦ నాకిపు డం కె... ా దికెట్లసూ
చి...భవా భవా విజిత♦చిత్తభవా యభ... మహాభవా!

చ. అరయఁగ నే నహర్నిశము • నాఁడెడు వాక్యము లెల్లఁ దావక
స్ఫురణగఁ జిత్తగించి కలుష • మపారకరంబులఁ బారఁదోలి నీ
చరణ సరోజభక్తిఁ గొన • సాగఁగఁ జేసి సముద్ధరింపవే
చిరవిభవా భవా విజిత • చిత్తభవా యభవా మహాభవా ! 100

చ. ఇరవగుభక్తితోడ జనుఁ • డీశతకంబుఁ బఠించిన న్సమా
దరమున వ్రాసిన న్వినఁ • దప్పవుగా వివిధేష్టభోగముల్
ధరభుజియించి యాతుదిని • తావక దివ్యపదంబుఁ జేరుఁబో
చిరవిభవా భవా విజిత • చిత్తభవా యభవా మహాభవా. 101

ఇది కూచిమంచి తిమ్మకవి విరచితం

బగు శ్రీ చిరవిభవశతకము

సంపూర్ణము.

# ఆశీర్వచన పద్యనవకము.

క. శ్రీసిద్ధేశ్వరశతకము, భాసిల్లెడుఁ గంఠసీమ పతకమ పైకై
వాసిరయొసంగెడునంతే, వాసిమణీపాసఁగె మనకు వాంఛితసిద్ధుల్.

క. ఎంతేకాలమునుండియుఁ, జింతిల్లెదనయ్య తగిన శిష్యుఁడుదొరకన్
సంతతవాంఛ న్భాషా, కాంత న్నావలెనకొల్చి కవిమైమించన్.

మ. వినుమాశిష్యవరేణ్య నాదు కవితా విస్ఫారరాజ్యంబు నీ
కనుమోదంబునఁ బూన్చినాఁడ సుకలా వ్యాసంగనిత్యుండవై
మనమారన్ జరియింపుమయ్య జన న మాన్యుండవై సత్కవిం
ద్రనితాంతాదరపాత్రవర్తనుఁడవై ధన్యుండవౌ దెయ్యెడన్.

ఉ. కమ్మకొలమ్మునంబొడమి కమ్మని సత్కవనమ్ము నెమ్మదిన్
నమ్మదమారఁగోరి గురు సత్తము నారసిపొందలేక నీ
విమ్మగఁ గోర్కెనంతు వెర వెమ్మెయిఁగానక యుండియుండి ప
క్వమ్మయి దైనమొప్ప నిటు గమ్మన నీశతకమ్మొనర్చితౌ.

మ. ఉనుపట్నాస్త్ర విశారదాత్ములయి యు ద్యోగించి ప్రాపింప లే
రరయ న్సత్కవితా మహావిభవము ద్యద్దైవ దూరస్థులై
వరసంతాన వితానసత్తకమున న్భాసిల్లుకావ్యంబు నీ
శ్వరభక్తి న్రచియించినాఁడ వికఁబో ప్రఖ్యాతినీకయ్యెడిన్.

ఉ. వ్యాకృతి యాకృతింబడసి వచ్చెనొ శారద నీదువాణికి
ప్రాకట సంస్కృతాంధ్రమయ వాగ్ఝరితోఁడ ననంగనొప్ప నీ
శ్రీకవితావిలాస శుభ చిహ్నకృతిం గడుమెచ్చుకొంద్రు సు
శ్రీకలితాంధ్రసత్కవుల కీనకృపంగని ధాత్రిశేఖరా.

పంచచామరము.

కృషింజెలంగువాఁడవౌటఁ గీర్తిమెందు నాదు వా
క్కృషి న్మెలంగువాఁడనౌట వృద్ధిఁగోరుచుంటినో
కృషీవలేంద్ర విత్తనంబు క్షేత్రరాజమందు స
త్కృషింబొనర్చివేయ నీయ దేఫలంబు వృక్షమై.

క. ఈశతకము మాపతికృతి, యై శశ్వద్వందనీయమై వెలయుటచే
నాశశిభాస్వత్తారము, శ్రీశాలీగ్రామమహిమఁ జెన్నొందుభువిన్.

క. యోగానంద ధరామరుఁ, డీగురునవరత్నమాల నిడె దీననతోఁ
దాగురువై కృతికర్తయు, భోగీంద్రకలాపభక్తపురుషున కెలమిన్.

---

సీసమాలిక.

శ్రీనిధియా చెలికాని వంశపయోధి,
జనియించె నెవ్వాఁడు చంద్రుఁడనఁగ
రమణగా భావనారాయణ రమణాంబి,
కాగర్భశుక్తి ముక్తాఫలంబ
యిద్ధకళానిధి వృద్ధిగాంచెననంగ,
రాజకళలనేఁడు రహి వెలుంగు
నెర్నగూడెము జమీ కేలికయెగుణ,
గణతారకానీక కలితరాజు
హూణాంధ్రగీర్వాణ వాణీవిదుం డెవ్వఁ,
డాంధ్రసత్కవులకు నమరతరువు
ప్రాక్కవిరచిత జీర్ణగ్రంథ గణసము,
ద్ధరణ మహత్క్రియా చరణుఁడెవఁడు
శ్రీరామచరిత ప్రభృతి కృతికర్తయై,
యాంధ్రభోజఖ్యాతి నతిశయించి
దేశకళాభివృద్ధి ప్రబుద్ధి సమృద్ధి,
మించి గ్రంథాలయాలుంచి యంచి
తగ్రంథమాలయు స్థాపించి ప్రియముగాఁ,
బ్రియముగాక యొసంగు బిరుదుఁదాల్చి
యాంధ్రసోదర్యుల కందిచ్చుఁ బొత్తంబు,
లేకవివర్యుండు ప్రకటముగఁ
బీఠికాపురరాజ విశ్రుతబంధుండు,
చిత్రాడపురవాసి శ్రీవిలాసి

III

రాజకీయ సభావిరాజితుం డేబుధో,
త్తంసుండు సుయశోవతంసుఁ డరయ
నాలప్పరాయార్యుఁడఖిలాంధ్రలోక హృ,
దయపద్మనిలయుండు దైవకృపను
గోదావరీమండలోదార రాజకీ,
యసభలో నొక సభ్యుఁడవుటఁజేసి
నాయున్న రాజోలు నగరంబునకువచ్చి,
పదియుఁదొమ్మిదినూర్ల పయినిరువది
యొండు హాయనమును నొనరు నవంబ రి,
రువదాఱుతేదిని బ్రివిమలాత్ముఁ
డరసి మత్ప్రియశిష్య విరచిత సిద్ధేశ్వ
రశతకము న్వాని భృశకృపాప్తి
వగచు నన్నోదార్చి స్వాశవధమువెలార్చి,
దిక్కఱిన శతక తిలకమునకు
దిక్కయినను భువి దివిమదీయచ్ఛాత్రుఁ,
డేర్చె ముద్రింతు నేదీనినంచు
దీనమందారుండు ధీరవందారుండు,
దీర్ణతేజోఘృణా పూర్ణరామ
పదభక్తి లక్ష్మణుండుదితుఁడై చెలికాని,
లచ్చరామాఖ్యుఁడై వచ్చె వానిఁ
గరుణ యోగానందకవి మనోభీప్సిత,
మీడేర్చి రఘురాముఁ డేలుఁగాత.

26—11—21,
రాజోలు,
గోదావరిజిల్లా.

ఇట్లు విబుధవిధేయుఁడు,
చిల్లరిగె యోగానందయ్యపంతులు,
బి. హెచ్. స్కూలు, ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

శ్రీమత్పంచబ్రహ్మణేనమః

# సిద్ధేశ్వరశతకము.

శా. శ్రీమత్కుండలినాథభూషణసుధీ చింతామణీ శైలజా
రామార్ధాంగ నిరంజనాశ్రితజనా త్రాణ సర్వాత్మకా
భీమాటోపవినిర్జితారి విలస ద్విశ్వాత్మ నిన్నెప్పుడున్
నేమంబొప్పఁగ సంస్మరింతు వరదా నిర్వ్యాజ సిద్ధేశ్వరా. 1

మ. అతిలావణ్యసటాచ్ఛటా కలితశీ ఘ్రారూఢమందాకినీ
పతితస్ఫారతుషారపుంజవిలసత్పర్యంకపీఠంబునన్
సుతు విఘ్నేశ్వరు నిల్పి ముద్దిడు మహాశూలీ స్మరోన్మూలి యా
తతభక్తి న్నినుఁ గొల్చెదన్ దళితదైత్యవ్రాత సిద్ధేశ్వరా. 2

మ. భవనాశంకర శంకరా సకృప సర్వవ్యాపకా ధూర్జటీ
ధవళాంగా పశునాయకా విమలవిద్వన్నుత భూతేశ్వరా
ధ్రువకల్యాణదిగంబరా సుఖద చిద్రూపా విరూపాక్ష శ్రీ
పవనాహార సుహారభూషణగణా భవ్యాత్మ సిద్ధేశ్వరా. 3

మ. పరమజ్ఞేయ నిరామయా వృషభశ్వేద్వాహనా శూలి భూ
ధరజానాథ సనాతనా విబుధవంద్యా దైత్యనాశంకరా
స్మరవిధ్వంస పరాత్పరా జగదధీశా విశ్వసమ్మానితా
గురువర్యా పరమాత్మ వహ్నిమయచక్షూ శ్రీద సిద్ధేశ్వరా. 4

మ. హరికోటిప్రతిభాకరా నిఖిలజీవాధార విశ్వంభరా
భర ధౌరేయ భుజంగరాజమణిశశ్వద్భూష నీహారభూ
ధరజామాత సురేంద్రవందిత పరంధామా జగద్రక్షకా
ఖరపాపాంబుధిబాడబానల మహాకాళీశ సిద్ధేశ్వరా. 5

మ. అతిలోకేశ్వర మ్రొక్కెద న్విమలనిత్యానందసంధాయికా
సతి నర్ధాంగమునంద తాలిచి పరిష్వంగంబు గావించు నా
తతవిద్యాబలనాయకా సుజనసంతాపంబుఁ జేళీమన
శ్చతురత్వంబున నార్చు నీదుకరుణాసారంబె సిద్ధేశ్వరా. 6

మ. ఘనవేణీపటలంబుతో మణిరణత్కాంచీవలగ్నంబుతోఁ
గనదంఘ్రిస్ఫుటనూపురధ్వనులతోఁ గంజాక్షుఁ డామోహినీ
వనితాకారము దాల్చి రాఁగ బహుళవ్యామోహమగ్నుండవై
కని వెంటంబడి చిత్రముల్సలుపవా కామారి సి... 7

మ. వరకైలాసగిరీంద్రవాస పరిరంభభ్రాంతకాత్యాయనీ
కరుణాపాంగ సతృప్తిమానస నినుం గాంక్షించి చిత్తంబునన్
జిరకల్యాణభవత్పదాబ్జయుగమున్ సేవింతు నిత్యం బుమా
వర ద్విడ్భీకరభూషితాహివర సర్వత్రాత సి... 8

మ. దితిసంతానము గాఁ జెలంగి విలసద్ధీరత్వముం జెంది యం
చితభాగ్యోదయదేవతాచయములం జింకింపఁగాఁ జేయు న
య్యతిమాయావుల నావియత్త్రిపురదైత్యానీకమున్ మ్రింగదే
సతతోదారభవత్ప్రతాపశిఖి విశ్వస్తుత్య సి... 9

మ. దరిలేనట్టి యమోఘసంభవలతల్ ధ్వంసంబు గావించి సు
స్థిరసౌఖ్యాకరదివ్యమోక్షపదమున్ జేకూర్పవే భక్తశం
కర మానీశ్వరచారసర్వసురవ్యాపత్కంజాతి సంజాత భా
స్కర కారుణ్యరసాలవాల త్రిజగత్కల్యాణ సి... 10

మ. లలితామోదనిరూఢపుష్పలతికాలంకారకైలాసమే
యిలు నీకై నది పార్వతీపతి మహాహీనాంత్రిహారాళి రం
జిలు భూతేశ్వర దేవతాతతికి నీ సేవాపరత్వంబునం
గల సాఫల్యము సెప్పఁగా వశమె రంగద్గాత్రి సి... 11

మ. లతికాపుష్పవినూత్నసౌరభరసాలంకారదివ్యాంగసం
స్తుతగంగాధునిశీర్షమందునిచి తేజం జూపి తన్మానినీ
పతివై యెప్పుడు శంకరా నతతమున్ భావించి స్వాంతంబునన్
స్తుతిఁగావింతు దురంతదుఃఖభవము క్షుణ్ణం జేయు సి... 12

మ. మదినూహించి భవన్మహాత్త్వము లసన్మౌనీంద్రలోకంబు నిన్
గదియంజూచెడు మార్గముం దెలుపవే కారుణ్యచిత్తంబుతో
ముదముం గూర్పవె భక్తసంతతికి నీ ముఖ్యాశ్రుతి న్నాహ్వాదిన్
బాదలంజేయవె దాసపోషణ మహాపుణ్యాత్మ సి... 13

మ. కరము ల్మోడ్చి మదీయశక్తి కొలఁదిన్ • గంగాధిపా యెవ్వఁడున్
వరభక్తిం బదము ల్మది న్నిలిపి ని • న్వర్ణింతుఁ బద్యావళిన్
నిరయంబందు మునుంగుట ల్దొలఁగి నే • నీపాదసేవారతిన్
వెరవేది యిఁక నాకుఁ గానఁ గరుణన్ • వీక్షింపు సి... 14

మ. తలఁపందుండిన కోర్కి కిం దగిన య • త్నంబే సదా చేయుచో
నిలఁగో నెవ్వరు సాక్షులౌదురయ నీ • వేకాక లోకేశ్వరా
లలితస్ఫారసుధాంశుఖండకుసుమా • లంకార శ్రీశంకరా
ఖలనాశంకర భక్తసమ్మదకరా • గౌరీశ సి... 15

శా. ఆపత్సాగర కర్ణధార యతిమా • యారూపసంహారకా
ప్రాపింపన్ సులభుండవే సుగతి దూ • రస్థుండ యా వానికిన్
నాపట్టై కరుణార్ద్రదృష్టివయి య • న్నా ప్రోవవే భక్తులన్
గాపాడన్ బిరుదంబు దాల్పవొకొ దు • ర్గాభర్త సి... 16

శా. తిర్యగ్యోనులఁ బుట్టి పుట్టి తుదకీ • దేహాభిమానంబుతో
నార్యాధీశ మహాప్రభావజననం • బై యుంటి నన్నింక నీ
పర్యాయంబయినం భవాబ్ధిగడపం • భావింపవే తండ్రి యౌ
దార్యస్ఫూర్తి సతంబుఁ గొల్తు నిను వి • ద్వత్పూజ్య సి... 17

మ. త్రిగుణాతీతసువేదవేత్తలు ఋషి • శ్రేష్ఠుల్ ప్రశంసించియే
భగవంతు న్నిరతంబుఁ గొల్చి విమల • త్వంబంది రారూఢి నా
భగవంతు న్నినువేఁడికొందుఁ గరుణా • పాథోనిధీ పూని తె
న్నగఁ బాలింపఁగదయ్య నన్ననఘ య • జ్ఞధ్వంసి సి... 18

మ. తనువుల్ శాశ్వతమౌనె మర్త్యతతికిన్ • ధ్యానింప నిన్నాత్మలోఁ
గనదాలోకనఁజేసి నన్నెపుడు దుః • ఖప్రాప్తికిన్ జిక్కనీ
కనయం బ్రొప్పఁగ నేలుమయ్య శ్రితర • క్షానిత్యదీక్షాత్మస
జ్జనసమ్మానిత శేముషీమణి నమ • స్కారంబు సి... 19

మ. పరమాత్మా నిను నమ్మికొల్చెదను నా • భారంబు నీదేసుమీ
తరిమై నన్నిఁక నేవిధంబునను నా • ర్తత్రాణ రక్షింతువో
ధరణీభృత్తనయామనోహర దయా • ధౌరేయ కందర్పసం
హరణధ్యేయ కృపీటయోని నయనా • సానంద సి... 20

మ. ధనహీనుండను జ్ఞానశూన్యుఁడ దర•త్రాపార్ధమఃఖాత్ముఁడన్
జననప్రాప్తి మహామయుండను జగ•త్సంతాపిత చ్ఛిన్నమిత్త్ర గొ
ల్చినఁ దత్పీడ దొలంగునంచు మదిలోఁ • జింతించెద న్నిత్యమున్
నను నీదాసునిగాఁ దలంపుము మహా•నందాత్మ సి... 21

మ. అతనుం గాల్చిన ఫాలనేత్రి మిపుడ•య్యా ప్రజ్వలింపించి యా
తతమత్పూర్వకృతోజ్జ్వలత్కలుష సం•తానంబు నార్పంగవేఁ
డితి నీకార్యమునల్పి శుద్ధునిగ రూ•ఢింజేయవేతండ్రి దా
రిత షడ్వర్గమహా ఘృణావనిధి స•ర్వేశా ప్రసి... 22

మ. వపువెత్తించిన హేతులెయ్యవియొ దే•వా చెప్పవేనాకు హృ
చ్చపలత్వంబు సహింపఁజాలక నలి•న్సంతాపినై పొక్కెడన్
గృపఁజూడంగదె మ్రొక్కెద న్మహాదుఃమా•ధీశా ప్రతీక్షింపవే
యుపరోధింపకె ముక్తిసాధము దయా•ళూ నర్వసి... 23

మ. శశిపూషానలనేత్రి సద్గుణఖనీ • సర్వప్రభూ లోకముల్
నశియింపింపఁగ వృద్ధిసేయఁగను న•న్నాచేయు నీకేతగున్
నిశయందు న్నిదురింపఁజేసి పగటి•న్నేర్పొప్పఁగా జీవులన్
భృశతేజంబున వెల్గునట్లరసి కా•వింపంగ సి... 24

మ. ధరణిం బ్రాకృతశిల్పకారుఁ డురుమే•ధావంతుఁడై చేయు మే
దుర మాణిక్యనిశాంతమట్లు భవస•ద్రూపామహోత్సాహివై
స్ఫురదస్తోక శరీరముంజలిపి జీ•వుం డందునుండన్ లస
చ్ఛరణాజల్పితె మేరుధీర సురవ్రా•త్సంచార సి... 25

శా. నీవేమిత్రుఁడవై స్వబంధువయి హృ•న్నీరేజసంచారివై
భావస్ఫూర్తిగనెంచి ప్రోవవె మనః•పద్మంబున న్గొల్చెదన్
ద్రోవంగానక చిక్కువడ్డ నను ము•క్తుంజేసి రక్షింపఁగన్
రావేతండ్రి భవత్ప్రభావముగనం • బ్రార్థింతు సి... 2౦

శా. కారుణ్యామృతబిందువుల్పిలికి యం•గంబెల్లఁ బూతంబుగన్
రారాజద్వ్యధుశ్లిష్ట ప్రేమమున ని•ర్వర్తించి యామీఁదటన్
ఘోరంబైన భవాంబుధిం గడపు ర•క్షోహంత నిన్వేఁడెదన్
ప్రేరాసల్పెడి నీపదాబ్జముల ప్రా•పేకంటి సి... 27

మ. భవనంబందొక దీపెయున్నటు జగ•ద్బాహ్యాంతర జ్యోతివై
భవసంహారక సర్వలోకముల సం•వాసంబుగానున్న చోఁ
బవలు న్రేయియు సంధ్యల న్విలసిత•వ్యాప్తిన్ లసింపంగ దే
భవనాహ్వాత్కమలంబు పూతముగ శ•ర్వాణీశ సి... 28

మ. వరభక్తుండనుగాఁ దలంచి కరుణా•పాథోధి వీక్షింపఁగా
నురుమోక్షప్రద వీలు నీకవునొ కా•దోయంచు శంకించెదన్
దురితౌఘఘ్నభుజ నాశ్రయుండవగుటన్ • దుర్బుద్ధినై శంకరా
పరనాశంకర కావకుండె నను వి•శ్వస్తుత్య సి... 29

మ. ఉడునాథాంక కిరీట సర్పమణిహా•రోద్యత్ప్రభాశోభితా
జడత న్నేను జరించు మార్గ మతిక•ష్టంబై కలంచెన్మదిన్
గడుదాక్షిణ్యముతోడఁ బ్రోవఁగదవే • గంగాధునీధూర్వహా
జడనిస్ఫారనిషంగ మేరుసునను•ష్టంకార సి... 30

మ. గదవిధ్వంస మహాగదాశిఖరిజా • కాంతామనఃపద్మష
ట్పద సర్వజ్ఞభయానకా మనవి చె•ప్పంజాల దీనాకృతిన్
సదయాత్మా గదపీడితుండనయి యు•చ్ఛ్వాసంబు లేకుండెదన్
దుదినెట్లో మెదవో భవార్తిని గడుం•దూలించి సి... 31

మ. కలనైనన్ మఱువంగరాని యొక శం•కన్మగ్నియున్నాఁడఁ జం
చలమాయాపరివేష్టితుండనగుట • న్శంభూ నిను న్నిచ్చలున్
గొలువంగ న్దరమానొ కాదొయనుచున్ • గోరాజ దివ్యాశ్వకన్
విలసద్ధాతునిగా నొనర్పుము జగ•ద్విఖ్యాత సి... 32

మ. కలుషారణ్యదవానలా దురితవృ•క్షంబుల్ ప్రవృద్ధంబులై
గలఁతంబెట్టుచునున్న విచ్చట నను • న్గాసిల్లితి న్నిన్నుఁ గే
వలమున్నమ్మిన సార్థకంబు గనిపిం•పంజేసి కాపాడవే
తలపూవాడఁగ నీకతండ్రి ఋషిభక్త•త్రాత సి... 33

మ. తన రాష్ట్రంబునఁగల్గు పాపములు ద•ద్రాజే భరించుం జుమీ
యను లోకోక్తియ నీకుఁజెల్లు వినుమా • సాంబా లసత్సర్వభూ
తనికాయ ప్రభువౌట నీదెకద యా•భారంబు చర్చింప వే
దనలంబొందఁగ నీకు నన్నెపుడు వి•ద్వన్మృగ్య సి... 34

మ. సమయంబక్కఱలేదు త్వత్కరుణకీ • శా దీనమందార వే
గమయార్తిం దొలఁగంగఁద్రోతువఁట భ • క్తశ్రేణికట్లంచు లో
కములెల్లం బ్రకటంబుగాఁ బలుకు గం • గాభర్త యట్లుండఁగాఁ
బ్రమదంబారఁగ నన్నుఁబ్రోవవె జగ • ద్రక్షా ప్రసి... 35

మ. సమత న్నీవొనరించుకర్జములు వి • శ్వంబందు లెక్కింప శ
క్యమె యెవ్వారికినే నుమాధిప యఖం • డా విశ్వసంభావిదా
గమవేదార్య సుపర్వ సర్వవినుతా • గంగాధరా నన్నుఁ గా
వుమ దీనావనసువ్రతా శరణు శం • భూ సర్వసి... 36

శా. దేవా నిన్నిట నండగొంటి నఘమం • త్పీడ ల్దొలంగించియున్
నావాఁడౌ నినుఁ బ్రోతునంచనుమ యం • న్నా నన్ను నాపన్ను నిన్
నీ వారాధిఁగఁ బ్రేముడిం గనుమ తం • డ్రీ భక్తసంరక్షణా
దేవేశా ధృతకృత్తివాస యఘభే • దీ యిష్టసి... 37

మ. అనఘా నిన్నొకగొప్పకార్యమునకై యాచించితిన్ గాని దా
నినిఁ జేయంబనిలేదు నాకనుదో తం • డ్రీ చేయుదో ప్రేమమై
ననఘత్వంబు గలట్టివాఁడవవుట • న్నాంబా వ్రసాదింపవే
యనవద్యంబగు ముక్తి నాకు సురవం • ద్యా సూరి సి... 38

మ. ఘనసౌందర్యముతో వెలుంగుచు లస • త్కాండప్రయోగంబుచే
తను లోకావళినొంచు మన్మథునిఁ ద్వ • త్ఫాలాగ్నిచే రూపుమా
సిన రుద్రా భవదీయమూర్తి జగదా • భీలాత్మచారిత్రమున్
వినిన న్భీతిజనింపదే రిపుహరా • వీరోగ్ర సి... 39

మ. వరపద్మాక్షు పదారవిందయుగళిం • బ్రాపించు దేవేంద్రు భా
సురసౌభాగ్యముఁ గోరి నిత్యము నినున్ • శోధించి కాంక్షించి సు
స్థిరభక్తి న్నుతియింప మెచ్చుకొని నీ • శ్రీయాకృతిం జూపి న
ద్వరముల్ దైత్యుల కీయలేదె శశిభా • స్వన్నేత్ర సి... 40

మ. ఘను లాకాంతతమోవిముక్తికొఱకై • కాంక్షించి యర్చింపరే
యనిశంబు న్నిను భక్తితో మునులు ని • ష్ఠానూనసంవృత్తితో
వినయస్ఫూర్తిలసత్ప్రయత్నమతితో • విజ్ఞానహృద్వృత్తితోఁ
గనదారాధనిసర్గయోగగతితో • గౌరీశ సి... 41

శా. తోకంబందక నేకలక్షలజనుల్ • దూరస్థులై స్వర్గమున్
జోకం జేరఁగలేక మందులయి హ్యా•చోర్ధ్వస్థులై తా రధో
లోకావాప్తికిఁ జేరి కష్టగతులై • లోలత్వముం జెంది య
స్తోకాభీలపునారకంబుగనరే • దుర్గేశ సి... 42

మ. క్రతువు ర్నూనరించినట్టిఁడు భవ•త్కల్యాణసంవాగ్రసాం
చితమాధుర్యధునీఝరి న్మునుఁగు తు•ష్టిం బొందు నేమానవుం
డతులోద్దీపితతావకాంఘ్రియుగని•త్యారాధనం జల్పి స
న్నుతిగావింపఁగ మోక్షమందుఁగద యో•న్నోన్యేల సి... 43

మ. దినము ల్వెచ్చుచు ధర్మము న్విడిచి సం•దేహాంబుధి న్మున్గుచు
న్మనుజుండెంతయు మూర్ఖుఁడై కుజనుఁడై • మాద్యత్కలాహీనుఁడై
తనువే రూఢిగ సౌఖ్యమూలమనుచు • న్దానెంచి పాపాత్ముఁడై
కనఁడే ఘోరవిపత్పరంపరలు దు•ర్గానాథ సి... 44

మ. ధనముం బొంది వినూత్నరత్నమయసౌ•ధశ్రేణిఁ వర్తింపఁ దా
ననయుండై వృజినంబొనర్చుచు ధనా•శాయత్తలోలాత్ముఁడై
ఘనకాంతారమునందు లేళ్లఁ దిను వ్యా•ఘ్రింబట్లు భాసిల్లుచున్
ధనముం గూర్చి జనుండు దుఃఖపడెడున్ • దర్పోగ్ర సి... 45

మ. తరుణు ల్వాసిసఁ బుత్రకు ల్విడిచినన్ • దారిద్ర్యంబు రూపేదుటల్
స్థిరమై తోఁచిన స్నేహితుల్ దొలఁగినం • దీవ్రాపదుద్యద్విభీ
కరదుర్వారదవాగ్నులం దవిలినం•గానీ యసత్యంబుల
న్బుధశ్రేష్ఠులు పల్కనొప్పరుసుమా • పుణ్యాత్మ సి... 46

మ. ఫలభాక్త్యప్తులుగాఁగఁ దమ్మెపుడుఁ గా•పాడంగ లోనెంచు తం
డ్రులయాజ్ఞప్తుఁబమీఱుచుం ద్రుకొడుకుల్ • క్రూరాత్ములౌనట్టిఁడు
ర్గలుగన్ లాభమదేమి కద్పులకు దుః•ఖప్రాప్తికే కాక యి
య్యలలోఁ దండ్రిఋణంబు దీర్పఁగలరే • యింతేని సి... 47

మ. ఫలముంగోరి విశేషపుత్రవసువి•భ్రాంతి న్వచర్యాత్ములై
తొరగాఁ దోఁచి మనీషులెల్ల మునివృ•త్తుద్దాల్చి బ్రహ్మత్వముం
బొరయుం బూనికసల్పి దుస్తరభవాం•భోరాశి లంఘింపరే
స్ఫురదామోదభవత్పదాబ్జముల పా•పుం గాంచి సి... 48

మ. ఇహమే తప్పఁ బరంబు లేదనెడి దుర్వృత్తిం బ్రవేశించి దు
స్సహకాఠిన్యదురంతఘోరతరసంసారాంబుధి న్మగ్నుచు
స్బహుళార్తిం గడగాననేరక మహాభావజ్ఞులం దూఱుచు
న్నహహావర్తింతురు మూఢమానవులహో మాన్యాత్మ సి... 49

మ. ఇలపై నుండిక యెంతకాలము నరుం డెంతేనియుం గుర్తుతో
ఫలముం గోరక నీక యర్పణముగా భావించి సత్కర్మముల్
గలశక్తిం బొనరించునేని తుదకుం గైవల్యసంప్రాప్తియై
కలుషాంభోధిఁ దరించి సంతతము సౌఖ్యంబందు సి... 50

మ. ఘనమైతోఁచినమాయ తాను భువనాగారంబు గల్పించితో
డనె జంతూద్భవమందఁ జేయఁగ నఖండ స్వాగలీలాస్పృహన్
మునిసందోహహృదీప్సితప్రద మహాభూతేశ నీశక్తిచే
తను దన్మాయయుఁ జిక్కుకుందువుగదా ధన్యాత్మ సి... 51

మ. అరిషడ్వర్గముఁ గెల్చి జ్ఞానజితమాయాత్మైకవిజ్ఞుండునై
పరిభూతాన్యయదుఃఖరూపుఁడయి విద్వద్వర్యసమ్మాన్యుఁడై
వరవేదాంతవిశారద ప్రణవమొప్పంజల్పుచోఁ గల్గదే
పరమోత్కృష్టవిరాజమాన సుఖనిర్వాణంబు సి... 52

మ. నరుఁడై పుట్టినవాఁడు సర్వ సుగుణానందప్రభాగారుఁడై
పరమోత్కృష్ట దేవతార్చనలు సల్పంజాలి నిష్ఠాత్ముఁడై
తరియాభక్తి సుకృత్యముం జలుపు సద్వంద్యుండై యిద్ధాత్రిలోఁ
బురుషుండై తగుఁగానిచోఁ బశువుపో మూర్ఖుండు సి... 53

మ. హరయంచుం బలుమాఱువల్కునెడ నూహాంజొన్పి నిశ్చింతుఁడై
నరుఁ డెల్లప్పుడు సన్నుతింపఁగను నానారోగపీడాదులన్
హరియింపంగను గల్గఁగాదె భవసంహారోగ్రదీర్ఘాకృతిన్
హరనామంబటు సర్వపాతకహరుండా నీకు సి... 54

మ. జలధింబూర్వము పూర్వదేవసురలిష్టప్రాప్తికై త్రచ్చుచోఁ
జలదుద్యత్ఖరవిస్ఫులింగకణ విస్తారప్రభాపూర్ణ ది
గ్వలయంబై జనియించు హాలహలమాస్వాదించి లోకావళిన్
నిలువంబెట్టిన నిన్ను నాతరమె వర్ణింపంగ సి... 55

మ. జనకుం డెవ్వఁడు పుత్త్రుఁ డెవ్వఁ డిలఁ దే•జఃపుంజ సంయోగతన్
దనువుల్దాల్చి జనించుచుందుర్, పరమా•త్మారూపభేదంబులన్
దిననాథుండు నిజాంగసంగలియ సం•దీప్తప్రకాశించు న
ట్టనఘా తేజమె యిట్టులౌనుగద ని•త్యాస్తిత్వ సి... 56

మ. ఖరపాశంబులఁగట్టి యిద్ధతనువా•కంపింప దండించి ని
ష్ఠురశూలంబుల నొంచి తేకుఁడని సం•స్ఫూర్తిం గరాళించి బం
ధుర కోపానలమూర్తియౌచు యమనా•థుండంపఁ దత్కింకరుల్
దురితాత్ముం దుదిపీడిపోవుదురె యా•ర్తుండంచు సి... 57

శా. అజ్ఞాను ల్విననర్హు లెట్లు రసపూ•ర్ణార్థప్రభాంచత్కలా
సుజ్ఞానావహ సత్ప్రబంధ మురువి•జ్ఞుల్ సంస్కృతోద్యత్కలా
భిజ్ఞుల్ పొందెడి యజ్ఞజాతఫలముల్ • పృథ్వీన్నిరస్తప్రభా
వాజ్ఞానాత్ముల కందశక్యమె యప•ర్ణాధీశ సి... 58

మ. తొఱటం బిల్లలనుంచి పక్షి సకలో•త్తుంగావనీజావళిన్
దిరుగ న్మేఁత యొకింతగానమికి హృ•త్పీడ న్వగంబొందు న
ట్లరయన్ గష్టము నొందెడున్ స్వకుల జా•యాపత్యరక్షార్థమై
పరితప్తుండయి ద్రవ్యహీనుఁడు సతీ•వామార్ధ సి... 59

మ. పరిచర్య న్భవదీయచిత్తమలరిం•పంజేయ నిష్ఠాత్ములై
పొరయంబోవరు పాపకార్యములు సం•పూజ్యాత్మ సత్యవ్రతుల్
పరియింతు ర్మదినీదుసేవ ముని స•ద్భక్తాశ్రితుల్ నీలస
చ్చరణంబు ల్భజియింతుర్ నిశ్చలహృద•బ్జందు సి... 60

మ. సరియెవ్వారలు ధారుణీస్థలిను మే•శా నీదుభక్తాళికిన్
పరతత్త్వజ్ఞుల కెట్లుగూర్చెదవొ సౌ•భాగ్యైకపూర్ణత్వమో
గిరిజాధీశ్వర నాకు నట్లొసఁగవే • గీర్వాణమానీంద్ర న
ర్వరహృత్పద్మనివాసయో వరద కం•దర్పఘ్న సి... 61

శా. చేతశ్శుద్ధిగ వీతమోహుఁడయి తు•ష్టింజెంది యెవ్వాఁడు తాఁ
బ్రాతర్వేళల నిన్నుఁగూర్చి పరిచ•ర్యల్సేసి హృద్భక్తిమై
భూతశ్రేణికి దాతృతాగరిమచూ•పున్ వాని కబ్బుంజుమీ
భూతేశా మహనీయసౌఖ్యపదవుల్ • పూతాత్మ సి... 62

మ. హరినాథుండు సమస్త విశ్వభర ము•ద్యద్దివ్యశీర్షంబునన్
గురుధైర్యంబుననిల్పు కైవడిఁ గరాం•గుష్ఠంబున న్నిల్పఁడే
పురుషార్థం బవనింజనించి జగదా•ప్తుండా ర్తసంతాప్రీతియా
పురుషోత్తంసుఁడు నందసూతిధరముఁ • బుణ్యాత్మ సి.. 63

మ. తలపోయ న్నిజభక్త సంచయులస•త్ప్రారబ్ధ సంయోగమున్
దొలఁగంద్రోయఁగ నీవకాక యెవఁడా•ప్తుండౌ విత్కరింపఁగా
విలయాబ్దశ్వసనుం బలెంభయద గం•భీరప్రభావోన్నతిన్
దళితారాతిమనోభవా భవహరా•తంద్రీ ప్రసి... 64

మ. కలిదంభక్రియచూపి చిత్రగతులం • గల్యాణసంపూర్ణ తా
కల నాభాగ్యనిధానవస్తు కృతసౌ•ఖ్య ప్రాభవున్వీరునిన్
నలరాజు న్వికృతాకృతిం జలుపఁడే • నవ్యప్రశాంతుంగడున్
విలసన్మార్గుని శక్యమౌనె విధి త•ప్పింపంగ సి... 65

మ. గణుతింపంగను సాధ్యమెవ్వరికి వా•జ్మాత్రధుర్య విద్వాంసులన్
బ్రహ్మాభ్యాసక వేదకర్మలగు వి•ప్రశ్రేష్ఠుల నాప్రజ్వర
క్షణ విశ్రాంతివిధాప్రయోజన రణాం•చత్ప్రౌఢ రాజన్యులన్
గణదేవాశ్రిత పాదపద్మయుగళా • గౌరీశ సి... 69

మ. పథికుండొక్కఁ డరాతిభీతి కలుగం•బాట న్నిరీక్షించియే
పథికుల్గానమి కెట్లుచింతిలునొ యా•పత్కాలమై తోఁచఁగా
నధిక క్రూరకరాళజంతుయుత దే•హాంబ న్వనంబందున
వ్యథమే దేహావ్యథాకరుండగునుగా • విశ్వేశ సి... 67

మ. దనుజం డొక్కఁడు గోరినట్లుగను ద•ద్ద్వారప్రదేశంబునం
దనిశంబుం జరియించి కాచితివ నం•తా నిక చెల్లుం జుమీ
జనకా త్మ్రధరజాపతీ శ్రితజనాం•చద్రక్షణోద్యత్క్రియల్
మనమందారయ సోమశేఖరుఁ డస•వ్యగ్రామ సి... 68

మ. జననంబందినదాది మృత్యుభయ మ•శ్రాంతంబువాటిల్లు నం
చనుమానంపడు దేహధారులకు నా•యూజన్మసంబంధ వే
దనలం ద్రోలుటగాక యొండుగతి క•ర్తవ్యంబె యోజింపఁగా
దిననాథేందుశిఖ త్రినేత్ర త్రిజగ•ద్ధ్యేయాత్మ సి... 69

మ. సగుణోపాస్తి నొనర్చి కొందఱు మని•ష్ఠాపూర్తి సంపత్తితోఁ
జగతిన్ ఖ్యాతినిగాంచి యంచిత జగ•త్సర్వేశ నిన్నర్థిఁ గో
ర గురుప్రాభవ మొప్పఁగా శ్రితజనా•రంభాప్త రక్షింపవే
సగుణాతీతుల కేమిలోపమికఁ వి•శ్వస్తోత్ర సి.. 70

శా. ఆశాశృంఖలఁజిక్కి మోహఘన పా•శాయత్తులై యీశ స
ర్వేశు న్నిన్ను భజింపనేరక మహా•హేయాత్ములై గర్వులై
లేశంబేనియు దుఃఖవార్ధి గడవన్ • లేనట్టి నిర్భాగ్యులై
నాశంబొందుదు రార్తితో జడులప•ర్ణానాథ సి... 71

మ. విషయానేకపయూథసంకలితుఁడై • విజ్ఞానశూన్యుండు పౌ
రుషమోలిం దిగఁద్రోచి కల్మష మహా•ర్ణో రాశిలోఁగ్రుంకు పూ
రుషుఁడెబ్భంగి ముముక్షువౌను భవని•ర్యాణం బెటుల్వొందుడున్
వృషభేంద్రాశ్వ దయాపయోధి త్రిజగ•ద్విఖ్యాత సి... 72

శా. నీసాన్నిధ్యము సేర యోగిజనముల్ • నీసత్కథాజాలలీ
లాసారచరిత్రము ద్దెలియ శూల•స్ఫారభావింత్రియా
త్రాసుం దూఁచినరీతి నిన్నిలిపి హృ•త్పద్మంబుల న్శంకరా
వీసంబైనను దూలనీరు విలస•ద్విశ్వాత్మ సి... 73

శా. లోకారాధిత దీనరక్షణచణా • లోకేశ్వరాయక్షగా
షాకారిస్తుత ఘోరవహ్నిశిఖభా•స్వన్నేత్ర యాశాంబరా
నీకారుణ్యవరప్రసాదమున ని•ర్ణిద్రైక భాషాంగనా
స్తోకాపాంగ కృపేక్షణాప్తిఁ గనితిన్ • స్తుత్యాత్మ సి... 74

శా. నీదాస్యంబుగడించి మాదృశులు ని•న్నెనమ్మి సుప్త్రైమలం
దేదో తేజము నెప్పుడుంగనుచు భూ•తేశుండవో నీదెయాఁ
గాదోయంచు మనంబున న్మ్రపుల శం•కన్మ్రగ్గి తర్కించుచో
నీదివ్యద్ఘనమూర్తి చూపుదుగదా • నేర్పొప్ప సి... 75

మ. మనసాక్కంతయు మేరలేక చను ని•మ్మాయాప్రపంచైక వే
దనలం బొందుటకై నిరంతరము ద•ద్వ్యాపారము న్మాన్చి కౌ
న్నన నీసేవకుఁగామఁజల్పుకరుణన్ • దండిభవార్తుండనై
నినుఁ బ్రార్థించెద న్యాయమారయవె హృ•న్నేత్రాప్రసి...76

మ. ధనమార్జింపఁగ నంతకాలము దదర్థప్రీతిఁ గాంతాసుతుల్
గనిమోదింతురు రోగబాధితుఁడుగాఁగా లేక వార్ధక్యమే
ఘనమైతోఁచిన వాని మెచ్చరెట నీకట్టింపైన నీభక్తికే
దనుమానంబును లేదుగాలనదపగ్నాధీశ సి... 77

మ. పొలుపారంగను జీవి మాతృజఠరంబుం జొచ్చి పూర్వస్థితిన్
దెలియంగా శతవందనంబులఘభేదీ యంచవన్ గర్భముం
దొలఁగం దోచి కృతార్థుఁజేయుదుగదా దుర్వారశౌర్యాగ్రి నీ
విలసత్ప్రేమము పేర్కొనందరమె ద్వేషిఘ్నమా ప్రీసి... 78

మ. భవవారాశి నిమగ్నజీవులకు నీపాదాంబుజధ్యానమే
ప్లవమై దాటఁగఁజేయునండ్రు బుధు లభ్యాసంబుచే సాక్షి నీ
భవమంచే దరిగాన లేని నను లెబ్బంగి సమ్మహోదేవ జ
న్మవిపత్తుం దొలఁగంగఁజాలుదు రిహో మాన్యాత్మ సి... 79

శా. దానంబన్నను గానమన్నను గవిత్వంబన్న నిమ్మాన్యుఁడు సం
తానంబు జ్జననంబుతోన వెలయున్ ధాత్రిం బ్రకాశంబులై
యేనస్సాగరనావికా సకల భూతేశా యుమాధీశయో
దీనవ్రాత శరణ్యపుణ్యజన జాతత్రాత సి.. 80

మ. నియమంబొప్ప భజించుచున్న మదినిన్నేనమ్మి భక్తిం భవ
త్క్రియలందే నిజదీక్షనిల్పుచును దండ్రీ సద్గురూత్తంస చి
న్మయ మెవ్వండు కృతార్థతంబొరయునన్నా వానికే మోక్షమా
రయ హస్తామలకంబుగాదె శివసుదారీశ సి... 81

మ. కపటంపుం గ్రియనైంద్రజాలికుఁడు రూకంజూపి వాగ్ధాటితో
నపుడేమాయచుసేయురీతి శితికంఠా నీవు లోకంబులన్
నిపుణత్వంబునఁజేసి పెంచి కడకున్ భేదించి మాయించుచుం
డెపుడున్ లీలగఁగాక వేఱుగలదా యీశాన సి... 82

మ. హృదమందుండిన తామరా కుదకమందట్లయ్య నిర్వాణసౌ
ఖ్యద దేహంబున జీవుఁడుండి లలినాకంపించెడిం గల్మషాం
చద వార్యానలహేతులందగిలి స్వేచ్ఛందక్కి సంసార దు
ర్వ్యథపాలై కడునజ్ఞుఁడై మునుకుమాయంజిక్కి సి... 83

మ. తపనుం డుజ్జ్వలకంచుకంబనఁగఁ బ్రాగ్ద్వారాద్రిధరంబెక్కి తో
రపుఁగాంతిం జెలువొంది చీఁకటులఁబా • యందోలి భానుచ్ఛటా
తపమన్నేత్రిమొనంగి లోకముల కా • ధారంబమైయుంట వి
శ్వపచక్షుండని నీయనుజ్ఞఁబరఁగు • స్సర్వార్థ సి... 84

మ. తనరుం దివ్యపదంబుఁజేర్చు క్రియలం • దాఁజేయు సుజ్ఞాని కె
వ్వని పాదాంబుజరేణుసంగతి మహా • ప్లావంబమై కల్మషం
బను పంకంబు దొలంగఁద్రోయు నఖిలా • త్మాభక్తసంతానయా
యనుకంపాకృతి వీవకావె త్రిజగ • ద్వ్యాపార సి... 85

మ. తలిదండ్రుల్ సదపుత్రసంతతిని గో • త్రఘ్నున్ గనీక్షించి వా
రల దుర్వృత్తుల మాన్చుచందమున నా • ర్యానాథ నీసేవకా
వళి దుష్టత్వముగాంచి దిద్దుకొని వి • శ్వాసంబుతో నేలవే
కలకాలంబుఁ గృతజ్ఞులై మెలఁగఁగాఁ • గామారి సి .. 86

మ. వనమందెండిన యాకురాలుకరణిన్ • భావింపఁగానా జగ
జ్జనసంతానములోలి గిట్టుట యిదా • శ్చర్యంబె తేర్తాదులే
మునుమున్నిట్టివి వేనవేలు జరుగన్ • భూపాలురై నంధరం
దనువుల్నిల్పుకొనంగఁజాలిరె ఫణీం • ద్రస్ఫార సి... 87

మ. భవదంఘ్రిద్వయిపూజకై పురుషుఁడే • వ్వాఁడైనఁగానీ భృశో
త్సవమొప్ప న్నిజచిత్తకంజదళము • ల్సంతృప్తినర్పించి వేఁ
కువ నర్పించినవానికి న్సముఁడె యీ • క్షోణి న్మిలారూపమున్
బువులం గొల్చెడువాఁడు చూడు త్రిజగ • త్పూర్ణాత్మ సి... 88

మ. అవకాశం బెటఁగానరాదు వినుమ • య్యా నాకు సంసారసిం
ధువున న్మగ్నినవాఁడనౌట బుధభ • క్తుల్ సక్తు లారోగ్యకులై
యవకాశంబు వొనర్చుకొందు భవదీ • యాంఘ్రిద్వయింగొల్వఁగా
భవదేవా యొనవింపు బుద్ధినవధిన్ • భక్తింబ్రసి... 89

శా. నీరంబెల్లను నాతపంబువలన • న్నీరంధ్రమేఘంబమై
యారావభ్రమణంబుతో నెసఁగి లో • కాధారమౌనట్లుగా
ధారాపాతముఁజేసి సస్యవితతిన్ • ధాత్రి బ్రసమోదాత్మ వి
స్తారంబై చెలువొందఁజేయు భవదా • జ్ఞంగాదె సి... 90

మ. కనులం గ్రమ్మెడునశ్రుపుల్ విశదగం•గావీచికాజాలమై
తనువెల్లం బ్రవహించి ముంచి పరమా•త్మా నన్నుఁదూలించుచు
న్ననుజూడం దయరాదె నీమెద సదా•నందా మహద్బృంద దీ
నుని శోకామృతు హృద్భయాన్వితుని పా•న్నుంబ్రోవు సి... 91

మ. తమకే సంపదగల్గెనంచు ధనికుల్ • దౌర్జన్యదర్పోన్నతుల్
విమతత్వంబున దూఱుచుందురి సకలో•ర్వీదేవతార్థిప్రజన్
దమరే శాశ్వతమో ధనంబె స్థిరమో • తత్కారణం బింతయున్
సుమతిత్వంబునఁ జూడఁజాలకకదా • శూలీవ్రసి... 92

మ. నిలువ న్నీడయులేదు మా కరయఁగా • నీసత్కృపాదృష్టియున్
బలితంపు న్నిలయంబు లేనితఱి దే•వా యింత కిచ్చోట మా
తలదాఁప న్నెలవేదొ చూపి జగదం•తర్యామి పోషింపవే
నిలయం దెవ్వరుదిక్కు చెప్పుమకటా • యీశా ప్రసి... 93

శా. ఏవంపుం దనువేమికార్యమిది తం•డ్రీ యేలకల్పించితో
దేవా సారవిహీనమౌ జడముకాం•దే దీని నెబ్బంగి నీ
ప్రావీణ్యంబున బాగుచేసెదవొ క•ర్మంబింతె పొమ్మందువో
జీవేశా సురమౌని హృద్వనజవా•సీ సర్వసి... 94

మ. మనుజుం డొక్కటిపూనిచేయుటకు ము•న్నాత్మన్యాత్మ నిన్నాత్మఁబే
ర్కొనఁగా నేరనినాఁడు శక్తుఁడగునే • క్షోణీధరేంద్రాత్మజా
వనితాస్వాంతజలేశయార్కయను కం•వంగావలే పాకశా
సన ముఖ్యామరవారసన్నుతమహే•శా సర్వసి... 95

మ. కనకంబొక్కటియే తదంశమునఁ ద•ళ్కుల్గులుల్కు భూపాళియా
గొనబొప్పంగ ననేకరీతుల జగ•ద్గోళంబులంగల్గు జీ
వనికాయంబుల వెల్గుచుందువుగదా • భవ్యాత్మ క్షోణీధ్రరా
ట్తనయా చిత్తసరోజషట్పదమహా•త్మా సర్వసి... 96

మ. ఒకచందుండు ఘటావళిందవుల నె•న్నో బింబముల్దోఁచు మా
డ్కికి నీ రేజభవాండ భాండములఁ దం•డ్రీ వెల్గుచుం దీవటుల్
సకలాత్మ యటుగానిచో విపులవి•శ్వంబెల్ల రూపొందునే
యకలంక స్థిరదేవతార్చితగిరీ•శా సర్వసి... 97

మ. పరితాపోద్ధత కీలిదేహమును గా•ల్పంజాలు వేయేల యే
పరితాపంబొక లెక్కమేని నను నా•పాదింపఁగా నీక సా
దరదృష్టింబరికించి యేలుకొనుమా • తండ్రి పరంధామ యీ
శ్వరశూలాయుధహస్త దేవనుతశ•ర్వాణీశ సి... 98

మ. జలజాతామృత మానుతేఁటి తరపు•ష్పంబుందమిం జేరునే
విలసత్పూర్వభవార్జితంపుసుకృతి • న్విశ్వేశ నీభక్తియం
దలి సంపూర్ణపు సౌఖ్యసంపదల నొం•దంజాల కన్యంబులన్
దలఁపంజూచునె నామనంబు మునిబృందస్తుత్య సి... 99

మ. అనపాయవ్యవసాయజీవనము యో•గానంద గుర్వంచితాం
ఘ్రివితాంత వ్యవసాయసేవనము యో•గిధ్యేయ వాణీదయా
వనము న్సత్కవనంబు గాంచితి భవ•త్పాదాబ్జభృంగంబనై
వినుతింప న్మతికంబొనర్చితిఁ గృప•న్వీక్షింపు సిద్ధేశ్వరా. 100

మ. లయభీము న్నినుఁగొల్వరాదనుచు స•ల్లాపింతురే భీరు ల్జడుల్
లయముం జల్పుదువన్న భీతినిగదా • లక్షింప రక్షింపనై
లయముంజేసి యజస్రము త్రిపదవా•ల్లభ్యంబ యీవే యుమా
ప్రియ యీవే యొదియంతకన్నను సుఖ శ్రీమూర్తి సిద్ధేశ్వరా.

సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీరంగేశశతకము.

సీ. శ్రీరుక్మిణీదేవి • చెలులతోఁ గూర్చుండి
ముచ్చటింపుచునుండ • వచ్చినీవు
సడియుడిపి సరవి • సన్నఁ జేసి కనుల్
మూసిన ముదితయు • ముసిముసినగి
చేతులఁదడిమి నె•చ్చెలులార గోవర్ధ
నాచల కమఠకి•ణాంక కఠిన
తరము లివి కఠిన•స్థలులకే తగునన
నీ నవ్వుఁగనుఁగొని • నెలఁతలునన
గీ. నౌనె నిజమని చనుమెట్ట•లంట నీదు
చాతురినుతింప మాఁబోటి • జనుల కెటుల
నలవియగునని నీకు జో•హారొనర్తు
వీతభవతృష్ణ రంగేశ • వేణుకృష్ణ. 1

సీ. అడుగు హొరంగెల్ల • జడజాతములకిచ్చి
జంఘల సొంపుల • శాలిగర్భ
ములనింపి తొడలసొంపుల • నఁటులకొసంగి
కౌను డాల్వాలి జడ•కానికిచ్చి
బాహుల నిగ్గు ని•బ్బరమెల్ల మన్నుమో
సెము ద్విజిహ్వునకిచ్చి • జిగిమొగంబు
సొగసు గురుద్రోహియగు • వానికొసఁగి మై
చాయ పయోవాహ • సమితికిచ్చి
గీ. యిది తెలియఁబో దెవరి•కని మదిఁదలంతొ
తగదుసుమి నన్నుఁగావక • తక్కితేని
రవ్వ సేయుదు నిది గట్టి • రచ్చఁ బెట్టి
వీతభవతృష్ణ రంగేశ • వేణుకృష్ణ. 2

సీ. నెరిపిరిసరులు నీ • కురులు బట్టెనుగద
మణికిరీటమున నీ • మస్తకంబు
తా కట్టిబడియెగద ర • తనపుంబాహు
పురులు నీజిగి బాహు • వులనుగట్టెఁ
గద నీ వెడఁదఱొమ్ము • గమలామహాదేవి
యాక్రమించెనుగద • యవనిధరము
సుధ వేగఁ దెమ్మని • సురలు నీవీపున
మోపిరిగద యెంత • మోసపోతి
గీ. వకట యిటువంటి నిన్ను వే • దాంతములు స్వ
తంత్రుఁడవటంచుఁ బలికిన • దారిఁజూడ
నర్థభేదంబు గనపడు • నయ్యెమాకు, వీత... 3

సీ. చల్లనితావులు • చల్లు మేల్మల్లెమొ
గ్గలదండ యురమునఁ • గ్రమ్మ విరియ
ఘుమ్మని వాసనల్ • గ్రమ్ము గులాబీవి
రులసొంపు నెరులపెం • పు లలరింప
ధగధగమనీవి • జిగి గొను నూనూగు
మీస మత్తరుపూఁత • మెఱుఁగులీన
నున్నగన్పడు మువ్వ • జున్నము ల్వ్రేడలి ము
త్యంపుచౌకట్లుడా • లలవరింప
గీ. బల్కుసుం బాహౌరంగు ని • బ్బరపురంగు
లీను సన్నంపుదువ్వల్వఁ • బూని నీవు
సఖులతోఁ గూడి క్రీడించు • జాడఁ దలఁతు, వీత... 4

సీ. మాతల్లి వైదర్భి • మమత నీగుణగణ
ములు బలుమారు బు • ధులవలన వి
ని దినదినమునకు • మదనుని వెతలను
గని నీదుభావముల్ • గాంచి మదిని
సొగసున కుప్పొంగి • సొక్కుచు మాటికి
మొక్కుచుఁ దాలిమిఁ • గ్రుక్కుచు నహా

హా యిట్టి ప్రాణేశుఁ • డబ్బునా నావంటి
నెలఁత కటంచుఁ గ•న్నీరొలుకుచు
గీ. నెచ్చెలులకైనఁ జెప్పక • నిజశరీర
మెల్లఁ జిక్కఁగ నిలువెల్ల • వెల్లబారె
నెంతమోహనమూర్తివో • యెఱుఁగమయ్య, వీతభ... 5

సీ. గందంపు మైపూఁతఁ • గవిసి జాల్కొను లేత
చెమ్మటలేమొకో • చెలియ కిపుడు
కమ్మతెమ్మెర వీవు • గ్రమ్మఁ గందినరూపు
కనుపట్టు నేమొకో • కాంత కిపుడు
అపరంజినెరచాయ • లడరెడు వేడిమి
వెలిమాఱు టేమొకో • వెలఁది కిపుడు
కాటుక కన్నీటఁ • గరగి జారనతేట
చూపట్టు నేమొకో • సుదతి కిపుడు
గీ. అన్నిటికి నేడు చెలులార • చిన్నవోయె
ననుచు నాసామి నిను మన•మందుఁ దలఁచి
కుందు రుక్మిణిఁ గని జాలిఁ•గొనిరి చెలులు, వీతభవ... 6

సీ. వెలిదమ్మిపూరేకు • తెలిడాలుగల వాలుఁ
గనుదోయి రేనిద్రఁ • గాంచమరచె
మృదులకేతకిపత్రి • సదృశమా నెమ్మేను
హంసతూలికసెజ్జ • లంటమరచె
నిండుచందురునిపై • దండెత్తు నెమ్మోము
మృగనాభితిలకంబు • సొగసు మరచె
తేఁటిపై చకచకల్ • దాటు చక్కనికురుల్
గడిదేర గుడియోర•ముడుపు మరచె
గీ. వినుడు చెలు లిది గోపాలు • విడనిజాలు
యకటకట యేమిబోధింతు • మనుచుఁ బలుకు
చెలిపలుకు వించు రుక్మిణి • సిగ్గుగాంచు, వీత... 7

సీ. పైదాననా నీవు • భావంబు దాచఁగాఁ
దగదు నాతల్లి నీ•దాననమ్మ
నీవెత ల్గని నీరు•నిల్వఁగా నుంటినే
తేటతెల్లముగాఁగఁ • దెలుపుమమ్మ
నీవు నాకును మనం•బేక మే గదవె న
న్నెఱుఁగవా యిటు దాచ•నేలనమ్మ
ముగ్ధ లెందఱు లేరొ • మొగమోటమెందరో
యీరీతి మే మెందు • నెఱుఁగమమ్మ
గీ. తరుణి నీనోటఁ బలికింపఁ • దరముగాదె
తెలిసెఁ గృష్ణునిపైఁ గూర్మి • కలదుగదె య
టన్న వినుదాని సిగ్గెన్న • నలవిరన్న, పీత...

సీ. మొగమెత్తనీని యీ • తొఁగతేని నులుకింపఁ
దొయ్యాలి వేనలి • దువ్వవలదొ
నడువనీయక రోస•పడు నంచ నెడలింపఁ
జెలువధారావాటి • మెలఁగవలదొ
పలుకనీయకఁ గూయు • చిలుకల నులికింప
నతివ మై సాంకవం • బలఁదవలదొ
చూడనీయక కోల • లాడించు మరుఁ డుల్కఁ
దెరవ కుంకుమబొట్టు • దిద్దవలదొ
గీ. యేమి తెలియని చెలివిగా • కేము నేగి
జేయుదుమటె యటన్న నె•చ్చెలుల కువిద
యుత్తరంబీదు నినుఁబట్టి • యుడుకుపుట్టి, పీత...

సీ. పున్నమరేతేని • వెన్నెలల్ తిన్నచో
నేల నాడుదమమ్మ • బాల రావె
కేళికావాపికా•కూలమ్ములను జక్రి
మూలఁగవగూర్తము • ముదిత రావె
చంద్రునికాంతిచే • సగమైన చుక్కల
గణియింత మిప్పుడు • కాంత రావె

యాకొన్న మనచకో • రాళి కాకలిదీర
లేవెన్నె లిడుదము • లేమ రావె
గీ. యనుచు లాలించు చెలు లిటు • లనుడు వినుచు
వత్తు రానను మాను కో•పంబుబూను
రమణి నినుమదిఁగూర్చి వి•రాళిఁజేర్చె. వీత... 10

సీ. పలుమారు పిలిచినఁ • బలుకదు బింబోష్ఠి
యగుటచే నేమొకో • యతివలార
నెమ్మోము జూపదు • నీరేజమృదుపాద
యగుటచే నేమొకో • యతివలార
పాడదు పంచమ•ఫణితిఁ బల్లవపాణి
యగుటచే నేమొకో • యతివలార
నగఁగుల్కు మనతోడ • నగదు కోకస్తని
యగుటచే నేమొకో • యతివలార
గీ. యనెడు చెలిపల్కు శుకపిక • వనజవైరి
చంద్రికావ్యంజకంబయి • చెలియ కకట
కఠినతరమయ్యె నినుఁగూర్చి • కాకఁజేర్చె. వీత... 11

సీ. చుట్టుజరీమేల్కు•సుంబంపురంగున
న్నంపుటోణీపింజె•నాగరికము
మీఱు సగమువిప్పి • మేనఁగప్పి మిగులు
సగమును పింజపా•టుగను సవ్య
గళపార్శ్వమంటి లేఁ•గవళిపత్రమువంటి
వీపున జీలాడ • పిఱచి మడమ
లనుదొట్టుపంచక•ట్టునమణీమయము
లగు పాదుకలనంటి • యంటనట్లు
గీ. వెలయు లీలావిహారంబు • నలుపు నీవు
మోహమునఁ గన్నులంగట్టి • ముదిత బిట్ట
తనము విడనాడు ననుగావు•మనుచు నేఁడు, వీత... 12

సీ. అపరంజియట్లు ము•త్యాలబల్కుంతితో
నంటి తరతరము • నమరుచును జి
లుగుకెంపులరవ జె•లువుగ్రుక్క సరులు
చంద్రహారంబులు • చాయలీన
మేన గంధమలంది • జానుగా నొరగా
ముడిచిన వెగముడి • మొల్లసరుల
దట్టముగాఁ జుట్టి • దాన్నిపై శిఖిపింఛ
మలరిచి యమునావ•నాంతరమున
గీ. మెలఁగు నీమురళీగాన • మృదులరీతి
నాతి వినురీతి భ్రమియు న•రాతియగుచు
మదనుఁ డెదఁగ్రాచఁ బుటూచ • లెదిరివీచ, వీత ... 13

సీ. నెమ్మోము చెలియయ్యు • నీరజవైరి వి
రోధింప నకట స•రోజతతియు
నైనను గనికర•మూనదు మరినేరి
తోడ నేస్తముగట్టు • తోయదంబె
శిఖిని బేర్చెచి దాఁ • జీదరఁజేయు న
మీారమైనను హాంస•నారమైన
నయయొ ధైర్యము జెప్ప•నది లేక మీాఁదిమి
క్కిలి తాపకారులై • గినియసాగ
గీ. సామి వైదర్భి నిను మాన•సమునఁ దలఁప
మిత్రులె శత్రులైరి తఁచ్ఛత్రు లెటుల
మిత్రులగుదురు చాలు నీ•మీాఁది ప్రేమ, వీత ... 14

సీ. తలిదండ్రులకుఁ దెల్ప • ఫలసిద్ధి యగుఁగాని
పరిభవింపుచు లజ్జ • పలుకనీదు
ఊరకే పరిహాస • మొనరింతు రక్కట
చెలులచేఁ జెప్పింప • నలవికాదు
యిది చెలుల్ గ్రహియించి • రేమొకో రుక్మితోఁ
దెలపిరా విఘ్నంబు • గలుగఁజేయు

నూరకుండెదనన్న • ఘోరాశుగములచేఁ
గ్రాచెడె పూవుసిం•గాణిజోదు
గీ. అన్న చేదీశ్వరునికివ్వ • నన్నుఁ దలఁచె
నెటులనుండునో యిఁక దైవ•ఘటన యనుచు
నకట మదిఁగుందు నిచుఁగోరి • నాయెనూరి, వీత ... 15

సీ. కృష్ణాయనుచు ముద్దు • కీరంబుఁ బలికింపు
మంచుఁ జెల్మిని చెలి • ననునయించు
నల్లనివాన్కినీ • నాతిమోహించెనే
యని నవ్వ చెలియపై • నలగి చూచు
గొల్లలేమాదురో • కోమలి వెన్నదొం
గను దెచ్చునని నవ్వఁ • గనలియుడుకు
వికటంబులకు నేమి • వెలఁదులారా నన్నుఁ
జీదరించకుఁ డంచుఁ • జెలులఁబల్కు
గీ. నౌర నాసామి నిను మాన•సాబ్జమందు
నిలిపి నీసుగుణంబులె • దలఁచుగాని
వేరె యొకమాట వినదు నిం•డారఁ గనదు, వీత... 16

సీ. మోము చందురునంటి • ముంగురుల్ శ్రీమవారి
గురిసి కార్మొగు లనఁ • గొమరుమిగుల
నూర్పుదెమ్మెరలచే • నుడికి కెంచలిరాకు
వంటి వాతెర వసి•వాడుజూప
ముఖవాసనాలోభ • మునఁ గ్రమ్ము భృంగసం
తతి నాసగ్రాచెఁగాఁ • దలఁగిపోవ
మైదట్టముగఁ బూయు • మంచిగందము పరి
తప్తమై తుకతుక • ధ్వనుల నుడుక
గీ. సఖులమరపించి మదిలోన • సంభ్రమించి
విడవితమి సాయమూని ని • న్వెతుకఁబూని
విపినములపొంత కలకాంత • వెడలెనంత, వీత ... 17

సీ. తుమ్మెదల్ జుమ్మని • గ్రిమ్మఁ దెమ్మెరలు
దుంముమ్మని గమ్మపూ • దుమ్ముఁ జిమ్మ
కమ్మవిల్దొర నలొమ్మ • గమ్మలఁ గ్రుమ్మ న
మ్మలజడి యలజడి • కలవడి తుద
నెదయదలు చిలుక • రొదలు కలఁచలింపఁ
గోయిలమూఁకలఁ • గొండకూఁక
ల బలుధాకల యొడ • ల వెడలు కాకల
కాకలకంఠి చీ • కాకు పడుచు
గీ. ధృతివిడుచు తడబడుచు నే • గతి నడచు ను
పాయమెఱుఁగ కపాయము • బావనేర
దకల చెలినేలఁదగదేమి • యపుడె సామి, వీత... 13

సీ. మంజీరశింజాన • మాహూతకలహంసి
గదలనీ నన్నట్లు • కాళ్లఁ బెనఁగ
బహువర్ణసుమరజః • పటలచిత్రితకీర్ణ
కేశబంధము కేకిఁ • గేళిసేయ
నవనవోదితవ్రణో • ష్ణవిసర్పనిశ్వాస
మలరుజొంపములసొం • పవఘళింప
నక్షికజ్జలమిశ్ర • తాశ్రునిమ్నగ కుచా
భోగఘట్టమునుండి • పొంగిపార
గీ. నిను వెతుకఁగోరి వనిఁజేరి • ననఁ గటారి
దారి నారినెగయుపూలఁ • గోరి దూరి
శౌరియని తల్లడిలు మాదియొ • యూరి యోరి, వీత... 19

సీ. మొగమెత్తనీదాయె • వెగటుతమ్ములపిండు
పలుకనీదాయెరా • చిలుకదండు
గళమెత్తనీదాయె • గండుకోయిలధాక
సొలయనీదాయె వే • సోకుమూఁక
చేయెత్తనీదాయె • చిగురుటాకుబిడారు
కాంచనీదాయె వేఁ • గల్వబారు

తలఁచు త్తసీదాడు • మలినాళిరింఛోళి
కదలసీదాడు దు•ర్మదమరాళి
గీ. కలికి గిరిపడి గిరిజడి • కాక పోక
నిలువలేక యనోకహ • నిబిడకేళి
గహనకుసుమపరాగశ•ర్కరఆదరల, పీత... 20

సీ. నింహారఁ గాయు రే•యెండవేడిమిఁ గాఁగి
పదము పెట్టగనీని • పచ్చికవ్వ
రపుదిప్పలను జెప్ప•రాని నొప్పి ధృతిద
ప్పి విరాళిఁ దోఁపద•ప్పి బలుదప్పి
గొని చివురుల మంట•లని దేఁటులను పొగ
లని దెమ్మెరలఁ జిమ్ము • ననలధూళి
కణముల విస్ఫులిం•గములని తలఁచి
హా వనవహ్ని చుట్టెడు • ననుచుఁ దేఁటి
గీ. రొదలు వినుచు ననలకీల • రొదలెయనుచు
జడుపుగొనుచుఁ జెలియపైకి • వెడలు తెరవు
గనుచు నకటకటా యెంత • గాఁగెఁ గాంత, పీత... 21

సీ. గదిసి పైనుండు తు•మ్మెదపిండనెడినల్ల
ని దిరిసు దొడిగి బ•లొమ్మదలు మొదలు
కొని బాఁకు దీవియ • లనెడి డబ్బాడవా
ల్బిగియించి విరహుల • బీరమడఁచు
మావులపేరి య•మ్మరుని బందీకొమ్మ
లనుకైల చివురాకు•లను ననీల
గరపుకాల్బెట్టు చిం•చ్చురకీల్లు చెవిరంజి
కపు బలుగుడకలు • గలుగు పికము
గీ. లను దుపాకుల నెగయింపఁ•గను వెడలెను
జోడుగుండ్లన కణకణా•లాడు కనులు
గనుచు మదినెంత వలవంతఁ • గనెర కాంత, పీత... 22

సీ. తనదు కెంగేలుగ • ననుగని చివురుల
ని గవయు కోయిల • లగముల తన
నెమ్మోము తమ్మియ • ని దలఁచి గ్రిమ్మతు
మ్మెదలను తన కెంపు • పెదవి బింబ
మనిపచ్చ రాచిల్క • లను తనకీల్జడ
ఫణియని బరతెంచు • బర్హిణముల
నారామ మేనేల • దూరితినను దూరు
నన విలువవిభూష • ణములు చిక్క
గీ. బడిన ముత్తెంపుసరులును • బారదోలె
గాక లేకున్న నేమానో • కలికిమిన్న
వీఁడెఱుఁగదయ్యె భామ నీ • మీఁది ప్రేమ, సీత ... 23

సీ. బంగరుమెఱుఁగు దు • వ్వలువతోఁ బిక్కల
దాఁక జీలాడు ని • ద్దాహారంగుఁ
జేతులతోఁ గెంపు • వాతెఱ తెలిగప్పు
చిఱునవ్వుతో దావ • చెలి చెలువము
డిగిచికొన్నట్టి నె • మ్మొగముతో నీలంపు
దిమ్మల నిరుకేవ • దిద్దినట్లు
వాడరు వెడఁదకొమ్ము • తో నవలామూక
బొడువ మరుం డోర • వెడలిచిన క
గీ. టారి జిలుగుమిటారపు • టారుతోడఁ
గన్నులనుగట్టి యావెన్కఁ • గానరాక
నింతినలయింప నీచిత్త • మెట్టులోర్చె, సీత ... 24

సీ. చనదు ననువిడచి • చనఁగ నిలునిలుము
నినునెనరున సామి • వనుచు నమ్మి
కొని మదినలబడి • గొని వెడవిలుదార
విడచునన జిలుకు • జడికిజడిసి
కలువరాయనికిఁ గో • యిలలకుఁ దెమ్మెర
లకుఁ జిలుకలకు......నోడు

గవలసె నీక నను • గవయుకున్నఁ దాళఁ
జాల నీయాన వే•యేల ననుచు
గీ. విరిబోదలబారు వేమారు • వెతకఁజేరు
వెతకివేసారు నొకమాఱు • విధిని దూరు
వెలఁది నీతీరు గనఁగోరు • వెతలమీఱు వీత ... 25

సీ. తళుకుటనంటి బో•దెలలోన తననీడ
గని యబ్బి తెవటంచుఁ • గౌఁగలించు
కమ్మపూటీరాలఁ • నెమ్మిపింఛముఁగాంచి
డాగెదాయనివేగ • డాయనేగు
విరిసంపగులసొంపు • నెరికగా మదినెంచి
నాయాన నిలుమంచు • డాయఁబోవు
నగిసె పూనెరివిప్పు • జిగినీదు మొయిగాఁగ
మదినెంచి భ్రమమించి • గదియఁబోఁడరు
గీ. భ్రమవదలి మరల భ్రమియును • భ్రమిసిభ్రమియు
నొక్కఁగడె భ్రమవదలక • యుండు చెలువ
పొలువు నలవుగొలువు తలఁ•పుదులుభ్రమిఁక వీత ... 26

సీ. నచ్చెలియొక తె య•న్నెలతఁగావకనంత
వెతకివేసారియో • వెలఁదులార
వేగ రారమ్మ యే•మోగాని మనబాల
యిచట లేదమ్మ నే•నేమి సేతు
ననిపల్క నింతింత • యనరాని దిగులుఁబ్బ
నందఱు జనుదెంచి • యచటనచట
లోయుచు నటఁ గల్వ•రాయని రాబాట
నడుగుఁ జెమ్మటడాగు • లగుటఁగాంచి
గీ. యివి మిటారియడుగు జిన్నె•లి త్రైరవున
నరిగ కేళీవనముజేరె•నమ్మ యెంత
మోసమని తల్లడిల్లి రా•ముదితలెల్ల వీత ... 27

సీ. చలువ తారాబాట • జనివువ్వుదోట జా
వ్వని నచ్చటచట న•వ్వనితళ్లు
కమనీయవానంతి • కాకుంజపుంజంబు
లను గుంజదళిపుంజ•లలితచూత
కలితకాంచనడోలి • కలవలమాన మా
రుత మందగమన చా•రుతర సమహ
రాగస్రైకతముల • రతితేనికత్త్రశా
ని గొలగొలలబాలు•వగు నెలవుల
గీ. వెతకుచు లతాంగిగానక • వెఱపుబొడమి
గడమిగులు వల్లఁకంబుల • నొడలుబిడలు
పడగఁబడుపాట్లు మాబోంట్లు • బలుకుటెట్లు పీత...

సీ. కనుఁగొనక్వడలు వెచ్చనినీరువయిజారి
తళుకుఁజెక్కుల ధగ•ద్ధగలుమాన్ప
విరితుమారమున ధూ•సరమైననెరిగప్పి
మోముమిటారంబు • మోటుపరుప
జారుపయ్యెదనంటు • చలువకాటుకడాగు
గుబ్బచన్గవనీటు • గొదువసేయ
తనువంటి చిమచిమ•మ్మనుగెంద లిరుటాకు
వెగరుటావిరిమేని • జిగియడంప
గీ. తెమ్మెరలు రేచ పొగలయి•దేంట్లుదోఁచ
భగ్గుమను మెట్టుదమ్మి పూ•టగ్గిడాయు
చెలిగని నఖుల్దటాలున • నలమికొనిరి పీత...

సీ. అమ్మమ్మ యెంత సా•హసము జేసితివమ్మ
యిఁకనిను నమ్మరా•దెంతమాట
దెచ్చితివమ్మ యి•త్తెఱఁగులేనాఁడు మే
మెఱుఁగ మేవెతకెద • మేమిదెలను
మముఁగికరించి యా•మనియును పులిబొంచి
యున్న యీవనికి ని•న్నొంటిదెచ్చు

నలవిరిసింగాణి • గలజోదునను నీయు
మను దగలకపోదు; • సుదతి గవలి
గీ. వేగ రావమ్మ నీమనో • విభుని దెత్తు
మమ్మ యిది నమ్ముమమ్మ మా • యమ్మ యనుచు
సఖియ లిటుదూర చెలిబిక్క • జరిచెనోర వీత... 30

సీ. మొలకగాడ్పులకాక • చెలిమోము ఝుమ్మని
పన్నీరుచిలుకరే • పడఁతులార
పూఁదేనె తుంపరల్ • పొలఁతికన్నులదూలె
ననుబైఁటనొత్తరే • వనితలార
యనఁటివేడిమిదాకి • వనజాక్షి మైగందె
వేగమంత్రించరే • వెలఁదులార
యలరుటేనికలు నె • చ్చెలి పాదములఁజొచ్చె
మెల్లనదియ్యరె • మెలఁతులార
గీ. మనము చెలిమిన్న నీపట్ల • గనకజన్న
సకట మఱిమెంత మోసమా • నోయటన్న
చెలుల కలవిలలట్టె నీ • వలనఁబుట్టె వీత... 31

సీ, ఘోర వాతాంకూర • హాతక మాసఖియ మైఁ
గందించెదా యని • గసరువారు
శుకమ మానకియ్యపై • మొక మెట్టనగఁ జేసి
బెదరించెదా యని • గదుమువారు
కోయిలా తుదకు నీ • కూఁతఁబట్టుట చెలి
నలికింపనా యని • యాడువారు
తుమ్మెదా దుశ్శకు • నమ్మ కోమలి నేచఁ
దొడరితివా యని • దూరువారు
గీ. త్రోవఁబడు పుష్పాదుల దవ్వు • దుడుచువారు
జళుకుఁ గొనవలదని చెలిఁ • బలుకువారు
నైరి సఖులెల్ల లలన నిన్నోరుకతన, వీత ... 32

సీ. పువుటందలములోన • బువుఁబోణినుంచి మో
తపడంతు లంత మోౢ•తలనడంచి
తత్తరంబుగ నెత్త • నత్తటి బిత్తటి
యొకతె ముందేగి ఛీ•తోచితోప
చారోపహారంబుఁ • గూరిచి తెచ్చి యు
త్తోయజాక్షికి దిగ•దుడిచి పార
వైవ బిరాలున • వనితలు చెలి నంద
లము డించి యెలమి క•ల్యాదొరచట్ల
గీ. మెట్లవెంబడి మెల్లన • మేడఁ జేర్చి
చలువ లెన్నేనిఁ గూర్చి ర•చ్ఛించలాత్మి
కౌర యిఁటువంటివింత లెం•దైనఁ గలవె, వీత... 3
సీ. హారముల్ బరువాయె • నన్నంబు వెగటాయె
చెలులపై యలుకాయె • చీదరాయె
తలఁపులు మెండాయె • వలవు మిక్కుటమాయె
చలువలు సెగలాయె • నలసటాయె
నిముసమే యుగమాయె • నెమ్మేను సగమాయె
నిలుపు లేదాయె బ • ల్సొలపులాయె
కన్నీరొలుకుటాయె • కలవిలపాటాయె
వెఱపు మోపాయె పై • వెల్లనాయె
గీ. మరునివగలాయె వగలెల్ల • మంతమాయె
వలచు ఛౌలి నిటువలె వెత • గొలిపి తౌర
సరసుఁడవు లేర నీమేలు • చాలుఁజాలు, వీత... 3
సీ. ఇవ్వాడె బంగరు•దుప్పటి వలెవాటు
తోఁ దళ్కుఁగన్నుల•తో వలంతి
నగవలరేడు ముద్దు•మొగముతో నెలమికాఁ
డిటవచ్చెనమ్మ ద•న్నింతఁజూచి
గడుసిగ్గునను వరు•గిడు నన్ను వెన్నంటి
వడి కౌఁగిటనుబట్టి • తొడనిడికొని

చెక్కుముద్దాడి చు • రుక్కున నామోవి
నొక్కి చొక్కించి దాఁ • జొక్కిచొక్కి
గీ. మెచటి కేగెనో కానరాఁ • డేమిసేతు
సకట కలయని తోఁచుఁ గా • దనియుఁ దోఁచు
నంచు వలవలఁ గన్నీరు • నించుఁ జెలియ, పీత ... 35

సీ. ఏమరి యేనున్న • యెడఁ దటాలున వచ్చి
మోహనాంగుఁడు కను • లూమ్సినట్లు
మూసిన నెఱిఁగియు • ముదిత నొచ్చెనో విడు
విడు మమ్మ యనుచు నే • వేడినట్లు
వేడిన మారెల్గు • తోడఁ బ్రాణేశుండు
విడక పేరేమని • యడిగినట్టు
లడిగినఁ దెలసి యా • నౌనంచు నగి వీడి
తటుకునఁ దల్వార • దాగినట్లు
గీ. దాగి కడకేగునెడ నన్నుఁ • దమ్మివేఁయ
నొచ్చ వగసేయ దయఁ గౌఁగి • లిచ్చినట్లు
నెలఁత కలవచ్చెనంచుఁ గ • న్నీరునించు, పీత ... 36

సీ. అచ్చుగా నీరూప • మంతయుఁ బొడకట్టి
ముకురభావము జూచి • మోహమొందు
నొంది దిగ్గున లేచి • యూరకే చీకాకు
పడి నెచ్చెలుల పైకి • వెడలఁదోలుఁ
దోలి యద్దపుఁదల్పు • లోలి బిగించి పై
పట్టుతట్టపు తెరల్ • బారుసేయుఁ
జేసి యాభావంబు • చెక్కులు ముద్దాడి
కడుఁబ్రేమ బిగ్గనఁ • గౌఁగిలించుఁ
గీ. గౌఁగిలించి రొంకింత లోఁ • గరగుఁ గరిగి
పల్కవేమను నని పల్కు • నుల్కులేమి
కక్కటక్కట చెలి వెక్కి • వెక్కి యేడ్చు, పీత... 37

సీ. కూసెదు కనులెఱ్ఱ • జేసెదు చాలవో
  కాకితాపులు నీకు • కోకిలంబ
అఱచెదు మొగమెత్తి • పఱచెదు తెలియదో
  తుళ్ళు మీఱావారిసం • కెళ్ళు శుకమ
యార్చెదు ఱెక్కల • ల్లార్చెదు దొరుకునో
  కాంచనం బింతైన • చంచరీక
గ్రిమ్మెదు విరి • దుమ్ము జిమ్మెదు గానవో
  చిలువవాచిచ్చు ద • క్షిణసమీర
 గీ. రామ ఘనసాంకవామోద • హేమగాత్రి
  కాలఫణివేణి మాచెలి • గాఁగ నెఱిఁగి
  తొలఁగ మేలని రపుడు నీ • చెలియ ఱాలులు, వీత... 38

సీ. సత్వసంపత్పూర్ణ • జనమైన వెలిదీవి
  మఱికొంత తేజంబు • నెఱపినావు
దివిషదీశానాత్మ • భవసామ్యసంప్రాప్తి
  జనులు పోయగ మున్న • నొనరినావు
తతసహస్రకరప్ర • తాపంబు చల్లార్చి
  యత్యర్జునాభిఖ్య • నలరినావు
శరపుష్టి కైలాస • ధరమందుఁ జూపి యా
  ముక్కంటితల కాలఁ • ద్రొక్కినావు
 గీ. కనుక నిను రావణున కెక్కు • డనఁగవచ్చు
  నో నిశాచరరాజ య • నూనతేజ
  యనుచు శశిదూఱుఁ బలుమారు • నతివ చారు, వీత ... 39

సీ. పలుగాకిమూఁకలో • పలఁ బుట్టి పెరిగి బ
  ల్గండుమీఱినది నీ • కాల్బలంబు
పుడమి నాకులపాటుఁ • బొడమించిగద మధు
  నాముందు నీదండ • నాయకుండు
గాను గాడించినఁ • గాని వీడదుర యా
  తొంటిగుణంబు నీ • తుంటవిల్లు

శ్రీ రామా!

# శ్రీ రఘునాయకశతకము.

ఉ. శ్రీకమనీయపుణ్యశుభ•లీకబలీనికేతనమాలికా
లీకబలీకృతాంఘ్రియుగ•లీయుగలీయుగశీర్షలోకపా
లీకబలానిలాస్త్రకద•ళీకదళీకదళీకనైజదే
నాథులరుద్ధనాక రఘు•నాయక భక్తవరప్రదాయకా. 1

చ. శరధినివాసనాగపవ•శాపనిశాపతిశారదాభకీ
ర్తిరుచివికాసకాసరస•రీసృపకేతిపరీతిదైత్యజై
త్రరణవిలాసలాపకవి•ధానవిధానబుధాళిహోస్యసా
నరధశరాసచాప రఘు•నాయక భక్తవరప్రదాయకా. 2

చ. సమదసమానమానవమ•సర్వగుణప్రథమానమానవ
ప్రియదనిదానదానవస•భావిదితాశుగదానదానపూ
ర్ణమునివితానతానవవి•లాసవితాబ్ధివితానతానవ
స్నమదపదానగాన రఘు•నాయక .. 3

చ. సకల పురావచః ప్రచయ•సారమరిమ్లుచమార్గణక్షణా
దకనిధిచూషణక్షణర•దక్షిసిద్ధతదైత్యరాడ్వపు
శ్శకలతమోధ్వజభ్రమవ•శభ్రమదభ్రమణి ప్రచారునిన్
శకులవిహారునెంతు రఘు... 4

చ. కమఠఘనప్రదర్పవిజ•ఖర్పరకించిదకుంఠతాకర
భ్రమదురు మందరాద్రి తల•భగ్నఘనోద్ధితమహార్తికవ్రజ
భ్రమదపయోధితుంగతర•భంగురభంగప్లవత్రపాచారునిన్
కమఠవిహారునెంతు రఘు ... 5

చ. గగనతలాంచలస్థ శశి•ఖండశిఖాగతవారివాహలే
ఖగణభృదాత్మ భాసురవి•షాణవిసాగ్రవిషక్తభూమి ఘో
రగతి విశేషసూచితఘు•రఘుపితార్భ్యఘుకోశునిన్ బురా
ణగురుఁగిటీశునెంతు రఘు ... 6

ఉ. డింభకఘాత్యమానగిరిత•టీనికటీకృతభేదబోధక
స్తంభవిదారణక్షణశసి•తస్వనఖాంకురలగ్నదైత్యరా
డ్డంభసటాచ్ఛటాస్ఫుటిత•తారకితాభ్రనృసింహవేషునిన్
సంభృతదాసునెంతు రఘు .. 7

చ. స్వవపురితైకదేశచర•బల్యభిదత్తజలార్ఘ్యలిప్సతా
స్తవనకృదేకపాదమిత • సర్వజగత్త్రిపదప్రమిత్సతా
నవవటినైష్ఠికత్వమాన•నస్ఫుటహేతువిహారు నిన్ను మా
ణవకశరీరునెంతు రఘు... 8

చ. అరిపదవాచ్యచక్రవ పు•రర్జునబాహు సహస్రఖండన
త్వరితరుషోద్ధతప్రబల • బాహుజవర్గధనైకవింశతి
స్థిరవరశుప్రకృత్తనృప•శీర్షవినిర్మితనాకరథ్యునిన్
వరుభృగురాముసెంతు రఘు ...

చ. అరివిజయాతిదర్పిత ని•జాయుధపంచకవంచనార్ధ భా
సురశరమాత్రకృత్తసుర•సూదనశోణితసేకదోహద
స్ఫురదుకులోకశాఖవర•పుష్పయశోహృతహృన్మిళిందునిన్
నరపతిచంద్రునెంతు రఘు... 10

చ. నిజసుషమావ్రజప్రణయి•నీజనమోహనదావదాహ మో
క్ష జనకతాపశాంతి కవి•సంతతి జీవనరాజహంస భీ
తిజనక గర్జనాబ్ధివస•తీపరిపూర్తి సుకీర్తిశాలి కృ
ష్ణజలదమౌళివైతి రఘు... 11

చ. సహసుషమాస్తిలోకహిత•సంమదకృన్నిజనేత్రయుగ్మతా
భిమతివిరోధసూచిరవి•బింబ తదీయకులైకవాసదృ
ష్టివలిననిత్యకల్పితశ•శిస్ఫుటగౌరవకారి దివ్యజ
న్మగృహీమశౌరివైతి రఘు... 12

చ. హలముఖభేదబాష్పసలి•లాతితరంగితపూరబింబన
చ్ఛలపదపాతకృజ్జనక•సంభ్రమధూర్తదినేశకన్యకా
కలితవరోపగూహనస•ఖస్థలదంబరసంపరాంతునిన్
బలిబలభద్రునెంతు రఘు ... 13

ఉ. అర్యభిగీతవిశ్వజయ • హాసికృదాత్మజమాతిలోపహాం
తర్యమనాతిసాధపతి • దార్ఢ్యకరత్రిపురాంగనావ్రతా
హార్యహరోక్తి నజ్రిసుస • హాయలసద్గిరిధర్మనిష్ఠతాం
తర్యతభాగతాంగ రఘు... 14

ఉ. ప్రాణవిమోజనోద్గతవి • వత్కృతసర్వవిభేదబోధకృ
త్ప్రాణికృపాణబింబితవి • భాకరబింబమహాస్ఫురద్ధవి
శ్రాణనహేతుహోమముఖ • సద్వనికృద్ద్విజముఖ్యసౌఖ్య సం
త్రాణదకల్కిమూర్తి రఘు .. 15

ఉ. గత్వరసృష్టిపుష్టిలయ • కాలనమోక్షణలీలకై జగ
జ్జిత్వర స్త్రీపుమాకృతుల • నీమతిఁదాల్చియు మూలతద్రిజ్జ
స్నత్త్వతవాంబులంగలసి • సంజ్ఞితులౌనజవిష్ణురుద్రులన్
దత్త్వమునీవెకావె రఘు... 16

చ. విభవములెల్ల నీవె యని • వేశిపదంబులఁ బ్రాకుభక్తులన్
శుభదకరంబులందిగిచి • చొప్పడఁ గన్నులఁగప్పికొంచు నీ
వభిమతివిూఱ శీర్షపద • మంటఁగఁ జేతువటండ్రు నీయనూ
నభువనకాయమెంతు రఘు ... 17

చ. బలువగు నవ్వసంతమున • వహ్నులకుం బరిచర్యఁజేసి య
జ్వలు తరివేల్పుమాత్రమున • సంతసమెంతొకొ నీకుమాపునం
జలజలరాలు బాష్పములు • సంతతధారగ నిన్ను నెప్పుడున్
దలఁప మరెంతయొకో రఘు... 18

చ. మలినసువర్ణభూషలను • మాటికిమాటికి తెల్పితోమి బ
ట్టులమినయంగముద్దుఱుఁగ • సంతమునం గరగించిచేసిన
ట్టులు పలుమాఱుశిక్షలఁ గ • డుం జగము న్విమలంబొనర్చుచున్
బలుమరు సృష్టిఁజేతు రఘు... 19

ఉ. పాపము [illegible] శింపఁగ నా • పాప [illegible]
నోపను చంచలాత్మ [illegible] నో [illegible]
ప్రాపిత తాపవేదనకుఁ • బో [illegible] గేహి [illegible]
నాపటుసచ్చరిత్ర రఘు... 20

ఉ. నేరము లెంచి నన్నిలువ • నేరము నీమహిమంబులుం గడుం
దూరము లన్యుల న్నరయ • దూరము చెప్పఁగ నేల నింక నీ
వారము నీదుభక్తజన•వారములం గరుణించి బ్రోవఁగన్
భారము నీదె సుమ్ము రఘు ... 21

చ. దురితములన్నియుం దొలఁగఁ•ద్రోసి ననుం గరుణింతువంచు నే
నరసి నిను న్మదిం దలంచి • యంజలిఁ జేసి నుతించి వేడఁగా
నరమర సేయ నీకుఁ దగ•దయ్య వహింపఁగ దయ్య వేగ న
న్నయ్యనఁ బ్రోవుమయ్య రఘు ... 22

ఉ. బన్నములన్నియుం జెలఁగి • పారఁగ నిర్మలమైనభక్తితో
నెన్నఁడు మాతునో నతుల • కెక్కుడు మోదముఁ గల్గఁజేయుచున్
బున్నమ చందురుం గెలచి • పోల్చిన నీవదనారవిందమున్
గన్నులఁ గన్వదీర రఘు ... 23

ఉ. రోయక పాపకూపములఁ • ద్రోయక పాపము చిత్రగుప్తులన్
వ్రాయకయుండ నన్ను నెడ•బాయకయుండుము పుత్రవర్గముల్
డాయకయుంటఁ దండ్రిలకు • లాయకవే యిఁక నేలపంతమే
నాయకలంకఁ బ్రోవు రఘు... 24

ఉ. సేమమెఱుంగ నీహృదయ•సీమగ ణుంగ మహోత్సవంబులున్
నోము లెఱుంగ నేవగిది•నోగని రంగ యఘావలంబు పే
రామ దొరంగ నీదగు ద•యాబ్ధి శరంగ పరంపర స్దగన్
ధామమొసంగి నీవె రఘు... 25

ఉ. శ్రీవనితాధరిత్రు లిరు•గ్రేవల సేవలొనర్ప శేషుపై
రావణుబాధచే మిగుల • రావమొనర్చెడి వేల్పుప్రోవుకుం
దావలమై భయాంబునిధి • దాఁటెదనంచు దయానుభావమున్
నావ యొనర్చితీవె రఘు... 26

ఉ. ఆదివి జాలికింబరగ•నాదివి జాలికి సూత్రమైన నీ
పాదయుగాబ్జముం దశర•థావని భర్త యొసర్చ వానికిం
గాదిలిపట్టివై పొదలు•గాదిలకించి ప్రతిజ్ఞతోడ బల్
నాద మొనర్చితీవె రఘు .. 27

ఉ. వానరులై జనింపుఁడని • వాసవముఖ్యుల కానతిచ్చి దే
వానరదేవభావము ధ్రు•వంబుగఁ గాంచ మదిం దలంచి వే
వేనలురూపులొంది పృథి•వీపతిపత్నులకుం జనించి స
న్మానము నొసంగితీవె రఘు... 28.

చ. జనిమరణోదయ ప్రభృతి•షడ్విధ భావవికారశూన్యుని
న్ననుఁ గొనఁజాలమే మనియె•గాక యసంగవిశుద్ధబుద్ధ ని
త్యనిరతిశాయి పూర్ణమహి•తాకృతికి న్విధి ధేంద్రియాదిబం
ధ నియమమెట్టుగల్గు రఘు... 29.

చ. శుభచరితంబులన్నియును • జొప్పడ సల్పువ భర్తృపత్నులం
దిభువనమాన్యులొందు సక•లీరతషః ఫలమోయనంగ రా
మభరతలక్ష్మణాదికకు•మార చతుష్టయరూపమై తగన్
ప్రభవమునొందితీవె రఘు... 30

చ. ముదమునఁ బౌరులెల్ల కడు•మోాఁయ సుఖానశుకాదిపక్షులున్
మదమునఁగూయ భక్తులమ•నంబుల వెన్నెలఁగాయ శత్రుసం
పదలెడబాయఁ బూలజడి•వానలు పండువసేయ నీమజ
న్మదివసమొప్పఁగాదె రఘు... 31

చ. అనిమిషమూర్తివై వెసమ•హాంబుధిజొచ్చిన సోమకాఖ్యుమ
న్ననిమిషజేసి చంపుట బు•ధాళికిఁ దెల్పఁగఁబూని బాల్యమం
దనిమిషమూర్తిదాల్చిన మ•హాత్ముఁడవీవె భవాబ్ధిదీవియై
నను దరిజేర్పలేవె రఘు... 32

ఉ. ఆసుడివాలువాలు విలు•సజ్జము రేఖలఁజేసి చూపరున్
మోసము సేయఁగాఁగసియె • పోగియుచేసితివింకఁ గెల్గవన్
మూసుకయుంటివంతటనె బొ•గ్గునవున్ రతనంపుతేటవున్
వాసిదలంపలేమె రఘు... 33

చ. లలినెలతాలమేలి మగ•జాల తెగఁదగు నున్నపాన్పులో
పలి తెలిసన్నదుప్పటుల•పైఁ దిరుగంబడుచు న్సుధాళికిం
పలయుచు మున్నుపాల్కడలి • పవ్వపుఁ బవ్వపుఁ గొండబాల్పుటం
దలపునఁజేర్చితీవె రఘు... 34

చ. మినుకుల నెచ్చిపచ్చికల • మెచ్చనిపచ్చనిరాలఁబోలు మె
ల్లనజవరాండ్రుపీవ బవ • ళింపుచు లేనగుమోముతోన ము
న్నవనిధిఁగోనఁదూగు వట • పత్త్రమున న్శయనించి మించు పెం
దనివిఁదలంచుకొంటి రఘు ... 35

చ. పుడమిబడల్పడున్ పడగ • ఫోడిమిపీఁకెడు పాపఱేఁడటం
చెడనెడ రెండుమూఁడడుగు • లేయుఁడు వేయుఁడు రాజుజాడ మున్
వడిబలివేడవేడ బవు • బాడబతన్ గనుపొ్రడవంచు గొ్ర
న్నడలు దలంపఁజేసె రఘు... 36

ఉ. కానలకోనలోఁబొడమ • గానలతేనెల సోనలెంతయూ
లేనెలకూనలోని జిగి • లేని సుధారసమెంత నీనుడుల్
వీనులసోక మేనులు న • వీనపువీనులఁగాంచి బోనమున్
బానముమానియుండు రఘు... 37

ఉ. మక్కువదీఱ దల్లి పటు • మాయుని నినున్ గని కౌఁగలించి య
మక్కయికేటి భాగ్యమని • మాటికిమాటికి ముద్దుఁగొంచు నే
దిక్కున నీవెకాదన మ • దిందలపోయుకు నీదుమోసపుం
దక్కులలోనగాదె రఘు ... 38

చ. కలువలఁబోలువాలు తెలి • గన్నులఁ గాటుకఁదీర్చి చెక్కులం
గలకలవప్పవెన్నెల ని • గన్నిగ లీనఁగసోయగంబునన్
బొలిచిన నీనునెమ్మొగము • పున్నమవెన్నెల గీముగోమున
న్నలువకు నెన్నగాము రఘు... 39

ఉ. తమ్ములతోడనాడి కను • దమ్ములువాడఁగఁ దళ్కుచెక్కులం
జెమ్మటజార హారములు • చిందరవందరగాఁగ నూర్పులం
గమ్మనిముద్దుమోవి గసి • గంద సిగందగు పూలురాల నం
దమ్ముగు నిన్ దలంతు రఘు... 40

చ. నిను ఘనమంచునెంచి • కడునెమ్మిగ నెమ్మిగము ల్నటించ జే
ర్మినిగుడ నీవు గానమొన • రించిన మించిన లజ్జఁగోయిలల్
వనములఁజేరె గాఁదనఁ బ్రి • పంచమనోహర నిమునామమై
నను మదికింపుగాదె రఘు... 41

ఉ. చూపరులెల్ల రిచ్చపడి • చూడఁగ వేడ్కఁ దాపిమేల్ మలీ
నాపని బాజుబందులుగ • నంబడ దుప్పటి పల్లెవాటుగా
రాపుసువాణిము త్రెప్పు కుం • కాయియు నీవుజరింపఁ దల్లికన్
రాపుదలంచు గాదె రఘు... 42

ఉ. రాణజెలంగఁ బాపలగు • రా తగురా చిగురాకువిల్తు సా
మ్రాణియునందనర్చి మగ • రా తొగరా పొగరాను మేలి కం
ఖాణము నెక్కువేళ నెనఁ • గా నఁగా వినఁగానికౌతు వి
న్నాణము నీదె కాదె రఘు... 43

చ. పనుపడిమీఱు ముంగురుల • బారు కనుంగవతీరు చక్కనై
కొనుపులిగోరు బల్ కలిమి • గోరు భుజంబులసారు గాంచినం
తనె జడదారులైన జడ • దారులనన్ వడిఁదారుచిత్రమున్
వననిధిఁ దేలినారు రఘు... 44

ఉ. తియ్యనివిల్తుగెల్వ వెను • దీయని పోయఁగ మాత్రితాళికిన్
గయ్యములోన నయ్యరుల • కై యమురూపముజూపు జాణవై
వయ్య ననుంగృపార్థిగన • వయ్య నమస్కృతు లందవయ్య నన్
నయ్యనఁ బ్రోవుమయ్య రఘు... 45

చ. రురుమృగచర్మమొప్ప జెడ • లు న్గ్రతుసూత్రము క్షౌమనామకాం
బరమును మౌర్వి బోల్ త్రిగుణ • మౌర్వి పదాద్యరుకాంత కాంతఖా
దిరనవదండమున్ గొనిని • దేశవిధంబున బ్రహ్మచర్యమున్
బరగఁగఁ దాల్చితీవె రఘు... 46

చ. తనరెడు నీదుజన్మదము • దారవశిష్ఠ గురూపదిష్ట స
న్మనుగత వర్ణపఙ్క్తిజగి • మై నొగిమైదగ గానుపించెనో
యన బలిబంధనోద్ధృత ప • దాంతకి తాంసగ గాంగధారగ్రి
న్ననఁ బ్రభవించెనాగ రఘు... 47

చ. పెల్లుతపంబొనర్చి యలవి • ప్రతనొందిన బానవాలు జా
బిల్లి మఖంబుగాన నినువే • డిన వాడిశరంబుగాడి న
ట్లుల్లము ఝల్లనన్ నృపతియు • న్సతియు న్బ్రతిఒందు లేని పెం
దల్లడమంద లేదె రఘు... 48

ఉ. ఎక్కడమౌనివచ్చె పురి•యేటికిఁ జెచ్చెరజొచ్చె నక్కరో
మొక్కసమేమి లేదు మన•మ్రొక్కులు గైకొన డక్కటక్కటా
యిఁక్కసుగాయ లేటి కన• రేఁజను లేగెడు మిమ్ము లక్ష్మణున్
మక్కువఁ జూచిచూచి రఘు ... 49

చ. వెనుకొనియేగ వన్యపద•వి న్బదవీన్ గదలింపరాదుగా
యనికొని నెమ్మి నమ్ముని బ•లాతిబలాతిబలాఖ్యవిద్యలన్
మునుకొని వేగ్రహించిగద•ము న్పదమున్ గదముందొరంగి క్రొ
న్ననయనఁ బోల్చితీవు రఘు ... 50

చ. ఒకపరిగేరిపారి మఱి•యొక్కొకమారఁ ఘుమాఘుమాఘు నిన్
పకపకనవ్వుసోయగము•నన్ గమనంపునడల్ దొడంగి వే
ఱొకతరిదారిగీరి కల•నూరక చేరికఁ జేరఁ జీరి మి
న్నకమునిగొల్చితీవె రఘు... 51

ఉ. హాటకగర్భముఖ్యగగ•నాటకకోటులమాటలో జగ
న్నాటక సూత్రధారమది•నాటగతోఁటకడ న్వధార్హతో
ద్ఘాటక కౌశికాజ్ఞజవ•దాటక దుష్టచరిత్రపేటికన్
దాటకఁ గూల్చితీవె రఘు... 52

ఉ. ప్రోచితిఃండ్రియై పుడమిఁ•బుట్టిన కశ్యపుపత్నినాము మా
రీచు పఁమ్రింతు నెట్లనివ•లె న్వడిలంకకుఁబంపు వృత్తమా
వాచికపత్రమట్ల శర•వారత నాఖులవ్రాల్చి తద్ధిపె
న్నాచునఁ బుర్వగాఁగ రఘు... 53

చ. అలవడనీడు మాకమృత•మంచు మహీసురులెల్ల వేడ బల్
విలుపవరించి రాహువుసమ్మరించి సుబాహువుద్రుంచి బాణపూ
తలవిడగాత్రుఁడంచు నమృతంబె యొసంగితి వద్దయాళు నిన్
దలఁచిన యేకొఱంత ర... 54

చ. సమమగునీవు గౌశికుఁడు • సల్పిన కర్మములెన్న దేశపు
ణ్యమని వెలుంగుడగ్గరి మ•నమ్ములు ధర్మము నాసురావళుల్
యమనియమంబులొందఁగఁ బ•లాళ సమిత్కుశలుండవంచు జ
న్నమున మునుల్వచింప ర... 55

ఉ. కౌశికుఁ గూడిపోవునపుఁగా బహుశోభి భవత్పరాగమే
నాశిలయై యహల్యపడిన స్పృశించఁగనయ్యెఁగదన్ తుదిన్
కౌశికుఁ గూడిపోవునపుఁగా బహుశోభి భవత్పరాగమే
నాశిలఁజేసెనౌర ర... 56

చ. విశిఖతఁగాంచుచో నితనివే నిరసించితి నీరసంబునన్
నశిఖతనిప్పువచ్చెడు నిజంబని భీతిలిడాగియుండియుం
గృశమయినట్టు లెక్కుడఁగ నీవు గదల్చిన మాత్రమున్నె చం
డశివరాసనంబు ర... 57

చ. విలుఁగుచునవ్విసంబునను విచ్చెదఁ జేసిని కేశబంధము
స్వావలయిఁ గుప్పిగతేరయులు వక్రగతిం జెలంగి పెండ్లోనల్
ఖళహుండియంత నినుఁ గాంచి హసించు స్మరాంతకత్వమున్
దలఁచి గలంగఁబోలు ర... 58

ఉ. మోసముమానుడొందగరము గ్గళయు గృహము లోహతాంచితా
వాస పురత్రయంబణఁచు పన్నె మహోన్నతి నందమందు కై
లాసముగెల్చు నీకెతగు రాయని యజ్ఞనకుండొసంగ నిన్
డాసె ధరాత్మజాత ర... 59

ఉ. హాసప్రమోదతో భుజశరాసప్రడాకయు నూఁగునూఁగు బల్
మీసపురేకతోఁ జెడగు మేదగి నేగఁగ నాగరాంగనల్
సేసపువీఁకఁ జూడ్కులన చెందొవలందలుపింప నీపద
న్యాసప్రజోకనెంతు ర... 60

చ. చెలువెత హుంకరించినను సిగ్గుమునై వడినష్టగించినన్
దలఁకక నీవు నెమ్మొగము దమ్మిపయింబడి నాసనంపగిం
దెలిసియుఁబోలె బౌరునవనీసుత దృగ్భ్రమరాళిగాంచి కం
దలితహాసమీవె ర... 61

చ. ఉరమున మించుకైక ముడియూడిన జోడుజాడనంతటం
బిరుసగునట్టి పోకముడి పీడినతోపనె గాడినట్టి ని
ర్భరపులకాంకురంబులు భరంపశఁజేసితి వానుఫేయుకిన్
గరముగ గ్రహించువేళ ర... 62

చ. అలజడి విష్ణుపత్రియుక్తి • నాత్రియికిం బెడబాయు లోకమం
గలమగు దీనఁజేయు కసి•గందకెయుంచునుభంగి సీత మం
గళగళసూత్రబంధములఁ • గ్రుదుగనిల్పితి దీనబంధులన్
నలువప్రమోదమంద ర... 63

చ. ధరణిజపెండ్లి నొండొరులఁ • దాకొని మోము లొకింతవంచఁగా
నిరువుర గంటెరత్నముల • నిద్దుఁగన్గొని పెల్లుపొంగు బల్
దరహసితింపుగుంపులన • దండడిదోయిటి బ్రాలుముత్తెపుం
దరగలుముంచెమిమ్ము ర... 64

ఉ. తత్తర మొప్ప సీతకయి • దమ్ము ర్పించినఁ బ్రాలుముత్తెముల్
ముత్తెములంచు మోటులన•బోఁటునె వాని దలంచువాటికిన్
మత్తగజాశ్వరత్ననిధి • మానవతీసుతరత్నముల్ స్వసం
ధత్తములై చెలంగ ర... 65

చ. పదరజమంటుమాత్రమున • పత్థరమున్ననె చేతనత్వము
న్వదలదచేమొ మూజడత • వాసిశిరంబున నున్నదంచునో
కదలుచు డొల్లిముత్తెములు • గాత్రమునంటుచు పాదపీఠము
న్వదలకనిల్చిగుండె ర... 66

చ. స్థిరచరభూతజాతముల • సృష్టియొనర్చిన మూలదంపతుల్
తెరమిడిమీరుమాటికిఁ బ్రదక్షిణమేగినఁ దప్పటంచునో
పరికృతహోమత్య్రప్తిఁగని • పావకుఁ డప్డు ప్రదక్షిణార్చుల
న్మ్రుటిమఱిఁజేసెదాని ర... 67

చ. ఇరువదియొక్కమారు పృథి•వీశులఁదుంచు నఘాంకమోయనం
బరశువు నిన్నుఁగన్గొనిన•మాత్ర ధరంబడ చాపటంకృతుల్
గురుతరతద్యశస్సితగ•రుత్తులఁ దోలఁగ నీశరంబునం
దరగదె భార్గవాగ్ని ర... 68

ఉ. అప్పతిదత్త దివ్యమణి • యందముతో సిరియక్కనంది పెం
పొప్ప కుధాంచలంబులను • హొంజిరి జెక్కల వాహనంబుపైఁ
జిప్పిలు పుష్పవర్షముల • సేసలునప్పుచు నప్పు డప్పురిన్
గప్పఁగ నేగితీవె ర 69

చ. భరతహితైకనిష్ఠ నభిషేకమహోత్సవ దుగ్ధవార్ధి మం
దర మనఘమ్ముగాఁ గ్రమ్మఁ గడిఁ గమ్మగు హాలహలమ్ము గైక యీ
వరమును మైపడ న్భవా శివాయయటంచును మ్రింగి వాక్సుధన్
సరసుర తృప్తిఁ గీవె ర... 70

చ. సకల జగత్ప్రభుండను • సాగరవేష్టిత భూమిమాత్రి నా
యకునిగఁ జేయఁ బూనె నృపుఁ • డయ్యయొయంచు నెపంబుఁ దల్లిపైఁ
బ్రకటమొనర్చి కౌశికిపై • రాజ్యమునుం దృణభంగిఁ గాక యిం
తకెవరు నెట్టఁ గొందురు ర... 71

చ. కరుణ వలిర్చినావు సుర • కార్యముఁ దీర్ప వరంబొసంగి యే
వారమునందు రే సురలు • మాకొరకెవ్వరి యింతె కానిచో
భరతుఁడు లేకయుండుతఱి • పట్టము గట్టుట కొప్పవెట్టుల
న్నరవరపుత్రవెట్లు ర... 72

చ. సురనర తిర్యగక్షిభవ • శోకనదమ్ ప్రవహింప నందు నో
పురములు సౌధముల్ భవనములు నవనమ్ము ప్రతిబింబితంబులై
యుఱుగఁగ నల్లవంచు బొరి • నద్దగిఁ బంచవె నీ చరణ్యమా
నరుచి నహించు వేళ ర... 73

చ. సది వెతలించు యాత్రియిన • నాఁడుఁ దోంను కృపాకటాక్షమున్
దిరిదశులు వొందనేరరని • దెల్పఁగ నేల చతుర్దశాబ్దముల్
వదలక కొల్చు తమ్మునికి వచ్చెనె యచ్చపువాఁడ జేరమం
దదె బహులాభమింతె ర... 74

చ. దయఁ గనుగొంచు నీవు కయి • దండముసంగినఁ బూలతోఁటలోఁ
బయనమొనర్చు సీత వనిత సమఁ జేసెనఁ జింతయేల చే
డియ యిదె వెంటవచ్చు నను • డింపకుఁ డంచును చాయఁ జూప నెం
త యెడబుపుట్టె నీకొ ర... 75

చ. దరహసితంబులున్ స్మరులు • దార్చెడి చూపులు మైబెడంగులున్
గిరికొనఁ జిత్రకూటములు • కేళివల నుప్పతిలంగ మీఁ జిలి
ర్వ్యాసు విహరింపనోకొ మహిలో వెలసెన్ గిరిచిత్రకూటమై
సరసుర పుణ్యరాశి ర... 76

చ. రణజయశూరు నిం ద్రిసుతు • రావణునంతటి దుష్టుఁ గూల్పఁగన్
దృణమున కాజ్ఞయీఁ బఱచి • దేవతలెల్లను దల్లడిల్ల వాఁ
డణుకువఁ జేరఁ గాంచితట • యాకృతిఁ జూచియె కాదె మాకునుం
దణుకును బెణ్కు లేదు ర... 77

చ. పనుపడ రాజ్యము న్నిలుప • పాదుకల న్నియమించి దండకా
వన వనవహ్నివ న్నిఖిల • బాధవిరోధు విరాధు నార్చి పు
ణ్యానవలతావితానమన • యమ్ముఫలింపఁగఁగాదె యచ్చోటన్
ఖరను మొనర్చితీవు ర... 78

ఉ. నిన్నెకనన్ గృశించిధమ • నీతతివంజరపక్షులా మునుల్
మున్నుగ బంధము ల్విడచి • మోక్షమునొందుట యబ్రమే తృణా
ప్రోశ్నతిఁ జేయు నీవు హరి • యుంచిన చాపశరాళిదాల్చుట
స్వప్నికవింతగాక ర... 79

ఉ. అసుర బాధలం దెలుపు • నవ్వనవాసుల దీర్ఘదీర్ఘని
శ్వాసము ధూమకేతు వన • సాగిన వేగయితూఁగు నమ్మహో
ల్లాసము దాయమ ట్లఖిల • రాక్షసపక్షవధ ప్రతిజ్ఞ వి
న్యాసము జూపితౌర ర.. 80

చ. అనుజుఁడు నీవు బిట్టుపరి • హాసము నొసర్పఁగ సీతసన్నిధిన్
గినసిన్తురాంధ శూర్పణఖ • కీడిదవీడుము రక్తపానసూ
రనెపుడుగోరు దిమ్మరిన • లక్ష్మణుకత్తియె ముక్కుచెవుల ఖం
డన మొనరించితీర్పె ర... 81

చ. వినదము మీఱ శూర్పణఖ • నీజయభేరి యనంగ బాఱినన్
గిరిసిఖరాదిరాక్షసులు • నీశరవహ్నిబడ స్ఫుటస్ఫుటా
ధ్వనులును దోడుగా దిశల • దందడి సంపడిపించె శత్రురిత్తిం
దనుకగఁ జేసితౌర ర... 82

ఉ. రక్కసు మున్నుచంపమియు • రాక్షసుఁ డేయుని తెల్పియున్ మృగం
బెక్కడ నేగు నీపచటి • కేగుటయున్ ధరణీజకున్ తమం
బెక్కట లక్ష్మణుం డెనసి • యేగుటఁ జూడఁగ నీనుమోసపుం
జిక్కులటంచుఁ దెల్పె ర... 83

ఉ. రావణురాక నీకెఱుఁగరాదె ఖరాదులఁ దున్మినట్టి మా
చ్చావచరూపముల్ గొనవె యద్దశవేరెదలంచితేని క లం
కావన దాహమట్లు దశకంఠకరోల్కులు కడంకె సీతయన్
దావకకోపకీల ర... 84

చ. ధరణిజగాదు పక్షి గళఁదాక్చి బిగించిన కాలపాశమే
యరయఁగఁగానిచో నపుడె యాతనిఁకూల్చెదె తల్లినై న వే
చోరదె నలంగి వాని గళలోచ్చశిలల్ దెగుదాక కాకపన్
దరికొనస్సైఁచియున్న ర... 85

ఉ. మోహముగాదు వృక్షముల ముంగిటశోకము నీవుగాంచుట
వ్యాహతకోపవహ్ని సఖివార్త వినంబడకున్న లోకముల్
దాహమొనర్చు భూమిజకుఁ దమ్ములు వీరనిజారిసట్టి స
న్నాహముఁజూపితౌర ర... 86

ఉ. త్రాణమొనర్ప సీతకయి రావణుతోడుతఁగోరి పోరుచు
ప్రాణము లొప్పగించిన జటాయువు మిమ్ము గ్రసింపఁదార్చు గీ
ర్వాణపతి ద్విషుండగు కబంధు నమంబుగ నుద్ధరించు వి
న్నాణము నీదెకాదె ర... 87

ఉ. లేశమటంచువోక శబరీపరిచర్య బహూకరింపు మా
యాశబరార్చనంబడసి యాతనిఁ దృప్తునొనర్చు వంచు నం
దాశజనింప మున్నుగనె యాతనిదేవి సమర్చజేసెనో
నాశుభశంకఁగూర్చె ర... 88

ఉ. కేవలపాపమూర్తులన గృధ్రనఖాంక కినాళితో దశ
గ్రీవతకంబె వాలి జయకీలితమాల్యవి శల్యమైన సు
గ్రీవత మేలనందెలిపి కింకరుగానత విన్నరించినన్
రావణుఁ డెల్వనొనె ర... 89

ఉ. సాలములన్ గిరి న్భువినిఁ జక్కఁగ వ్రక్కలుజేసి వచ్చిన
వ్వాలివయి నహన్యనుగ వైచె టంచును బాణమగ్గనో
గోలభరుంచ భీషణఘోరమదోత్కటరక్తసిక్తతన్
గోత్రిఁ బొన న్నయించె ర... 90

ఉ. సారినిఁదెల్పి సీత గన•సాగెడు వానరకోటిలోన కూ
పారము నిన్నెనదాఁట వన•భంజనమైననొనర్చ సీత కో
పారఁశిఖూది శత్రుపుర•హానినొసంగఁగ నీవెయంచు ము
న్మారుతికీవె ముద్ర ర... 91

ఉ. అక్కట సీతభూషణము•లారయ టాపిగ నీకు ముద్రి బా
నొక్కట యేగగం దుముకు•చుండు నదెంతటిజాణయో వరం
బెక్కెయె తెచ్చెరోమణి న•హీంతదోలె బిరానసద్దియున్
జక్కఁగ నీకు మ్రొక్కె ర... 92

ఉ. పొంగుప్లవంగసేన నిలు•పుంగన రావణుద్వారపాలు న
బ్ధింగని నీదుకన్నుఁగవ•పెంపగు కెంపువహింప బాడబా
గ్నింగొను భంగిగ్రుంగి యది•సింగిని మ్రింగెడి పెన్ భయార్ధిమ
న్గఁగరుణించితౌర ర... 93

చ. వసధిఁ జూడజొల్లమని • వానరులిచ్చెడి మూర్ధకంపమున్
గనదరి దుర్జయత్వమును • గాంచునె నీకు కృపార్ద్రదృష్టి య
ర్యనుజుఁడు వచ్చి నీకు శర•ణాగతిఁ దెల్పి నమస్కరించినం
తనె యభిషేకమిచ్చె ర... 94

చ. రిపులజయింప వానరులు • రిత్తగమున్మెకృశబాసి యేగినా
రిపుశిఖ లూరకుండుమె మ•హీజయులాతియె మూకటంచు న
వ్విపులమహీధరంబు లతి•వేగము మున్నుగనేగుచున్న వ
న్నపగిదిసేతువొప్పె ర... 95

చ. ప్రిలయపయోనిధీచికలు • బ్రాకినవిచ్చుకులాచలంబు ల
ట్లలము దవ స్ఫులింగముల•నంటిన మండు మహాద్రిమంబుల
ట్లఘు రణోత్సవ ద్విగుణి•తాసురసేన ప్లవంగసేనచే
నలియఁగఁజేసితౌర ర... 96

చ. సురపతి గట్టితెచ్చె నఁట•చూచెద మీతనివీర్యమంచు నీ
వెనుపరి సింద్రజిద్విజయ•మొంచి సహించి హసించి తమ్ము ని
ర్భరశరవహ్ని వాని శల•భమ్ముగఁజేసితివౌర యిట్టిచూం
తరము వెఱుంగ లేరు ర... 97

ఉ. లోకములెల్ల నొక్కపరి • లుప్తము లౌ యుగాంతవేళ పెన్
జీఁకటి మూలకందమగు • జెచ్చెర నుబ్బెడు కుంభకర్ణుని
దారికులు మేలుకొల్ప దర • హాసవికాసి శరత్ప్రియుమ్మెద్రం
దాకఁగఁ గూర్చితౌర ర... 98

చ. రణమునఁ గూల్చు నిన్ను జయ • లక్ష్మివరించిన వేళ దిక్పతి
మణుల సురేంద్రునస్త్రముల • కందుకలీలనొనర్చి తక్షణ
క్షణ రుధిరమ్మురంజఁదగ వ • సంతములాడిరి దుందుభుల్ ధణం
ధణయన నింగిమ్రోయ ర... 99

చ. కుజముదియంచు నాపయిని • గోపముకోయదె వీరలక్ష్మి దా
భుజములఁ గౌఁగలించితివి • పొంకము మైథిలియుక్షనేవ పొం
తజనన మొంచు సంచు సతి • దానుదకంగొని తెచ్చె నగ్ని గ
న్నజగము నిత్యనౌర ర... 100

చ. అజముఖదేవతాసమితి • యంజలులం గృపవించి వానర
వ్రజములు సీతతోడఁగొలువ • న్భరతాది మనోరథంపుగుం
పు జవము బెంప వచ్చుగతిఁ • బుష్పకమెక్కి బిరానఁదమ్ములం
బ్రజల నలర్చితౌర ర... 101

చ. నవనవతూర్యఘోషముల • నారతనర్తనగీత సమ్మతి
స్తవము లలంకృతేభ హయ • సంఘవిమానగ పుష్పవర్షముల్
భువిదివినుండిసీమ శుభ • భూర్యభిషేకదినం బెలర్చుచు
న్నవి వర్తిబింబకీర్తి ర... 102

ఉ. డాత్రొడసీతతో నిరుగ • డ న్భరతుండును జిన్నతమ్ముఁడుం
బ్రీతిగవీవ లక్ష్మణుఁడు • వెన్కను ఛత్రముఁబట్టి కొల్వగం
జాతకరీతి జూపరులె • సంగ సమీరజుఁడొత్తు నీబుధా
మ్మాతపదంబుఁగొల్తు ర... 103

చ. భవదభిషేక పూతజల • పాత మదెట్టిదొ సాగరాంతభూ
మివలయమందు నకరిమపు • మృత్యువుదుర్గతి రుగ్జలాగ్ని భూ
పవన భయంబులెల్ల అఘ • బాసె సదా ధనధాన్యపూర్ణపు
ణ్యావనము పల్లవించె ర... 104

ఉ. చూపుల రూపుల న్మరులు • జూపెడి కోపుల యూపుతీపులన్
కోపక చాపలమ్ము లనను • గూనుర్ముల పేర్మల ముద్దుముద్దులన్
రేపును మాపు నోపక త • రిన్ బుతులుబ్బగ లిచ్చి గుబ్బెతన్
జా్రపుగఁ బ్రోచితీవు ర ... 105

ఉ. సారసబంధువంశమున • సంభవమొందుచు రాజవంశ వి
స్తారము నెల్లెడ న్నకవి • ధంబుగఁ బెంపవె దాని తానమిం
పారెదు దివ్యగానముల • నప్పని ముత్తెములింక నిప్పుడుం
దారెదు నీకుకూర్మి రఘు • నాయక భక్తవరప్రదాయకా. 106

ఉ. ధారుణిఁబ్రోఁబూను • నవతారము లెన్నఁగ నెన్నిగాన మీ
దారిజగంబులెల్ల సుకృ • తంబ యుతాబ్దము లొందనేర్చె నే
తారకనామ మెప్పటికిఁ • దార్చితి టీవలివారికై ననున్
నారకబాధఁదీర రఘు • నాయక భక్తవరప్రదాయకా. 107

ఉ. కల్యభిమాన హార్ద్రగుణ • గానవిలాస కథానిధానమౌ
ద్గౌంబ్రపగోత్రుఁ డార్యమత • ధన్యచరిత్రుఁడు కామశాస్త్రి మం
గిళ్యకరమ్ము పద్యశత • కమ్ము సమర్పణఁజేసె భక్తమం
డల్యను కంపఁగొమ్ము రఘు • నాయక భక్తవరప్రదాయకా. 108

శ్రీ రఘునాయకశతకము

సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# శిష్యనీతిబోధినీశతకము.

క. శ్రీకరుఁడు దేవుఁడొప్పఁగ
నీకొసఁగునుగాక! సౌఖ్య • నిచయములివె నే
వాకొనఁదొడఁగితి నీతులఁ
జేకొనుమా వానిశుభము • సేకురు శిష్యా. 1

క. నమ్మినవారల నమ్ముము
నమ్మకుమాభువిని నిన్ను • నమ్మనివారిన్
నమ్మియు నమ్మనివారల
నమ్మకు మెప్పుడును నీవు • నయముగ శిష్యా. 2

క. సమయము వచ్చిన నీకై
విమలమతిన్ బ్రాణమైన • విడిచెడు హితుఁడే
సుమి! నిజమౌహితుఁ డనఁగా
సములే యవ్వారి కితర • సఖు లిల శిష్యా. 3

క. బూటకపు మాటలాడుచుఁ
దాటోటులు చేసియెన్నొ • తలపాగలు మా
ర్పాటొనరించు సఖాళిన్
జేటుసుమీ! నీదుచెంతఁ • జేర్చిన శిష్యా. 4

క. ధనగర్వమైనచుట్టముఁ
దనుపిడిచిన కాంత, లోక • ధర్మవిహీనున్
జనదిలఁ జేరఁగ, నటుచే
రిన నవమతి కలుగునదిభ • రింతువె శిష్యా. 5

క. పనిలేక నేరియింటికిఁ
జనకుమ పలుమారు నీవు • సంతతగమనా
దనాదరో భవతి, యనం
గనునార్యులు నుసుప్రసూక్తిఁ • గనవే శిష్యా. 6

క. పదివేల నిచ్చి యైనను
వదలఁగవలె సుమ్ము భువి న • పాత్రుల చెలిమిన్
బదివేల నిచ్చి యైనను
ముదమునఁ గొనవలయు ఘనుల • పొందును శిష్యా. 7

క. తన యెఱిఁగిన సద్విషయము
వినిపించెడు వాఁడె గురుఁడు • విమలమతి స్సు
వినయము నట్టి గురుం గనుఁ
గొని సేవలు సల్ప మేలు • గూడును శిష్యా. 8

క. ఏ మతమును నిరసింపకు
మే మతమున సార మదియు • నెంత కలుగునో
యేమి యెఱుంగుదు, దేవుని
కేమతమును సమ్మతంబె • యెఱుఁగుము శిష్యా. 9

క. మతకర్తలు మేధావులు
హితమనియే బోధసేతు • రెల్లరకును వార్
మతసారముఁ, గావున నే
మతమును నిరసింపవలదు • మహిలో శిష్యా. 10

క. నీకున్ సమ్మతమగునది
లోకులకున్ గాకయుండు • లోకులమతముల్
నీ కిష్టము గాకుండును
'లోకోభిన్నరుచి' యనరె • లోకులు శిష్యా. 11

క. ఎందును సత్కీర్తిని గై
కొందురు సజ్జనులు గాన • గుణమతి నీ వీ
సందర్భము యోజించి, య
మందగతిన్ వారిఁ జేరు • మంచిది శిష్యా. 12

క. సురఁ ద్రాగువాని, జూదరిఁ
బరవనితామానహరు, న • పండితునిన్, ద
స్కరుఁ గొంటెపిల్లవానిని
దరిఁజేర్పకు, దానఁ గీడు • తప్పదు శిష్యా. 13

క. తనుదాను బాగుపడుకొనువాఁ
డును, ఘనలుభ్రాంతరంగుఁడున్ దూష్యుఁడుఁ జే
సినమేలు మఱచువాఁడును
గన నెంతయు నీమలంబ్రౌగా భువి శిష్యా. 14

క. పెద్దల శుశ్రూషను నీ
బుద్ధి వికాసించుఁ గీర్తి • భువి వెలయును నీ
సుద్దియెఱింగిన నీకున్
ఔద్ధత్యకరం బబ్బుటయుదె • వినుమా శిష్యా. 15

క. పురుషార్థచతుష్టయముల
గొలుపఁగదా ధనముఁ గూర్చుకొను టాధనమున్
సరిగా నీనాల్గింటికి
నరసి విభాగింపవలయు • నవనిని శి... 16

క. అంతఃపురకాంతలతో
మంతనములు గూడ వెట్టి • మనుజున కైనన్
ఎంతైనన్ గడగానో
క్కింత తొలంగుటయె శ్రేయ • మిలలో శి... 17

క. రాజే తల్లియుఁ దండ్రియు
రాజే ధర్మస్వరూపి, • రక్షకపరుఁడున్
రాజే సత్యాన్వేషుఁడు
రాజే పోకల్పకంబు • ప్రజలకు శి... 18

క. "నావిష్ణుః పృథివీపతి"
నా విని వే పెద్దలన, ఘనంబుగఁ బ్రభువున్
ఏవాఁడు గొల్చు నాతం
డే విజ్ఞుఁడు దలఁచిచూడ • నిలలో శి... 19

క. రాజద్రోహము చేసెడు
నాజడునకు మేలు గల్గ • దవమానం బా
భూజననిందయుఁ గల్గును
నాజన్మాంతంబు శ్రమలు • నగుసుమి శి... 20

క. కరవాలముపై సాము నొ
నరుచుటలన్ మిత్రితోడ • నయరహితమతిన్
నరసము లాడుట లవనీ
వరులను గొల్చుటలు జూడ • వసుధను శి... 21

క. పొట్టకు జరుగనికొలు వే
పట్టపుఁబ్రభు నొద్దనైన • వలదుర, ఁగోర్కిఁ
చుట్టును దిరిగెడు వంచక
మెట్టులు ఫల మందనేర్చు • నెంమిని శి... 22

క. ప్రభుసేవ సల్పు పెల్లరు
విభవములొందుటకె యనుచుఁ • బేర్మిని నేభూ
విభుఁ జెఱఁగి మనుచుఁ బ్రజలన్
శుభముల నారాజు పొందుఁ • జూవె సు శిష్యా 23

క. హితవాక్యముఁ గొనగఁ నని
ష్టితఁ జూపెడు రాజు మనుని • సంతనమున, దు
స్థితులకుఁ బాల్పడి, కడపట
వెతఁజెందుచు నిరయమొందు • వినుమా శి... 24

క. సేవకుల కష్టమాత్మను
భావించి సతంబుమనుచు • ప్రభువే సుఖయా
నావిధమున సల్పకఁ దన
జీవనమేచూచుకొనినఁ • జెడుఁజుమి శి... 25

క. తనరాష్ట్రంబున నుండెడు
జనులను రక్షింపనట్టి • జనపతియెపుడున్
గనును మహాపదల న్న
జ్జననిందకుఁ బాలువడును • సత్యము శి... 26

క. అందఱచే సంస్తుతులను
నందఁగ భావించినడచు • నతఁడిలఁ దుదకే
కీం దనియింపఁగఁజాలకఁ
జెందును దుఃఖంబునిదియుఁ • జిత్రము శి... 27

క. మనమునకు విరోధముగాఁ
గను సేవనిమైనఁ జేయఁగాఁజనదు, మనం
బున కిష్టంబగు సత్క్రియ
లను నొనరుప నీదుకీర్తి • రాణిలు శి... 28

క. నలునంతదోషమైనను
బలుకుదు రత్యంతమైన • పాపంబని లో
కులు భువినల్లెగాఁ బో
కులు గాకులనంగ వినమె • క్షోణిని శి... 29

క. సరసంబై సర్వజనా
దరమయి. సత్యంబునయి మితంబయి విబుధో
త్కరసంస్తుతిపాత్రంబై
వఱలవలె న్సభలఁబల్కు • వాక్కులు శి... 30

క. ఆర్యులు లేని సదస్సది
సూర్యుఁడు లేనట్టిదినము • సొబగుననుండున్
గార్యజ్ఞు లటకుఁజేరిన
దుర్యశమది తప్పకగును • దొలఁగదు శి... 31

క. భవకష్టంబులవీడుట
కవగుణనతియుండఁగోరు • నతఁడు కృతార్థుం
డవునే ? బండను గొని తా
నెవఁడైనను వనధిఁదాఁటు•నే భువి శి... 32

క. జారులసాంగత్యమునన్
దీరనియపకీర్తికలుగుఁ • దెల్వియుఁ జెడుఁ దా
గారవమున్ దొరఁగు, దురా
చారంబుల కగ్గమౌను • సత్యము శి... 33

క. శరణన్నవానిఁగాచుట
వరమంబగు ధర్మమరియు • భానుకులుం డా
సురవైరి తమ్ముఁబ్రోచిన
శరణిని మోక్షింపుమీవు • సన్మతి శి... 34

క. సత్యవ్రతుఁడౌ పురుషుఁడు
నిత్యంబగు యశముతోడ • నెగడునుగనుమా
సత్యహరిశ్చంద్రునియుత
సత్యవ్రతము దలంపు • సరగున శి... 35

క. భగవత్సంతతికాదే
జగమునఁగల జీవసమితి • సదయత నీవా
యగణిత జీవంబులఁగను
మగణితసుకృతంబు దాన • నగుజుమి శి... 36

క. పలలాశనమ్ముఁ జేసినఁ
బలలాశనుఁడౌ నతండు • భావింపఁగ నా
పలలాశనవిరహితుఁ డెవఁ
డలవాఁడే యమరనిభుఁ డ•టందురు శి... 37

క. అవయవహీనులఁగాంచిన
నవహేళన సేయఁగూడ•దటులొనరుప నీ
కవునే ? మేలవ్వారలు
అవిరళభగవంతుసృష్టి • నమరిరి శి... 38

క. దానముజేసెడిపట్లన
నూనమతి న్పాత్రయాచ•కోత్తములకు న
మ్మానితగతివితరణముగ
దానము నొనరించుటదియె • ధర్మము శి... 39

క. పొగరెక్కిన బాలకులను
పగలాఁడులనైనవార • వనితలకును జూ
దగాండ్రకును, వ్యర్థము గాఁ
దగదుర ! వ్యయపఱుప నీను • ద్రవ్యము శి... 40

క. ఎదురముఖస్తుతులను జే
యు దగాకోరులను ధనము • నొడుచుకొన న్నీ
సదనముఁ జేరెడువారల
వదలుము దూరముగ మేలు • పఱచును శి... 41

క. పరిపరివిధముల కీడులు
వొరయును, ధనహీనుఁ డగును • బుధదూషితుఁడౌ
నరివారిలోనఁగల్గును
బరిహాసము సురను ద్రావు • పలువకు శి... 42

క. సజ్జనునొక్కనినే జనుఁ
డిజ్జగమునఁ బూజసలుపు • నెంతయుభక్తి
న్నజ్జగము లతనికిని సం
పజ్జయములఁగోరు వాస్త•వంబిది శి... 43

క. సాధులఁ బూజించెడువాఁ
డే ధన్యుఁడు బుడమి వాని•కేసమయమున
న్బాధలుగలుగవు, మోక్షము
సాధించెడు శక్తి కలుగు • సత్యము శి... 44

క. పరవనితా వాంఛితునకుఁ
దఱుగును సత్కీర్తి, నీతి • తలఁగును లోకుల్
పరిపరివిధముల దూఱుదు
రరయఁగ నరకము ఘటిల్లు•నయ్యా! శి... 45

క. నారులకు సాహసంబది
యాఱింతలటంచు శాస్త్ర•మనదేకానన్
నారులచిత్తముఁ గనుఁగొన
వారిజభవునకునునైన • వశమే శి... 46

క. సంసారాబ్ధిని దాటఁగ
హంసీగమనలె తలంప•నగుదురు ప్లవముల్
సంసారాబ్ధిని ముంపఁగ
హంసీగామినులె శిలలు • నగుదురు శి... 47

క. శిష్టాచారము లడఁగెను
దుష్టాచారములె యెందుఁ•దోఁచెను సుజనుల్
గష్టంబులపాలైరిలఁ
గష్టాత్ములకును శుభములు • గల్గెడు శి... 48

క. వెలయాలివలపునమ్మకు
మాలసులఁ జేరంగఁబోకు ♦ మాత్మస్తుతులన్
సలుపుకొనువారిఁజేరకు
పలువలరాపీకు నీవు♦పజ్జకు శి... 49

క. పతియాజ్ఞల జవదాటక
సతతమునాతనికి సేవ♦సల్పుచు పతితాన్
మతిఁదృప్తిఁ గలిగియుండిన
వితతయశంబబ్బుటసుదె ♦ పృథ్విని శి... 50

క. తనపతిఁ దనియింపఁగలేక
కను బరకాంతలనుగోరు ♦ కష్టుఁడుసుఖమై
మనునే ? సత్కీర్తిన్ గై
కొనునే ? మోక్షంబుఁ గనునె ♦ క్షోణిని శి... 51

క. స్వోదరపూరకుఁడౌ నరుఁ
డేసేవిశిఁ జనిననేమి ? ♦ యిలనధికుండౌ
నే ? దిక్కులేనివారల
నాదరమునఁ బ్రోచునతఁడె ♦ యధికుఁడు శి... 52

క. శరణంబని తనువేడిన
నరినైననుఁ గావవలయు ♦ నండ్రుబుధాళుల్
పరమంబగు నీధర్మము
కరయగ నరియానెమెద్ది ♦ రైనను శి... 53

క. పరుసపుఁబలుకులు వలుకకు
దురితపుఁదోవలను జనకు ♦ దుష్టుల చెలిమిన్
గరమనురక్తి నిజేయకు
సరిగావిని సజ్జనులకు ♦ సత్యము శి... 54

క. సుతుఁడుసుతుండన నెవ్వఁడు
పితరుల పైభక్తిఁగలిగి ♦ వినయముతోడన్
సతతము సేవలొనర్చు
సుతుఁడేకద ! సుతుఁడనన్ వ ♦ సుధలో శి... 55

క. గురువునకు ద్రోహమును జే
యరసి తలఁచునతఁడు • నగునే సౌఖ్యా
యురు పీతుండై భువిలోఁ
బరమాపదలందుఁ గడకు • వాఁడిల శి... 56

క. పరధనపరనారులఁ దా
నిరతముఁ గాంక్షించునతఁడు • నెగడునె కీర్తిన్
దరిలేని కష్టవనధిని
దురితాత్ముండగుచు మున్గఁ • దొడఁగును శి... 57

క. పూనికతో శత్రుల నే
మానవుఁ డడపంగఁగోరు • మదినామంబున్
దానము భేదము దండము
నూని చరింపంగవలయు • యుక్తిని శి... 58

క. పెద్దలఁ దృణీకరించెడు
గద్దరియగు మనుజుఁ డెపుడుఁ • గాంచఁడు మేలున్
బుద్ధి నెఱింగిన యతఁడే
పెద్దయటం చెంతురు బుధులు • పేర్మిని శి... 59

క. దుర్మతి సుమతిన్ జేయఁగ
ధర్మజ్ఞులు బాటుపడ వృ • థాయగు వారి కే
కర్మముచేతనో యట్టుల
ధర్మువుఁ ద్రోయను జనంగఁ • దలఁతురు శి... 60

క. నిర్మలమతితోఁ జేసెడు
ధర్మమె స్వర్గలోకమునకు • దారిని జూపున్
ధర్మజ్ఞులైన వారలు
కర్మములందునును దీన • నత్యము శి... 61

క. కర్మముఁ దప్పింపఁగ నే
నిర్మలచారిత్రుఁడైన • నేర్చునె ప్రభుమున్
గర్మము లొనరించెడివాఁ
డ్ కర్మంబుల ననుభవింపఁ • గావలె శి... 62

క. మర్మంబెఱుఁగక మదిలో
ధర్మమునే చింతసేయు • తాపసవరుల
న్నిర్మలమతితోఁ జేరిన
దుర్మార్గుండైనవీడు • దోసగులు శి... 63

క. సతతము సత్సహవాసమె
వితతమతిన్ జేయుఁగాదె • విజ్ఞుండతనిన్
అతిమోదంబునఁగని దే
వతలిత్తురు కోరినట్టి•వరములు శి... 64

క. సుజ్ఞానుఁ జేరునట్టిఁడు
నజ్ఞానుండైనఁగాని • యదిపోవిడి న
మ్మజ్ఞానమంది యవని
న్సుజ్ఞానుం డనఁగఁబరగుఁ•జుమ్మా శి... 65

క. రణమునకుఁ జనినయాతఁడు
వెనుకాడందగునె పోర • భీరుత్వమున
న్మను నేసత్కీర్తిని ? దా
గను నే యట్లనఁ బరసుఖంబులు ? శి... 66

క. జననాథు నుప్పుఁదినుచును
బనివచ్చినయట్టివేళఁ • బాఱెడు భటుఁడా
మను జేశు నింటఁగుక్కయి
జనియింపఁగవలదె యొంచు•జన్మము శి... 67

క. తనుగాచు మనుజనాథుని
ఋణమును జననీఋణంబు • నిలరజకు, ఋణం
బును దీర్పకొనఁగఁజాలునె
జనుఁ డెంతటిమూఱు మేలు•నల్పిన శి... 68

క. తొలితొలి సౌఖ్యంబుగ న
వ్వలఁ గష్టంబులనుగూర్చు • వలదుర నగనా
వల కైన మా[illegible]
[illegible] • [illegible] శి... 69

క. సునిశిత కరవాలముపై
ననువుగ నాట్యంబుఁజేసి • యసువులనిల్పం
గను నగునుగాని గణికం
గనికష్టము లందఱుండఁ•గలరే శి... 70

క. ధనమును యశము నాత్మను
గుణమును శాశ్వతసుఖముఁ • గులగౌరవమున్
జనసమ్మతమును బోఁ జే
యును వేశ్యలపొందుగాన • నుడుగుము శి... 71

క. కష్టంబు లెన్ని గలిగిన
నష్టమతిన్ జింతపడక • నవోత్సాహా
విష్టుండై యుండును ను
త్కృష్టుఁడు దాఁగొండవలెను • తెలియుము శి... 72

క. తృణములచే నావృతమగు
పెనునూతులు గోముఖంపు• బెబ్బులులు మఱిన్
మణులను శీర్షంబునఁదా
ల్చిన ఫణులుగణికలనఁగ • సిద్ధము శి... 73

క. దర్శనమున మదిగలఁత వి
మర్శనమునఁ గాలహారము • మఱియుం దత్సం
స్పర్శనమునఁ జెడుగులును ని
దర్శనమునఁగిల్లు గణికఁ•దవిలిన శి... 74

క. అందఱికిని సమ్మతియగు
చందంబున నడువనేర్చుఁ • జతురుఁడు, నీచుం
డెందైన నటులఁ జరియం
పందలఁచిన హాస్యమొందు • వసుధను శి... 75

క. న్యాయమునఁ బరిపాలించెడు
ధీయుతు లిలఁగొఱఁతయగుటఁ • దెంపరులై య
న్యాయ పథంబులఁద్రొక్కఁగ
పో, యార్యులు సయితమిపుడు • బోరవడి శి... 76

క. దేవుఁడు నీ మేలునకై
గావించెడు కార్యములను • కష్టములైనన్
భావింపకు కష్టములని
యేవిధమునైన ననుభ•వింపుము శి... 77

క. శాంతమె నరునకు భూషయు
నంతయె మరణంబుఁ గూర్చు • వహ్నియు మఱి యే
కాంతముగా దేవుని దన
స్వాంతమునన్ గొల్చుటదియె • స్వర్గము శి... 78

క. క్రోధాత్ముఁడు గురువైన
న్బాధయొనర్పంగఁదలఁచు • భావంబునఁ దా
నేధర్మము యోజింపఁడు
సాధుల బోధలనుగొనఁడు • సత్యము శి... 79

క. తనుఁదాను పొగడుకొనుటయుఁ
బనిలేకనె పరులనింద • పాల్పఱచుటయున్
గనమరణసమానములం
చనిరార్యులు గూడవివి సు•జనునకు శి... 80

క. తనచెప్పినదే ఘనమని
యనుకొనుచు బుధాళిబోధ•లాత్మను నిడకన్
అనయము మెలఁగెడు నరుఁడెటు
గను సౌఖ్యము నిందునందుఁ • గనుమా శి... 81

క. తనపదవికిఁ దగినట్లుగ
జనుఁడు చరింపఁగవలయు • జనసమ్మతిగాఁ
గనుఁగొనకఁ జరియించెడు
జనుఁ డిలహాస్యంబునొందు • సత్యము శి... 82

క. దేవుని మహిమలెఱుంగఁగ
నేవిజ్ఞుఁడునైనఁ జాలఁ•డెంతని చెప్పం
గావశమా భక్తావను
భావించినఁ దోసపడఁగుఁ • భావము శి... 83

క. మేనా ? బుద్బుదసన్నిభము
సూనులు మనయప్పగాండ్రు • చుట్టలుదొంగల్
మానిత ధనం బసత్యము
దేనిని నమ్మంగరాదు • తెలియుము శి... ౮౪

క. భగవత్సంకల్పంబును
నగునె విమర్శింప నెట్టి • యత్నికైనను న
య్యగణిత సత్సంకల్పుని
బాగడంగాఁ జాలరెవరు • పొందుగ శి... ౮౫

క. లోకంబులు పుట్టించును
బ్రాకటముగ మనుచుఁదున్రించుఁ • బ్రజ్ఞాధికుఁ డా
శ్రీకరు మహిమలనెంచఁగ
నేకరణిని సాధ్యమగునో • యెఱుఁగుము శి... ౮౬

క. తనమత ముత్కృష్టంబని
మనమునభావించి యితర•మతములనెల్లన్
గొనకొని దూషించినమా
త్రిన జనుఁ డెటులొందుఁగీర్తిఁ • దలఁపుము శి... ౮౭

క. కులమెక్కుడో గుణమెక్కుడో
యిలలోఁ దెలియంగలేక • నెందఱో యజ్ఞుల్
కులమే యెక్కువయనుచును
బలువిధములఁ బలుకుచున్న•వారలు శి... ౮౮

క. పుట్టుకతోడ ద్విజత్వం
బెట్టుల లభియించుఁ గర్మ•మింతయుఁ గనకన్
అట్టులఁ బుట్టుకచేతని
టిట్టుల మంచెంచువారు • ధీరులు శి... ౮౯

క. ఉత్తమగుణుఁడో మాలఁడె
యుత్తముఁ డత్యల్పగుణము • లున్నట్టి ద్విజుం
డెత్తెఱఁగునఁ గనినను వి
షోత్తముఁడా ! శ్వపచుఁ డతఁడె • పోయల శి... ౯౦

క. సక్రియ మార్గమువీడిన
శత్రునికైన న్బదంబ • శాశ్వతమగు ని
ర్వక్రగతి న్నడచెడువాఁ
డే క్రియపథగామియంచు • నెఱుఁగుము శి... 91

క. దారిద్ర్యాబ్ధి నిమగ్నునిఁ
జేరరు చుట్టంబులైన • సిరి వానికె చే
కూరినఁ జేరుదు రెంతయు
దూరస్థులుగూడ ధనము • దోఁచఁగ శి... 92

క. పేదకు బిచ్చంబిడఁగను
వాదించెదు నట్టి భాగ్య•వంతులు దయతోఁ
లేదనక నిత్తు రెంతయు
సాదరమున ధనము వార • సతులకు శి... 93

క. ద్రవ్యముఁ గలవాఁడే సం
స్తవ్యుఁడు మాన్యుండు బుధుఁడు • సద్గుణయుతుఁడున్
సేవ్యుఁడు స్మరరూపుఁడు మఱి
దివ్యుఁడు నతఁడేయటందురు • తెలియుము శి... 94

క. ధనహీనుఁడు పాపాత్ముం
డనయము దుఃఖాబ్ధిమగ్నుఁ•డత్యల్పుండున్
జననిందా పాత్రుండును
గనుఁగొనఁగా వానిబ్రతుకు • కష్టము శి... 95

క. విద్యావంతుం డీభువి
సద్యశమును నందుఁదనదు • జ్ఞానముచేతన్
అమ్యల ధర్మములెఱుఁగును
విద్యామహిమంబుచేత • వినుమా శి... 96

క. జ్ఞానమె నరునకు నేత్రము
జ్ఞానవిహీనుండె యంధ•సదృశుఁడు గానన్
జ్ఞానము సంపాదింపఁగఁ
బూనవలెన్ జన్మమందుఁ • బుధుఁడు శి... 97

క. కర్జము భువిలో నరునకు
నార్జన వినయాదిలక్షణాఢ్యుండై తా
దుర్జన సహవాసంబు వి
సర్జన మొనరించుటరయ • సత్యము శి... 98

క. పాపపుఁ గార్యంబులచేఁ
గాపురుషుం డనెడిపేరుఁ గనుఁ•గాన నరుం
డేపున సత్కార్యములే
చేపట్టినఁ గల్గుఁగీర్తి • సిద్ధము శి... 99

క. మనమునకుఁ దోఁచినట్టివి
వినిపించితి ధర్మములను • బ్రీతిదలిర్పన్
గొని వీని సద్యశంబును
గనుమా! చిరసౌఖ్యములను • గనుమా శిష్యా. 100

క. వేదము వేంకటకృష్ణ స
మాఖ్యుతనాయుఁడను. బండి•తాగ్రేసర స
త్పాదాబ్జ సేవకుఁడ, నే
నాదేసించితిని నీతులరయుము శిష్యా. 101

క. చెలికానికొలము పాలక
డలిఁబుట్టిన లచ్చిరాయఁ • డను దొరకిదె, నే
లలి నీపొత్తము నిచ్చితి
వెలయంగ నతనియశంబు • పృథివిని శిష్యా. 102

శిష్యనీతిబోధినిశతకము
సంపూర్ణము.

## కృతిపద్యములు.

ఉ. శ్రీ చెలికాని సత్కుల సరిత్పతిచంద్రమ! లచ్చరాయ నే
నీచరితంబు నెంచఁగను నేర్తునె? యెల్లెడ దేశమందు నీ
యాచితిప్రస్తుతింపఁబడె నాంధ్రవధూటిని బెక్కుభంగులన్
బ్రోచితి ప్రోచుచుంటి విఁక బ్రోవఁగలాఁడవు నిక్కమారయన్.

సీ. ధీవర్య! నే వ్రాసితిని "శిష్యనీతిప్ర
బోధిని"యను నట్టి పొత్తమొండు
కందపద్యములు నూఱందును గలవవి
యందఱి కుపయోగమగు నిజంబు
తమ దివ్యసన్నిధానమునకుఁ బంపితి
భాషాభిమానులై పరగుతాము
చేకొని దానిఁ బ్రసిద్ధినొందిన "యాంధ్ర
భాషావిలాసినీ" ప్రథితనామ

గీ. పత్రికారాజముఖమునఁ బ్రచురపఱుపఁ
బ్రార్థనముసేతు విపుల కృపార్ద్రహృదయ
ప్రాకటీకృత గ్రంథప్రకటనకర
లలిత సుశ్రీనికాయ శ్రీ లచ్చరాయ.



శ్రీరస్తు

కవిప్రభునామగుంభిత విచిత్రపద్యగర్భిత కందపద్య

# సకలేశ్వరశతకము.



క. లలిసీసల పదకొండును, బొలుపుగ పదమూడువర్ణములు సీసపద్య
మ్ములవదలక విడిచిమధ్యము, గలవర్ణములకవినామాంకగవిప్రాయమగున్.

సీ. శ్రీరావువంశవారిధిచంద్రుఁడకలంక విక్రమక్రమదానవిశ్రుతుండు
వరదానసాహితీసరసకవిత్వాంధ్ర యవనహూణాది భాషాన్వితుండు
ధైర్యగాంభీర్యచాతుర్యసౌందర్యవర్యకుమారమహీపతిప్రభుకుమారుఁ
డబ్జచందనమనోహరసితాయతకీర్తి శ్రీధర్మరాయధాత్రీవిభుండు
భవ్యతేజస్కుఁడా బాంధవావతంసు
లోకదరి మంత్రిసత్తము లోకసీమ
సత్కవీశ్వరు లోకచో సంచరింప
నిండుకొలువుండె నాఖండలుండనంగ. 1

సీ. ఈకీర్తిగాఁ గొల్వుదీరిచి పెంపొంద పండితులనుగాంచి పలికెనిట్లు
నిరుపమానప్రజ్ఞ పరగంగ నెవ్వరైన సంస్కృతగీర్వాణస్థాంధ్రభాష
భవ్యపద్యమ్ములఁ బ్రభువుపై నిర్మించి తత్పద్యములుగుంభితంబుగాఁగ
మధ్యమందమరించి మదిమోదమిగులొత్తఁగా సకలేశనామాంకమొప్ప
సర్వవిద్వత్కవీంద్రు లాశ్చర్యమొంది
సారెసారెకు నెలమిచే సన్నుతింప
భక్తిచేఁ గందశతకంబు పాటవమ్ము
దోచఁ గావించు టత్యంత దుస్తరంబు. 2

క. ప్రమదము మెయి నిటులనఁ ద, త్సమయంబున నాన్నృపాలచంద్రుంగ
నుచుం । గ్రమమొప్పనొనర్చెద నే, నమరఁగ నీయాజ్ఞకరణి ననుచు వచింపన్. 3

క. విధికనకవసన వలయము, లును ఘోటీపేటికాదులును సమోహ్లాదం
బున నిచ్చి సెలవొసంగెన్, ఘనులునుతింపంగఁ జేయఁగడగితిఁ గటులన్. 4

---

క. ఈమరగుమనమున నియిరు,
వద్దైదుపద్యముల సమపాదములలోఁ
బొదలెడు నైదవవర్ణము,
లిదెకనుఁగొనసుకవిభావ మెసఁగు నరేంద్రా.

శ్రీరమణ శ్రీకారణ, వారణ దనుజారి ఘోరపాపవిదారీ
మారవిరోధీ కలశ, క్షీరధి శరధీ మహేశ శ్రీసకలేశా. 1

జితరక్షా సతరక్షా, యతిదీక్షా సహిత దక్షయాగవిపక్షా
ప్రతికూల నిరీక్షా వి, ష్వక్పృతి భస్మీకృతరతీశ శ్రీసకలేశా. 2

ఖలరోషా గలభూషా, ఫలమోషక తామసీష ఘనసంశ్లేషా
కలితోజ్జ్వల దుష్టీషా, శిరముఖీకృతరమేశ శ్రీసకలేశా. 3

త్రాతామరజాతా శర, ధౌతాకర హరిణపోత దైత్యవిజేతా
భూతప్రణయసమేతా, శీతావనిధరనివేశ శ్రీసకలేశా. 4

పరకాంతా పరహంతా, వరదాంతాదర నితాంత భవుకస్వాంతా
గరహార సూరవార, స్థిరసారతరప్రకాశ శ్రీసకలేశా. 5

హృతసంసృతి సంతాపా, సితభాను కిలాకలాప శ్రీకరరూపా
కృతదుష్కార్య విలోపా, శ్రిత సంభృత్యభినివేశ శ్రీసకలేశా, 6

పురగర్వాకర పూర్వా, మర దుర్వారణగణ ప్రమాపణహారా
హారదైత్య రాజబాణా, ధరసంస్థభటాపదేశ శ్రీసకలేశా. 7

కరుణావరుణాగారా, చరణానతభక్త పాపవర్జితచారా
వరభక్తాయత్తవిభవ, మకరధ్వజనాశ గిరీశ శ్రీసకలేశా. 8

బాలహరిణాంకఫాలా, కాళీహృన్నయనాంబుజాళి కల్మషపటలో
ద్వేలాంధతమసహేళీ, లీలాకరవాస నిరీశ శ్రీసకలేశా. 9

భోగపరా భోగకరా, భోగిధరా భరణభక్తభూర్యనురాగా
యోగవిహార హీరగౌరా, శ్రీగగనశిరోజహాస శ్రీసకలేశా. 10

చిరవేద్యా నిరవద్యా, హరవిద్యాధర ఘనాయితాయతకీర్తి
కరుణాధీనా బాలశి, శిరభానుకలాకలాప శ్రీసకలేశా. 11

ప్రథితప్రథితారాతీ, గ్రథితాఖిల లోకరీతి రమ్యవిభూతీ
విని విగ్నేము వినీతి, శిథిలీకృత మోహపాశ శ్రీసకలేశా. 12

శర్వహరా సర్వసురా, ఖర్వ విరాజత్కిరీట ఘటిత మణిశ్రీ
ధూర్వహ హృద్యైక పదాబ్జా, నిర్వృతిసుఖదాగుణాత్మ శ్రీసకలేశా. 13

గిరిధర్మా కరిచర్మాం. బర నర్మాలాప ముదిత మహాభృత్కన్యా
వరమానసపద్మాక్షను, స్థిరపీతానగరసద్మ శ్రీసకలేశా. 24

అలమూర్ప్రాలేయాచల, నిలయా నిలమూపహారి నిర్మలనామా
విలసద్వేహాబిడౌజ, శ్శీలా పితగళప్రకాశ శ్రీసకలేశా. 15

శరదభ్రశుభ్రదీప్తి, స్ఫురదభ్రధునీశితాభ్ర శోభితగాత్రా
భరితభక్తి జనస్తోత్రా, చిరతరకారుణ్యపాత్ర శ్రీసకలేశా. 16

నగకోదండ మురార్యా, శుగ వేదండాస్య జనకశుభ కృచ్చర్యా
జగధీశా సత్కృప వా, సిగనను రక్షింపుమయ్య శ్రీసకలేశా. 17

సత్యపరా నిత్యధరా, పత్య విరాజితశరీర భవ్యవిచారా
దైత్యనిరాకరణాత్మా, మృత్యువిరామహర గిరీశ శ్రీసకలేశా. 18

వందిమామా శర్వభవ, న్మందిరమౌన్ మద్యుల్ డేగినం గరికరిణీ
వందోషాం బెలమిఁదదా, ళందమునం బాదలునీశ శ్రీసకలేశా. 19

గౌరీకుచముద్రిత క, స్తూరీ ఘనసారసార సురభితవక్షా
దూరీకృతానృతా సర, సీరుహసుహృదిందుచక్ర శ్రీసకలేశా, 20
జితకామా నుతనామా, ధృతసోమా విమత భీమదేవలలామా
శతభానూపమధామా, కృతదుష్కృతజాత నాశ శ్రీసకలేశా. 21
ఎదనన్ను బ్రోతువంచున్, ముదమొప్పఁదలంచి నీకు మ్రొక్కెదభక్తిం
బ్రదరద్దితిజామిత్రా, త్రిదశమనఃపద్మమిత్ర శ్రీసకలేశా. 22
యశముం బెంచును దోష, ప్రశమనముం జేయు నీదు భక్తి గిరీశా
విశదాత్మా బిల్వప్రియ, శశిరాంశుకలాకలాప శ్రీసకలేశా. 23
వనజాప్తామితధామా, మునిరాజసమాజ లబ్ధపూజాకలనా
వినతబిడౌజా నాగా, జినవాసా గిరినివాస శ్రీసకలేశా. 24
శ్రీకరనామున్ దురితా, నీకహరామున్ భజింతు నిన్మహనీయా
లోకసమాజాభక్తవ, శీకర శంకర మహేశ శ్రీసకలేశా. 25

---

క. అమరఁగ నీ మొనిమిది ప
ద్యములం బ్రతిచరణమందు నాఁబవదగు వ
ర్ణమునరసిచూడఁ గవిభా
వముదోఁచును ధర్మరాయ వసుధాధిపతీ.

హరిహయ నీరేజాసన, హరిముఖదేవాభివర్ణితామలచరితా
పురహర భూధరమందిర, పరమసముద్యత్కృపాత్మభవ సకలేశా. 1
భవశిక్షిత చతురాస్యా, భవభవ నాకాశికుంభభవ మహితస్తా
భవ గజచర్మపటావృత, కవిజనితాపద్వినాశకా సకలేశా. 2
దరశరగీర్ణలనాసుం, దరవిగ్రహా శివపవిత్రనామ సమూహా
చరితతిమిరాబ్జబాంధవ, చిరతరగేయానుభావ శ్రీసకలేశా. 3

శరణీకృతగోత్రసుధా, కర పావక మిహిరనేత్ర కరుణాపాత్రా
సురజనభయాపహరణ క, త్పరమానస సత్ప్రభాంచితా సకలేశా. 4

సితశతపత్రకలంబా, కృతనతమహితప్రవరేంద్ర హృదయావాసా
ప్రతతవిరోధవినాశక, శ్రితజాలక కల్పభూజ శ్రీసకలేశా. 5

సుమనోనాయక మకుటీ, సముదాయ వికాసిరత్నసాంద్రవిభాంచ
ద్విమలపదపంకజుని నే, ల్లు మదిస్మరియింతు నీశ సకలేశా. 6

హరిబాణ జలధితూణా, సురనిలయా కలితచాప శోభితహారా
పరిహృతపాపాశితగళ, స్థిరతరశశ్వద్గుణాఢ్య శ్రీసకలేశా. 7

సితసారస శీతకర, ప్రతిభా నిరంతరస్ఫురద్విపులయశా
క్షితిభృత్తనయాకుచతట, సితాభ్రభవమరుదవాట శ్రీసకలేశా. 8

---

క. కుదురగు మనమున నీ యిరు
వదైదు పద్యముల నసమ పాదంబులలోఁ
బొదలెడు నాల్గవ వర్ణము
లిడెకనుఁగొన సుకవిభావమెసఁగు నరేంద్రా.

శ్రుతినవనీనుయుఁ డఖిలం, బితగతి నక్షోత్తమంబు వినయవిభూతిం
గృతియుఁ జెలంగును జగతిన్, శితికంఠశివా గిరీశ శ్రీసకలేశా. 1

నుతిశీల సమున్నతినతి, హితతామోదంబువలన విరిశాంతమతిన్
యతిపాలుపుమీఱు నతిరా, జితపీఠపురీనివేశ శ్రీసకలేశా. 2

మానుగనాకమణి నైకశి, లానీకము నను బ్రవీణుఁ డజ్ఞులలో నెం
తేనలువొందును స్మరహర, సేనాధిపజనక యీశ శ్రీసకలేశా.

తలపొప్ప సుజనసంగతి, నలిపిన సత్కీర్తిగల్గు సంపదలెసఁగుం
దొలఁగు దురితాళిచిత్తము, జెలఁగును నైర్మల్యవృత్తి శ్రీసకలేశా.

శరణాగతభరణ పరా, కరిచర్మాంబర త్రిశూలకర వృషభాధీ
శ్వర సైంధవశరదంబుద, శరదరసంకాశ సద్యశా సకలేశా. 5

పరికలితరోషమతివై, పురములఖండించి లోకములఁ బ్రోవవె నీ
వురువర్త్మవచనరచనా, పరితుష్టోమా మనోజ్ఞభవ సకలేశా. 6

మతినబ్బురమగు నీగతి, శ్రితహితజనతానుకూల శిక్షితకాలా
తతహోరాయితఫశివర, కృతకాన్యవచోగ్రవేద్య శ్రీసకలేశా. 7

కడుఁ జాలభక్తి మనమునఁ, గడుఁ బూనిన నీదునామగణసంస్మరణం
బునునాయకధరహార నే, నడరించెద సద్గుణాకరా సకలేశా. 8

కరుణాయుత తరుణాయుత, సురుచిరతేజా సుధీంద్ర సురధరణీజా
వరదనిరాకృతదుష్కృత, చిరవైభవ పార్వతీశ శ్రీసకలేశా. 9

కరయుగ్మముముకుళింపుచు, నిరతముయుష్మద్వరాంఘ్రిపీరజములకుం
బరమాదరమునఁ బ్రొక్కెద, సిరులిడిరక్షింపుమయ్య శ్రీసకలేశా. 10

ఘనకలితదానసంపద, జనపతి గాంభీర్యగరిమ చారుకవిత్వం
బునుదళుకొందును గడు ధా, త్రిని బీరపురినివేశ శ్రీసకలేశా. 11

క్షితినారాయణుఁ డదుకుల, గుతుకాప్తిఁగుచేలుఁడిడఁగఁ గొనుగతినాస
న్నుతిగైకొనుముపురుతరసం, సృతినాశక పార్వతీశ శ్రీసకలేశా. 12

ఇలభావుకమతి నీకతి, సలలితమా నొక్క పుష్పసరమొసగంగాఁ
బలుముక్తిఁపుసరముల రా, జిలనాసజ్జనుఁడుదాల్పు శ్రీసకలేశా. 13

తమినీకొకతతి నభిషే, కమొనర్చుమనీషి మస్తకముపై సురలో
కము వేడుకమీఱఁగనుము, సమితివ్యాప్తించు శ్రీదసఖ సకలేశా. 14

త్రిదశాలంబుని మునినుతు, సదయాత్ముని నిన్ను సంతసము సంతతము
న్మదినిఁ బెనఁగొనఁగ నేఁగొ, ల్చెదఁ బీరపురినివేశ శ్రీసకలేశా. 15

సదయపురాసురహారుని, స్మరదనమదధ్వంసి నీలమణిగణశోభా
స్పదగళునిన్నిను మతిఁజే, సెదఁ బీరపురినివేశ శ్రీసకలేశా. 16

గిరిచాపా హృతనతజన, పరితాపా తాపసేంద్ర భజితపదయుగా
వరద కుజనసంహారసు, స్థిరపీఠపురీనివేశ శ్రీసకలేశా. 17

ఘనకులజులకాచారము, ధనికులకౌదార్యమార్యతతి భూషణమై
దనరఁగలదంచుఁ దగఁబ, ల్కెను బీఠపురీనివేశ శ్రీసకలేశా. 18

నుతసకలగుణవిశేషికిఁ, బ్రతత ప్రతిపాదనంబు వల్లికి సుమసం
తతి మిన్నగ కరుణుఁ డలం, కృతి పీఠపురీనివేశ శ్రీసకలేశా. 19

నిలుకడలేనిమనంబును, జెలువమొకించుకయులేని చెలిప్రాయంబు
న్వలపొదపనికూటమియును జెలువొందదు సత్ప్రకాశ శ్రీసకలేశా.

అతిలలితసుకవితాప, ద్ధతికిం బాంఢితివిహీయుతమునకుఁ బ్రియవ
స్స్మృతసామ్మగదాభవమిల, సితపీఠపురీనివేశ శ్రీసకలేశా. 21

కలిమికి నిర్మదభావము, బలిమికి శౌర్యంబుగలుగ బంగారునకు,
న్వలపల రెడుకీతివిరా, జిలపీఠపురీనివేశ శ్రీసకలేశా. 22

ఎదఁబూనెదముదమునసీ, పదములనన్ బ్రోవుమీశ భవ్యసమాఖ్యా
సదవనిసురచాతకవా, రిదపీఠపురీనివేశ శ్రీసకలేశా. 23

కలకాలముబ్రోచెదవని, తలపుచునిన్నాశ్రయింపదయగల్గదొకో
పొలుపలర నింకనైనను, జెలిమిన్ననుఁబ్రోవుమీశ శ్రీసకలేశా 24

అజగేహ్యై కనుచరుతుని, గజవైరిన్నిన్ను సుకృతిగణమెదలోన
న్భజియించున్ క్షితిరథకృత, వృజినవినాశామహేశ శ్రీసకలేశా. 25

---

క. అనుపమమగుమతిఁ గుతుకం
బున నీపదిరెండు పద్యములఁ బ్రతిచరణం
బునఁ నాఅపవర్ణములం
గనినం గవిభావమెసఁగుఁ గలితసుకీర్తి.

వినుతగుణప్రకరాకర, ఘనసుమన స్సుఖకరోరు కరుణాభరణా
ధననాథాప్త విశిధ న్న, తినజాలక ఘనసమీర శ్రీసకలేశా. 1

ఎలమిం దావకపదముల, కిలనగుఁడొక మూరుపాద్యమిడ ఖేచరశై
　వలినింగడు జలకేళిం, జెలువారనొనర్చు నతఁడు శ్రీసకలేశా. 2
జనుఁడొక హాటకకుసుమం, బునవిన్నతి విమలమతిని బూజింపమణీ
　కనకాయుతాయ తనరా, జినెసంగును యతినుతాఖ్య శ్రీసకలేశా. 3
కుతుకంబు విరాజిలనతి, సతతము నీపాదములకు సల్పునరుఁడసం
　గృతిజనమెంతేని నమ, స్కృతులిడు నీశానగిరిశ శ్రీసకలేశా, 4
నుతిపదభావుకచరితా, తతదురిత లతావితానదాత్ర వరసుధీ
　హితపాలిత భువనాళి, క్షితిరథ వనజాప్తతేజ శ్రీసకలేశా. 5
ప్రకటాంచితకుశల వినా, యకజనక నభోనదీధరా కలిత జటా
　నికరా సుకవిస్తుత భూ, రికృపాత్మక యఘవిదూర శ్రీసకలేశా. 6
కరధృతశూలా పరము, ష్కరదానవలోకహారణ కరణ ధురీణా
　గరకంధర ధరణీధృ, ద్వరసద్మా శామ్యదహితతతి సకలేశా. 7
సితనలినాబ్ధిచరామృత, శతధృతి లలనాబ్జకుముద శరసంకాశా
　నుతధీసుకర్మపోషణ, కృతముఖశాసిత రతీశ శ్రీసకలేశా. 8
మదనాహిత సుకవీకృత, పదసేవక గురుతరప్రభావయుత వర
　ప్రదయమగంధవిదారీ, త్రిదశాదృత తతనిదేశ శ్రీసకలేశా. 9
శంకర విబుధాధిపతివ, శంకర హరిణార్భకాంకశయ సరసిరుహా
　పంకహర ధరాగారవి, శంకటతర శార్ఙ్గపాణిశర సకలేశా. 10
తుహినగిరికన్యకాకుచ, నిహితాగురుకలితవక్ష నిరుపమభూతీ
　మహిత వృషాధిపవాహా, బహులాంచద్గోత్రనిచయభవ సకలేశా.
నుతిఁజేతున్సారకలయే, నుతరామశిరఃకవద్విమాత్న కుముదినీ
　హితపుష్ట తపోధనతే, హతచిత్తభువఃపదాబ్జమని సకలేశా. 12

---

క. అనుపమమగుమతిఁ గుతుకం, బుననీపది రెండుపద్యములఁబ్రతిచరణం
　బున నాల్గవవర్ణములం, గనిరం గవిభావమొనఁగుఁ గలితసుకీర్తి.

అజరామానుజవినుతా, రజనీశ కళాకలాప లలితసుహాసా
రజత ధాత్రీభృదగారా, యజరామరణైక్యతాశ్రితా సకలేశా. 1

సర్వచరస్థిరకారణ, సర్వసురస్తవరేణ్య సారతరగుణా
పూర్వామర సంహరణా: ఖర్వమతీ ఘనకృపాత్మకా సకలేశా. 2

అంబరమణి ప్రభాకర, సాంబ పరాత్పరకరాత్తహరిణఘనశ్రీప్రా
లంబాశమనాభీలది. గంబర ధర్మాచలంబహర సకలేశా. 3

గారిమనోజ్ఞ సతతవి హారిసుకుమార మారహర గిరిపరసం
చారిరణ రంగాహత, వైరి నిర్మాలినభవభవ సకలేశా. 4

పర్రదాహకవృషవాహా, వరనామా సుగుణధామ పరమానసరా
కరుణాతరంగితాత్మా, చిరఘోరాఘాభ్రపవన శ్రీసకలేశా. 5

సురచారణవిద్యాధర, గరుడోరగసిద్ధసాధ్యగణ గుహ్యకకి
న్నరదానవమౌళీమణి, స్థిరభాయతనాంఘ్రిపద శ్రీసకలేశా. 6

కృతసవనాశ గిరీశా, ప్రతత మహాసలిలజాల రమణీయగళా
కృతిగేయ సచ్చరిత్రా, జితభాభవామహేశ శ్రీసకలేశా. 7

మదవారణవైరి విభి, సుదతీ హిమవిమలకమలసూతశ్వేతా
బ్జదరా విరాట్పరద్వా, ఇదభానురసప్రకాశ శ్రీసకలేశా. 8

అనఘసుధాకరమౌళీ, ఘనతాపసహృదయపద్మగణరోలంబా
త్రిణయనవస్త్రీభూతా, జినబాధాహరణశీల శ్రీసకలేశా. 9

ఘరజాకుచకుంకుమవి, స్ఫురణాతివిభా సమానభుజమధ్యయుతా
పరమాయతతేజా శ్రీ, కరవేధితమఃపురాంధకా సకలేశా. 10

వరదా మానసమున ని. గ్గరమారాధింతు విపులకలమయుతంబూం
భరితస్ఫారకృపాత్మన్, చిరకృపమాపాహియంచు శ్రీసకలేశా. 11

మతికారణసన్నుతి నీ, గతిఁ జేయభ దనుకంపగలుగద దేవా
కృతివారవర్ణనీయాం, చితకీర్తి నగనివేశ శ్రీసకలేశా. 12

క. క్రమముగ నీయెనిమిది ప,
ద్యములన సమచరణములనుదగు నష్టమవ
ర్ణము లరసిచూడఁ గవిభా
వముతోఁచును ధర్మరాయ వసుధాధిపతీ.

నిరతముఁబ్రోవఁగ దేయని, పరమానందంబుమీఱ భజియింతు గినున్
భరితమహానుగ్రహ సుర, చిరసురపథ కేశపాశ శ్రీసకలేశా. 1
హారదక్షదక్షపవహర, కరిరక్ష శ్శిక్షకా వికాసిత వినమ
ద్వర సనకముఖ్యముని సు, స్థిరమానస సరసిజాత శ్రీసకలేశా. 2
శపలుఁడ లోభాకరమతి, నపరిమితక్రూరవృత్తినగు నాదగు వి
న్నపమొకతఱి వినుము సరీ, నృపనాయకమణి కలాప శ్రీసకలేశా,
అలికాక్షభవ భవార్ణవ, కలశోద్భవ వేదపాదకటకోపేతా
బలభిద్వినుత నగోత్తమ, నిలయా శశధరశిరోమణీ సకలేశా. 4
సురుచిరనురహారిణాక్షీ, చిరభోగాభోగ మొక్క శ్రీఫలదళము
న్నరుడొకతఱి గోరికనీ, శిరమున నర్పింపఁగలుగు శ్రీసకలేశా. 5
పురహర మృత్యుంజయ శివ, ధరజామాతా కురంగధర నలినాక్షా
దరణీయచరితయుత శం, కర ప్రమథగణాధినాయకా సకలేశా. 6
హరహరయంచు న్నినునొక, పరి కౌతూహలమెసంగఁ బల్కిన వోఁడాఁ
దిరమగుచును జెన్నారెడు, సిరిగల్గి జెలంగునరుఁడు శ్రీసకలేశా. 7
ముదవనరిసమగ్రచమూ, ముదితసమీరాయతే నమోనమయంచు
న్మదమొదవనిన్ను నుతిఁజే; సెద సదయగుణాప్తశ్రేణీశ శ్రీసకలేశా, 8

---

క. క్రమమెప్పఁగ నీపది ప
ద్యములం బ్రితిచరణమందు నైదవదగు వ
ర్ణము నరసిచూడఁ గవిభా
వము దోఁచును ధర్మరాయవసుధాధిపతీ,

తా శ్రీదయుతా, జాదినుతా ధరనుతాన్వితా పృథ్వీనిధీ
నోధికాండ ధీసు, శ్రీద మహేశాన గిరిశ శ్రీసకలేశా. 1
రాపితాప్త, ప్రతితీభర్మాద్రిచాప పాపహర విభా
దేహా గురుత్వక్షిత. సితతేజ త్రిగర్భభూజ శ్రీసకలేశా. 2
సుభావుకప్రద, భూతాధిపరాజమకుట భూరిదిశా సం
తపట దేవజనతా, చేతస్స్వామరసతపన శ్రీసకలేశా. 3
గావేంద్రసుతా, ధవ్రనభవ నఖర్వాపరప్వద్రై తేయద్రా
రదవ్రుక్ గొల్చెదరి, న్నివదేవా చింత్యాగిభవ శ్రీసకలేశా. 4
కరిద్వైరీ, గిరిచాపి గాఢకోప కృత్తపుర నిశా
రాడ్బలసర్వామర, శిరోధృతాంచితనిదేశ శ్రీసకలేశా. 5
త్కటసత్కీర్తి, వరదా హరిబాణబాణ పలభుగ్రథా
నిత్వాపర శంకర, చిరభూతీ నగనివేశ శ్రీసకలేశా. 6
హ మహానీయాం, చితనామా మునివరేణ్యచిత్తవిహారీ
నన్మల్లిసితవిదా, రితపుర శర్వామహేశ శ్రీసకలేశా. 7
హితా సీతా, పతి పూతఖ్యాతిచరిత వర్ణనశీలా
తాఘుతతిపనాగ్న, సితిహృత్సరసిరప్రకాశ శ్రీసకలేశా. 8
పమధానూ, కలశీజా శ్రితపదాబ్జ కారుణ్యరనా
తా సమ్మదము విరా, జిలఁ దానకభక్తినిమ్న శ్రీసకలేశా. 9
ప్రతిక న్యా సం, గతనిం జతురాస్యగర్వఖర్వకరణా
నిం జెన్నగునుతిఁ జె, సితగ్రోవము నన్మహేశ శ్రీసకలేశా. 10

---

క. అమరఁగ నీయెనిమిది ప
 ద్యములం బ్రతిచరణమందు నాలవదగు వ
 ర్ణము నరసిచూడఁగ విభా
 వము దోఁచు ధర్మరాయవసుధాధిపతీ.

కుటిలాంతక దిక్పటలీ, పటుశోభిత శాతశూలపాణిసరోజా
నటనప్రధానశీలా, పటుతర కేశవకలంబ భవ సకలేశా. 1
భవస్మయభాగ్బ్రహ్మపకీ, భవకార్యాకలితశౌర్య పావనచర్యా
కవిచంద్రస్తవనీయా, శివప్రవితతగుణదనంత శ్రీసకలేశా. 2
వినిహతజిహ్మశ్మపలా, శనజాలక వాసవాదిసర్వక్రతుభు
గ్వినుతా తూణీరాయిత, వనధీ శితికంఠ గిరిశ భవ సకలేశా. 3
వరతుహినాద్రీందుమణీ, శరదంభోవాహ కుందచందన రజనీ
కరసంకాశా త్రిజగ, త్పరికలిత ప్రాణినికరపతి సకలేశా. 4
హరిశంకర దుర్జనభూ, ధరరింఛోళీ శతార ధనపతిమిత్రా
వరదా పంచేషుహరా, గుణకృపసంభృత విశేషగుణ సకలేశా. 5
తతకరుణాసంగత సం, తతదివ్యనికేతనీకృతశ్రుతి మాళీ
హితమోద విధానాత్మా, హతత్రిపుర తీవ్రనరకహన సకలేశా. 6
జయభువనఖ్యాత మహా, జయనానాంహోవితాన సాంద్రవన ధసం
జయభాస్వద్గాత్రధసం, జయనుతనికృతాశ్రితావజయ సకలేశా. 7
మంగళమస్తకనద్గుణా, సంగతహర భోగికృపాప్రసారాత్మకతే
రంగచ్ఛరదబ్దే భసి, తాంగయని సతంబుదంతు హర సకలేశా. 8

సంపూర్ణము.





శుభమస్తు.

# మాధవశతకము.



శ్రీ సీతాపురమందు భక్తులను రక్షింపం దలంచి ప్రాపిం చ
దాన్వయవారంబులఁ జక్కఁజేయుచుఁ గిరీటాద్యుత్తమాలంకృతిన్
దీపింపన్ జిఋపవ్వమోఘు దగఁ గుంతీదేవిచేతం బ్రతి
ష్ఠాపూజల్ గనియున్న నిన్ గొలిచెదన్ స్వామీ హరీ మాధవా.

శా. క్రూరుల్ చేసెడి దుష్టకృత్యములఁ బోఁగొట్టంగ శిష్టావనన్
ప్రారంభించిన సాధుకృత్యములఁ గాపాడంగ నూహించి యా
ల్వారన్ యాదవవంశమందు జననంబై మున్ను శ్రీకృష్ణుఁడన్
పేరన్ బ్రబలినాఁడ వీవెకద సేవింతు న్నినున్ మాధవా. 2

మ. తొలిధర్మజ్ఞులు పాండునందనులకున్ దుర్యోధనుం డెన్నికోం
దలముల్ గూర్పఁదలంచినన్ భువి భవత్కారుణ్యయుక్తేక్షణం
బులచే నయ్యవిగీటణంగుచు శుభంబుల్ వారికెల్లప్పుడున్
గలిగెన్ గావున నీవు సాధుజనరక్షన్ జేయుమో మాధవా. 3

మ. మినుకుల్ వే యిఁకనేల కూళయు నజామీళుండు నారాయణా
యనుచున్ దాను నిజాత్మజుంబిలువఁగా నపుణ్యాత్ము నెంతేదయన్
గనుచున్ వానికిఁ గాలకింకరులసంఘాతంబుచే సంభవిం
చినబాధల్ దొలఁగించి మోక్షపదవిం జేకూర్చితో మాధవా. 4

మ. దురితాత్ముం డగుకైటభుం డనెడుదైత్యుం డెల్లలోకంబులం
దురుహింసాన్వితకృత్యముల్ సలుపఁగా నుద్యన్మహాక్రోధవి
స్ఫురితస్వాంతుఁడవౌచు నయ్యసురుని న్బోరన్ వడిం గూల్చి భూ
భరము న్మాన్పినవాఁడ వీవెకద దేవా శ్రీహరీ మాధవా. 5

మ. అలరాధానలినాయతాక్షిపయి నత్యంతానురక్తుండ వై
లలితంబై సుమనోజ్ఞమైన సరసాలాపంబులన్ లీలతోఁ
బలుకన్ డాయుచు యామునాంబువులలోఁ బల్మాఱు క్రీడావిచే
ష్టలుగావించి తదంగనామణిని హృష్టంజేసితౌ మాధవా. 6

మ. కపటస్వాంతముతోడఁ బూతన విషాక్రాంతస్తనద్వంద్వమై
నిపుణత్వంబున నీకుఁ బాల్గుడుప నానీచాత్మభావంబు నీ
వు పరబ్రహ్మమవౌటచే నెఱిఁగి యాపూఁబోఁడిప్రాణంబు లో
క్కపరిన్ బీల్చి వధించినాఁడవు జగత్కల్యాణదా మాధవా. 7

మ. పటుకేయూరపరిష్కృతంబయిన నీ బాహాచతుష్కంబు ది
క్తటముల్ నిండినశోభతో నెసయఁ బద్ధాగ్రైనలోకాళి యు
త్కటభారంబువహింతు వీవని జనౌఘం బెన్నునే నీదసూ
స్ఫుటవీక్షావళి సోఁకి రక్షిదునం మన్ దెల్పెదన్ మాధవా. 8

మ. యమునాతోయములందు గోపికలతో నానందమొప్పన్ విహా
రము గావించుచు శీకరంబులరుదారన్ జల్లుకొన్నట్టి కా
లమునన్ వారికిఁ గల్గినట్టిసుఖము ల్వర్ణింప శక్యంబె యా
వ్రజసుదల్చేసినపుణ్యమెట్టిదియొ చెప్పంజాలనో మాధవా. 9

శా. శూరుండై నరకాసురుండు జగముల్ క్షోభింపఁగాఁజేసి చె
న్నారంగాఁ బదియాఱువేలనృపకన్యాశ్రేష్ఠలన్ బల్మిచేఁ
గారాగారముఁ జేర్ప నయ్యసురునిన్ ఖండించి బంధస్థలౌ
వారిన్ నీవుఁ బల్చి యాదవజ సుఖింపంజేసితౌ మాధవా. 10

శా. నీతోడన్ సహచారులై నిరతమున్ నీసత్కృపాపాత్రులై
గోతండంబుల మేపు గోపకులు పెక్కుల్ గా భవద్వేణు సం
జాతంబుల్ ఘనగీతముల్ విని యతిశ్రావ్యంబులై యుంట సం
ప్రీతిం బొందిరి వారొనర్చిన తపశ్శ్రీయెట్టిదో మాధవా. 11
శా. రాసక్రీడలొనర్ప గోపకవధూరాజ్యంతరస్థుండవై
నాసాగ్రంబున వారు కితకం బమర మందస్మేరవక్త్రంబుతో
భాసిల్లంగను దొంటినోముల ఫలంబాయంచు వారెన్నఁగన్
నీసాన్నిధ్యము వారి కబ్బెనుగదా నిత్యంబు శ్రీ మాధవా. 12
శా. నీసందర్శన మాచరించినరుండే మోక్షముం బొందెడున్
నీసేవన్ సతతం బొనర్చుపురుషుండే మంచి ధన్యాత్ముఁడౌ
నీసూక్తుల్ వినినట్టిమానవులకున్ నిత్యంబు వైకుంఠ సం
వాసంబబ్బునటంచుఁ జెప్పఁగఁదగున్ బక్షిధ్వజా మాధవా. 13
శా. నిన్నున్ జూడని కన్ను లేల యెపుడున్ నీస్తోత్రమున్ జేయ లే
కున్నన్ జిహ్వయ దేల నిన్ను మదిలో నూహించి ధ్యానింపలే
కున్నన్ జిత్తమదేల నీకుఁ గుసుమవ్యూహంబుచేఁ బూజలన్
బన్నన్ లేని కరంబదేల యనుచున్ వాక్రుచ్చెదన్ మాధవా. 14
శా. నీయాలింగనసౌఖ్యముం బొరయ నెంతేఁ గోరుచున్నట్టి స
త్యాయోషామణిఁయున్ మొకల్లలుగు నబ్జాక్షుల్ నినుంజూచు వా
రై యుద్వాహంబొంది రట్టిచరితం బాలించు మర్త్యాళికిన్
బాయున్ సంసృతిపాశబంధములు సంభావింపఁగన్ మాధవా. 15
శా. నీనామంబు స్మరించనేని దురితానీకంబు నిర్మూలకం
బౌనంచున్ మదిలోఁదలంచుచును నిత్యంబున్ భవన్నామమే
శ్రీనారాయణ వాసుదేవయనుచున్ గృష్ణా స్మరింతున్ జుమీ
నీనుండ న్ననుఁ బ్రోవుమీ కరుణతో దేవా హరీ మాధవా. 16

మ. తొలి సాధుండు గజేంద్రుఁ డమ్మకరిచే దుర్వారబాధాప్తి వి
హ్వలుఁడై నిన్ను హరీహరీయనుచుఁ బ్రోవన్ వేఁడుకోఁగా దయా
కలితస్వాంతుఁడవైన నీవు మొసలిన్ ఖండించి నాగేంద్రు నిం
పలరన్ బ్రోచితి వయ్యెడన్ మనుపుమయ్యా నన్ను శ్రీమాధవా.

శా. సోమాదిత్యులు నీకు నేత్రయుగమై చాచున్ జీకటింగొట్టి యు
ద్దామంబై సవెలుంగు లోకముల కొందన్ జేయుచున్నారు ము
న్నామందాకిని నీదు పాదములయం దావిర్భవించెంగదా
నీమాహాత్మ్యము నాకెఱుంగవశమే నే మూఢుఁడన్ మాధవా. 18

మ. అలబాణాసురుఁ డాజిరంగమున డాయన్వచ్చినన్ వాని దో
ర్బలదర్పంబు నణంచి తద్భుజసహస్రంబుం బడంగొట్టి ము
త్కలితుంగా ననిరుద్ధునిన్ సతి నుషాకన్యన్ వడిన్ దెచ్చితో
తలమే తావకదోశ్చతుష్కపటుసత్వం బెన్నఁగన్ మాధవా. 19

మ. మురదైత్యేంద్రుని సంహరించి మధుఁడన్ పూర్వామరాధ్యక్షునిన్
దురమందున్ బఱిమార్చి కేశిపలలాంధోనాయకుంగూల్చి ము
ష్కరుఁడైన న్తిలు వజ్రనాభదనుజన్ జక్కాడి నీవీ వసుం
ధర నిష్కంటకఁ జేసినాఁడవు మహాత్మా మ్రొక్కెదన్ మాధవా.

మ. అతిదారిద్ర్యము నొంది విప్రుఁడు కుచేలాఖ్యుండు నీబాల్యమి
త్రత నాత్మందలపోసి పిమ్మట భవత్సాన్నిధ్యముంజేరి నీ
కతఁడర్పింపఁగ దెచ్చినట్టియటుకుల్ హస్తంబుతో మెక్కి భూ
రితరైశ్వర్యములిచ్చితీ వతనికిన్ శ్రేయఃప్రదా మాధవా. 21

శా. నీకున్ వాహనమై ప్రవర్తిఁగనుచున్ నిన్నున్భజాగ్రంబునన్
జేకొంచున్ వహియించునట్టిఁడగు పక్షిస్వామి పుణ్యంబులన్
నాకుం బేర్కొనఁగాఁదరంబె యెపుడుం దల్పంబు దానౌటచే
నాకాకోదరరాజు పుణ్యము ళగణ్యంబుల్ గదా మాధవా. 22

శా. భూనేతల్ ఘనగర్వయుక్తులగుచున్ బోషింపకున్నాఁ గిఁక
నాత్మానంబానెడ సంతసంబు నవమానంబైనఁ జోఁ జింతయు
నాత్మానంబూని నిను న్భజించెద మదిన్ నాపైఁ బ్రసాదింపు మ
య్యా నీవేగతి నీపదాబ్జముల నే ధ్యానించెదన్ మాధవా. 23

శా. నీవావిష్ణుఁడ వంచుఁ దానెఱుఁగమిన్ నీరేజగర్భుండు తాన్
గోవత్సంబుల నాలఁ దాఁచఁ గనుగో గోవత్సరూపంబులన్
నీవే దాల్పఁగ నబ్బురంబుపడి వాణీజాని స్తోత్రముం
గావించెంగద నీదుమాయ దెలియంగా శక్యమే మాధవా. 24

శా. ధీచాంచల్యము దేవదానవుల కొందింపన్ జగన్మోహనం
బౌచున్నట్టి స్వరూపమెత్తి యమృతం బాదేవతారాజికిన్
బ్రాచుర్యంబుగ నిచ్చి రాక్షసులకున్ రాకుండఁగాఁ జేసితౌ
నీచర్యల్ మిగుల న్విచిత్రముగఁ గాన్పించుంగదా మాధవా. 25

మ. ప్రకటంబై తగుమల్లయుద్ధ మపుడారన్ జేసి చాణూరము
ష్టికులంబట్టి వధించినాఁడ వీక దుశ్శీలాన్వితుం గంసునిన్
వికటాకారుని సంహరించితివి పృథ్వి న్నీవు గోపాలబా
లకరూపంబున నున్నదేవుఁడవు నిన్ శ్లాఘించెదన్ మాధవా. 26

మ. వికృతాకారిణి నాత్రివక్రను దయ న్వీక్షించి నీ వప్సరో
నికరంబెల్లను మెచ్చుకోఁ దగినదానిం జేసితౌ ద్రౌపదీ
ముకురాస్యామణి కీవ నిర్మితములౌ పుట్టంబులంగూర్చి యా
మెకు మానంబును గాచినాఁడవు జనుల్మెచ్చంగ శ్రీమాధవా. 27

మ. కొలువై తుంబురునారదాదులగు భక్తుల్ వల్లకీగాన ము
జ్జ్వలతన్ జేయఁ దదీయగోష్ఠిఁ దగుచున్ వైకుంఠమందున్న నీ
యలఘుప్రాభవసంప దున్నతులఁ గన్నార న్విలోకించు వా
రలకున్ మ్రొక్కినఁ బాపముల్ దొలఁగి దూరంబౌగదా మాధవా.

శా. నీచారిత్రములం బఠింప శుభముల్ నెక్కొంచునుండున్ సదా
వాచాకౌశలిచేత నీదునుతులన్ వాక్రుచ్చిన న్వారి కా
రా చేకూరుచునుండెడిన్ సకల తీర్థస్నానపుణ్యంబులున్
నీచే లోకము లుద్భవస్థితిలయా న్వీతంబులౌ మాధవా. 29

శా. నీవక్షస్స్థలమందు బాలరవికాంతిం గేరఁగాఁజాలుచున్
ఠీవిన్ భాసిలునట్టి కౌస్తుభమణి న్వీక్షించిన న్వాఁడు మో
హావేశంబులఁ బాసి జ్ఞానకలితుండై మోక్షముం బొల్పడున్
దేవా నీవుధరించుచిహ్నమయినన్ నిన్బోల్చు నో మాధవా. 30

శా. నీకంఠస్థలియందువ్రేలుచు సుధీనిర్వర్ణ్యసౌరభ్య లీ
లాకల్పద్రుమజేతలైన వనమాలా వైజయంతీ మనో
జ్ఞాకారంబు లెదందలంచినను బుణ్యస్తోమముల్ వానికిం
జేకూరుంగద తన్మహత్తులు మనీషిశ్లాఘ్యముల్ మాధవా. 31

శా. ఆదుర్యోధనముఖ్యదుర్జనుల కత్యాశ్చర్య భీతిప్రదం
బై దీపింపఁగ సజ్జనుల్ వినుతిసేయన్ విశ్వరూపంబు నెం
తే దర్శింపఁగఁజేసి యాసమయమందే తత్సభన్ వేడ్కనిం
డౌదృష్టిన్ ధృతరాష్ట్రభూపతికి నీవందించితో మాధవా, 32

శా. నీహస్తంబున నున్న శార్ఙ్గధనువున్ నిత్యంబు ధ్యానించినన్
దేహారోగ్యముగల్గు నందకముఁ బ్రార్థింప న్సమస్తాఘముల్
నీహారం బినదీప్తిఁబోలె నణఁగు న్నిన్ గొల్వఁగా భద్రసం
దోహంబుల్ సమకూడునంచును దలంతు న్భక్తిచే మాధవా. 33

శా. నీచక్రంబును సన్నుతించినను వానిం జెందరావాపదల్
వైచిత్ర్యం బగునట్లు నీఘనగద న్వర్ణింపఁగా వానికిన్
దోఁచ న్సోకదరాతిభీతి జగమందు న్నీదు శంఖస్తవ
ప్రాచుర్యంబొనరింప సౌఖ్యములు గన్పట్టుంగదా మాధవా. 34

శా. నీపాదార్చన మెన్నిజన్మములకైనిన్ జేయ నాకబ్బచే
నీపంచాక్షరమంత్రసజ్జపము నే నిత్యంబుఁ గావించెదన్
నీపాదానతభక్తబృందములతో స్నేహంబు గావింతు న
య్యా పద్మాక్ష కృప న్ననున్మనుపుమా యశ్రాంతమున్ మాధవా.

మ. నినుఁగన్నట్టిది యైన దేవకి పురంధ్రీరత్న మెయొప్పు న
వ్వనితాగర్భము పావనంబునొనరింపం బుట్టి యున్నావె నో
చిననోముల్ ఫలియింపఁజేసితివనన్ శ్రీకృష్ణరూపంబుతో
డను గోపాలకబాలురంగదిసి యాటల్నేర్చితౌ మాధవా. 36

మ. వసుదేవుండు తపోవిశేషములు పూర్వంబందుఁ జేయంగ నం
తన మొప్ప న్ఫలియించినట్టిఫల మీతండంచుఁ దా హృష్టమా
నసుఁడై నిన్నల నందగోపతిచియింటన్ జేర్పఁబుత్తెంచుచో
వసమై యామునతోయమీవరుగఁ దోవంగూర్చదే మాధవా. 37

మ. తనదుగ్ధంబులనిచ్చి పెంచిన యశోదాదేవి పుణ్యాళి యిం
తని లెక్కింపఁగ శక్యమే యొవనికేన్ హస్తంబుతో దువ్వుచున్
నినునాడించుచుఁ జంకఁబెట్టుకొని పానీయంబులం బోయుచుం
డినదై యర్మిలి ముద్దుఁబెట్టుకొనియె న్నేర్పొప్పఁగన్ మాధవా.

మ. అలనందుండు నిజాత్మజుండవని నీకత్యంతముం బ్రేమ జొ
బ్బిలఁగ న్బూషలబంకరింపఁగని సంప్రీతుండవై గోపపి
ల్లలతోడ న్విహరించినాఁడవు సులీల న్నీచరిత్రంబు ని
చ్చలు నాత్మందలపోయువారలకు నాశ్చర్యంబగున్ మాధవా. 39

శా. పాకారాతిదురాగ్రహంబున శిలావర్షం బహోరాత్రముల్
పైకన్ దాఁ గురిపింప నంతి యొదవ్రన్ భీతిల్ల గోసంధనా
భ్యాకం బై నగకెందద్రిమెత్తి వెనపీవా గోపగోపాళిక
[illegible] సుఖంబొనఁగితివి నీ దోశ్శక్తిచే మాధవా. 40

మ. పరకాంతా పరవిత్తనిస్పృహుఁడనై స్వామీ భవద్ధ్యానత
త్పరబుద్ధిన్ విషయోపభోగములపై వాంఛ న్విసర్జించి నీ
స్మరణంబే యొనరించుచుంటి నిఁక నీచారిత్రమాలించుచున్
బరమానందము డెందమం దెనసి నిద్రాబ్ధిం జెదన్ మాధవా. 41

మ. అలసాళ్వక్షితినేత సౌంభకవిమానారూఢుఁడై కిన్కచేఁ
గలహంబుం బొనరింపఁగా నతనిపైఁ గౌమోదకి న్మహో
జ్జ్వలశక్తిం బడవేసి గండణఁచి తత్ప్రాణంబు లొక్కుమ్మడిన్
దొలఁగంజేసితి వీవకావె సకలాప్తుల్ మెచ్చఁగన్ మాధవా. 42

మ. అనివార్యుం డగునట్టి కాలయవనుం డన్వాఁడు యుద్ధంబొన
ర్చిన వాని న్ముచికుందసంశ్రితధరిత్రీభృద్గుహాంతంబునన్
జనఁగాఁజేసి మునీంద్రుచేత నతని న్జంపించి యమ్మౌనిచే
ననుకూలస్తుతు లొందినాఁడవుగదయ్యా శ్రీహరీ మాధవా. 43

మ. నినుఁబూజింపఁగ ధర్మనందనుఁడు యత్నింపన్ దనుద్దేశము
న్విని యంతన్ శిశుపాలుఁ డాగ్రహముచే నిన్ దూలగా నప్పు డా
తనిశీర్షంబును ద్రుంచినాఁడవు సభాస్థానంబున న్సభ్యులె
ల్లనుమెచ్చంగ భవద్విదూషకులు నేలంగూలరే మాధవా. 44

శా. కాళిందీహ్రదమందుఁ గాళియమహాకాకోదరుం డంబువుల్
క్ష్వేళజ్వాలలనిండఁజేసి జనుల న్వేధింప నీవప్పుడా
వ్యాళోద్గర్వమణంచి తచ్ఛిరములం దంఘ్రిద్వయంబుంచి స
ల్లీలన్నాట్య మొనర్చినాఁడవు ప్రజల్మెచ్చంగ నో మాధవా. 45

మ. సమరాజేయపరాక్రముండగు జరాసంధుండు నీతోడ యు
ద్ధముఁ గావింపఁదలంచుచున్న తఱిఁ దద్బాహాసముద్రిక్తగ
ర్వము వారింపఁగ భీమునిన్ జొనిపి సంగ్రామంబున న్వాని నం
తమునొందించితి వబ్బురంబుగను క్షుద్రధ్వంసకా మాధవా. 46

శా. శ్రీరంగంబున నంగనాయకుఁడవై చెన్నొంది భద్రాద్రిపై
శ్రీరామాఖ్య వహించి తిర్మలగిరిలో శ్రీమద్వెంకటనాయక
పేరన్ వర్తిలి శేషశైలమున శ్రీవిద్వాంకటేశాఖ్యఁ జె
న్నారం బూనినవాఁడ వీవొకఁడవే యై యుంటివో మాధవా. 47

శా. నీకు న్బ్రహ్మకుఁ గద్ద నెమసేవకులతో నైక్యంబుఁ గావించెదన్
నీకీర్తిం గొనియాడెద న్మనసులో నీధ్యానముం జేసెదన్
నీకైవారము నేఁటి లేదనుము నే నిన్నాఁడ వాకిచ్చెదన్
నాకు న్మోక్ష మొసంగఁగాఁ దలయు శ్రీనారాయణా మాధవా. 48

శా. నీవే విద్యలకెల్లఁ బ్రాసకమవై నెక్కొందు సాందీపభూ
దేవశ్రేష్ఠుని చెంత విద్యలను బూర్తిన్ నేర్చికొన్నాఁడ విం
కానీ ద్వన్మతి పూర్వజన్మకృతపుణ్యం బెట్టిదో మెచ్చికిన్
భావింపం దరమౌనె భక్తజనకల్పక్ష్మారుహా మాధవా. 49

శా. ఆపత్కాలమునందు నీస్మరణ మత్యంతంబుఁ గావించినన్
గాపాడంగఁ దలంతువీవు వనిలోఁ గార్చిచ్చు వేష్టింపఁగా
గోపస్త్రీలును గోపబాలకు లనేకుల్ వేఁడఁగా నప్పుడా
యాపత్తున్హరియించి బ్రోచితివి కావా యందఱన్ మాధవా. 50

శా. చోరుండై తగుసోమకుండు దుహిణాశ్రుత్యుత్కరంబెల్లఁ జెం
పార న్మ్రుచ్చిలి వార్ధిడాఁగఁ గని నీవవ్వేళ మత్స్యంబవై
యారక్షోధిపుఁ జంపి వేదసముదాయంబు న్వడి న్దెచ్చి యం
భోరుహజన్మున కిచ్చినాఁడవతఁడామోదింపఁగన్ మాధవా. 51

మ. అమృతంబు న్మథియింప దేవదనుజుల్ యత్నించి మంథాద్రిఁ గ
వ్వముగాఁ బన్నగరాజు రజ్జువుగ నొప్పంజేయుచు న్బాలసం
ద్రము బల్మిన్మథియింప నీవపుడు కూర్మస్వామివై యానగేం
ద్రము నీకర్పరమందుఁ బూనితివి ధీరగ్రామణీ మాధవా. 52

మ. అవని న్జాపను జుట్టి పట్టుఁగ హిరణ్యాక్షుండు చుట్టంగ నీ
వు వరాహాకృతిఁ దాల్చి యాదనుజుని న్బోర న్వడిం గూల్చి యీ
భువి నీకొమ్మునఁ బూని ప్రోచితివి నీభూరిప్రభావంబుఁ జె
ప్పవశం బెవ్వరికైనఁ గాదు వికచాబ్జాతాక్ష శ్రీమాధవా. 53

మ. అవిభేద్యాశయుఁ డాహిరణ్యకశిపుం డత్యుగ్రకోపంబుతో
భవదీయాంఘ్రిసరోజభక్తవరుఁడౌ ప్రహ్లాదు బాధింప మా
నవసింహాకృతిఁ దాల్చి రాక్షసుని పెన్వక్షంబు భేదించి భ
క్తవరుం బ్రోచితి వీవకావె దురితౌఘధ్వంస శ్రీమాధవా. 54

మ. బలిదైత్యాగ్రణి వంచనంబు నొనరింప న్వామనాంగుండవై
యిల మూడంఘ్రులుమాత్ర మీ వడిగి యాపృథ్వీదివుల్ జాలమిన్
దలపై వానినిఁ ద్రొక్కి నాగభువనస్థానంబునన్ జేర్చితౌ
జలజాతాక్ష భవత్ప్రభావ మెఱుఁగ న్శక్యంబె శ్రీమాధవా. 55

మ. జమదగ్న్యాత్మభవుండవై సకలరాజన్యాళియు న్నీదు క్రో
ధమహాగ్నిస్ఫుటకీలను న్శలభబృందంబై చన న్వారి ర
క్తముచేతం బితృదేవతర్పణములం గావించి హర్షించితీ
వమర న్నీయవతార మద్భుతకరం బయ్యెంగదా మాధవా. 56

మ. శమదాంత్యాదులఁ బూని పంక్తిరథ కౌసల్యాతనూజుండవై
ప్రమథాధీశధనుస్సుఁ గూల్చి యపుడావైదేహిఁ బెండ్లాడి దు
ర్దములౌ రావణకుంభకర్ణులను యుద్ధంబందుఁ జక్కాడి యీ
క్షమ నిష్కంటకఁ జేసినాఁడవు సురల్ శ్లాఘింపఁగన్ మాధవా. 57

మ. యదువంశంబు ముదంబునొంద బలరామాఖ్యుండవై రేవతీ
మదిరాక్షీమణిఁ బెండ్లియై ముసలముం బల్లంగలంబూని దు
ర్మదుఁడైనట్టి ప్రలంబరాక్షసునిఁ బోరన్దున్మి కాళిందియన్
నది మర్దించినవాఁడ వీవె జగదానందప్రదా మాధవా. 58

మ. పరమానందము భక్తకోటికి నిడ నర్థిస్వహాప్రాంశవై
దురితధ్వాంతదివాకరుండవగుచు న్దుర్వాదముల్ మాన్పి సు
స్థిరచిత్తంబున నిన్నుఁ గొల్చుమనుజశ్రేణి న్సదా ప్రోచుచున్
గిరిమన్ లోకము నేలుచుంటివి కదా కౌతుకంబొప్పఁగన్ మాధవా. 59

మ. కలికిన్ వాక్కృతిఁదాల్చి దుష్టజనసంఘధ్వంసముం జేయ ని
స్తులదోర్విక్రమము న్వహించి విలసత్తుంగాశ్వరాజంబుపై
లలిఁ గూర్చుండి కరంబునందుఁ గరవాలంబూని తద్దుష్టవి
ద్దళనంబుం బొనరింతువెంతయు జగత్సంరక్షకా మాధవా. 60

శా. నీవే తండ్రివి తల్లి నీవె చెలి నీవే ప్రాణమిత్రుండవున్
నీవే నాకిఁక న్గురుండవయిన న్నీవే సహాయుండవున్
నీవే యాపదలందు రక్షకుఁడవు న్నీవే సుమీ ప్రాపువున్
నీవే గావున నిన్ను భక్తిఁ గొలుతు న్నిక్కంబుగన్ మాధవా. 61

శా. నీమందస్మితమాసుధాంశుకిరణానీకస్ఫురచ్చంద్రికా
భూమాభిఖ్యఁ దిరస్కరించి కలశాంభోరాశి సద్వీచికా
స్తోమంబు న్నిరసించి భక్తులకు సన్తోకానుకంప న్సదా
క్షేమంబు ల్గలుగంగఁ జేయునను నన్ గీర్తించెదన్ మాధవా. 62

శా. నీనేత్రంబులశోభ యెవ్వరికి వర్ణింపం దరంబౌనె ల
క్ష్మీనారీమణికి న్నివాసమగుచుం జెల్వొందు త్రైలోక్య ర
క్షానైపుణ్యముఁ బూని చూపరులకు న్నందించు భవ్యంబులన్
గాన న్దానికి సద్దియౌసరియనంగ న్జెల్లునో మాధవా. 63

శా. నీదేహంబును గన్నులారఁగనిన న్నీలాభ్రసంకాశమై
మోహంబు న్ఘటియించుఁ దానికి భుజంబుల్ చూచిన న్గల్పశా
ఖాదర్పంబు హసింపఁగాఁ దగి మదిం గౌతూహలంబూన్చు నీ
వే దైవంబని పటించుఁ గొల్తు మదిలో నెల్లప్పుడున్ మాధవా. 64

శా. కామక్రోధముల జ్జయించి మదిలో గర్వంబు వర్జించి ని
న్నే మర్త్యుండు దలంచ కొల్చునో యతండే శుద్ధధన్యాత్ముఁడై
తా మోక్షంబును జెందనర్హుఁడగు డెందంబందు నే నమ్ముచున్
నీమీఁద న్మదినిల్పి కొల్చెదను దండ్రీ ప్రోవుమీ మాధవా. 65

శా. నీశంఖంబు సుదర్శనంబు మొదలౌ నీదివ్యచిహ్నంబు లెం
తే శృంగారముగా ధరించిననరు ల్వీక్షించినన్ జ్ఞాన మా
వేశించు న్సుకృతంబుగల్గునని నే విశ్రబ్ధచిత్తుండనై
నీశుభద్వయచిహ్నముల్ దలఁచెదన్ నీభక్తుఁడన్ మాధవా. 66

శా. పాశంబు న్ధరియించి కాలుఁడు నను న్బాధింప నూహించుచో
లేశంబైన నిను న్దలంపఁగలనో లేనో యటంచిప్పుడే
కౌశల్యంబునఁ దావకస్మరణముం గావించెద న్భక్తితో
నోశాంతాకృతి నన్నుఁ బ్రోవుము దయాయుక్తుండవై మాధవా.

శా. తర్కవ్యాకరణాదిశాస్త్రములు శ్రద్ధాయుక్తిఁ జర్చించుచున్
దర్కింపం బనిలేదు దాన యమబాధల్పాయునే యన్యసం
పర్కం బేమియులేక నీచరణసేవాసక్తుఁడై యుండినన్
గోర్కుల్వానికిఁ జేకురు న్భవపిముక్తుండై తగున్ మాధవా. 68

శా. ఘంటాకర్ణుఁడు యుష్మదాఖ్యను వినంగా రాదటంచెప్పుడున్
ఘంటల్ కర్ణములందుఁగట్టుకొనుటం గాదే తదంహశ్ఛటా
కుంఠాకాత్ముఁడవై దయారసము వెల్లిగ్రమ్మఁగా వానికి
న్గంటంజేసితివయ్య మోక్షము ననాయాసంబుగన్ మాధవా. 69

శా. శ్రీకాంతామణి భూమియుం బదముల న్సేవించుచుండంగ నా
వైకుంఠంబున శేషశాయివయి సద్భక్తుల్ మహాభక్తితో
సేకీర్తి న్వినుతించుచున్నతఱి నో నీపై భవం బాత్మలో
నేకాగ్రత్వమునం దలంచెదను లోకేశా హరీ మాధవా. 70

శా. నీసత్వంబు నిభీమానుండెఱుఁగ నేర్చెన్ హానిరత్వంబునం
దానుగ్రీవుఁడె సాక్షి భక్తజనరక్షాసక్తి బ్రహ్లాదుఁడే
దాసుండే యగుసాక్షి నీయభయదానంబందు దంతిందుఁడే
యానాసాక్షికృతుండంచుఁ గొల్తు మదిలో నశ్రాంతముగ్ మాధవా.

శా. ఏలోకంబుననుండి యిచ్చటకు దా నేతెంచెనో యిఁకఁ దా
నేలోకంబున కేగునోయది రవంతేనాత్మభావింపఁగాఁ
జాలం డెన్నిసహస్రముల్ గడచెనో జన్మంబు లెన్నంచనగం
డాలోచింప నరుండు నీదుఘనమాయాక్రాంతుఁడై మాధవా. 72

మ. వినిన న్నీచరితంబు లేవినవలె న్విశ్రాంతిమై నెప్పుడున్
గనిన న్నీభుజనైకమోహనకరాకారంబె కాంచవ్వలెన్
జనిన న్నీరుచిరాలయంబులకె యిచ్చం దాజనంగావలెన్
మనిన న్నీపదసేవచే మనవలె న్మర్త్యుండు శ్రీమాధవా. 73

శా. స్వర్లోకాంచితభోగము ల్మదిఁ దృణప్రాయంబుగా నెన్నుచున్
నిర్లక్ష్యంబుగఁ జూచి నీమహనీయాస్మిత్యంబె నేగోరి యం
తర్లక్ష్యంబుగఁ జేసికొంచు నెదలోనన్నిల్పి ధ్యానింతుఁ జ
క్షుర్లీల న్ననుఁగాంచి ప్రోవ్రుమయ యిఁక న్వేఁడెద న్మాధవా. 74

మ. నరజన్మంబు బతిదుర్లభంబనుచు నెన్నంబొల్చెగా యందు భూ
సురజన్మంబు లభించుటుత్తమ మటంచు న్వేదవేత్తల్ వచిం
తురుగా కట్టిద్విజుండు నీదుపదభక్తుండయ్యెనే నోర్మతిముం
బొరయు న్భక్తివిహీనుఁడొందఁగలఁడే మోక్షంబు శ్రీమాధవా. 75

శా. ఏజాతి జనియించిన న్మతియుఁ దా నెచ్చోటి వర్తించిన
నేజన్యాకలితాంతరంగుఁడగు నన్నద్భక్తితోఁ నుండి నీ
పూజల్ చేసి సమానవృందు సతతంబు న్నెమ్ముల్ వొందుఁగా
న్నేజశ్శాలియునై చిరాయువుగవర్తిల్లు న్భువి న్మాధవా. 76

మ. తనయుండజ్ఞతఁ జేసినట్టి యపరాధంబుల్ విలోకించి త
జ్జనకుండవ్వి క్షమించినట్లుగను యుష్మద్దాసుఁడన్ నేనొన
ర్చిననేరంబులు సైఁచినావయి దయాదృష్టి పరిసారంబుచే
ననురక్షింపుము దేవకీతనయ కృష్ణా శ్రీహరీ మాధవా. 77

శా. రంభాదుల్ దనచెంగటన్ నిలిచియశ్రాంతంబుఁ గ్రీడించినన్
సంభోగాదృతి లేశమైనవిడదా స్వర్గాధిపత్యంబిఁకన్
జంభారాతికిఁ బోలెగల్గినను దృష్ణల్ వీడవక్లాట వి
స్రంభంబొప్పఁగఁగోరుచుంటిని భవత్సాన్నిధ్యమున్ మాధవా. 78

శా. అన్యాయాధ్వమునందు వర్తిలకసత్యజ్ఞాన యుక్తుండనై
మన్యాదేహికసుఖంబులేక గతిసంభావించుమన్ నీదు పా
దన్యాసోద్ధితధూళి నాశిరమునందాల్తున్ హరేయంచునే
నన్యంబొల్లక నీపదాబ్జములనే యర్చించెదన్ మాధవా. 79

శా. నిన్నున్ భోనస్మరించు మాత్రమున వానిన్ సత్కృపాదృష్టిచే
తన్నీవెప్పుడుఁ బ్రోచుచుందువని పెద్దల్ చెప్పఁగా మున్ను నే
విన్నాఁడన్ మఱియార్తరక్షకుఁడ వీవేకాక జేజేలలోఁ
గన్నాకుల్ మదినెన్నఁగాఁగలరె నీకన్నన్ హరీ మాధవా. 80

మ. జననంబందఁతతోడనే కలిగెయుష్మన్నామసంకీర్తనం
బును నీపాదసరోజభక్తియు భవత్పూజాపరత్వంబు గా
వున నాకీవనుకూలదైవమవుగా బుద్ధిన్ వితర్కించుచున్
వినుతింతున్ నినుసంతతంబు మదిలోవేడ్కన్ హరీ మాధవా. 81

మ. పరిశూన్యానేహమునందు లోకములు వావంగారహింకనిన్ను ని
శ్చలతేజోమయరూపదీపిత విశేషజ్యోతివై యక్తటిన్
వెలుఁగేశాకృతి నొందుచున్ జగములివే వెండిపుట్టింతువో
జలజాతాక్ష భవత్స్వరూపమె జగజ్జాలంబగున్ మాధవా. 82

మ. వ్రతముల్ దానము లెన్ని చేసినను దద్వారాణశీముఖ్య పు
ణ్యక్షేత్రము లెన్ని చూచినను దా నాయశ్వమేధాది స
త్క్రతువుల్ చేసినఁ దావకీన మృదుపదాబ్జ సేవాన మా
గత పుణ్యంబునుబోలఁ జాలవని వేడ్కంబల్కెదన్ మాధవా. 83

మ. తులసీదామములన్ ధరించుకొని చేతుల్ మోడ్చి సత్పుండ్ర వ
ల్లులు ఫాలంబునదిద్ది శుద్ధపటముల్ శోభిల్లఁగాఁగట్టి ని
చ్చలు నీనామముసంస్మరించుచు భవత్సంకీర్తనల్ పాడుచున్
బలుమాఱున్ నినుసన్నుతించు నరుఁడే భక్తుండగున్ మాధవా. 84

మ. జటియైయుండుట ముండియౌటయును గాషాయాంశుకంబుల్ ధరిం
చుటయున్ జేతులసత్కమండలువుఁ గొంచున్ వేషముంబూనుచుం
డుటయున్ లోనగునవ్వియెట్టులొసఁగు నోమోక్షంబుత్తృష్ణన్ జయిం
చుటయై నిన్నుభజించుచుండుటయె యిచ్చున్మోక్షమున్ మాధవా.

శా. ఘోరంబౌ కురుపాండవాహవమునన్ గ్రూరాత్ములంగెల్వ దో
స్సారంబల్ల కిరీటికీవొసఁగి నీచాతుర్యముం జూపుచున్
సారథ్యంబొనరించి యాతనికిఁ దత్సంగ్రామసీమన్ జయం
బారన్ నీవొనఁగూర్చినాఁడ వతిసాహాయ్యంబునన్ మాధవా. 86

మ. అమృతంబానిన మానవోత్తమునకున్ వ్యాధుల్ జరామృత్యువుల్
క్రమమొప్పం దొలఁగున్ దలంపభవదాఖ్యన్ నిత్యమున్ సంస్మరిం
చు మనుష్యాగ్రణికిద్భవంబె నశియించున్ సత్యవైకుంఠ వా
సమొగల్గున్ సుధనీదునామసమ మేచందాననా మాధవా. 87

మ. అఘవీరుత్తతి దాత్రిదాత్రిలఘుబల్య స్తోకసన్మందిర
ప్రియుణాశ్చాపిని పాత్రిపాత్రిని శభాస్వద్గోత్రగోత్రా సక్ర
న్నిఘసాపాదక గాత్రిగాత్రిమరమహి శ్లాఘ్యదోశ్శక్తి భా
జన్మనవత్పుత్రిక మిత్రిమిత్రిశశి శుంభన్నేత్ర శ్రీమాధవా. 88

మ. కటిభాగాన్వృతభర్మ చేల విలసత్కస్తూరికా చిత్రిత
స్ఫుటఖండేందు సమాంశ ఫాలపరిణత స్తోమద్యుమత్సాల స
ద్విటపత్రాక్షి శయత్ప్రశీల కమలాబ్జాతాననాలోల హృ
త్స్ఫుట చంచత్కరుణాలవాల వినమద్గోపాల శ్రీమాధవా. 89

మ. అసితాంభోధ్రపమ కాయకాయదతి భక్తాంహస్తమస్సూర్యసూ
ర్య సురత్నాంచిత భావభావభవ జన్మ్ర ధానన్నై పుణ్యావు
ణ్యాసమాహారదక్రోధాకర రసజ్ఞాత్యంత మాధుర్యదా
యీ సమానాచ్ఛసమాఖ్యమాఖ్యశశభృత్ప్రాంచద్యశోమాధవా.

మ. ఖలగంధర్వ ఖలీనఘోరపల భుగ్వ్యాళాశ్లీవిని
స్తులకారుణ్యనదీ నగోపతరుణీ నేత్రోత్పలానాధీశకుం
డలిరాట్తల్పశయాన యోగిజన బృందస్వాంతయుంజానశ్రీ
జలజాక్షీఘనకౌస్తుభాంకలిత వక్షస్థాన శ్రీమాధవా. 91

మ. కరిరాజార్తి విదారచంద్ర రుచిరంగత్స్మేర ముఖస్వస
త్కరకుత్కీల శతారదుగ్ధ సరిదీడ్గంభీర బృందావనా
చరితాపార విహార సర్వజగతీ సంరక్షణాధారశ్రీ
హరిణాక్షీయుగగారభక్త శుభదాయ్యాకార శ్రీమాధవా. 92

మ. పతగాధీశ్వర యానవేల్లదరి షడ్వర్గాంధకార
క్షితగీర్వాణ వితాన యాదవకుల శ్రీయోదనిధ్యానరా
జితశంఖారి దధానరాత్రిచరహస్తిశ్రేణి కాలానభ
క్తతతిజ్ఞాననిదాన యోగివర హృద్వ్యాలీన శ్రీమాధవా. 93

మ. భృతవేషాంశ కటాహవల్లవ పురంధ్రీ క్షీరదధ్యాజ్యభు
క్త్యైతులోత్సాహ విశిష్టజాహ్నవసి బాహానాహ దుగ్ధాబ్ధిసు
ధ్యాశిలాంచద్వర గేహదారిత సుధాంధశ్శాత్రవవ్యూహాక్షీ
ణిత పద్మభక్తసమూహ పాండవవిపద్గ్రాహ శ్రీమాధవా. 94

మ॰ రవికోట్యంచితతేజ పాతకతమిస్రశ్రేణికాఘ్రాస్త్రకై
రవిణీరాడపదంబుజా శ్రితసుపర్వవ్రజా లోకేశవా
సవపూజ్యాంఘ్రిసరోజ చారుతరతుఙ్గాశోభిచేతోజ జై
ష్ణవనీలత్తనుభాసమాజ సమనుష్యవ్యజ శ్రీమాధవా.                    ౯౫

శ్రీవత్సాంచదురః కవాటజలరాశిస్మాయి మానప్రభా
వా వార్యాశుగనిర్ఘాట యభ్యుషితరమ్య ద్వారకాపాల పా
దావిష్టాష్టదిగీడ్జలాట మణిదీవ్యత్కుండలద్వంద్వ శో
భావిష్కారికిరీట సంస్తుతదశేషభ్రాట శ్రీమాధవా.                    ౯౬

ఫణిభుగ్భర్తృయుతోత్తమాంగ విపదబ్జవ్రాతమాతంగ స
ద్గుణరత్నాళ్యనుషంగ కోపనిహతక్రూరాంతకృత్పాటాంగ కా
రుణికాపూర్ణతరాంతరంగ గరుడారోహక్రియాచంగ మా
ర్గణబృందాక్షయసన్నిషంగ పదనిర్యద్గంగ శ్రీమాధవా.                  ౯౭

నిగమోక్తస్తుతిఘోష కౌస్తుభసుమాణిక్యోల్లసద్భూష లో
క గణాత్యద్భుతకోపవేష త్రిదివౌకశ్లాఘ్యసద్భాష సౌ
భగసంయుక్తమనీష లాలితరమాబాహాసమాశ్లేష పా
శిగ్రుహీతక్షితిమోష దుష్కృతహిమానీపూష శ్రీమాధవా.               ౯౮

సమరోర్వీజితబాణ సేవకసమాజప్రీతకళ్యాణ దు
ర్దమరక్షోభయకృత్కృపాణ నిజభక్తత్రాణ ధుర్యాణ స
ర్వమహీభారధురీణ పాలనకళాపారీణ కౌంతేయవి
క్రమజాగ్రత్తనువారవాణ కృతలోకప్రాణ శ్రీమాధవా.                    ౯౯

యదువంశాంబుధిసోమ దుష్కృతసమూహక్షోదకృన్నామ దు
ర్మదరాతివ్రజభీమ చంచదసితాభ్రశ్యామ వందారుస
న్మదసంధాయిచరిత్రధామ సుమదామస్తోమ వత్సాంతసీ
మ దిశాపూర్ణయశోలలామ సతతసంభ్రత్ప్రేమ శ్రీమాధవా.              100

శ్రీకృష్ణాహార మంగళంబు దనుజారి మంగళంబయ్యా స
త్యాకాంతాధిప మంగళంబు యమునాధా మంగళం బచ్యుతా
పాకారిస్తుత మంగళంబు గరుడారూఢ మంగళం బర్తిమీన్
గైకొమ్మీశ్వర మంగళంబిదియె మాంగళ్యంబు శ్రీమాధవా. 0

మ. ధరణీమండలి శాలివాహన శకాబ్దంబుల్ మహీధాద్రి కుం
జాల శీతాంశుసంఖ్యచే బరగఁ దంచద్రాశిఁ సాఖ్యాకవ
త్సరమందున్ దగు జ్యేష్ఠపుం బహుళపక్షంబందునౌ సప్తమీ
స్థిరవారంబున నెల్ల నీశతక మొందెంబూర్తి శ్రీమాధవా. 10

ఉ. భువిలో నల్లమ రాజవంశ కలాశాంభోరాశి పూర్ణేందుఁ డా
హ్వ పరశ్లాఘిత సచ్చరితుఁ డగు సుబ్రహ్మణ్య సంజ్ఞాక స
త్కృపికిన్ జిన్నమకు న్సుతుండ నమరంగన్ రంగశాయ్యాహ్వనౌ
కవి నే నీశతకంబు నీకొసఁగితిన్ గైకొమ్ము శ్రీమాధవా. 108

సమాప్తము.